# సంఘారచ్ఛాచిత్రము

## (LAKE OF PALMS)

రొమేశచంద్రగు

అనువాదకులు:

బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులుగారు



ప్రకాశకులు:

కొండపల్లి వీరవెంకయ్య,
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,
రాజమండ్రి.



[ వె: 2—0—0.

# సుధాకరచ్చంద్రము

## మొదటి ప్రకరణము

బంగాళాదేశమందు నివాసయోగ్యంబైన తాల్పుకూరను గ్రామముకలదు; తాల్పుకూరనఁగా బంగాళీభాషలో తాళ్ళచెరువని యర్థము. ఆ గ్రామమున నొక చెరువు కలదు. ఆ తటాకంబునకు వద్దానుపరి చుట్టును కేనచేలు తాళివృక్షములు కలవు. ఈ తాళ్ళచెరువుబట్టియే యాగ్రామమున కానామముకలిగెను. ఆ తటాక ప్రాంతమున వరిచేలు కనుపండువులై యుండును. పట్టుమధ్యాహ్నము ప్రొద్దు నెత్తిమీఁద నున్నపుడుతప్ప దక్కినసమయములందు ముఖ్యముగా నుదయాస్తమయములయందుఁ దటాకజలంబు నిరంతరము తాఁటిచెట్లనీడచేతఁ గప్పఁబడి యుండుటచే సముద్రజలంబునుఁబోలి నల్లనై యంధకారపుంజమట్లుండును.

ఒక్కనాఁడు సాయంకాలము భానుఁడపరజలధిని గ్రుంగినపిదప నొక్క యంగన నడుములోతునీట స్నానము చేయుచు నిలిచియుండెను. ఒడ్డుననున్న మెట్లమీఁద తొమ్మిదియేండ్ల ప్రాయముగల యొకబాలిక తన చెల్లెలిం జంకఁబెట్టుకొని తల్లిరాక నిరీక్షించుచుండెను. స్నానము చేయుచున్న యాయింతి ప్రక్కనీరు గొంపోవవలసిన పెద్దకుండ యొకటి యుండెను. స్నానము చేయుచున్న యా వితంతువుయొక్కయు గట్టుననున్న యిరువురు బిడ్డలయొక్కయుఁ జరిత్ర మిక్కిలి దయనీయమైనది. ఆ పడఁతి గౌరవముగల కాయస్థకుటుంబమున జన్మించి హరిదాస మల్లికుఁ డనువానికిచ్చి వివాహము చేయబడెను. ఆమె తలిదండ్రులు భర్తయు సామాన్యస్థితి గలవారు. ఆమె మగని కాఱెకరముల భూమి యుండెను. కాయస్థుఁడు చేత నాఁగలిఁబూని దున్నకూడదు. కావున హరిదాసమల్లికుఁడు పాలేళ్ళంబెట్టి తన చిన్నభూమి సేద్యము చేయించుచు వచ్చెను. పండిన ధాన్యమందు దివాణమున కీయవలసిన పన్నులు, పాలేళ్ళకీయవలసిన భాగము పోఁగా మిగిలిన ధాన్యము స్వకుటుంబ పోషణమునకు జాలని హరిదాసు తఱు

చుగా ద్రవ్యములేక యిబ్బంది నప్పుడప్పు డితరుల సహాయము నపేక్షింప వలసిన వాఁడ గుచు వచ్చెను. హిందూదేశమున నాలు ముగ్గురు గంపెడుపిల్లలుగల కుటుంబము లనేకము లీతెలంగున నే దినమునకు నాలుగైదణాల రాఁబడి గలిగి లోకయాత్ర నెంతో కష్టముగా గడుపుకొనుచుండుట మనమెఱుంగినదేకదా! హరిదాసు సంవత్సరము పొడుగున కష్టపడినను వాని కంతమాత్రమైనఁ జేఁజిక్కుట కష్టమయ్యె. హరిదాసుయొక్క పెదతండ్రి కుమారుఁడు తారిణీమల్లికుఁడు బర్ద్వాను (వర్ధమాన) పట్టణమున మహారాజుగారి కొలువులో నుండెను. అన్నదమ్ములే పరస్పరసహాయము జేసికొనుట యరుదైన యీ దినములలో పెదతండ్రి కుమారులవలన సహాయ మపేక్షించుట యీ కాళవృక్షముయొక్క ఫలముల నపేక్షించుటయే యైన నప్పుడప్పుడు తారిణీమల్లికుఁడు, హరిదాసు సొమ్మున కిబ్బందిపడి తన్నడిగినప్పుడు చేబదులుగ పదిగాని యిరువదిగాని రూపాయలు బదులిచ్చి తిరిగి యతఁడా సొమ్మిచ్చివేయునప్పుడు వడ్డీమాత్రము గ్రహింపక నుపకారము చేయుచుండును. అట్లగుట హరిదాసు జీవనము మొదటినుండియుఁ గష్టజీవనమె యైన నతఁడు సంతుష్టుఁడై కాలక్షేపము చేయుచు వచ్చెను.

వివాహమైన పదియారు సంవత్సరములకు హరిదాసున కొక ముద్దులకూఁతురు పుట్టెను. ఆ ప్రథమ సంతానమునకుఁ దల్లిదండ్రులు ముదితులై బిందుదేవి యని పేరు పెట్టిరి. లేకలేక పుట్టినబిడ్డయగుటచే బిందు మిక్కిలి గారాబమునం బెరుగుచుండెను. జననీజనకుల గారాబము దారిద్ర్యమును రూపుమాప లేదుకదా! అందుచేత బిందు తల్లిదండ్రు లెంతముద్దుచేసినను నిరుపేదయే యయ్యుండెను. తారిణీమల్లికుఁడు దేవీ నవరాత్రములకు వర్ధమానపట్టణమునుండి స్వగ్రామమగు తాళ్ళచెరువునకుఁ బోయి తన కూఁతురైన యుమకు సన్నపువ్వులువలు బంగారుమురుగులు వెండియందెలు కడియములు మొదలగునవి తెచ్చుచుండును. అదిచూచి తాను పేదవారి బిడ్డనన్నమాట యెఱుఁగక బిందు తనకుఁగూడ నట్టివి తెమ్మని పోరుపెట్టుచు వచ్చినందున తల్లిదండ్రులా పోరు పడలేక యప్పుచేసి బిందు చేతులకు గుల్లమురుగులు, కాళ్ళకు గుల్లకడియములు జేయించిరి. అందుకైన ఋణము హరిదాసు చాలాకాలమునకుఁగాని తీర్పలేక పోయెను. ఋణమైనను నది వస్తురూపముగా నుండుటచేఁ గుటుంబమున కెప్పటికైన నుపయోగించు విలువసొమ్మని చెప్పవచ్చును. హిందూదేశమున పేద కుటుంబములలో స్త్రీలు చేయించుకొను నగలే వారికిఁగల సొత్తగుటచేఁ దఱచుగాఁ గుటుంబమున కెంతో యుపయోగములుగా నుండుట మన మెఱుంగుదుము కదా! అందుచే పేదలు నగలకొఱకై ప్రాకులాడుట గర్హ్యము కాదు. ఉమాబిందులు సమానవయస్కులగుట బిందు తఱచుగా నుమతో నాఁడుకొనుటకుఁ బోవుచుండును. బిందు సహ

జముగా సాధుస్వభావయు మితభాషిణియు నగుటచే నతనికామెయందు గాఢాను రాగముండెను. తనకుఁ దల్లిదండ్రులు తినుటకు మిఠాయి పండ్లు మొదలగు మధుర పదార్థము లిచ్చునప్పుడామె తన ప్రక్కను మేఁకపిల్లవలెకదలక మెదలక పేదచూపులం జూచుచు, నిలిచియున్న బిందున కందు గొంచెము పెట్టుచుండును. తనవారు చేరువ యూరి సంతనుండి తనకు లక్కపిడతలు, బొమ్మలు మున్నగునవి తెచ్చియిచ్చునప్పు డాబాలిక సెనరు గలిగి బిందును జేఁబిలిచి యప్పుడప్పు డొక బొమ్మయు నొక లక్క పిడతయు నిచ్చుచుండును. దానిం జేకొని బిందు పట్టరాని యానందము నొంది పరుగు పరుగున నింటికిం జని తల్లికిం జూపి మురియు చుండును. నిఱుపేద యగుతల్లి కూఁతు నెత్తికొని ముద్దాడి ముద్దులు మూటగట్టు బిడ్డకు దాకేమియుం గొని యియ్యలేనందుకుఁ గంటఁ దడి బెట్టుకొనుచుండును. బిందు పుట్టిన నాలుగేండ్లకు హరిదాసునకు మఱియొక పుత్రిక పుట్టెను. పెద్దకూఁతురు కొంచెము చామనచాయ గలది. కాని క్రొత్తగాఁ బుట్టిన యాబాలిక మహారూపవతియై యప్సరసవలె నుండెను. ఆమె మేనిచాయ మేలిమి వలె నుండును. కన్నులచ్చముగ తమ్మిరేకులే. పెదవులు దొండపండులే. నవ్వులమృతపక్ష ములే. చక్కనిచుక్కయగు నాబిడ్డకుఁ దల్లిదండ్రులు "సుధ" యని నామకరణముచేసిరి. సుధ యనగా నమృతము. సుధకు జననీ జనకుల ముద్దే కాని మరియేమునుఁ జెల్లెములు లేవు. ఆమె పుట్టినవెనుక కుటుంబమునకు వ్యయ మధిక మగుటచే దండ్రికి మనోవ్యథ యధికమయ్యెను. ఏలయన, బిడ్డకు పాలు కావలసివచ్చెను. కాళ్ళకు చిన్న యందెలు కడియములు గావలసివచ్చెను. ఇరుగు పొరుగు గమ్మలక్కలకు బిడ్డను జూపవలసి వచ్చి నప్పుడు మంచిపరికిణీలు మొదలగునవి కట్టవలసివచ్చెను. వీనికన్నిటికి సొమ్ము కావలసి వచ్చెను. అది లభింపనప్పుడు కన్నతల్లి హృదయ మెంత కరుగునో యెవ్వఁడెఱుంగును. పేదతండ్రి మనోవ్యథ నేకవి వర్ణింపఁజాలును.

ఇట్లు దారిద్ర్యముతోను, మనోవ్యథతోను, హరిదాసు దినమెల్ల శ్రమపడి కుటుంబపోషణ చేయుచుండ వానియిల్లాలు పరమసాధ్వియై మగని పరిచర్యయందును బిడ్డలపోషణయందును రవంతయు నేమఱకవచ్చెడు నిమిషములు సుఖముగా నెంచికొనుచు సంసార మొకరీతిగా గడుపుచుండెను. ఆమె తెల్లవారకమున్నె లేచి వంటచేసికొను నిత్తడిపాత్రలు తోముకొని యిల్లు వాకిలి చిమ్ముకొని పిల్లలకుంబాలు పోసికొని వంటచేసి కొనుచుండును. మగని భోజనానంతరము చెఱువునకుం బోయి స్నానముచేసి నీరుతెచ్చి కొనును. ఆమె మధ్యాహ్నభోజనముచేసి దొడ్డిలోనున్న చెట్లనీడల బిడ్డలుందాను బవళించి యుంచుకనేపు నిద్రించుచుండును. సాయంకాలము మరల నెప్పటియట్ల వంట మొదలగు గృహకృత్యముల నెఱవేర్చి రాత్రిభోజనమగువఱకు నెడతెగక పనిచేసి భర్తను

బిడ్డలకు నిద్రవచ్చి యనంతరము తాను కూడుగుడిచి కంచములు పళ్ళెములు లోనగువాని తలుపులకు గొళ్ళెములుపెట్టి ప్రాణనాథునిప్రక్కఁ బవళించును. భర్తృసేవయే తా నారాధనముగా నెంచికొనునది కావున హరిదాసుభార్య నిరుపేదతనమును దుర్దశయు దానిని లెక్క సేయక మిక్కిలి భాగ్యముతో దులతూఁగుచున్నవారికంటె నెక్కువసౌఖ్య మనుభవించుచు సంసారము దిద్దికొనుచుండును. ఆమె నిజముగా పేదరిక మనుభవించు చున్నదా? లేదు. ఆమె కున్న భాగ్యము కోటిలోనొకతెకైన దొరకునా? ఎట్లన, సదృష్టవశమున నామెకు సుగుణాకరుఁడును బరమసాధువునై తన పాలిటిదైవమని చెప్పఁదగిన భర్త లభించెను. రెండవదియు వెలలేనిరత్నాలవంటి ముద్దుబిడ్డ లిద్దఱుండిరి. ఈభాగ్యము లుండుటంబట్టి యాయిల్లాలు నిర్విచారముగఁ గాపురముసేయఁగలిగెను. పేదరాలై పతివ్రతయైన కులకాంత కింతకంటెఁ గావలసిన దేమున్నది.

కటకటా! యీసౌఖ్య మామె చిరకాల మనుభవింపఁ జాలదయ్యె. పాపపు విధి నిర్దయ మటు లుండఁ దదన్య మెట్లు కాఁగలదు. సుధ జనియించిన నాలుగు సంవత్సరములకు హరిదాసు మర్లక్కా కాలధర్మము నొందెను. అప్పు డమ్మహాపతివ్రత శోకసంతప్తయై పలువరించుచు మూర్ఛిల్లి, మొత్తికొని, గుండెలు మోదుకొని గ్రామమంతయుఁ బ్రతిధ్వను లిచ్చునట్లు వినువారిగుండెలుపగులునట్లు విలపించెను. పరమసాధ్వియగు నాయింతి గృహామునకు వల్లభుఁడగు పురుషుని దైవ మంత్రమూకముగా నేల గొంపోవల యును? ఆపేదయింటికిం బ్రకాశతఁగలుగఁజేయు దీపము నతఁడేల యార్పఁగలయును? ఊరివా రందఱువచ్చి వారిసంతాపమునుజూచి తాము నిలుచక విలపించి యామెనూరడించుచు వచ్చిరి. కాఁపువాండ్రు పొలమునకుఁబోవునప్పు డామెయింటిముందొక నిముసము నిలిచి కంట దడివెట్టికొని పోవుచుందురు. భర్తృవియోగమైన సంవత్సరమునకు, జ్ఞాతియగు తారుణీమల్లికుఁడు హరిదాసుభూములను సేద్యము చేయింప సమకట్టి స్వాధీనము చేసికొనెను. కాని యతఁ డిచ్చుధాన్యము పాప మావితంతువునకు నామె యిరువురుబిడ్డలకుఁ గడుపునిండ తినుటకుఁ జాల దయ్యెను. ఇంటిచుట్టు కొరడివేయించికొనుట కైన నామెకు సామర్థ్యము లేకయ్యె. ఇల్లు కురియుచున్నను మరల నేయించికొనఁ జాలదయ్యెను. అందుచేత నాపడతి తనచిన్నయిల్లమ్ముకొని వ్రేలువిడిచిన బావగారైన తారుణీమల్లికుని యింటివద్ద రెక్కలకష్టముచేసి బిడ్డలం దానును బ్రతుకఁదలఁచి వాని యింటికిఁబోయి వానిపాలం బడెను. అక్కడ నామె రెండుసారులు వంట జేయుటయే గాక గృహసంబంధమైన కృత్యములు నీచములనక యుచ్చములనక చేయఁజొచ్చెను. తన గారాబుబిడ్డలగు బిందును, సుధను నేలఁగూర్చుండబెట్టి తారుణీమల్లికునికూఁతు నెత్తికొని మోయుచుండును. ఇంటికి గావలసిననీరు దెచ్చుచుండును. అంట్లు తోము

చుండును. కసవు చిమ్ముచుండును. అనాథలై జీవనమునిమిత్త మొకరియాధారమును బడసినవారు మిక్కిలి యోర్పుగలిగి యుండవలయును గావున నీవితంతువు చీవాట్లకు లెక్కసేయక యెన్నఁడు నధరస్పందము చేయకయుండెను. అప్పుడప్పుడు హృదయము దుఃఖపూరితమగుటయు నొంటిగ నొకతావున కఱిగి కన్నీరువిడిచి మనంబున నీవిధంబున నీశ్వరప్రార్థనచేయుచుండును. "ఓదీనదయాళూ! నాచిన్నకూనలగు బిందును సుధను రక్షింపుము. వాండ్రు సుఖపడునట్లు లలాటములమీఁద వ్రాయుము. నీకరుణామృతము వారిపై వెదజల్లుము. సుధకు బిందకు నేను బ్రతికియుండఁగానే వివాహము లగున ట్లనుగ్రహింపుము. నాకింతకన్న గావలసినది లేదు." చెఱువులో మొలబంటు నీటను దిగి స్నానము చేయుచున్న యాపడఁతియొక్కయు మెట్లపైనున్న యిరువురు బాలికల యొక్కయుఁ బూర్వచరిత్రమిది.

కొంతిసేపటి కాయింతి నీరుముంచి కడవ భుజముపైఁబెట్టుకొని "అమ్మా బిందూ! యింక నింటికి పోదములెమ్ము. నీవు చెల్లెలి నెత్తికొనఁగలవా? పాపము యింటివద్దనుండి నడచివచ్చునప్పటిక దాని లేతకాళ్ళు నొప్పులెత్తి యుండును. అది దూరమెట్లు నడవగలదు? అయ్యో! పాపము నిద్రకూడ పోయినదా? యనుచు నీరు వెడలి బిడ్డలవైపు వచ్చెను." "అవునమ్మా! చెల్లెలు నిద్రపోయినది. ఏలాగో నేనెత్తుకొని వచ్చెదనులే" యని బిందు తల్లికు త్తరముచెప్పెను. "నా తల్లీ వద్దువద్దు. నిద్రపోవుటచే బిడ్డ యెక్కువ బరువుగా నుండును. కావున నీవెత్తుకొనలేవు. దానిని నాచంక కందిచ్చి నీవు నా చీరకొంగు పట్టుకొని నావెనక నేరమ్ము. అదిగో మబ్బులు కాఱుక్రమ్ముచున్నవి. ఈరాత్రి తప్పక వర్షముకురియును. త్వరగాఁ బోవుదమురమ్ము" అని తల్లి పలికెను. పలుకుటయు బిందు అమ్మా! సుధను నేనెత్తికొని రాఁగలనే. మొన్నరాత్రి మన కాళిగారియింటికి నేను చెల్లెల నెత్తికొని రాలేదా? ఈ కొంచెము దూరమే మోయ లేనా? యని బదులుచెప్పుటయు "సరే! అలాగే యెత్తుకొనిరా, కాని చాల చీఁకటిగా నున్నది. నీవు పడి దానిఁ బడవేయక జాగ్రత్తగా నడువుము. మొన్న మన యుమ తీర్థములోనుండి వచ్చునప్పుడు దారిలో బడెను. పాపము దానికి మొగముమీఁద పెద్ద పుండుగాయము తగిలి నెత్తురు వచ్చె"నని తల్లి యుపదేశపూర్వకముగాఁ బలికెను. ఆ పలు కులు విని బిందు అమ్మా! ఏరీర్థమునకే మన యుమ పోయినది? అది కొనితెచ్చికొనిన బొమ్మలు నేను చూచితిని. యెంతబాగున్నవే? అంతమంచి వెక్కడిది దొరికినవో! యని యడిగెను. నాతల్లీ! నీవెఱుఁగవఁటే. అగ్రద్వీపమున నేఁటేట గొప్పతీర్థము జరుగును. అక్కడికి [illegible] కొందరి [illegible] లు వత్తురు. నాట్యక్రీడ వైశ్యపుత్రుల సంఘములు [illegible]
ఘోషణము చేయుదురు. [illegible] సంగీతములతోను [illegible]

యుండును. అని తల్లి పుత్రికతోఁ బలికెను. అమ్మా! నీవెప్పుడైన నాతీర్థమునకు పోయితివఁటె యని బిందు ప్రశ్నవైచెను. అందుకుఁ దల్లి యిట్లనియె. "నేను నీయంత పిల్లనై యుండఁగా నొక్కసారి యాతీర్థమునకుఁబోయి చూచితిని. మాయమ్మయు, నాయనయు నేను, మాచుట్టాలుకలిసివెళ్ళి మూఁడునాళ్ళక్కడ చెట్లక్రిందనే బసచేసి యుంటిమి. "చెట్లక్రిందనా? ఆయూరిలో ఇండ్లులేవా" యని బిందు మహాశ్చర్యముతోఁ నడుగుటయు "నాతల్లీ! అందఱకు నిండ్లు దొరకునా? యేఁబదివేలమంది యాతీర్థమునకుఁ వత్తురు. అందుచేత నందఱు చెట్లక్రిందనే యుందురు. అక్కడొక పెద్దమామిడితోట యున్నది. ఆచెట్లక్రిందనే వర్తకులు దుకాణము పెట్టుకొని యన్నిసరకుల నమ్ముకొందురని తల్లి బిడ్డకు బదులుచెప్పెను. "అమ్మా! ఆ తీర్థము నాకుఁ జూడవలెనని యున్నది. అది నాకొక్కసారి చూపెట్టవే?" అని బిందు ముచ్చటపడి వేఁడఁ దల్లి సన్నకంఠముతో "అమ్మా తీర్థమును నీకుఁ జూపించుటకు నేనందరివంటి యదృష్టవంతురాలనా? ఆ ప్రయాణమునకుఁ జాలడబ్బు ఖర్చగునని పలికెను. ఆ మాటల కిష్టపడక బిందు పోనీ, ముందునాటికి నన్నుబంపు. మన యుమ, కాళి, వెళ్ళిచూడఁగా నేనెందుకు వెళ్ళకూడదే? యని యజ్ఞానవశమున దనస్థితి యెఱుంగక వచియించుటయు జనని యిట్లనియె. "నాతల్లీ! నీవు మంచిదానవు. మోటపట్టు పట్టఁగూడదు. ఉమతండ్రి కాళితండ్రి భాగ్యవంతులు. కావున వారెక్కడకైనఁ బోవఁగలరు. మీరు పేదరాలి బిడ్డలు కారా? మీకు ముచ్చటలు, వేడుకలు తక్కిన వారితోఁబాటు తీరునా! బ్రహ్మదేవుఁడు మీరు సుఖపడవలెనని మీనొసట వ్రాసినపక్షమున నా కడుపున నేల పుట్టుదురు. బంగారపు బొమ్మలవంటి నా చిట్టితల్లులిద్దరు మఱియొకరియింటఁ గడుపుకూఁటి నిమిత్తమై యేలయుందురు? దైవమా! నీ నిర్ణయము జరుగుచున్నదిగదా!

కాఱుమబ్బులు, మబ్బుల ననుసరించి గాఢాంధకారములు నలుదిక్కుల వ్యాపించెను. మెఱుపు తళతళమని నడుమనడుమ మెఱయఁజొచ్చెను. మబ్బుపైగాలి చెట్లయాకులను గలగల లాడించుచు వీవఁజొచ్చె. గ్రామమంతయు నిశ్శబ్దముగ నుండెను. నక్కకూఁతలుతప్ప మఱియేధ్వనులు వారిచెవులకు వినఁబడవయ్యె. ఆకసమున నొకటిరెండు నక్షత్రములు దూరమున నేఁటంటనో మిణుకుమిణుకు మనుచున్న చిన్న దీపముతప్ప మఱియు వెల్తురు గానబడుటలేదు. ఆ చిమ్మచీఁకటిలో బిందు తల్లి చీరకొంగుపట్టికొని చెట్లక్రిందనుండి యూరిపురతలో నడువజొచ్చెను. చీఁకటియగుటచేతఁ దల్లి కన్నీరువెట్టి కొని నడచుచున్నదని బిందు కనుఁగొనలేక పోయెను. ఇట్లుపోయి తల్లి బిడ్డ లిల్లుజేరిరి.

# రెండవ ప్రకరణము.

## అక్కచెల్లెండ్రు

తాళ్ళచెఱువు గ్రామమున దట్టమగు చెట్లతోపల నడుమ నొకచిన్న కుటీరము కలదు. అది మట్టమధ్యాహ్నము. చుట్టుప్రక్కల పొలములు మండువేసంగిఁ జండతరుఁడైన భాస్కరుని యెండలో మెఱయఁ జొచ్చెను. సన్నకాపులు రెండు జాములవరకు పొలములలోఁ బనిజేసి నాగళ్ళు భుజములపై వైచికొని పశువులఁ దోలుకొని యిండ్లకుఁ బోవుచుందురు. అతి పరిశ్రమముచేత నలసిసొలసిన కొందఱు కాపులు గృహముల కరుగలేక పొలములోనే చెట్టునీడనో బడి నిద్రింపుచుండ వారికొఱకు భార్యయో, బిడ్డయో, తోఁబుట్టునో యింటనుండి యన్నము గొనిపోవుచుండెను. కన్నులు మిరుమిట్లు గొలుపు నా మధ్యాహ్నపుటెండలో నీడగల యా గ్రామమే చల్లనితావు. గ్రామము నందలి ప్రతి ప్రదేశమున విశేషముగఁ బెఱిఁగిన వెదురుపొదలయాకులు గాడ్పునకుఁ గదలఁజొచ్చె. తరుచుగా రెండుమణుగుల బరువుండు పనసపండ్లు తియ్యని నీరుగల కొబ్బరిబొండములు గ్రామమునఁ బ్రతి పాటి పెరటియందుఁ బ్రతియింటిముంగిట బండుచుండును. మూఁడడుగుల పొడవుగల యరఁటిగెలలు నున్నని యాకులనడుమ వ్రేలాడుచు గనులపండువు సేయును. గ్రామమునఁ గొన్నిచోట్ల వీధులకిరుప్రక్కల బొమ్మజెముడు మొదలగు ముండ్లచెట్లు మొలిచి మార్గమును సన్నముగ జేసెను. ఊరిలో సగముభాగ మడవిమొక్కలతో నిండియుండును. ప్రక్కనున్న మామిడితోఁట రెండుమూఁడెకరముల నేల నాక్రమించుకొని చల్లదనమునకు దావై నీడలనిచ్చుచు మనోహరముగ నుండును ఆ మధ్యాహ్నమున సూర్యుఁడు తీక్ష్ణములై శూలములట్లున్న తన ధవళ కిరణములను తోఁటలోని చెట్లయాకుల సందునుండి నేల మెఱయుచుండు పచ్చగడ్డిపై బ్రసరింపఁజేయఁజొచ్చె. ఆ తోఁపునుండి యావలకు వినఁబడునట్లు నిముసమైన నెడతెగక కూయు పావురముదక్క దక్కిన పక్షులన్నియు నెండవేడిమిచేత నోరెండి పలుకఁ జాలవయ్యె.

ఆయూర నీడగల యొకచోట నొకగృహము గలదు. దాని వీధిచావడికి నలు ప్రక్కలఁ గొబ్బరిమొక్కలు గలవు. దాని వెనుక నొకవాకిలియు దానినంటి యొక గృహమును గలవు. ఈ గృహమే యింటివారికి నివాసయోగ్యమై శయనయోగ్యమై యుండును. దానికి ముందువైపొక పంచపాళిగలదు. ఈ ప్రక్కనొక చిన్న వంటయిల్లు గలదు. దొడ్డిలో నొక పసులశాల యుండెను. అం దొక్కటే పాడియావున్నది.

ఇవి యన్నియుఁ దాఁటియాకు గృహములే. ఈ గృహమందు వసియించు కుటుంబము లోనివా రప్పుడప్పుడే మధ్యాహ్నభోజనము ముగించియుండిరి. పొయిలోని నిప్పు నయిత మార్పివేయఁబడెను. కొరడిమీఁదఁ గొన్నిబట్ట లెండవేయఁ బడియుండెను. దొడ్డిలోనున్న దిగుడుబావినీటిలో వంటగిన్నెలు, పళ్లెములు వేయబడి యుండెను. కాని వానినప్పటి కెవ్వరుఁ దోమియుండలేదు. ఆబావియొద్దను గొన్ని యరఁటిచెట్లుమాత్రమే కలవు. తక్కిన దొడ్డి యంతయు ముండ్లచెట్లతో నిండియుండెను. పండుకొను గదితలుపు మూయఁబడి యుండుటచే గదియంతయు నంధకారబంధురమయ్యెను. ఆ గృహయజమానురాలు గదిలో నిట్టట్టు పచారుసేయుచుండెను. రెండేండ్ల వయసుగల యామె చిన్నబిడ్డ గదిలో నొకచాపమీఁద నిద్రపోవుచుండెను. ఆఱునెలల ప్రాయముగల కొడుకును నిద్రపుచ్చుటకై యామె గదిలో నిట్టట్టు దిరుగుచుఁ జేతితో బాలకుని జోకొట్టుచు నెడనెడ శ్రావ్యముగా జోలపాడుచు వచ్చెను. ఆ యువతి రమారమి యిరువదేండ్ల వయసుగలది. ఆమె కరచరణములు మిక్కిలి కోమలములై యుండెను. ముఖము మంజులమె యగును. కాని యే కారణంబుననో యించుక తెల్లబారియుండెను. ఆ యెలనాగ కన్నులు వెడదలై నీలోత్పలంబులవలె నిగనిగలాడుచు మొగమున కెంతయు వన్నె దెచ్చుచుండెను. అన్యదేశములందలి యువతు లీవయస్సున నీమెకంటె శరీరదార్ఢ్యము కలిగి ముఖలావణ్యము కలిగియుందురు. హిందూదేశమున నువిద లిరువదియేండ్లు వచ్చునప్పటికె గృహిణులై యిద్దరు ముగ్గురు బిడ్డల తల్లులై యుండుటచేతను సంసార సంబంధములగు మనోవ్యథలు వారిం బీడించుచుండుట చేతను సాధారణముగ ముఖవర్చస్సు దొలఁగియుందురు.

కొంతసేపటికి బాలుఁడు నిద్రపోయెను. పిమ్మట నామెయుఁ జేయి తలగడగాఁ బెట్టుకొని కొండొకసేపు విశ్రమింపఁ బండుకొనెను. అది మట్టమధ్యాహ్నమైనను. ప్రచండమైన యెండవేఁడిమిచేత జన మర్ధరాత్రమందువలె మాటుమణఁగి యుండెను. బహిఃప్రపంచమువలెనే గదియు నిశ్శబ్దమయి యుండెను. బాలిక యనదగిన యా కాంత బిడ్డలప్రక్క నిదురించెను. సంసారబాధ లా సమయమున నామెను విడిచి దవ్వరుగుటచే నా ప్రశాంత సమయమున నామె మొగము మేలుకొన్నప్పటికంటె వికాసవంతమై యలరుచుండెను. ఆమె రమారమి యొకగంటసేపు నిదురించునప్పటి కేదో చప్పుడయ్యెను. ఆ చప్పుడువిని యామె మేలుకాంచె. ఆమె కన్నులు తెఱచి చూచునప్పటికి మెఱయు గన్నుగవతోఁ జిరునవ్వు వెన్నెలలుగాయు ముఖచంద్రమండలముతో ముద్దులు మూటగట్టు నొక బాలిక పెద్ద పిలుపుతో నాడుకొనుచు నామె యెట్టయెదుట గానంబడెను. ఆ బాలిక [illegible] కొంచెము పాటిపాటి [illegible] గెంతుచుండెను. బాలికయు

నా వస్తు వామార్జాల కిశోరముల కిద్దరదియుండలైర నడచుచున్నది. యొకకొన నవ్వుచు దూరముగ లాగుచు వినోదము ననుభవించుచు. ఆ శరీరసౌందర్యమును నిర్వర్ణ కాని దీర్ఘాలోచన కాని మొలక లెత్తలేదు. ఆమె సమస్తావయవము లానందముచే గ్రక్కుచుండెను. పెదవులు చిఱునవ్వుతో వెలయుచుండెను. పుష్పసన్నిభమైన యామె బాహువులు మెత్తని పుష్పగుచ్ఛములతో నిండిన తీగలలాగున మనోహరములై యుండెను. ఆమెకది పదియారవయేడు. బాల్యమునుండి యౌవనప్రారంభమునకు సంక్రమించిన చాంచల్యము మొదలగున వామె నప్పటికిని బాయలేదు.

అటు లున్న యీ ముద్దుగుమ్మను జూచి గృహయజమానురాలు "సుధా ! యెంత సేపైనదే నీవు వచ్చి" యని యడిగెను. అప్పు డా యక్కచెల్లెండ్రకు క్రింది సంభాషణ జరిగెను.

సుధ—చాలా సేపైనదే! నీవు గాఢముగ నిద్రపోవుచుంటివని లేపలేదు. అక్కయ్యా నాకు, ఈ పిల్లిపిల్ల నే నెక్కడికిపోయిన నక్కడకు నా వెంట వచ్చును. నేను వంటయింటి తలుపుమూసి యాటకిన్నెలం దోయుటకు దిగుచుండగా కదలకపోవ నది కూడ నన్ను వెంబడించినది.

అక్క—గిన్నెలం దోమి గదిలో బెట్టితివా ?

సుధ—ఆ. పెట్టితిని. ఆ పని జేసికొని యీ పిల్లిపిల్లను పశులశాలలోం బడవైచితిని. కాని యది తడకల సందునుండి దూఱి మరల నాదగ్గఱకే వచ్చినది. ఈ వస్తువు నాకిది గావలెనంట. కాని నేను దానికియ్యను.

అక్క—నీకు రాత్రికూడ సరిగా నిద్ర లేదు గదా ! నీవు కొంచెము సే పెందుకు నిద్రపోవే ?

సుధ—'అక్కయ్యా ! పగలు నాకు నిద్రరాదే ! అయినను రాత్రి నాకు సరి గానే నిద్రపట్టినది. నీ పిల్లవా డేడ్చినప్పు డొక్కసారిమాత్రము నేను మేలుకొంటిని. పిల్లవా డీపూట నేలాగున నున్నాడు ?'

అక్క—వాని కిప్పుడు నెమ్మదిగానే యున్నది. రాత్రి యొడలు కొంచెము వేడిగా నుండును. తండ్రి కాట్వానుండి యీ పూట కొంచమమందుం దెచ్చి వేయుదురు. ఆ మందు జ్వరమును తగ్గించి సుఖముగా నిద్ర పట్టించును.

సుధ—అక్కయ్యా ! కాట్వానుండి బావ యెప్పుడు వచ్చునే ?

అక్క—సాయంకాలము వత్తునని చెప్పివెళ్ళినారు. ఎందుకేమిటి ?

సుధ—(నవ్వుచు) ఎందుకా నేను బావను కొంచెము హాస్యము చేయవలెనని యున్నదిలే ! అది యేమిటో నే నిప్పుడు చెప్పను. బావ రాంగానే చూడంగలవు. ఆ వేళ నా మీఁద నిరాపాడి వేసినాండు. అందుకు నే నిప్పుడు కసిదీర్చికోవలెను.

అక్క—నీ వేమి చేయఁదలఁచుకొన్నావో చెప్పరాదఁటే!

సుధ—చెప్పఁగా. నీవు ముందుగ నతనితోఁ జెప్పివేయుదువు.

అక్క—చెప్పను లే.

సుధ—చెప్పవుగదా! నిజముగా చెప్పవు గద?

అక్క—నిజముగానే చెప్పను.

అంతట సుధ చీరకొంగుముడి విప్పి యొక చిత్ర వస్తువుఁ బైకి తీయ మరల నక్కచెల్లెం డ్రిట్లు సంభాషించిరి.

బిందు—అమ్మాయి! యిది యేమిటే?

సుధ—అక్కయ్యా! చూడఁగానే తెలియ లేదఁటే?

బిందు—తెలియు చున్నది. ఇది జనపనార కాదఁటే?

సుధ—అవును. జనపనారయే కాని దానికి నేను కుసుంభవర్ణము వైచితిని.

బిందు—అట్లయిన నీ కీ రంగుపేఁ చెందుకే?

సుధ—ఎందుకో చెప్పుకో.

బిందు—నేనెట్లు చెప్పుకో గలను.

సుధ—ఇంతే ఇదే చెప్పుకోలేవఁటే. ఈ రాత్రి బావ నిద్రపోవునప్పుడు నేనీ పేఁచాతని గడ్డమునకు గట్టి యతఁడు లేచినప్పుడు పెద్దగడ్డం బావజీగారు వచ్చినారని యెగతాళిజేసి నవ్వెదను. ఇది మంచి కేళాకోళము కాదూ?

అని సుధ తనమాటలకుఁ దానే వికవిక నవ్వెను. బిందు లోపలినుండి వచ్చు చిఱునవ్వు నాపుకొనలేక యొక్కసారి నవ్వి సుధయొక్క ముఖారవిందమునుఁజూచి తనలో నిట్లని విచారించెను. "అయ్యో! నాతల్లి వెఱ్ఱిసుధ. నీ చిరునవ్వు లెంత మనోహరములుగా నున్నవే? కటకటా! నీకర్మము కాలిన దనియు నీ బ్రతుకు వృథయైన దనియు నీవెఱుఁగవుగద. ఆ పాపిష్టిదైవ మింతచిన్నతనములో నీ మొగమున నెక్కడవైధవ్యము వ్రాసెనో గదా."

ఈ గ్రంథారంభమం దొకనాటి సాయంకాలము తల్లియు నిద్దఱుకుమార్తెలు తాళ్ళచెఱువువద్దకు నీరునిమిత్తమువచ్చి యిప్పటికి పదియొకండు వత్సరములైనది. మనము పైన చదివిన కథనుబట్టి యీ నడుమ కాలగతి యెట్లుమాఱెనో తెలిసికొనవచ్చును. ఈ బాలికలతల్లి జ్ఞాతిగృహముననుండి బిడ్డలం బెంచెను. మగని మరణానంతరమామె సౌఖ్యమన నెట్టిదో యెన్నఁడెఱుంగక పోయినను దనకుమారికల కిరువురకు నెట్లయిన వివాహమైనంజాలునని యెల్లప్పుడు గోరుచుండెను. ముద్దుకూఁతుల పెండ్లిండ్లు కన్నులార జూచు కుతూహలముచేతనో వివాహము కాకుండఁ గన్యల నిలుపఁగూడదను మత

నిర్బంధముచేతనో చాలకాలమువఱకు నిలిపిన మంచి సంబంధములు దొరకవను భయము చేతనో మనదేశమునఁ దల్లిదండ్రులు కూఁతులకే డెనిమిదేండ్లు వచ్చినది మొదలు భర్తల వెదకుచుందురు. అందుచేతనే తల్లి బిందునకుఁ బదియవయేఁడు రాఁగానే పెండ్లి నిమిత్తము తొందరపడి వరుని వెదకఁజొచ్చెను. పరువుగల కుటుంబమునఁ బుట్టినను బీదబాలికల కనుకూలసంబంధములు లభించుట యరిదిగదా. పట్టణములందుండు నాగరికులగు తల్లిదండ్రులు కొడుకుల వివాహములప్పుడు వేనవేలు రూప్యములఁ గట్నములుగా నపేక్షించుట యీనాటి యాచారమైయున్నది. పల్లెలలో నీ దురాచార మంతగాఁ బ్రబలి యుండకపోయినను జననీ జనకులు తమకుమారులకు భాగ్యవంతుల కూఁతులం దెచ్చి పెండ్లిచేయుటకై యత్నింతురుగాని మగఁడు మృతినొందఁ జుట్టముల పంచను జేరి రెక్కలకష్టముఁ జేసి రొట్టెటో బిడ్డలం బెంచుకొనుచున్న పేదరాలికూఁతు నేతల్లిదండ్రులు తమకుమారునకు నెఱిఁగియెఱిఁగి వివాహము జేయుదురు? దిక్కుమాలిన యీయిల్లాలొక్కతెయె బిందు వివాహమును గూర్చి బెంగగొని సంబంధములు వెదకఁ జొచ్చెను. కాని తారక్కమ్మకుఁడు పాపము తండ్రిలేని బిడ్డకదాయని జాలిదలఁచి బిందు పెండ్లినిగూర్చి యేప్రయత్నముఁ జేయలేదు. చుట్టము లంతకంటె నుపేక్షఁ జేసిరి. పేదవాండ్రు చుట్టములకు జుట్టములు కారుకదా. పేదతనమేగాక బిందునకు సౌందర్యలోపము గూడ కలదు. ఇవి కారణములుగఁ జాలసంబంధములు కాలక్రమమున వచ్చుటయు నవియెల్ల నేదోనెపమునఁ జెడిపోవుటయుఁ దటస్థించెను. తారుణీవల్లికుని భార్య సాయంకాలము లోపలివసారాలోఁ గూర్చుండి ప్రతిదినము బిందు తల్లిచేఁ దల దువ్వించు కొనుచు నప్పుడప్పుడా పేదరాలి నీవిధముగ నూరడించుచుండును.

"అమ్మాయి! పిల్ల పెండ్లినిగూర్చి నీకింత బెంగ యెందుకమ్మా? మనయింటి యాఁడుపడుచు, పెండ్లిండ్లనుగురించి బెంగ పెట్టుకొన నక్కఱలేదు. వీండ్లకు వివాహములు కాకపోవు. మన కుటుంబస్థితి, మన గౌరవము వర్ధమానపట్టణములో మీ బావగారికున్న యుద్యోగము నెవ రెఱుఁగరు? తలక్రిందుగాఁ దపస్సుఁ జేసిన మన సంబంధమువంటి సంబంధము దొరకునా? అందుచేత నీవు బిందు విషయమున విశేషము మనస్తాపము నొందకుము. మీ బావగారు నవరాత్రములకు వచ్చినప్పుడు నేనాయనతో మాటలాడి మన మర్యాదకుఁ దగినసంబంధము వెదకునట్లు చేసెదను. అదియునుఁగాక మాయమ్మాయి యుమకుఁగూడఁ బదియవయేఁడు వచ్చినదికదా! అన్ని ప్రక్కలనుండి దానినిమిత్తము పదులకొలఁది సంబంధములు వచ్చిపడుచున్నవి. దాని కిప్పుడు పెండ్లిచేయుటకు నే నొప్పుకొంటినా కన్నులనద్దుకొని దానిని దీసికొని పోవుదురు. కాని యింతలో వివాహము చేయుట నాకిష్టములేదు. మా చిట్టితల్లికిఁ బెండ్లిచేయఁ దలఁచుమేని మనకుటుంబమునకు

దగినసంబంధమే తీసికొని వత్తుముగదా! కాని యమకు బిందుకుఁ జక్కఁదనములోఁ గొంచెము భేదమున్నది. ఉమ యెఱుపు. బిందు నలుపు. దానికిఁదోడుగ నీవద్దడబ్బులేదు, నీపుగఁ డెల్లవారివలె గడుసరి కానందున నాలుగుడబ్బులు వెనుక వేసికొనలేకపోయెను. కుటుంబ గౌరవము సమానమైనను బిల్లలిద్దరికిఁ గలభేదమిది. అయినను భయపడి ఆదే బెంగ పెట్టికొనకు. నేను మనసారఁ దలపెట్టితినా నీకార్యము గట్టెక్కింపగలను" అని హస్తకంకణములు ఘల్లుఘల్లున మ్రోయునట్లు తల ముడుచుకొనుచుఁ దోడికోడలు ధైర్యము సెప్ప బిందుతల్లి విచారమును విడిచి కూఁతురు పెండ్లినిమిత్త మువ్విళులూరు చుండును,

అనంతరము దేవీనవరాత్రములు వచ్చెను. తారుణీమల్లికుఁడు వర్ధమానమునుండి స్వగ్రామమునకు వచ్చెను. ఆయన వచ్చునప్పుడు పూజావస్త్రములు నగలు దక్కాచీరలు భార్యనిమిత్తము, మంచి పరికిణీగుడ్డలు మొదలగునవి కూఁతురునిమిత్తము, కొన్నివస్తువులు నౌకర్లనిమిత్తముఁ దెచ్చెను. వర్ధమానమునుండి నాజరుగారు విలువగల బహు పదార్థములతో వచ్చిరనువార్త గ్రామమంతయు వ్యాపించెను. ఆయన దర్శనముఁ జేయుటకు జనులు గుంపులుగుంపులుగాఁ బోయిరి. పోయి వారు దయాస్తనుయము లొక్కవరుసనే వాని నూరక పొగడఁజొచ్చిరి. కొందరు పూజఁజేసికొనుటకు సొమ్ములేక బదులడుగఁ బోయిరి. మఱికొందఱు వ్యవహారపు జిక్కులఁగూర్చి యాలోచన మడుగబోయిరి. ఒకఁడు తన కుమారునకు నుద్యోగమిమ్మని వేడబోయెను. మరియొకఁడు వానితోఁ బనియేమియు లేకయే వృద్ధాచార మనుసరించి యాయనదర్శనముఁ జేయుటకుఁబోయి కొంతసేపు పొగడి స్వగృహమునకుఁ బోయెను. ఈ మహోత్సవములలో బిందుమాట యెవరికిఁ గావలెను? పూజలు ముగిసెను. పదునైదు దినములు సెలవులు గతించెను తారుణీమల్లికుఁడు వర్ధమానపురమున కరిగెను. బిందు వివాహ ప్రసంగ మతనివద్ద రానేలేదు.

చుట్టములసాయ మట్లగుటచేత బిందుతల్లి యిరుగుపొరుగమ్మలక్కలఁ గలిసికొని నపుడు వారిని పుత్రికావివాహవిషయమున నోపినసాయముఁ జేయుఁడని వేఁ చుండును. ఆయమ్మలక్క లామె వేఁడికోలువిని, తలయూఁచి "అమ్మా! దానికేమి; మీయమ్మాయికి సంబంధమే వెదకిపెట్టఁజాలమా? ఈపాటి సాయముఁజేయుటకు నీకంటెను ముఖ్యులెవరమ్మా? కాని యాఁడుపిల్లలకు బెండ్లిఁజేయుట యీదినములలో మహాకష్టమమ్మా. కట్నమిచ్చుటకు నీదగ్గఱసొమ్ము లేదాయెను. ఈయమ్మాయి తండ్రి యెప్పటి సొమ్మప్పుడే సంసారముక్రిందఁ బెట్టునే కాని కొంచెము తెలివి గలిగి నాలుగుడబ్బులు వెనుక వేయలేక

పోయెను. మీబావగారివలె కొంచెముసొమ్ము నిలువఁజేసినయెడల వివాహమున కింతకష్టమక్కఱలేక పోవునుగదా తల్లీ. అప్పుడు నీమగనితో ఖర్చులలోఁ గొంచెము మితముగా నుండుమని మేమెన్నివిధములనో చెప్పితిమి. కాని వినలేదు. మగవాఁ డేలాగునఁ గర్చుఁ జేసినను నీవైన మామాటఁ జెవిని బెట్టితివా? చూడు! మఱియిప్పు డెంతతలమీఁదకువచ్చినదో, పెండ్లియనఁగా మాటలా అయినదేమోయయినది. దానికేమి, ఎక్కడనో యొకచోట సంబంధము తీసికొనిరాలేక పోదుమా, ఎవరివిషయమునైన నూరకుందుముగాని, చిట్టితల్లి, బిందు విషయమై యశ్రద్ధఁజేయుదుమా? యని చెప్పుచుండురు. మనసులోనున్నకోరిక ఫలముదూరమైనకొలఁది బాధయధిక మగుచుండునుగదా! అందుచేత బిందు తల్లి తనకోరిక గ్రామములో వయసుగడచినపెద్దలతోఁ జెప్పుకొని సహాయమునువేఁడ దలఁచి చెలువుగట్టున వారిం గలిసికొన్నప్పుడు, త్రోవలో నెదురైనప్పుడు విడువకయదేపనిగా వారింబతిమాలుచుండ వారును దమగొప్పతనము తేటపడునట్లామెతో నిట్లనుచుండిరి.

"బిడ్డా! యిన్నాళ్ళనుండి యీసంగతి మాతో నేల చెప్పకపోయితివి? చెప్పక యూరకుండిన నెట్లు తెలియును? కాళితల్లి సంబంధము వెదకివెదకి వేసారి యెందును గానక చిట్టచివర క్రిందటినెల మాకువర్తమానమంపినది. అప్పుడు మేమేవో చిక్కులు పడి యొకసంబంధముఁ గుదిర్చితిమి. కాళికిఁగూడ మీఅమ్మాయియీడే. దానికిఁగూడ పదియవయేఁడువచ్చినది. ఎంతమంచిసంబంధము కుదిర్చినామో చూడు. వర్ధమానపట్టణమందున్న రాయకుటుంబమువారు కుబేరునియంత ధనవంతులు. సకల భాగ్యభోగ్యములుఁ గలవు. పెండ్లికుమారునకు ద్వితీయము. వయస్సుకొంచము ముదిరినదనుమాటతప్ప తక్కిన నేలోటియేమియు లేదు. కావలసినంత యైశ్వర్యము. ఆ పట్టణములో వారికున్న గౌరవ మెవరికిలేదు. ఎంతపలుకుబడి! యెంతవ్యవహారము! ఆయన పెద్దదొరలకు విందు చేయుచుండును. వారితోఁగలిసి గుఱ్ఱపుబండ్లమీఁద దిరుగుచుండును. వేయేల? ఆతఁడు జమీాందారువైభవ మనుభవించుచున్నాఁడు. మేము తలఁచుకొన్నట్టికాని యాపిల్లతల్లి స్వయముగా వెదకికొనిన నిటువంటి సంబంధము దొరకునా? ఈరోజులలో మనుష్యులకు స్వాతంత్ర్యములు బలిసి పెద్దలతోఁ జెప్పక వ్యవహారములు చేయఁజూతురు కాని యవి నెఱవేఱునా? కాని యిప్పటికైన నీవు తెలివైనపనిఁజేసితివి. మావద్దకువచ్చి యిందులో మమ్మాలోచన మడిగితివి. మామాట జ్ఞాపకమున్నది; కొంతసయిమే."

పాప మాపేదరాలు వారిమాటలు మనఃపూర్వకముగా వచ్చినవే యనుకొని కంటఁ [illegible] తానంతకాలము [illegible] వారి యాలోచన [illegible] వారి [illegible] వారు

దయార్ద్రహృదయులై మరల నామెతో "నీవిఁకఁ బెండ్లివిషయమున బెంగపెట్టుకొన నక్కరలేదు. మాచెవిని వేసితివిగనుక నీకార్యము నెఱవేర్చెదనే యని నిశ్చయముగ నమ్ముకో" యని ప్రత్యుత్తర మిచ్చుచుండెను. బిందుతల్లి యరచేతిలో వైకుంఠము గనఁబడినట్లు, చందమామ చేతికి దొరికినట్లు, మిక్కిలి యుప్పొంగి పరవశముఁజెంది నిద్రాహారములు సైతము మానుకొనుచు వచ్చెను. క్రమక్రమముగ దినములు వారములు నెలలు గడచెను. రెండు సంవత్సరములు గతించినను గూఁతునకుఁ బదునెండవయేఁడు వెళ్ళవచ్చినను సంబంధము వెదకి తెచ్చువా రెవ్వరు లేకపోయిరి. హరిదాసుమల్లికున కాగ్రామము నందే యొక ప్రియమిత్రుఁ డుండెను. ఆయనకొక పుత్రుఁడు కలఁడు. అతని పేరు హేమచంద్రబోసు. హేమచంద్రుఁడు విద్యాభ్యాసముఁజేసి వర్ధమానపురమునఁ బ్రవేశపరీక్షయందుఁగృతార్థుఁడై పైచదువులఁ జదువునిమిత్తము కలకత్తానగరమునకుఁ బోయెను. కాని దైవవశమునఁ దండ్రి పరలోకగతుఁడు కాఁగా, హేమచంద్రుఁడు విద్య ముగింపకయె స్వగ్రామమునకుఁబోయి యే యుద్యోగమునం బ్రవేశింపక పిత్రార్జితమైన యాస్తితో గౌరవమునఁ గాలక్షేపముఁ జేయసాగెను. హేమచంద్రుఁడు బిందును బాల్యమునుండి యెఱుంగును; కావునఁ జక్కఁదనముకంటె గుణములయం దధికాసక్తుఁడై యా బాలికను వివాహమాడ నిశ్చయించుకొనెను. అవివిని యూరిలోని పెద్దలు తండ్రి స్నేహితుని బిడ్డయైనంతమాత్రమున నిఱుపేదలపిల్లను బెండ్లియాడఁ దలఁచుటచేత హేముఁడు బుద్ధిహీనుఁడు నిర్భాగ్యుఁడు నని తలంచిరి. అందఱు ముక్కులు మూతులు విఱిచినవారే. హేమచంద్రుని చుట్టములు, కుటుంబగౌరవమునకుఁ దగదని సంబంధముఁ జెడఁగొట్టఁ దలఁచిరి. కాని హేముఁడు స్వతంత్రుఁడు. పట్టుదలగలవాఁడు నగుటచే నెవ్వరిమాటలు సరకుసేయక బిందు తల్లికడకుఁబోయి తానే స్వయముగ వివాహము నిశ్చయించుకొనెను. పెద్దలమాట హేముఁడు త్రోసివైచినాఁడను నీసున నూరిలోని యమ్మలక్కలు నీరాడు రేవులలోఁ జేరినప్పుడు "అక్కయ్యా! వినావమ్మా! యీచోద్యము, హేమునికెంత సిగ్గులేదో! వానిసాహసము కాల. పెండ్లికాకముందే బిందును దఱచుగాఁ జూచుటకు వెళ్ళుచుండెనఁట" యని యొకతెయన మఱొకతె "వదినే అంతేనా చిత్రమువిను. బిందు సాయంకాలము చెఱువువద్దనుండి వెళ్ళునప్పుడు హేముఁడు త్రోవలోఁగాచికొని దానితో గుసగుసలు గసగసలును. మాయకలికాలము వచ్చెఁగదా!" యని వింతలు చూచినట్లే చెప్పుచుండును. ఎవరెట్లు చెప్పుకొన్నను సంబంధము నిశ్చయమయ్యెను. తారిణిభార్యకునుగూడ నీ సంబంధ మిష్టముగానే యుండెను. ఆమె వెనుక నభయమిచ్చినట్లు బిందు వివాహమునుగూర్చి మగనితో మాటలాడకున్నను భాగ్యవశమున సంబంధము కుదిరినప్పుడు మాత్రము మనసార సంతసించెను. అంతట సుముహూర్తము నిశ్చయమయ్యెను. తారిణీచరణుఁడు భార్యయుఁ బీటలమీఁదఁ గూర్చుండి కన్యాప్రదాన మొనర్చిరి.

ఈ వివాహమైన కొలఁదికాలముననే తారుణీపుత్రికయగు సుమతికిఁగూడ మిక్కిలి భాగ్యముగల సంబంధము వచ్చుటచే నా దంపతులు మఱింత యానందమునొందిరి. ఉమాబిందులకొక్క సంవత్సరమందె వివాహమయ్యెను. బిందునకు వివాహమైనది మొదలు తల్లి సుధకుఁగూడఁ బదియవయేఁడు వచ్చినందున దాని వివాహమునుగూర్చి మనసున నెంతో యాత్రముపడుచు నెడనెడ నిట్లు తలంచుచుండెను. "నేను బ్రతికియుండఁగానే దీనికిఁగూడ మూఁడుముళ్ళు పడినా నే నేమైనను భయము లేదు. అప్పుడు నాకోర్కె సఫలమగును" అటులామె తలంచుచుండఁగనే యొక సంబంధము దొరకెను. వరుఁడు సుధకన్నఁ గొంచెము పెదవాడు. వివాహానంతరము తల్లి యిరువురుకూతులఁ జేరియొక ప్రక్కం గూర్చుండఁబెట్టికొని కన్నుల నానంద బాష్పములుతొలఁగ "నాతల్లులారా! నాజన్మమిప్పటికి తరించిన"దని ముద్దిడి తనయంతటి యదృష్టవంతురా లీలోకమున లేదని బ్రహ్మానందభరితయయ్యెను. పాప మీ యిల్లాలు మగని మరణానంతరము నేత్రములనుండి యానందబాష్పములువిడిచి మనసార సంతసించిన దీ యొక్కసారియే. ఆహాహా! దైవ మెంత యోర్వలేనివాఁడో కాని సుధకు వివాహమైన కొన్నినెలలకే ముట్టయులకు లోకము నకు బరువైనదని కాబోలు ఆపేదరాలు కష్టములుగట్టెక్కి సుఖపడుకాలమున నామె నెత్తికొని పోయెను. బిందు పండ్రెండవయేఁట దల్లిపోవుటచే నత్తయింటి కరుగవలసివచ్చెను. హేమచంద్రుఁడు ప్రథమముననుండి యామెయందనురాగ మధికమగుటంజేసి నవనాగరకుఁ డగుటచే నెవ్వరికింజంకక యాబాలికకు విద్యయు బుద్ధియుఁ జెప్పి దయతో నాదరించి యుక్తవయస్కురాలైనపిదప నామె తనయందనురక్తికి విశ్వాసములు కలిగియుండునట్లు చేసెను. ఈఁడువచ్చినపిదప బిందు పరపురుషునిఁ జూచి యెఱుఁగదు. భావించి యెఱుఁగదు. ఆమెకు పతియే దైవము. పతితోడిదె లోకము.

సుధయొక్క చరిత్రము మాత్రము మిక్కిలి దయనీయమైనది. పదియవయేఁట నామె వధువై పండ్రెండవయేఁట విధవయయ్యెను. వివాహ మగుటయేమో వైధవ్యము వచ్చుటయేమో యామెకు దెలియదుగదా! దిక్కులేని యాబాలవితంతువును వీరు తలయొంటికిఁ దీసికొని పోయెను. సుధ వివాహాలంకారములం దీసివైచి ఘనిష్ఠాలమునందేనకే రా దలచినకష్టము లేవియో యెఱుఁగక తనయీడు బాలికల విచిత్రమైన యాట లాడుచుఁ బాటలబాడుచు గాలక్షేపము సేయఁదొడఁగెను. వెనుకటి ప్రకరణములో జెప్పబడిన తెలుగున నామె పిల్లకూనతో నాడినయాటలే దానికి దార్కాణములు.

ఇట్లు నాలుగు సంవత్సరములు గడిచెను. బిందున కిరువురు బిడ్డలుకలిగిరి. కాశియు నుమయు భర్తలతో గాపురము చేయఁబోయిరి. వారిప్పుడిప్పుడు స్వగ్రామమునకు వచ్చి చిన్ననాటి చెలికత్తెయు సమానవయస్కురాలునగు [illegible] కష్టసుఖములఁ జెప్పికొనుచుందురు.

# మూఁడవ ప్రకరణము

## దంపతులు.

అప్పుడు జామురాత్రి యయ్యెను. తాళ్ళచెఱువుగ్రామము తాళ్ళవృక్షముల నీడలఁ బండుకొని నిద్రపోవుదానివలె నుండెను. చంద్రకిరణములు చెట్లయాకులలోఁబడి క్రిందికిఁ బ్రసరింపలేక యలసి యయ్యాకుపాన్పులఁ బండుకొన్నట్లచటనే నిలిచెను. చెట్లు పొదలు తోఁపులు గృహములు తెల్లని ముసుంగులు వైచికొనిన చెలువమునొప్పె. చందమామ కిరణములు తటాకమధ్యమునఁ దళతళ లాడుచు నీటిమీఁద నాట్యముసేయు తెఱంగున శోభనప్రదములై యుండెను. కాలపురుషుఁ డను సేవకుఁడు గ్రామమంతటం బఱచిన మల్లెపూల పాన్పుచందంబున వెన్నెల ప్రతిపదార్థమును దెల్లబాఱఁజేసి సకలజంతువులకు బాహ్యతాపహారకముగా నుండెను. గ్రామవాసులలో ననేకులు భోజనముచేసి తలుపులు మూసికొని నిద్రింపఁబోయిరి. అక్కడక్కడ నిదురరాని యొకముసలివాఁడు వీధియరుఁగుపై గూర్చుండి చుట్టద్రాగుచుండెను. ఇంటిపనియంతయు సత్వరముగాఁ జేసికొనలేని యాఁడుదియు నచ్చటచ్చటఁ దొందరతో నంట్లు తోముచు పళ్ళెములు కడుగుకొనుచుండెను. నిశ్శబ్దమైన యానిశాసమయమునఁ దూరపుఁబొలములలో నిదురపట్టని కాపుఁవాఁడు పాడినపాటమాత్రము సన్నసన్నముగా మేలుకొన్నవారి చెవులం బడఁ జొచ్చెను. తక్కిన ప్రపంచమంతయు నిద్రాపరవశమై నిశ్శబ్దమై యుండెను. బిందు గృహకృత్యము లన్నియు జేసికొని భర్త యెంతసేపటికి రానందున మేలుకొని తన గది యరుఁగుమీఁద గూరుచుండెను. చల్లని చంద్రకాంతి యామె చీరమీఁదను విలాసవంతమైన మొగము మీఁదను బడ క్రొత్తసౌందర్యముఁ దెచ్చెను. సుధయు బావగారికి జనపపీచుగడ్డము కట్టి హాస్యముఁజేయఁ దలఁచినది. కావునఁ జాలసేపు మేలుకొని క్రమ్ముకొనివచ్చు నిదుర నాపికొన లేక పండుకొనెను. ఆమె పెదవులు చిఱునగవు నవ్వునప్పుడు తెఱచి యున్నట్టే విడి యున్నందున చంద్రకాంతిపైఁ బడినట్లు యేదో మంచికలయు నామె మనంబున బడి యుండ వచ్చునని బిందు తలంచెను. కొంతసేపు కనిపట్టికొని యుండు నప్పటికి వీధితలుపులవద్ద నడుగులచప్పుడు కాఁగా బిందు వేవేగ లేచి పరుగుపరుగున వెళ్ళి కవాటము దెఱచెను. హేమచంద్రుఁడు గృహమును బ్రవేశించెను. అప్పటికి హేమచంద్రుఁ డిరువదినాలుగేండ్ల ప్రాయమువాఁడు. అతనిముఖము సుందరమై తెలివిని వ్యక్తముసేయు చుండును. అతని లలాట మున్నతముగా నుండెను. చాలదూరము నడిచి వచ్చుటచే నతఁడు మిక్కిలి యలసి యుండెను. పాదరక్షలు ధూళితో నిండియుండెను. బిందు పీటవేయ హేముఁడు దానిపైఁ గూరుచుండి యామె తననిమిత్తము దెచ్చిన చల్లనినీటితోఁ గాళ్ళు చేతులు మొగముం గడుగికొనెను. అంతట వారివ్విధంబున మాటలాడిరి.

బిందు—ఏమయినను సరే కాని మా పెదబాబయ్యగారిమీద వ్యాజ్యములు చేయుట బాగుండదు. అంతేకాక మనకు డబ్బుకూడలేదు. వ్యాజ్యములకు బోలెడు సొమ్ము కావలయును. ఈస్థితిలో మనము కుటుంబసంరక్షణముఁ జేసికొని భగవంతుఁ డిచ్చిన యీయిద్దఱుబిడ్డలను పెంచికొనుచు, నొకరిని 'దేహి' యని యడుగకుండ గౌరవముగఁ గాలక్షేపము చేసితిమా యదే పదివేలు. మన కీవ్యాజ్యములు వద్దు. ఇతరుల సొమ్ము మన కెందుకు? మీ భూములు రత్నగర్భములు. బంగారము పండును. అవి బాగు చేసికొనినయెడల మనము తిని యొకరికి పెట్టవచ్చును. మన కేపదిమందియున్నారు తినుటకు? మీతండ్రిగారి ధర్మమున మనకు దివ్యభవన మీయిల్లు దొరికినది. ఇదియే మనకు రాజ్యము. మహారాజులలాగు మనము సుఖముగా నుండవచ్చును.

హేమ—నేను నిన్ను పెండ్లియాడినపుడు మన మెల్లకాలము దారిద్ర్య మనుభవింప వలసి యుండునని యనుకొనలేదు. నీవు పరమ శాంతురాలవు. సంతుష్టికలదానవు. మంచిదానవు. గృహములో నిది యున్నది, యది లే దని విసుగుకొని యెఱుఁగవు. ఈవిషయమున దప్ప నా కెన్నఁడు నెదు రాడినదానవు కావు. ఐనను మగవాఁడ నగుటచే నీ కున్నంత శాంతము నాకు లేదు.

బిందు—మన మనుభవించుచున్నది దారిద్ర్యమా? చాలులెండి. ఈయిల్లు, యీదొడ్డి, యీఫలవృక్షములు పండించగా మనకేమికొదువ. హాయిగా రాజులలాగున నుండవచ్చును. ఇదిగో మహారాజులైనను దొరకని క్రొత్తవస్తువు మీ కొఱకు చేసి యుంచితిని. తెచ్చెద నుండండి.

హేమ—(చిఱునగవుతో) సరే. నేను రాజును. నీవురాణివి. ఏది రాజుల కయినను దొరకని యాయపురూపవస్తువు చూతము తెమ్ము.

భర్త రాకముందు బిందు దొడ్డిలోనున్న మామిడిచెట్టునుండి కొన్నిపచ్చికాయలు కోసి యెంతో రుచిగల్గునట్లు కూరవండెను. ఆమాట మగనిభోజనమునడుమ జ్ఞప్తికిరాఁగా నామె లోనికిఁబోయి యా కూర నొక తెల్లనిరాతిచిప్పలో వైచి మగని ముందఱ బెట్టి 'మహారాజుగారు దీని నారగింప వలయు' నని నవ్వుచుఁ బల్కెను. హేమచంద్రుఁ డాకూర నన్నములోఁ గలుపుకొని యది మిక్కిలి రుచిగానుండుటచే, నిది నిశ్చయముగా మహారాజులకుఁ దగినకూరయే. కాని మిక్కిలిరుచిమైన యీకూర దినునదృష్టము మారాజ్యమువలన రాలేదు. మారాణిగారి చాతుర్యమువలననే గలిగినదని మెచ్చుకొనుచుఁ గూరలు మొదలగువానితోఁ గొంతయన్నము కలుపుకొని తిని కడపట చక్కెర

గలిపినపాలతో మిగిలినయన్నము కలిపికొని తినుచు మంచిపాలిచ్చిన తమ యావును బాలలోఁ జక్కెర సరిగాఁ గలిపిన భార్యను గొనియాడుచు భోజనము ముగించి చేయిఁ గడుగుకొని భార్య యదివఱకే చుట్టి యప్పు డందిచ్చిన తమలపాకులచుట్టలు నోటనిడుకొని నమలుచు భూమివ్యవహారమును గూర్చి ప్రసంగము మరలరాఁగా వారిట్లు మాటాడిరి.

మా పెదబాబయ్యతో నీవ్యవహారములో రాజీనామా చేసికొనుట బాగుండదా! మనకు మధ్యవర్తులుగా నుండి వ్యవహారముఁ బరిష్కరింపఁ గల పెద్దలు గ్రామములోఁ జాలమంది కలరు కదా!

హేమ—ఆ ప్రయత్నమునైనది. కాని కార్యకారి కాలేదు. ఆయన పొలముతనదే యనుచున్నాఁడు. అది తనభుక్తములోనే యున్నదఁట. పదియేండ్లనుండి మరమ్మత్తులఁ జేయించి పన్నులు చెల్లించినాడఁట. లెక్కలలోఁ దనపేరు నమోదుజేయించు కొన్నాఁడట. అందుచేత నేమైనను సరే విడిచిపెట్టఁడఁట. కాని నిన్ను సుధను తనబిడ్డలవలెనే చూచికొనుచుండుటచేత మీ కా భూమిలోఁ గొంతభాగము దయాధర్మభిక్షముగ నిచ్చునఁట. భాగమనఁగా మూఁడవ వంతో నాల్గవ వంతో యని యాశ పడుచున్నావేమో, కళ్ళనీళ్ళు తుడుచుట కేదోయొక చవుటిపఱ్ఱ నిచ్చును. మనము పేదవాండ్ర మేమియుఁ జేయలేమని యతఁడు బాగుగ నెఱుఁగును. అందుచేతనే యీయాటలాడుచున్నాఁడు.

బిందు—నే నాఁడుదానను గదా! ఈ వ్యవహారపు చిక్కులు నాకేమియుఁ దెలియవు. ఏమో పెద్దవాఁడు, చిన్నప్పటినుండియుఁ బెంచి పెద్దవాండ్రను జేసినాడు. అందుచేత నతఁడేమిచ్చునో యది పుచ్చుకొని యూరకుండుట మంచిది. పోనియ్యండి. అతఁడు తిన్నను మంచిదే. పరాయివాఁడు కాఁడుకదా! కోర్టుల కెక్కితిమా బోలెడు సొమ్ముపోయవలెను. మనదగ్గఱ డబ్బులేదుగనుక నెక్కడనైన బదులు తేవలయును. ఆ బదులు తీరుట యెట్లు? ఒకవేళ మనమే నెగ్గగలమనుకొనుఁడు. వ్యాజ్యమునకయిన ఖర్చులక్రింద భూమి మనచేతులార మనమే యమ్ముకొనవలయును. నేలదక్కదుసరేగదా మా పెద్దబాబయ్యతో యావజ్జీవము నోటిమాట కంటిచూపు లేకుండ నుండవలయును. నెగ్గకపోతిమా భూమికి సొమ్మునకుఁ గూడ చెడుదుము. కొద్దో గొప్పో యాయన యిచ్చినంత పుచ్చుకొని తగవులేకుండ జేసికొందము. నే నాఁడ కూఁతురను. వ్యవహారములు తెలియనిదానను. మీరు మగవారు. అన్నియుఁ దెలిసినవారు కనుక బాగుగ నాలోచించికొని మీకు దోఁచినట్లు చేయుఁడు. వెఱ్ఱో మొఱ్ఱో నాకు దోఁచినమాట చెప్పినాను.

హేమ—(కొంతసేపాలోచించి మెల్లఁగా) అవును; నీవాఁడదానవే. నీవంటి యాఁడది యొకనికి భార్యయై యాలోచన చెప్పుచుండునో యతఁ డదృష్టవంతుఁడు. నేను ముందుగా నిన్నాలోచన మడుగక వెఱ్ఱివాఁడనై యెక్కఁడికో వెళ్ళి ప్లీడరులసలహా నడిగి వచ్చితిని. నీవు చెప్పినమాట నాకు నచ్చినది. అలాగే చేసెదను. మీబాబయ్యగారు వచ్చినారఁట. రేపువెళ్ళి యాయనతోఁ గలిసి మాటలాడి యేదో విధమున రాజీచేసికొనియెదను. ఇఁకొకసారి నా కేవ్యవహారములోనైన సలహా కావలసి వచ్చినప్పుడు నా గృహదేవతయైన యీ పెద్దప్లీడరు గారినే యడిగెదను; కాని తక్కిన ప్లీడర్లవద్దకుఁ బోను.

మగఁడు తన్ను గొప్పప్లీడరుగాఁ బ్రశంసించినందుకు బిందు ముసిముసినవ్వులు నవ్వుకొనుచుఁ బ్రసంగము చాలించి గదిలోనికిఁ బోయి పాన్పు సవరించి మఱియొకసారి తాంబూలమిచ్చి మగఁడు పండుకొన్నపిదప నాతనిప్రక్కను గూర్చుండి చాలసేపు గృహకృత్యంబులఁ గూర్చి మాటలాడఁజొచ్చెను. ప్రేమాస్పదులైన దంపతుల సంభాషణములకంతముండదుగదా! అట్లు కొంతసేపు సంభాషణమైనపిదప భార్య భోజనము చేయలేదన్నమాట జ్ఞప్తికిరాఁగ హేమచంద్రుఁడు ప్రియురాలి నుద్దేశించి నీవింకను భోజనముఁ జేయలేదు కాఁబోలు. వెళ్ళి త్వరగా భోజనము చేయుము. మనమాటలకు తెంపున్నదా. జలయూరినట్లూరుచునే యుండునని యామెను త్వరపెట్టి పంపెను. భర్తకు తనమీఁదఁగల గాఢానురాగముచేత బిందు తనవంటి యదృష్టవంతురాలు లేదని యుబ్బి రెండుజాములరాత్రి దాటినను భోజనమునకు ప్రొద్దుపోయెనని విచారపడక తిని పనిజేసికొని నిదురించుచున్న భర్తప్రక్కను బండుకొని సుఖనిద్రఁ జెందెను.

# నాల్గవ ప్రకరణము.

## భవిష్యత్కాలసూచనము.

మఱునాఁడుసాయంకాలము హేమచంద్రుఁడు తారుణీమల్లికుని గృహంబున కరిగెను. ఆ గృహావరణమున సింహద్వారము దాఁటగానే రెండుమూఁడు ధాన్యపు గాదెలు కనఁబడెను. ఒక ప్రక్కను పెద్ద పశువులశాలయొకటి యుండెను. దాని నిండ నావులు నెద్దులుగలవు. కొంతదూరమువెళ్ళ దేవతార్చనగృహము కలదు. వేరొకచోట భాగవతములు జలక్రీడలు మొదలగునవి యాడించుటకు స్తంభములమీఁద గట్టిన గొప్ప పాకకలదు. బంగాళాదేశములో ధనవంతులు వినోదములనిమిత్త మిట్టివి గృహావరణములలో నిర్మించుకొందురు. పుణ్యదినములలో గ్రామమందలి జనులందఱువచ్చి యీ వినోదములఁజూచి సంతసించి పోవుచుందురు. మనవైపున నిట్టి వినోదములు వీధులలోనే పందిళ్ళక్రింద జరుగుచుండును. అప్పటికి రెండేండ్లక్రిందట తారుణీమల్లికుఁడు లోపలి యిండ్లకు సంబంధములేకుండ నిటుకగోడలతో నొక కచ్చేరిగది కట్టించికొనియెను. సూర్యాస్తమయ మగుటచే నొక యిత్తడి స్తంభముమీఁద నా గదిలో దీపము వెలుఁగుచుండెను. ఆ గదిలో నొకప్రక్క నెత్తుగా గట్టఁబడిన దాసవేదికమీఁద జముఖానముపై బాలీసునకుఁ జేరఁబడి హుక్కా త్రాగుచు తారుణీమల్లికుఁడు కూర్చుండెను. ఇరుగుపొరుగువారు కొందఱు దర్శనమునకువచ్చి యప్పుడతనితోఁ బ్రసంగించుచుండిరి. హేమచంద్రుఁడు రాఁగానే మల్లికుఁడు దయగమర సేమమడిగి సేవకునిఁబిలిచి లోపలికల్లునిఁ దోడ్కొని పొమ్మని యానతిచ్చెను. స్త్రీలు వసియించుగదుల వసారాలకు నలుప్రక్కలు తడకలు కట్టఁబడియుండెను. మల్లికుని పడకగది విశాలమై మట్టిదిమ్మల మీఁద కట్టఁబడియుండెను. ఆ గదిప్రక్కను విశాలమైన వంటయిల్లు మఱికొన్ని చిన్నగదులు గలవు. దొడ్డిలోనొక నిగుడుబావి యుండెను. దానిచుట్టు మామిళ్ళు నారికేళములు మొదలగు ఫలవృక్షముల తోఁట యుండెను. హేమచంద్రుఁడు సేవకునివెంట లోనికరిగి పెద్దత్తగారింగాంచి నేలఁజారగిలఁబడి యామెకు నమస్కరించెను. ఆమె యల్లునిదీవించి కుశలమడిగి లేచి కూర్చుండుమని చెప్పెను. ఆమె నలువదియేండ్లు వయసుగలది. మొగము కలకలలాడుచుండును. చేతులు గుండ్రనై పొట్టిగనుండును. ఆమె పొట్టిగనుండినను నడకవైఖరి మొదలగునవి వికారముగనుండక యింపుగ గౌరవనీయముగ నుండును. కాళ్ళనందెలు కడియములు మొదలగు వెండిజతలు, చేతులఁ గంకణాలు మురుగులు మొదలగు బంగారపు జతలు ధరియించుచుండెను. ఆ నగలామె శరీరమునకుఁ దగియే యుండెను. ముఖలక్షణములు స్వభావములు తెలిగువారు చెప్పునట్టి భాగ్యయుక్తురాలని సూచించెను. అయినను ఆమె యప్పుడప్పుడింటికి నక్రోధమునుఁ బూని చూచినను మొగమువీఁద గనిపి

కట్టుతనము గలిగి వచ్చినవారిని గౌరవించునట్టి మంచి స్వభావము గలదని చెప్పవచ్చును. హేమచంద్రుఁడు లేచి యొక కుర్చీమీఁద గూర్చుండినపిదప, నల్లునకు నత్తకు నీ క్రింది సంభాషణము జరిగెను.

అత్త—నాయనా! మీయిల్లు మాయిల్లు గుమ్మములో గుమ్మములాగున మిక్కిలి చేరువనున్నను నీవొకసారియైన నిన్నాళ్ళనుండి మా గడపఁ దొక్కవైతివిగదా? పెద్దదానను బ్రతికియున్నానో లేదో యింతమాత్రము కనుఁగొనఁకూడదా?

హేమ—అత్తయ్యా! మీరాలాగున ననుకొనవద్దు. మీక్షేమము ప్రతి నిమేషము దెలియుచునేయుండును. ఏమో పేదవాండ్రముగద నౌకర్లు చాకర్లు లేనివాండ్రము. రోజల్ల గృహకృత్యములతోను, పిల్లలతోను సరిపోవుచున్నది.

అత్త—మంచివంక దొరికినదిలే; నీమాటయటుంచు. మా బిందుకూడా నా కంట బడుటలేదుకద. దాని నీ చేతులలోఁ బెంచి పెద్దదానినిఁజేసి నీకు పెండ్లిచేసితినిగదా. అది యొక్కసారివచ్చి పెద్దదానినిఁజూచి పోఁగూడదా?

హేమ—అత్తయ్యా! రాకేమి. ఉదయాస్తమానము లది మీమాటే పలవరించు చుండును. ఉమ పుట్టినింటికివచ్చినదని విన్నదిమొదలు లిక్కడకు నెప్పుడు వచ్చిపడుదునా యని వేగిరపడుచున్నది. కాని, అత్తయ్యా! తెల్లవారి లేచినది మొదలుకొని గంపంత పని. ఆ పయిన యీనడుమ పిల్లవానికి గొంతెము జబ్బుచేసినది దానమీద తీఱిక లేక యిల్లు కదలలేదు. పోనీ యొక పరియాయము మా యుమను మాయింటికంపండి. పిల్లలను దానినిఁజూచి యొకఘాటక్కడనుండి తిరిగివచ్చును.

అత్త—అది వీలులేదు. ఉమ భాగ్యవంతుల కోడలయినది. కనుక అత్తవారి కామె యిక్కడికి నక్కడికి వెళ్ళుట యిష్టములేదు. దాని యత్తవారు ధనపురములో మిక్కిలి మెన్నికయైన గొప్ప కుటుంబములోనివారు. వెనుక ధనపురమున నవాబులవద్ద దివాను ధనేశ్వరుఁ డుండెడువాఁడని వినలేదూ? ఆయన వంశమువారే వీరు. అంత గొప్పవారికి చుట్టుముక్కలలేరు.

హేమ—అత్తయ్యా! ఆ సంగతిని నేనెఱుఁగుదును.

అత్త—అవును నీవెఱుఁగకేమి! ధనేశ్వరుని కుటుంబమెఱుఁగని వారెవ్వరు? దానములలోనేమి, ధర్మములలోనేమి యాచారసంపత్తిలోనేమి వారికీర్తి వారిగొప్పకుఁ దీసిపోదు. వారింటి యాడపడుచునే సోమయాగాదు[illegible]గము చేయుచున్న వర్ధమానములో నొకరికిచ్చి వివాహము చేసినారు. నామాట నమ్ముదువో లేదో. ఏఁడువేలరూపాయలు

ఖర్చుచేసినారు. అంతసొమ్ము ఖర్చయినదని వారికేమైన లెక్కయున్నదా, వారికది యొక ఖర్చా ?

హేమ—(ఇంగ్లీషు చదువుకొని యర్థశాస్త్రము నభ్యసించిన నవనాగరకుఁడగుటచే నత్తగారిపల్కుల కిష్టపడక మెల్లఁగా) అత్తయ్యా! అది దూబరఖర్చు కాదా ?

అత్త—అది దూబరఖర్చా! సరిలే. నేను బ్రాహ్మణులకు సంతర్పణలక్రింద, సంభావనలక్రింద, వస్త్రదానములక్రింద విశేషముగ ఖర్చుపెట్టినారు. ఒక బ్రాహ్మణులే కాదు. ఆనాటి జనులెల్ల వైభవదినములక్కడ చేసికొన్నారు. అది ధర్మగుణము పెంపించుకొనుటగాని దూబరగాదు. ఎంతపుణ్యమున్నదో యెంచలేము. వేదములుచదువుకొన్న బ్రాహ్మణులకు, కర్మిష్ఠులకు, శాస్త్రవేత్తలకు విశేషముగ నప్పుడు బహుమానములు దొరికినవి. నాయనా! పిల్లను మాయింటికి తెన్నగా వారు రానీయరు. ఒక్క కేవల వ్రతములకు రానిచ్చుచున్నారు. మరి దేనికిలేదు. మొన్నమొన్ననే వారు వేసఁగికిఁ గొన్నాళ్ళు సెలవుమీఁద వచ్చినారు. ఆయనవచ్చిననాటినుండి లెక్కలేనన్ని పర్యాయములు పంపఁగా పంపఁగా నిప్పుడొకసారి పంపినారు. రెండువారములకంటె నెక్కువ యుంచుటలేదని స్పష్టముగాఁజెప్పినారు. పదునాలుగురోజులు కాఁగానే యొకగడియ యుండదు. అందుకయి చీరలు, పండ్లు, పసుపు, కుంకుమ తెచ్చుటకు వర్తమానమునకు మనుష్యులనంపినాము. రాకరాక వచ్చినదిగనుక వెళ్ళునప్పుడేమయిన నీయవద్దా ?

హేమ—అత్తయ్యా! పోనీ ఉమ మాయింటికి వచ్చుటకు వీలులేనియెడల నేనే మీయమ్మాయిని, పిల్లలను మాయింటికి మమ్ము జూచుటకు బంపెదను.

అత్త—తప్పకుండబంపు నాయనా! నీవు నా బిడ్డవంటివే. కనుక వీలయినప్పుడెల్ల నన్నుజూచుటకు రావలసినదేకదా.

హేమ—అలాగే వచ్చుచుందును లెండి. ఉమ యిక్కడ నింక నెన్నాళ్ళుండును ?

అత్త—ఎన్నాళ్ళుండునా! ఒక్క నిమిషముండదు. వర్తమానమునుండి సరకులు రాఁగానే పంపివేయుదుము. షష్టిపూర్తియు దగ్గఱకు వచ్చుచున్నది. అదియొక పెద్దఖర్చు.

హేమ—అవు నవును.

అత్త—ఆ షష్ఠినాఁడు పిల్లని దీసికొనివచ్చి కట్నములు కానుకలిచ్చుట యొక యాచార మున్నదిగదా! ఏనాటి పెద్దలేర్పాటుచేసినారో యది మనము మానకూడదు గదా! సరేగాని నాయనా! మీ పిల్లలు బాగున్నారా!

హేమ—చంటిపిల్లవానికి ఐదారుదినములనుండి జ్వరము వచ్చుచున్నది. కాట్వా నుండి మందుఁదెచ్చి వేయుచున్నాను. కొంచెము నెమ్మదిగా నున్నది.

అత్త—మంచిపనిఁజేసినావు నాయనా! చిన్నప్పుడు పాపము బిందునకుఁ గూడ ఈలాగుననే తరుచుగా జ్వరము వచ్చుచుండెడిది. అది పుట్టి యరపేదపిల్ల. ఏదో దైవానుగ్రహమువల్ల దాని కడుపున రెండుకాయలు కాచినవిగాని, మా బిందు మొన్న మొన్నటి పిల్ల కాదఁటయ్యా! ఓడ్డ యెంత నెమ్మదయిన దనుకొన్నావు. ఆఁకలగుచున్నదమ్మా యన్నము పెట్టుమని నోరెత్తి యడిగి యెఱుఁగదుగదా. నే పిలిచిపెట్టిన కద్దు. లేనిచో లేదు. మంచినీళ్ళయిన నంతేసుమా నాయనా! నే నంటే ప్రాణము కాదా దానికి. తండ్రి పోయినతరువాత వాళ్ళతల్లి బెంగపెట్టుకొని వీళ్ళ సంరక్షణము జేయుటయే మానినది. అన్నము తినిపించుట నేనే. బట్టలుకట్టుట నేనే. ఉపయేలాటిదో బిందుకూడ నాకాలాటదె. అందుచేత నొకమారువచ్చి చూచిపొమ్మను నాయనా!

హేమ—అయ్యో! తప్పక వచ్చి చూచును.

అత్త—క్రిందటి నవరాత్రములకు బిందు మాయింటికివచ్చి యానాఁడే వెళ్ళిపోయినది. ఈసారి యట్లుచేయక రెండుదినములుంచుము. అది మాయింటి యాఁడుపడుచు. పూజాదినములలో మాయింట మాతోపాటుండి పనిపాటలలో సాయము చేయవలసినదే; ఆ తొమ్మిదిరోజు లెంతపని ఎంతపని. చుట్టుప్రక్కల రెండుమూఁడుక్రోసుల దూరములో నున్న పల్లెలలోనివాండ్రందఱు దేవీవిగ్రహముఁ జూచుటకు మందమందలుగా వచ్చి పడుదురు. నీవు కచ్చేరిచావడికివచ్చి, యావడినుండియే వెళ్ళిపోవువాఁడవు కనుక లోపల పనితొందఱలు నీకుఁదెలియవు. తెల్లవాఱుజామున గాడిప్రొయిలో నిప్పంటించి, హండీ లెక్కించి, మధ్యాహ్నము మూఁడుగంటలవఱకు వార్చిపోసినను నిజముగా నొక్క మెతుకైన మిగిలెడిదికాదు. ఏమిజనము! ఏమియన్నదానము! లెక్కపెట్టశక్యమా?

హేమ—చెప్పవలెనా, నాకుఁదెలియదా? ప్రతి సంవత్సరము జరుగుచున్న దేవీ పూజాదినములలో [illegible] సము జరుగుట యెప్పు డెఱుఁగను?

అత్త — అయ్యో నాయనా! పెద్దలమర్యాద నిలువబెట్టవలెను. అగ్నిహోత్రావధానులుగారట్లు చేయుచుండ్రపు. అందరు పూజలు చేయుచున్నారా? నాయనలు దిగులుజెందుచున్నారు. నీ యిట్టుకు నీవు పూజచేయకపోయినను బోవలేవు. నోచెను పెద్దవారు కలవారుగనుక యీమామగారు చేయకపోయినను యెల్లలోకులు మెచ్చుకొందురు, పెద్దకుటుంబము గొప్పదిగనుక దాని పూర్వగౌరవము నిలుపవలెను.

ఈవిధముగ మల్లికవారికగౌరవమునుగూర్చియు, సునయుత్తివారిగు ధనపురమునారి వైభవముం గూర్చియు, తనభాగ్యమును గురించియు దేవీనవరాత్రములకు జనయింట జరుగు పూజలగురించియు నెంతసేపటివఱకామె తెంపులేకుండ ప్రసంగించినదో సుసము చెప్పజాలము. పాపము ప్రొద్దుపోవుటచే హేమచంద్రుని కన్నులు నిద్రావశమున మూతలు పడుచుండెను. అందుచేత నత్తగారి యంతములేని సోదెవంటి సంభాషణమునకు విసుగుజెంది, యామె చెప్పుచున్నను సరే యని రెండుమూడుసారులు నిద్రపై నావులించెను. ఎంత విసుగుజెందిన, నామె తనగొప్ప మానక వంశము హోమమునే నడుమనడుమ నామెయడిగిన ప్రశ్నములకు నవ్వు చవునీ యుత్తరమిచ్చు చుండెను. ఆ యుత్తరమునుబట్టి తనమాట లల్లుడు శ్రద్ధగా వినుచున్నాడని, యామె యానందముతో గుఱ్ఱమువలె తనకథ నామె మఱింత సాగదీయసాగెను. అప్పటికి బదిగంటలు దాటెను. నిద్రాపరవశుఁ డయిన హేమచంద్రుని యత్తగారు మాటాడుచున్న గదితలుపు వద్ద నందెల చప్పు డయ్యెను. ఆ ధ్వని జీవనదివంటి యామె కథాప్రవాహమున కడ్డుకట్టయ్యెను. ఈమె ధనపురపు ధనేశ్వరకుటుంబమునారి కోడలు కావున వెలలేని బంగారు నగలు, రతనాలతో ఝవులు మేనంతట మెఱయుచుండ జరీ ముద్దవంటి చీరగట్టికొని సొగసులు గుల్కునట్లు మంద మందగమనములతో గది ప్రవేశించి కుశలప్రశ్న మడుగుటకు హేమచంద్రుని యెదుట నిలిచెను. ఆమె యిరువది యేండ్లది. మేనిచాయ శుద్ధసువర్ణమువలె పచ్చనై లావణ్యము గ్రక్కుచుండెను. నవయౌవన ప్రాగల్భ్యము చక్కదనమునకుం దోడగుటంజేసి యాగ్రామమున నామెతోఁ బోల్పఁదగిన విలాసవతియే లేదు. కాఱుమబ్బులవంటి తలవెండ్రుకలను సిగ జుట్టికొనియెను. చందమామ నేలు విశాల ఫాలభాగమున రతనపుం బాపటబొట్టు మెఱయుచుండెను. సిగమీఁద వజ్రములుచెక్కిన బంగరుతుమ్మెదయమర్పఁబడెను. చేతులనున్న పోచీలు, కంకణాలు మొదలగు బంగారు జతలు వర్ణింపనలవిఁ గాదు. నడుమున వడ్డాణమునకు బదులు మేలుపసిండి మొలనూలు మెఱయుచుండెను. నవరత్నములు చెక్కిన బందరుపట్టెడయు నైదుపేటల ముత్యాల హారము మెడనలంకరించెను. ఆమె వేషముజూచి హేమచంద్రుఁడు చిన్ననాడు తన కింగ్లీషుపాఠశాలలో స్త్రీలకు నగలు చేయింపకూడదనిన నాగరకుఁడగునుపాధ్యాయుఁడు

చెప్పినమాట జ్ఞప్తికిఁదెచ్చికొని తనలో "ఎందుకువచ్చినడంబమిది. సొమ్ముపాడునకేగాని" యనుకొనెను. ఆభరణములు హిందూదేశ స్త్రీలకు జీవనాధారములైన యాస్తియని హేమచంద్రునకుఁ దోఁచలేదు. హిందూదేశ స్త్రీలందరు డంబమునకే యీయలంకారములను ధరింపరు. అలంకార రూపకమైనసొత్తు వారికి స్త్రీధనమై స్వాధీనమై పరమపవిత్రమై ఋణప్రదాతలకుఁగాని దొరతనమువారికిగాని చేరుకొనుటకు వీలులేక యావజ్జీవ మభయప్రదాయకమైయుండును. ఆఁడుది వితంతువైనను సంతానహీనురాలైనను వేయేల! యెంత దిక్కుమాలిన దైనను స్త్రీధనముజోలికిమాత్ర మెవ్వరు వచ్చుటకువీలులేదు. కృషివలన జీవించు కాఁపుకుటుంబము లనేకములు కరవుకాలములలో నాఁడవాండ్ర వెండిబంగారు నగలమ్ముకొని తినుటవలననే నశింపక నిలువగలిగెను. ఇంక భాగ్యవంతులలో పూర్వార్జితములగు నగ్రహారములు మాన్యములు మేడలు మిద్దెలు మొదలగు సర్వస్వము కాలవశమున నన్యాక్రాంతములైపోయినను వంశపారంపర్యముగఁ బలుతరములనుండి గృహముల నుండెడు రత్నాభరణములను సువర్ణాలంకారములను విక్రయించుకొనుటచేతనే కష్టకాలములలోఁ దొల్లింటిగౌరవముఁ గొంతయైన నిలువఁబెట్టికొని జీవించుచున్నారు. నగ లెన్ని యాపదలైన గడుపఁ జాలును కావున హేమచంద్రుఁ డనుకొనునట్లు గర్హ్యములు కావు. అంతట సుధా హేమచంద్రు లీ తెఱంగున మాటలాడిరి.

సుధ — బావా! ఇది సుదినము. ఈవేళ యుదయమున నే నేమంచిమొగముఁ జూచినానో కాని నీదర్శన మైనది.

హేమ — అదృష్టము నాది. నీదికాదు. ఏమా? మావంటి పేదవాండ్రకు సుకృతము లేనిదే మీవంటివా రగుపడుదురా!

సుధ — సరి సరి బావా బాగున్నది. నేనిక్కడికి పదిదినములక్రిందట వచ్చినను నీవొక్కనాఁడైన నన్నుఁ జూడవచ్చితివి కావుగద! పోనీ దానికేమిలే. నీవు బాగున్నావుకదా! అక్కయ్య, పిల్లలు బాగున్నారు కదా!

హేమ — ఆ! మేమందరము నెమ్మదిగా నున్నాము. నీవు కులాసాగా నున్నావు గదా!

సుధ — ఆ! నీదయవల్ల. నీకు మామీఁద దయ యున్నది గనుక మా క్షేమము విచారింపవచ్చావు. ఈరాత్రి నీవు దర్శనమిచ్చుటచేత నీకు మామీఁద నపారమైనదయకలదు. ఇప్పుడైనను మా బిందక్కయ్య పంపబట్టి నీవు వచ్చియుందువు. చాలప్రొద్దుపోవువఱకు నీ విక్కడ నుండకు. నీవెక్కడికో వెళ్ళినావని యామె యనుమానపడగలదు.

హేమ—(గుణవతి హాస్యపుమాటలు విని ముసిముసినవ్వులు నవ్వుకొని) ఉమా ! సాధ్యమయినంత త్వరలోనే మీయక్క నిన్నుఁ జూచుటకు వచ్చును. ఆమె ప్రతినిమేషము నీమాటయే స్మరించుచుండును. తెలిపి చేసికొని రావలయునని వగచుచున్నది. రేపు తప్పక వచ్చునులే. అప్పుడు పిల్లలను జూడ వచ్చును.

ఉమ—సరే, రేపుపంపు. ఒక్కసారి పిల్లలను జూడవలయునని యెంతో ముచ్చటగా నున్నది. (ఉమకు బిడ్డలు లేనందున పిల్లలపేరు చెప్పగానే వారినిఁజూచుటకామెకుఁ గుతూహల మెక్కువయ్యెను.)

హేమ—తప్పక రేపే పంపుదును. నీ వత్తవారియింట నున్నపుడుగూడ నీక్షేమ సమాచారములు తఱుచుగా మీయక్క కనుగొనుచునే యుండును.

ఉమ—అది నే నెఱుఁగనా. బిందక్కయ్యకు నేనంటే ప్రాణము కాదా, చిన్నప్పుడొక్కకంచములోఁదిని యొక్క మంచముమీఁద పండుకొన్నవారము కామా. ఒకనిముసమైన నొకరినొకరము విడిచి యున్నవారమా. పెద్దవారమైనతరువాతకూడ మేమిద్దఱ మొకచోట నేయుండి ప్రొద్దిన మొకరినొకరు చూచుచుండునట్లు లొక్కగ్రామముననే యుండవలయునని కోరుకొనుచుండువారము. కాని దైవయత్నమువల్ల నిద్దఱముఁ జెఱియొకయూరను బడిపోయి దూరమైపోయినాము. ఆ చిన్ననాటి యాటలు ముచ్చటలుఁ దలఁచుకొంటిమా యిప్పటికి నెంతో హాయిగ నుండును. రేపు తప్పక యక్కయ్యను పిల్లలను పంపుదువా ?

హేమ—సరే యిన్నిమాటలు చెప్పవలెనా ?

ఉమకు బిందును జూచునభిలాష మనసార జనియించెనే కాని నటన నిమిత్తము వచ్చినది కాదు. ఏలయన, గౌరవము సంపాదించుటకై గొప్పవారితో వియ్యమందిన తండ్రియొక్క డంబము కాని యెంతసేపైన విసుగు లేక తన గొప్పతనము తనగోడవలుఁ జెప్పికొనుగొల్లియొక్క వెఱ్ఱిగర్వము కాని యామెకడ లేనందునను మఱియెంతో చక్కని దయ్యు వెలలేనిరతనాలనగలు మేన దాల్చినదయ్యు మహా శ్రీమంతులకోడలయ్యు రవంతయైన గరువము నందక చిన్ననాఁడు తాను బిందుతోఁ జేసిన నెయ్యమును హృదయమునం దుంచుకొనియె. ఆమె యొయ్యారము నామె యైశ్వర్యముఁ జూడఁగానే యామె చుట్టములనెల్ల మఱచియుండునని మొట్టమొదట హేమచంద్రుఁ డనుమాన పడెను. కాని యామె కొండొకతడవు మాటలాడి తన యత్తవారికుటుంబ గౌరవమునకుం దగిన గుణమున కడమీయక హృదయపూర్వకమైన ప్రేమను జూపినతోడనే యా

యనుమానము నశించెను. ఉన్నతస్థితి సంపద ముణ్ణగునవి చిన్ననాటి సహజమైత్రినిఁ దునుమట్టింపక యుండునేని ప్రపంచము సౌఖ్యభూయిష్ఠమై భాగ్యవంతమై యుండుఁగదా. హేమచంద్రుఁ డట్లుపలికి స్వగృహమునకు బోవఁదలఁప సుమ "బావా నీ పాదధూళితో మా గృహమునుఁ బావనముఁజేసి యనుగ్రహించితివి కాన చిన్న విందారగించి మమ్ము మఱింత ధన్యులఁజేయ వేఁడుచున్నాను. కొంచెము ఫలహారముఁజేసి వెళ్ళు" మని బతిమాలి రమ్మని యందెలు ఘల్లుఘల్లుమని మ్రోయ తాను ముందు నడవసాగెను; హేమచంద్రుఁ డామెమాట త్రోసివేయలేక వెనువెంట వంటయింటికిఁ జనియెను. ఆ యింట రెండు క్రొవ్వొత్తుల దీపములు ధగధగ వెలుఁగుచుండెను. ఒక వెండియాకులోఁ గొన్ని మధుర పదార్థములు రొట్టెలు నుండెను. దానిచుట్టును వెండిగిన్నెలలోఁ గొన్ని కూరలు క్షీరాన్నము పాలు పెట్టబడి యుండెను. భాగ్యవంతులుగూడ సాధారణముగ పట్టియాకులలోను పళ్ళెములలోను భుజియింతురు. కాని యల్లుళ్ళు వచ్చినప్పుడు గొప్ప మిత్రులు చుట్టములు వచ్చినప్పుడు తమవైభవముఁ జూపుటకు వెండియాకులు గిన్నెలుఁ బయటికితీయుదురు. పాపము హేమచంద్రుఁడు జన్మమెత్తిన తరువాత యెన్నఁడు నంతవెలగలపళ్ళెరంబులలో గిన్నెలలో నంతరుచిగల పదార్థములను భుజించి యెఱుఁగఁడు. ఆ పాత్రలకైనధనము తనకుటుంబమున కొకసంవత్సర గ్రాసమగునని యతఁడు తలంచెను. అంతట సుమ చతురమైన యొక చిత్రాసనము వెండియాకువద్ద వేయించి, బావా! కూర్చుండుము. మొగమాటపడక యీ చిన్న విందారగింపుము. మావలన లోపములున్న నవి బుద్ధిపూర్వకముగాఁ జేయలేదు. కావున క్షమియింపుమని పల్కెను. హేముఁడు చిత్రాసనముమీదఁ గూర్చుండి భుజియించుచుండ సుమ వాని ప్రక్కనే కూర్చుండి మాటలాడుచుండెను. సుమ చక్కనిచుక్క. ధనపురముజమీందారుని కుమారుఁడు మిక్కిలి చక్కనిదానినే గాని పెండ్లి యాడనని పట్టుపట్టుటచే నాతనితండ్రి తాళ్ళచెఱువు గ్రామమున నతిలావణ్యవతి యైన యీబాలిక యున్నదని కర్ణాకర్ణిని విని యామె నిమిత్తము విశ్వప్రయత్నముఁజేసి పెండ్లిఁజేసెను. తారుణీమల్లికుఁడు సహజముగ గొంచెము మంచిస్థితిగలవాఁ డయినను ధనపురముజమీందారుతో వియ్య మందుటకుఁ తగినభాగ్యవంతుఁడు కాఁడు కావున నీవివాహముచేత నతఁడును, మాయామర్మము లెఱుఁగని వాని భార్యయు మునుపటికంటె నెక్కుడుగౌరవము కలిగి యించుక గర్వితు లయి యుండిరి.

ధనము సకలసౌఖ్యప్రదాయ మని సుమయు నెఱుంగును. కానియంతటి భాగ్యవంతులకోడలై యామె సౌఖ్యపడుచున్నదో లేదో యిప్పటికి మనకుఁ దెలియదు. ఈ కథాప్రచారమున ముందు ముందు మనము ధనపురముజమీందారును గలిసికొని నప్పు

డావృత్తాంతము నెఱుంగ వచ్చును. కాని ప్రస్తుత మొక మాటమాత్రము చెప్పగలము. ఆ చిన్నజమీందారుఁడు బాల్యమును విడిచి యౌవనముఁ బ్రాప్తించినపిదప చక్కఁదనములమీఁద నెక్కువమక్కువఁ గలవాడయ్యెననియు, నొకయేఁడు పైఁబడినకొలఁది భోగపరాయణుఁ డగుచున్నాడనియు నొకవాడుక లోకమున వెల్లడియయ్యెను. తాళ్ళచెఱువుపల్లియలో నున్న పేదలచరిత్రల వ్రాయుచున్న మన కిపుడు భాగ్యవంతులు, మదోన్మత్తులు నయిన యాజమీందారులగొడవ లక్కఱలేదు.

ఉమతో హేముఁడు చాలసేప నేకవిషయములను గుఱించి ప్రసంగించెను. ఆ ప్రసంగము రానురాను కొంత తడవున కామె యత్తవారిగొడవలలోనికి దిగెను. అత్తవారి ప్రసంగమువచ్చినప్పు డామె బదులుపలుకక మౌనముతాల్చుచు వచ్చెను. అదిచూచి హేమునిమనస్సునఁ గొంతయనుమానము దానితో వ్యాకులమును గలుగఁ జొచ్చెను. తాళ్ళచెఱువునం బుట్టినయాడుపడుచులలో నెల్ల లావణ్యవంతురాలు భాగ్యవంతురాలు సౌఖ్యవంతురాలు నని పేరువడిన యీ ముద్దుగుమ్మ హృదయ మింత లేతవయసున జింత యను నగ్నిహోత్రముచేత గాల్పఁబడుచుండునా యని సందేహముఁ దోప హేముఁ డామె మొగమువంక రెప్పవాల్పక పలుమాఱు చూడఁ దొడఁగెను. చూడఁజూడ ననేక రత్నాభరణముల యడుగుననున్న యామె మనస్సులో బైకి రాక యడఁగియున్న విషాదము కనుగొలంకులయందు పైకిరాక యడఁగియున్న కన్నీరు వానికిం బొడగట్టిన ట్లయ్యెను. "ఈమె ముఖారవిందమున గుప్తముగు విషాదము నిజముగా నా కగపడుచున్నదా లేక నాకన్నులు భ్రమఁజెందినవా" యని హేముఁ డొకటి రెండుసారులు తనలోఁ దాను వితర్కించుకొనెను.

# ఏదవ ప్రకరణము

## మిత్రదర్శనము

అట్లు హేమచంద్రుఁడు విందారగించి తారుణీమల్లికునిం గలిసికొని తన వ్యవహార మాయనతో మాటలాడి యింటికిఁ బోవ పయన మగునప్పటి కర్ధరాత్ర మయ్యెను. బిందు తలవాకిట నిలిచి భర్తృ నిమిత్త మెదురు చూచుచుండఁ గొండొకతడవున కామె కతని దర్శనమయ్యెను. అగుటయు నామె మొగము సంతోషముతో వికసింప "నిప్పటి కైన నింటిమాట జ్ఞాపక ముంచుకొని వచ్చినారు నయమే; యెక్కడనో దారి తప్పినా రనుకొని భయపడుచున్నాను. పాపము మాయయ్య తన యత్తవారిగొడవలు చెప్ప మొదలు పెట్టి యుండును. ఆ తియ్యనిపలుకులు చెవులు దోరపెట్టి వినుచు వదలి రాలేకపోయి నారు కాఁబోలు" నని పరిహాస మాడెను. అనవుడు "బిందూ! యెందు కీమెత్తని మందలింపులు. అంతవిశేషము ప్రొద్దుపోయినదా? యేమి" యని హేముఁడు పలుకఁ అబ్బే! యెంతో ప్రొద్దు పోయినదా రెండు యామము లయినది. ఊరు మాటుమణగినది. మీ స్నేహితుఁడు చీకటిపడగానే వచ్చి మీరిప్పుడే వత్తురో యప్పుడే వత్తురో యని మీనిమిత్త మెదురు చూచుచున్నాడని బిందు ప్రత్యుత్తర మిచ్చెను. అనగానే హేముఁడు తొట్రుపడి యెవరువచ్చినా రెవరు వచ్చినారు. ఏఁడీ యెక్కడ, యన బిందు రండి చూతురుగాని, యని యాతని లోనికిఁ గొంపోయెను.

లోనికిం జనినతోడనే చక్కని మేనిచాయయు సుందరమగు నెమ్మొగముఁగల యొకపడుచువాఁడు హేమచంద్రుని కెదురుగా వచ్చెను. హేమచంద్రుఁ డాతనిని గొంతసేపటివఱకు కానవాలుపట్టలేక కలవర మందుచుండ బిందు చిరునవ్వులు నవ్వఁ జొచ్చెను. కొంతతడవునకు హేముఁడు తనమిత్రుని గుర్తుపట్టి యోహోహో! శరచ్చంద్రుఁడా, యని పలుకరించెను. అంతట వారీ క్రిందివిధమున సంభాషించిరి.

శర__అవును నేనే జ్ఞాపకము వచ్చినదే ?

హేమ__నీవు కలకత్తానుండి యెప్పుడు వచ్చినావోయి. ఎంత మారిపోయినావు. నిన్ను నేను చూచి పదియేండ్లయినదిసుమా. నాఁడు మీయప్ప కాళి పెండ్లిలోఁ గలిసికొనినాము. అప్పుడు నీవు చిన్నపిల్లవాఁడవు. వర్ధమానములోఁ జదువుకొనుచుంటివి. ఇప్పుడు చాల పొడుగైనావు. మీసకట్టు దట్టముగ తిరిగినది. అందుచేత వెంటనే పోల్చలేకపోయినాను.

శర—అవును. మాయప్ప పెండ్లియైన కొద్దికాలములోనే మాతండ్రిగారు పోయినారు. అంతట మాయమ్మ నాతోఁగూడ వర్ధమానమునకు వచ్చినది. అందుచేత నప్పటినుండి యిక్కడకు రావలసిన యవసరము లేకపోయినది. అందుచేత కృతార్థుఁడనైన పిదప ప్రథమశాస్త్రపరీక్షఁ జదువఁ దలచి కలకత్తాకు పోయితిని. యామధ్య నాతో రాక నీయూరికి వచ్చి యుండెను. ఇవి వేసవికాలపు సెలవులు గనుక నేనామెను జూడ వచ్చితిని. పదియేండ్ల తరువాత నేనే మాఱిపోవుట యదియొక యాశ్చర్యమా! మీరంతయు మాత్రము మాఱలేదా! మాబిందువదినె నాకంటె నొకయేఁడు పెద్దదన్నమాటయే గాని మేమిద్దఱ మొకయీఁడువారమువలెనె జిన్నప్పుడెంతో సంతోషముతో నాడుకొనువారము. ఒకరిని విడచి యొకరముండువారము కాము. వారియింటికి నేనైనను బోవలయును; సుధ నెత్తుకొని యామెయైన మాయింటికి రావలయును. అప్పుడొకమాఱు మాయింటి ప్రక్కవారి జామిచెట్టునుండి కఱ్ఱకుఁ గొంకిఁగట్టి జామిపండ్లు దొంగతనముగాఁ గోసికొని వచ్చినది. అమ్మా! చిన్నపుడు బిందెంత గజదొంగనుకున్నావు. అలాటిదిప్పుడు పెద్దయారిందయై యిద్దఱు పిల్లలతల్లియై గృహయజమానురాలై కాపురముఁ జేయుచున్నది.

బింద—(చిఱునవ్వుతో) చాలుచాలు! గజదొంగ లేను గిజదొంగ లేను. నాజోలికి రాక నీమాట జెప్పుకొనుము. నీవీయూరిలో నున్నంతకాలము మామిడిచెట్లనెక్కడనైన నొకపిందియైన నుండినదా? అలాటివాఁడ విప్పుడు కలకత్తా కాలేజిలోఁ జేరి పెద్దచదువులు చదువుచున్నావు. చాల తెలివియైనవాఁడ వని యందఱుఁ జెప్పికొనుచున్నారు. ఆదినములలో నీలాగున చెట్ల నవలీలగ నెక్కఁగలవాఁడుఁ దోఁట దొంగతనములు చేయఁగలవాఁడు లేఁడు. ఈదినములలో నీలాగున జదువునకు దేనికి బేరుపడినవాఁడును లేఁడు. పదియేండ్లలో నెంతమార్పో చూడు!

శర—అబద్ధమాడకు. ఉన్న నిజమంతయు చెప్పు. ఆదొంగతనములు చేయించినవా రెవరు! చాటునుండి నీవే కాదా? మీదొడ్డిలో నున్న పచ్చిమామిడి కాయలు తినవద్దని మీపెత్తల్లి యడ్డుపెట్టుచు వచ్చినందున నేను నీకంటిపడగానే కోడి దుమికి చెట్టెక్కి కాయలుకోసి వంటయింటివసారాలో నీవు నిలిచి యుండగా నేను గిరివాటు వైచెడువాఁడను కానా? జ్ఞాపకము వచ్చినదా?

హేమ—(నవ్వుచు) చాలు చాలు. ఒకరిగుట్టు లొకరు బయటపెట్టికొనకండి. మీరు వేఱే చెప్పుకొన నక్కఱలేదు. మీరిద్దఱెంత గజదొంగలో నేనెఱుంగుదును.

(అని శరచ్చంద్రునితో) చంద్రా ! ఆదినములలో నేనుగూడ మీయింటికి వచ్చుచుండెడివాడను. జ్ఞాపకమున్నదా ! అక్కడనే సుధాబిందు లిద్దఱు నుండువారు. అప్పటికి సుధ యీయేండ్లది. (అని సుధవంకఁజూచి) సుధా ! మీయక్కతో గలిసి వీరి యింటికి వెళ్ళెడుదానవు జ్ఞాపకము లేదటే !

సుధ — (తన చిన్ననాటిసహకారి యగు శరచ్చంద్రఘోషు మొగము జూచి కొంచెము సిగ్గుపడి తలవంచి) అవును. జ్ఞాపకమువచ్చినది.

హేమ — అయితే చంద్రా ! నీభోజన మైనదా ?

శర — అయినది. ఈవేళ బిందువదినె మామిడికాయ పచ్చడి యెంతపసందుగా జేసిన దనుకొన్నావు. ఈలాటిపచ్చడి నెప్పుడు నేను తినలేదు.

బిందు — (పరిహాసముగా) సందెచీఁకటిలో మామిడిచెట్లెక్కి కాయలెత్తికొని వచ్చి తిన్నప్పటికన్న బాగున్నదా ?

శర — సందేహమా ? అంతకన్న బాగున్నది. పచ్చికాయలు పలుమాఱులు తిన్నాను. కాని యిట్టిపచ్చ డెప్పుడు తినలేదు. జిహ్వా లేచివచ్చుచున్నది కాదా?

బిందు — అప్పుడు పచ్చడిచేసినదాఁక ఆగుటకు నీ కోపికయేది ?

హేమ — (బిందుతో) సుధయు నీవుగూడ భోజనము చేసినారా ?

బిందు — సుధ యన్నము తిన్నది. నాభోజనము కాలేదు. మీది కడుపునిండిన బేరములాగున్నది. అత్తవారియింట విందారగించి వచ్చినట్లున్నారు. నేనింకఁ బోయి భోజనము చేసివత్తునా ? మీ కీపూట నేమియు నాశ లేదుగదా ?

హేమ — అవును. మా పెదబావయ్యగారియింటఁ గడుపునిండాతిన్నాను. నీవు భోజనముఁ జేసి రమ్ము.

అంతట బిందు భోజనమునిమిత్తము వంటసాలకుఁ జనియెను. సుధ బావగారు వచ్చువఱకు మేలుకొనియుండి యాయన వచ్చినపిదపఁ గొంతసేపు మాటాడి వసారాలో నొకచాపఁ బఱచికొని పండుకొనియెను. ఆమె లేతమనస్సు విచారములకు నిలయము కానందున బండుకొనినతోడనే మలయమారుతముయొక్కయుఁ బయిపయిం బ్రసరించు వెన్నెలలయొక్కయుఁ జల్లదనముచేత నామెకు హాయిగ నిదురపట్టెను. తోళ్ళచెరువు గ్రామ మంతయు నిశ్శబ్దమై నిద్రావశమైయుండెను. శరచ్చంద్రఘోషు హేమచంద్ర

బోసుతో మఱల సంభాషణ మారంభించెను. వారిరువురుఁ జిరకాలమునకు గలసికొన్న మిత్రులగుటచే వారి సంభాషణమున కెడతెంపులు లేక పోయెను. ఘోషు కుటుంబము బోసుకుటుంబము సంబంధబాంధవ్యములచేత పూర్వులనాటనుండియు బద్ధములై యుండెను. దానికిం దోడుఁగ నా యుభయ వంశానుకూలురు నగు హేమచంద్ర శరచ్చంద్రులు చిన్ననాటనుండియుఁ బరమ మిత్రులు. హేమచంద్రుఁడు శరచ్చంద్రుని తన తమ్మునియట్లభావించి యాతని యారోగ్యమును చిత్తనైర్మల్యమను సంభాషణవలనం గ్రహించి తద్దయు నాదరించెను. శరచ్చంద్రుఁడు హేముని దన యన్నయట్ల భావించి వానియెడ మిక్కిలి గౌరవ ముంచెను. ఎడతెగని యా యిరువుర సంభాషణముఁ జరుగుచుండగనే భోజనముఁజేసి ఓంను వచ్చి తన చెల్లెలు సుధ తలగడలేక పండుకొనుటఁ జూచి యామె తలను మెల్లఁగ దన తొడపై నిడుకొని ప్రేమాతిశయమున అలకలు నిమురుచు తానుగూడ సంభాషణములో దిగెను. అంతట వారిట్లు ప్రసంగించిరి.

హేమ—చంద్రా! నీ విప్పుడు బియ్యేకుఁ జదువుచున్నావుగదా! ఇఁక నైదారు నెలలోఁ బరీక్షయగును. పరీక్షలోఁ దేఱిన పిదప నేమిచేయుదువు?

శర—ఆ విషయమై నేను యోచింపలేదు. మాయమ్మ కాశీవెళ్ళవలెనని సంకల్పించుకొన్నది. అందుచేత నా పరీక్ష ముగియగానే నన్నిక్కడకు రమ్మనియు మాభూమి పుట్ర చూచికొమ్మనియు నన్నామె బలవంతపెట్టుచున్నది. ఆసిధ్కొంచెము. దానివలన నేఁడాది కాఁడు పంటలహూపాయలకంటె నెక్కువరాదు. మాయమ్మ కాశిలోనే దన జీవితకాలశేషముఁ గడపఁ దలుచుకొన్నది గావున నామె నక్కడ ప్రవేశపెట్టి భూముల మీఁద శిస్తామె కిచ్చుచు నేనేదైన తగిన యుద్యోగము సంపాదించికొనవలయునని యున్నది. ఈ సెలవులలో నేను మాయమ్మను గాశికిఁ దీసికొని పోవుటకుం దగు నేర్పాటులు చేసినాను.

హేమ—నీయాలోచన బాగుగ నున్నది. మీ తల్లి కాశిలో నివసింపఁ దలఁచుకొన్నది గావున తప్పక యామె నక్కడ దిగవిడచి తిరిగి కలకత్తాకుఁ బోయి కాలేజీలోఁ జేరి కష్టపడిచదువుము. పరీక్ష చాలాకష్టము. ఇదివఱకు నీవు ప్రవేశ పరీక్షలోను ప్రథమ శాస్త్ర పరీక్షలోను గృతార్థుఁడ వైనట్లే, యిందులోఁగూడ గౌరవముగ మొదటి తరగతిలో గృతార్థుడ వగుటకే కృషిచేయుము.

శర—చదువునను మఱికష్టపడి, తరువాత దైవమున్నాఁడు. కలకత్తాకు సాధ్యమైనంత త్వరగా వెళ్ళుదును. మీరుగూడవచ్చి కలకత్తాలోఁ గొంతకాల మున్నపక్షమున బాగుండును. ఎల్లకాలు మీ పల్లెటూరిలో నీవేలాగున నుండగలవయ్యా! పదియేండ్ల

క్రిందట నీవు కాలేజీలోఁ జదివినప్పుడు స్వల్పకాలము మాత్రము కలకత్తాలోనుంటివి. ఓంమువదినె కలకత్తా మొగమే యెఱుఁగదు. అందుచేత మీ రిద్దఱువచ్చి రెండునెలల పాటక్కడ నుండఁగూడదా? ఊసులపులై పోయినవి కదా! అందుచేత నీవు నాతోవచ్చి కొన్నాళ్ళు కలకత్తాలో నుండవచ్చు. అంతగా రావలసి వచ్చిన పక్షమున కొంతలరోజులలో రావచ్చును.

హేమ—చంద్రా! నీవెంతో మంచివాఁడవు; కనుక నింత దయతో నన్ను రమ్మని పిలిచినావు సరే! నేనువచ్చి కలకత్తాలో నేమిచేయుదును? నీవంటే రేపు ప్రొద్దున పరీక్షలోఁ దేఱుదువు. మంచియుద్యోగము సంపాదించుకొందువు. అక్కడ నాకేమి పనియున్నదోయి తిని కూర్చుండనా?

శర—నీవు మాత్రము తలఁచుకొంటే నేదైన మంచియుద్యోగము సంపాదించుకొన లేవఁటోయి? ఈ మాఱుమూల పల్లెటూరిలో నెల్లకాలము గడప వలయునా? నీవు ప్రవేశ పరీక్షలోఁ దేఱినావుగదా! అది యటుండఁగా నీవు చదువు మానినప్పటినుండి యూల్లవారివలె కాక యెన్నో పుస్తకములు చదివి చాల జ్ఞానము సంపాదించినావు. నీకున్నంత యింగ్లీషుపాండిత్యము బియ్యేల నుని బడాయి చెప్పికొను మాలో నెవరికి లేదు. ఇంత పాండిత్యము నింతయోపిక యింతపట్టుదల గల నీవంటివాఁడు ప్రపంచములో గొప్పవాఁ డగుట యొకకష్టమా?

హేమ—నా పాండిత్యమెంత. అతిస్వల్పము. నే నెప్పుడైనఁ బుస్తకము చదువుట పాండిత్యము సంపాదించుకొనుటకుఁ గాదు. ఏమియు దోచక. కలకత్తావంటి పట్టణములలో నెన్నో పెద్దపెద్ద పరీక్షలలో దేఱి గొప్పపండితులై యుద్యోగముల నిమిత్తము మేజువారీలు చేసిచేసి యుద్యోగములు లేక విసికి పోవుచున్న వా రెందరో యున్నారు. అక్కడ నా లెక్కయేమిటి! అక్కడ నే నుద్యోగము కొఱకు ప్రయత్నముఁజేయుట వృథ. చివరకు జరిగెడు దేమనఁగా కొన్నాళ్ళక్కడనుండి చేతులు నలుపుకొనుచు మఱల నీయూరు రావలసివచ్చును.

శర—పోనీ! అలాగే జరుగు ననుకో! వచ్చినకష్టమేమి? వీరు నాతో బాటు గంజియో అంబలియో త్రాగియుండవచ్చును. కర్చులకు మీకే యుపద్రవము నుండదు. ఉద్యోగమునిమిత్తము గట్టి ప్రయత్నముఁ జేసినవాఁడ వగుదువు. మనుష్యమహోసము దమని చెప్పఁదగిన యాకలకత్తాలోఁగూడ పేరు దెచ్చికొని మంచియుద్యోగము సంపాదించుకొనుటకు వీలున్నదని నాయభిప్రాయము. ఏదియు దొరకక పోయెనా మీయూరికి వచ్చుట యుండనేయున్నది. ఇందువలన నీకు వచ్చినకష్టమేమియు లేదు. వదినెయు సుధయుఁ గలకత్తా జూచినవారగుదురు.

హేమ—(కొంచె మాలోచించి) నా కేకర్చులు లేకుండ నీతో బాటుగ నుండు మన్నావు కాని మేము వచ్చిన పక్షమున వేరే బసలోనుండుటయే మంచిది. ఏలయన మేముండుటవలన నీచదువు తిన్నగా జరుగదు. అయినప్పటి కావిషయ మీరాత్రియే స్థిరపఱచనక్కఱలేదు. మాపెదమామగారు వర్తమానము నిమ్మనుచున్నారు. నీవు కలకత్తా రమ్మనుచున్నావు. నాకుఁ గూడ కొంత కాలము స్థలముమార్పు వలయునని యున్నది. స్థిమితముగ నాలోచించి నీవు వెళ్ళకముందే యేదో యొకటి చెప్పుదును లే. ఏదైన నీతో నాలోచింపకుండఁ జేయను.

శర—వదినె! నీయభిప్రాయ మేమి టమ్మా? కలకత్తావంటి మహాపట్టణముఁ జూడవలెనని లేదూ?

బింగు—చూడవలెనని లేకపోవుటా? నాయనా? ఊరుచేవమాత్రము సాగునా? మహాపట్టణము గాదా? మాటాడితే డబ్బుకావలెను. మేము పేదవాండ్రము. ఇక్కడ నున్నప్పుడే డబ్బుకెంతెంతోఁ జిక్కుపడు చున్నాము. ఇఁక నక్కడ నెట్లు బ్రతుక గలము?

శర—మీకంత డబ్బెక్కువ యుండఁకే పాడువైచికొన వచ్చును. కాని మీకే కర్చులు యవసరము లేదు. మీరు మాయింటనే యుండవచ్చును. మీరుండుటవలన నాచదువు చెడిపోదు. తెలుచుగా నేను రోజంతయుఁ జదువుకొని విసికివిసికి హాయిగ బ్రాణమిచ్చి మాటాడువారు లేక యొంటరిగ విచారముగ నుందును. మీరున్నపక్షమున నా చదువు చెడిపోదు. సరే కదా, సంతోషము చేత మఱింత సాగును.

బింగు—(నవ్వుచుఁ బరిహాసముగా) మఱేమి భయము లేదు కాని నీవు చదువు కొనుచు జదువుకొనుచు మధ్యమధ్య చిన్ననాటి ముచ్చటలు జ్ఞాపకము వచ్చినప్పుడు పుస్తకము లక్కడ పెట్టి వంటయింటికివచ్చి తోటలో జేసిన మామిడికాయల దొంగతనము నాతోఁ జెప్పుచుందువని భయపడు చున్నాను.

శర—అలా గనుకొనకపోతే చుట్టుపట్ల తోటలలో మామిడికాయ లేమైన నున్నవేమో దొంగలించుకొని నమ్మని నన్నె నీవు పిలుతువనుకొనరాదా? ఎట్లయిన మంచి పచ్చడి చేసి పెట్టుదువు కనుక లాభము నాదేలే.

బింగు—నీ వేలాగైన నదృష్టవంతుఁడవే నాయన! నేను నిన్న విన్న మాట నిజమో యబద్ధమో కాని నీ కన్ని పచ్చళ్ళు, నన్నివంటలు చేసిపెట్టుట కొకమ్మాయి గారు సిద్ధమగు చున్నారని తెలిసినది.

శర—ఆ యమ్మాయిగా రెవరమ్మాయి !

బిందు—ఏమి నంగనాచివోయి ? పాప మేమియు నెఱుఁగవు. మీ యమ్మ నీకు పెండ్లిఁజేయుటకు సంబంధము వెదకుట లేదా ? అబద్ధమాడక చెప్పు.

శర—(కొంచెము సిగ్గుపడి) పెండ్లిలేదు. ఏమీలేదు.

బిందు—(నవ్వుచు) నిజమే యైయుండునని నాకుఁ దోఁచుచున్నది. నీవు సిగ్గుపడి చెప్పవు. మీయమ్మ కాశికి వెళ్ళకమునుపు నీసంరక్షణముఁ జేసి నిన్ను బాగుగఁ గనిపెట్టఁగల పెండ్లామును నీకు గట్టిపెట్టియే వెళ్ళునఁట !

శర—ఈవిషయములో మాయమ్మ పట్టుదల యంతగా లేదు. ఆమెవైరాగ్యమేమో యామె యేమో కాని యీగొడవ లామె కక్కఱలేదు ! ఈపట్టుదల యంతయు మాయప్ప కాళిది. ఆమె వర్తమానములో నాకుఁ దగినసంబంధ మొకటి విచారించినదట. ఇక్కడకు వచ్చినప్పటినుండియు నాసంబాధ మొప్పుకొమ్మని యామె మాయమ్మను బలవంత పెట్టుచున్నది. కాని బి. ఏ., పరీక్షలోఁ గృతార్థుఁడనై కుటుంబపోషణముఁ జేసికొనుటకు మంచియుద్యోగము సంపాదించుకొనువఱకు పెండ్లిచేసికొననని వారిద్దఱితో స్పష్టముగఁ జెప్పినాను.

బిందు—పాపము కాళినిజూచి ఎన్నాళ్ళో యైనది. అదియును, నేను చిన్ననాఁట నెల్లప్పు డొక్కచోటనే యుండువారముగదా ! ఇప్పుడెదుపుపక్ష మాఱు మాసముల కొకసారైన నొకరినొకరు చూచికొనుట లేదు. నీవు వారిద్దఱను నేనేదో వీలుజేసికొని తప్పక చూచి తీరవలయును.

శర—సరే, మాయక్కయ్య యామను చూచుటకు నీవు వెళ్ళవలెననుకొనుచున్నది. మీ పెదబావయ్యగారి యింటికి వెళ్ళితివా, అక్కడ నీ విద్దఱినిఁ జూడఁగలవు.

బిందు—అక్కడికే వెళ్ళెదను. మీ యప్పను జూడవలెనని నాకెంతో యుబలాటముగా నున్నది. పాప మది యెన్నాళ్ళకోగాని రాదు. వచ్చుటకు వీలులేదు. ఏమంటే కటుంబము పెద్దది. పైఁగా వంగనా రోగిష్టి. ఆయన కెటరియవపడి వచ్చి నట్టున్నది. చూచి చూచి మీ యమ్మ కాళిని దానికంటె నిరుపేదయైనఁ దల్లి పెద్దవానికి రెండవపెండ్లివాని కిచ్చినదేమిటోయి !

శర—ఆమాట నన్నడుగ కమ్మా ! మాయమ్మ కాసంబంధము సుతరా మిష్టము లేదు. వారు కులీనబ్రాహ్మణు లఁట ! అందుచేత తమ సొమ్మంత పడిపోయినట్లు మా

చుట్టములు పురోహితులుఁ జేరి మాయమ్మను మెడలు విఱిచి ఈ సంబంధము చేయించినారు. పాపము దానికర్మ మాలాగున నున్నది. అది మేఁకపిల్లవంటిది గదా. ముసలి మగఁడైనను దానంతే పెట్టి పుట్టినావని తృప్తి జెంది యుండునుగదా! అట్టి పెండ్లిచేసినందు కొకరిని పల్లెత్తిమాటాడదుకదా. మగనిమీఁద పాపభక్తికదా.

అంతట నాగయాక యాసంభాషణ మితరవిషయములలోనికిం దిగెను. మిక్కిలి ప్రొద్దుపోయిన దని శరచ్చంద్రుఁడు లేచి "వదినె! చాలప్రొద్దుపోయినది. నే నింటికిఁ బోయెదను. రేపు మఱల వచ్చెదను. రేపేకాదు నే నిక్కడ నున్నంతకాలము ప్రతిదినము వచ్చి మామిడికాయ పచ్చడి కొంచెము రుచి చూచి పోవుచుందును. మీరు కలకత్తాకు వచ్చినపక్షమున నేను సుఖముగా రాచబిడ్డవలె నుందును" అని పలికెను. "ఆవిషయము ముందుముందు విచారించికొన వచ్చునులే. అన్నిటికన్న ముందు రేపు మీయమ్మను కలిసికొని ఈ రాచబిడ్డగారికి మామిడికాయపచ్చడిలో నేలోటు రాకుండ చేసిపెట్టగల చిన్నిరాణిని దీసికొనిరమ్మని గట్టిగ నొక్కి చెప్పెద" నని చిఱునవ్వుతో బిందు ప్రత్యుత్తర మిచ్చెను. శరచ్చంద్రుఁడును మందహాసము చేసి వారికడ సెలవుగైకొని గృహమునకరిగెను.

అప్పటికిని సుధ మేలుకాంచనేలేదు. సెలువపువ్వు నెక్కసక్కెములాడగల నామె ముద్దుమొగము మీఁద జంపవాము తనకేశపుంజము ప్రసరింపఁజేసి సహజమైన యామె లావణ్యమున కొకవింతలావణ్యముఁ దెచ్చెను. అక్కసోప వెలిగి పెగా నిదురించుచు సుధ నిదురలోసహితము మందహాససుధారసముఁ జిలుకఁ జేయఁజొచ్చెను. శరచ్చంద్రుఁడు బయలువెడలి వననలో నెన్నెన్నో తలంపులు మల్లడిగొన నాకసము వంకఁజూచి నడుచుచు తనలో నిట్లు వితర్కించికొనెను. "నేను కలకత్తాలోను ప్రధానములలోను గొప్పకుటుంబములను గొప్ప మేడలను మిద్దెలను నెన్నో జూచితిని. కాని యాచిన్ని తాటియాకుల యింటిలో నున్నంతసౌఖ్యము, సంతుష్టి, విశ్వాసము నెందుఁ గనియెఱుఁగ. ఆహాహా! ఆ హేమచంద్రుని హృదయ మెంతదయాపూరితమైనదో! ఆబిందుమున సంతసమెత్తినదో! ఆమెసులుకు లెంతమృదువులో! స్త్రీస్వభావమంతయు నీ బిందురూపము దాల్చినట్లున్నది. ఆ సుధాముఖారవింద మెంత ముద్దులు మూటగట్టుచున్నదో! ఆమె మనస్సు నిష్కలుషముగదా! ఈసాధుజనములతోఁ గలసిమెలసి కొంతకాలము నేయుండునేని బంధుప్రేమమెట్టిదో తెలియంగని నా కఠినహృదయ మిందుకు మెత్తబడి యనురాగాస్పదము కాకుండునా? ఏ వేడుకలులేక పట్టిమొద్దారివలె నుండు నా దినములగడిపి విడిచి నిజమైన మానవజీవితమని చెప్పదగిన ఈ సాధుజనుల నిలయమునఁ బ్రవేశించి యెన్నఁడైన సుఖింతునే! ప్రాణములేని బొమ్మవలెనున్న నాకు నిజమైన చైతన్య మెన్నఁడైనఁ గలుగునే!"

## అశ్రితులు

ప్రభాతకాలము తల్లిచేత సింగారింపబడి బయటకు బంపఁబడిన పెండ్లికూఁతురువలె నుండునని వేదములలో వర్ణింపఁబడి యున్నది. ఆకాశలక్ష్మికిం గారాబుకూఁతురై తెల్లని దువ్వలువ గట్టినట్లు వెలయు ప్రభాతకన్య తన రాకచే నెల్ల చీకటులను దవ్వుగ దోలి జంతుకోటికి నవనవచైతన్యము గలిగించెను. ఈ ప్రభాతకన్యం బట్టికొని పాణిగ్రహణము చేసికొనుటకు నరుణారుణ ముఖుఁడైన సూర్యుడు సప్తవర్ణము లనియెడు సప్త తురంగములం బూన్చిన యరదము నెక్కి యక్కన్య వెనువెంట దగిలెనో యన దూర్పు దిక్కునం దోఁచె కాని యాతని రాకఁ జూచి సిగ్గుపడి యువ్వలకుం దొలఁగెనో యన ధవళ ప్రభాతకన్య యదృశ్యయయ్యె.

బిందు ప్రభాతకాలమున లేచి యిల్లువాకిలి చిమ్మి పెరటిలోనున్న దిగుడు బావిలో రాత్రి వంటజేసినపాత్రలు తోముకొనుటకుఁ బోయెను. ఆమెయాపనిలో నుండఁ గనే యెవ్వరో వీధతలుపు తట్టిరి. అప్పటికి సుధకు హేమచంద్రునకు మెలకువరానందున సగముతోమిన పాత్రల దిగుడుబావిలోనే యుంచి బిందు తలుపు దీయుటకు పోయెను. ఆవచ్చినది కులమున బెస్తవాఁడై వృత్తిని సేద్యకాఁడైన సోనాతనుఁ డనువాని భార్య. బంగాళాదేశమున బెస్తలను కైవర్తులని వాడుదురు. ఈకైవర్తస్త్రీని బిందు చిన్ననాఁట వరుస కక్కయ్యా యని పిలుచుట కలవాటు పడుటచేనప్పుడును "అక్కయ్యా! ప్రొద్దుననే వచ్చితి వేమమ్మా? ఆచేతిలోని దేమిటి" యని పలుకరించెను. అంతట వారి కీక్రింది సంభాషణ జరిగెను.

కైవర్తస్త్రీ.—ఊరక వచ్చినాను. నాచేతిలోనేమి యేమిలేదమ్మా! మిమ్మును జూచి యెన్నాళ్ళోయైనది గనుక నొకతూరి యీవేళప్రొద్దున్న జూడాలని నిన్నటి మాపనుకొన్నాను. వచ్చునప్పుడు వట్టిచేతులతో రానేల నని మన సుధకు పెరుఁ గిష్టము గనుక గట్టిపెరుఁగు తోడుపెట్టి తెచ్చినాను. చిన్నమ్మాయి లేచినదా?

బిందు.—లేవలేదు. అక్కయ్యా! నీ వెప్పుడు మాకోస మేదోకష్టపడి తెచ్చి పెట్టుచునే యుందువు. మీరుమాత్రము డబ్బున్నవాళ్ళా! చేయునది సంసారముగదా. ఈలాగున మాటిమాటికి తేబోకమ్మా! పుచ్చికొనుటకు మాకు నెంతో గష్టముగా నుండును.

కైవ.—ఇదేమంతభాగ్యమమ్మా! వరాలా, మాడలా! ఇవి మాయావుపాలే కాని డబ్బుపెట్టి కొన్నవి కావు. అందులో కొంచెము తోడుపెట్టి మీకిచ్చినంత మాత్రాన

నా సొమ్మంతయు పోవునా? మీరేల యిన్నికొని బ్రతుకుచున్నారుగదా తల్లీ! మా యావు మీదే. మా యిల్లు మీదే. మా పిల్లయు మీదే. ఇటువంటి మీకు లేనిపోని మాటలెవరి కిచ్చికొందుము? మీరు కామందులు. మేము పాలెకాఁపులము.

బిం—ఇంతగట్టితోఁ జెప్పినప్పుడు ఏడవఁగూడదటే! అమ్మా! మాయింటికి వచ్చి భోజనము చేయునప్పుడు పోసికొందుము. అక్కయ్యా! నిన్ను పెరుగు తోడు పెట్టినట్లుగాను పెట్టలేదు. నీ పెరుగంటే సుధకంటె యెక్కువ. (అని సదా ముసలిది) ఇదేమిటక్కయ్యా! కన్నులు తడిగా నున్నవి. ఏడ్చుచున్నావా యేమిటి?

సోమనాథుని భార్య యిదివర కెందుకో లోలోపల విచారించుచుండెను. బిందు మాటలు వినఁగానే యది వెల్లివిరిసి పొంగెను. చీకొంగుతో నామె కన్నీళ్లు కొంతవఱకుఁ దుడిచెను. కాని ప్రవాహ మాఁగలేదు. అది చూచి బిందు మరల "యేమక్కయ్యా ఇది? సోమనాథుఁడు సెమ్మదిగా నున్నాఁడా" యని యడిగెను. అంతట నీ క్రింది సంభాషణ జరిగెను.

కైవ—ఆయనకేమి! ఆయన సుఖముగానె యున్నాఁడు.

బిం—మీ పిల్ల సెమ్మదిగా నున్నదా! అమ్మా!

కైవ—మీ దయవల్ల పిల్ల బాగానే యున్నది తల్లీ!

బిం—అందఱు నెమ్మదిగా నుండ ప్రొద్దుటనుండి ఈ దుఃఖమెందుకమ్మా! అంత యేమిమునిఁగి పోయినది?

కైవ—ముణిఁగి మి లేదమ్మా! చీఁకటితోన మునసబుగారి యింటికి వెళ్ళినారు. అక్కడ—ఏమి చెప్పనమ్మా! (అని గద్గదకంఠముతో నేడ్వఁజొచ్చెను.)

బిం—అక్కడ నేమిజరిగినది? ఎవ్వరయిన దిట్టిరా కొట్టిరా?

కైవ—తిట్టుటకుఁ గొట్టుటకు మే మెవరిసొమ్ము తిన్నాము? నాయన గడచిన తోవ మారినవాఁడైనను మీ దయవల్ల చెమటూడ్చి కష్టపడి నాకింత గంజి తెచ్చి పోయు గలఁడు. మే మెంత లేనివాళ్ళమైనను కొంచెము పరువుమరియాదలకోసము తాపత్రయ పడుచుందుము. కనుక నెవరిచేత మాటలు పడము.

బిం—(మగఁడు తెలివిమాలినవాఁడని శైవ స్త్రీ చెప్పినందుకు చిఱునవ్వునవ్వి) అయితే నీకీ యేడుపెందుకమ్మా! పోనీ నిన్ను మగఁడు తిన్నఁగా జూచుటలేదా యేమిటి?

శైవ—అది కన్నదా! నన్ను తిట్టడమే! నన్ను తిడితే అడిగేందుకు నాకెవరు? పొయిలో అగ్గి నేనో రెవరు, కంచములోకి కూరంత రావద్దూ! నే లేకపోతే ఆ పిల్లకాయలు కాళ్లు యుండునో! ఆడు నన్ను తిట్టి ప్రాణాలతో బతికిపోయెనే! కోక లుచ్చుకొని దుమ్ము దీరగ విడవనూ!

బిం—(మాల చిఱునవ్వు నవ్వి కొంచెము కసరుగా) అయితే నీ బుడిబుడి దుఃఖమునకుఁ గారణ మేమిటమ్మా! ప్రొద్దున్న యేడువవలసినంత పుట్టెమి మునిగినది?

శైవ—ఏమిగా లేదమ్మా! యేమి లేదు. ఆ గోసుగారియింటికాడికి ప్రొద్దున్న యెల్లినప్పుడు—అయ్యో! నా కర్మమా యేం జెప్పనుతల్లీ!

బిం—(విసుగుతో) నీయిష్టము వచ్చినంత సేపేడు. సంగతిచెప్ప విదేమిపాపము! అవతల గంపంత పనియున్నది. నేను నీతో నిలిచియుండుటకు వీలులేదు. ఇత్తడి సామానులు కడిగించుటేలేదు. పాలు దాలిమీఁద పెట్టలేదు. పిల్లలులేవగానే పాలు పాలని పోరుపెట్టుదురు. మాటుసోదె యెంతకు తెముల్పవైతివి.

అంతలో సుధ మేలుకాంచి యప్పుడప్పుడే వికసించిన తామరపువ్వు చందమున విలాసమును వెదజల్లు మొగముతో నచ్చటికిఁ బోయి తన యక్కప్రక్క నిలిచెను.

సుం—(సుధతో) అమ్మాయి! ఇంత పెందలకడ లేచినావేమమ్మా! ఇదిగో మన జెస్సక్కయ్యా నీకోసము గట్టిపెరుఁగు ముంతలోఁ దోడుపెట్టి తెచ్చినది. అవ కన్నములోఁ బోసికొందువుగాని, నేను వెళ్ళి పాయిరాజవేసికొందును. పిల్లలు లేచు వేళ గనుపది.

ఆ పలుకులు విని సుధ యా పెరుఁగుముంత లోనికిం దీసికొనిపోయి యుట్టిమీఁద పెట్టి పరుగుపరుగన దిగుడుబావికిం బోయి తన యప్ప సగము తోమివిడిచిన పాత్రలం గడుగఁబూనెను. ఇక్కడ గింపు సోనారినుని భార్య చెప్పెడు గొడవ తెములనందున విసికి లోనికిం బోవఁదలచి పెల్లగ మొగ మాపలకుఁ ద్రిప్పుచుండ నంతలో బెస్తయిల్లాలు కన్నులనీరు తుడచుకొని గొంతు సవరించుకొని "అప్పయ్యగారూ నే నన్నమాట నిజమేనాండి" యని యడిగెను.

బిం—ఏమి మాట?

కైవ—నేను గోనుగారి యింట్లో విన్న మాటమ్మా

బిం—అక్కడ నేమి విన్నావు?

కైవ—అయితే నే విన్నది నిజమేనమ్మా. ఈ మాట విన్నానికే నా మోను దిక్కుమాలినబతుకు కిన్నాళ్ళు బతికినాను. అయ్యో! అయ్యో! ఎంతపాపమమ్మా! మన నుధ మొగము జూడకుండ నే నొక్కపూటుండగలనా?

అని మఱేమియు బలుకక యా పెద్దయిల్లాలు మహాపదవాటిల్లిన ట్లెలుగెత్తి ఘోరున నేడ్వసాగెను. ఈ రోదనధ్వని నిద్రించుచున్న హేమచంద్రుని గదిలోనికి గొప్ప భూకంపధ్వనివలె వినఁబడినందున నతఁడు కళవళము నందుచు మేలుకాంచి చివాలున లేచి తొట్రుపడుచు గది వెడలివచ్చి బిందుంజూచి "ఆ ముసలి మొగము కట్టు పెద్దపెట్టున నేడ్చుచున్న" దని యడిగెను. "ఎందుకులేదు. ఆవిడ యెక్కడనో యేదో చెడుమాట విన్నదఁట. దానికై యేడ్చుచున్న" దని బిందు భర్తకు బ్రత్యుత్తరము చెప్పెను. అది విని హేమచంద్రుఁడు పల్లెయిల్లాలిఁజూచి "యేమియాపద మూఁడినది? నీకేమి చెడుమాటవిన్నావు? మావాండ్రందఱు నెమ్మదిగా నున్నారా?" యని యడిగెను. అనవుడు నా కైవర్తకాంత దుఃఖమునాపి కన్నీరుఁ దుడుచుకొని మగవారియెదుట వట్టి తలతో నిలువఁగూడదు గావున జీరచెఱఁగు మేలిముసుఁగు వైచికొని నేలయందుఁ దల యించుక వంచి దండముపెట్టి మెల్లగఁ "బాబయ్యగారూ! అందఱు కుశాలముగా నున్నా రండి. ఇబ్బంది యేమి లేదండి. ఏదో పాడుమాటొకటి వినబడినదండి. అదేదేమైనా కనుగొందామని, అప్పయ్యగారికాడికి వచ్చినానండి" యని బదులు చెప్పెను. అదివిని బిందు భర్తతో "ఆ పాడుమాట యేమిటో చెప్పమని నేనిందాకటినుండి పీకికొని తినుచున్నాను, ఆవిడనోటనుండి యామాట చెప్పించుటకు నా తాతతరమైనది కాదు. మీరు చెప్పించఁగలరేమో చూడండి" యని పలికెను.

అనవుడు హేమచంద్రుఁడు నవ్వుచు "ఆఁడవాండ్రసొదలు లాఁడవాండ్రకేగాని మాకు దెలియవు. మీసొదలు మగవాండ్ర కర్థములేకావు. రాత్రి మన మనుకొన్న సంగతుల గూర్చి మాటలాడుటకు నేనిప్పుడు శరచ్చంద్రుని యింటికి పోవుచున్నా"నని యక్కడ నిలువక మెల్లఁగ నావలకుఁ బోయెను. అనంతరము బిందు కైవర్తస్త్రీ తెలుఁగున మాటలాడిరి.

కైవ__అదిగో! అదిగో! నేను విన్నమాటనిజమే; బాబయ్యాగా రక్కడికే పోవుచున్నారు.

బిం__(కోపముతో) నీకీవేళ దయ్యము పట్టినదా యేమి? ఎన్నఁడులేనిది యీలాగున మాటాడ నారంభించినావేమి? నీవేమిమాట విన్నావో చెప్పరాదా?

కైవ__అప్పయ్యగారూ! ఈయాల పొద్దున్నే గోనుగారి యింటికాడికెళ్ళి అక్కడె యిన్నానండి.

బిం__అబ్బబ్బా! చంపుచున్నావుగదా! ఏమి విన్నావు. అడుగలేక నోరుపడు చున్నది.

కైవ__చెపుతా నప్పయ్యగారూ! కోపపడకండి. బుద్ధి నేరనివాళ్ళము. గోనుగారి యింట్లో నౌకరు__అడే జెమ్మడు! అడి మొకంమండా! అడి కేం పొయ్యేకాలమో కాని అదు చెప్పినాఁడు. అమాటినఁగానే నావో ప్రాణుం కెత్తింది. నాగుం డిప్పటికి దడద కొట్టుకుంటోంది. చూడం డప్పయ్యగారు. అబద్ధమేమో చూడండి.

బిం__అమ్మో! నీ గుండె దడదడలు చూచుటకు నాకు వ్యవధిలేదు. నేను వంట జేసికొనవలెను. (అని లోనికిఁ బోవుటకుఁ గిరుక్కున మరలెను.)

కైవ__(బిందుమతీకొంగు బట్టికొని) వద్దప్పయ్యగారు కోపమువద్దు. ఏమో మన నుండబట్టక మీమీ దాపేచ్ఛమూలాన్ని, ఆ మాట నిజమేమో కనుక్కుందు కొచ్చినాను. మాలోకమూను నాకు కావాలా అప్పయ్యగారు. చిన్నమ్మాయిగారి నొక్కపూట నాఁడకపోతే కడుపులో యెల్లాగో నుంటది.

ఆ మాటలు వినక బిందు తన దారిం బోవుచుండెను.

కైవ__(చీరకొంగు వదలకయె కూడబోవుచు) అప్పయ్యగారు వినండి. వినండి. గోనుగారి నౌకరు_అణ్ణి మోసుకుపోను. అణ్ణిట్లోనిప్పులొయ్య, అఁడి కొడుకునోట్లోనిప్పు లొయ్య, అఁడికోడలునోట్లోనిప్పులొయ్య, అఁడిల్లు దిబ్బగాను అఁడు చెప్పినాఁడమ్మా!

బిం__విడిపించుకొనక నె వంటసాలకు జనియెను.

కైవ__నే ఘట్టించినమాట కాదమ్మా యిది! ఈలాటిపాడుమాటలు అఁడు చెప్పాలి కాని మరెవరు చెప్పగలరు? మీరు సంచోరు. మీ రాలాంటి పనులు చెయ్యరనుకొని నేను నమ్మలేదు.

బెస్తయిల్లాలు తనవెంట నంటి రా బిందు వంటయింటిలోనికిం జనియెను.

కైవ—అప్పయ్యగారూ! ఆమాయచచ్చినోఁడు ఈలాగన్నాఁడండి. మీరంత మమ్మందఱిని యిక్కడ దిగబెట్టి కలకత్తా కాఁపురమెల్తారంట; అమ్మాయిగారూ! ఈ చేతులతో పెంచినానుకందా మిమ్మల్ని. కంటిసూపు నోటిమాట లేకుండా యెల్లిపోతా రామ్మా? చిన్నమ్మాయిగారికి నా పెరుగన్నా నేనన్నా పాణంగందా! ఇఁక నే నెందుకు నా పెరుఁగెందుకు?

బిం.—(ఆమె ప్రాణము విసిగించినందు కించుక కోపించినను మూర్ఖతకు చిఱునవ్వు నవ్వి) ఈ మాట చెప్పుటకేనా అప్పా! ఇంతసేపు యెముకలు కొఱికినావు. ఈ మాత్రపు దాని కింత యేడు పెందుకు? వెళ్ళుటో మానుటో యిప్పటికి మాలో మాకే తేలలేదు. నిన్నరాత్రి శరచ్చంద్రుఁడు వచ్చి కలకత్తా రమ్మని పిలిచినాడు. వెళ్ళుటంటే మాటలా? అక్కడ ఖర్చునకు సంసారమూ గుల్లయగును. మేము భాగ్యవంతులము కాము కదా!

కైవ—"అక్కడయ్యా! నా? మంచివాళ్ళు మరేదగలోరు కలకత్తా యెల్తారా? అక్కడవర్ణం, ఈవర్ణం, అనితేడా లుండవంట. మంచిచెడ్డలేవఁట. మాలమాదిగ తురక దూదేకులు బ్యామఁడు అంతాసంకరమఁట గాదు! అమ్మా! మీఁదిబంగారమంటిల్లు. చల్లగ యిక్కడే వుండు తల్లీ. ఆ గోనుబాబయ్యగా రెక్కడికైన యెల్తారు. ఆయనకేమమ్మా? పెళ్ళమా బిడ్డా? ఆయన తెల్లోళ్ళ యిసుకోలులో సదువుతున్నాఁడంట. ఆ సదువవగానే సీమ కెళ్తాడంట. అయ్యో దేవుఁడా! అలా గెళ్ళినోరు తమరు సల్లగుఁటారు. ఉన్న సుట్టాలగొంతులమీఁదికి తెస్తారు. అమ్మా! సీమయెక్కడుఁది? గంగదాటెల్లాలా, లంక దాటెల్లాలా?

బిం—సీమ వెళ్ళవలసినవారు చాలసముద్రములు దాఁటవలెను. గంగదాటి లంక దాటి యింక ఎదుటికి వెళ్ళవలెను.

కైవ—ఓలమ్మా! గఁగమ్మతల్లి కొట్టాలుదాఁటి బతకడమే! లంకదాటెల్లిన మనిషి మళ్ళి బతిగొస్తాఁడా! ఒచ్చినా, ఆళ్ళు రాచ్చసులై యొత్తారంట. ఒచ్చినోళ్ళు మణుసుల్ని బతిగుండగానే పీక్కు తింటారంట గాదూ. అవు నవును. గోనుబాబయ్య సీమెళ్ళ కెంజేస్తాఁడు. ఆయనకు పెళ్ళమా బిడ్డా నాతల్లి. ఈకొంపకి నీవు మాలచ్చిమిలా గున్నావు. ఈయగూ నొదిలిపెట్టి యెల్లకమ్మా, కొంపకనిపెట్టుకుండు.

బిం—అనక మళ్ళిగమ్ము. తరువాత మాటలాడ వచ్చును.

కైవ—అల్లాగే నమ్మా! కూడుండి అమ్మాయిగారు బోకేసిన తరువాత పెరుగెల్లాగుందో చెప్పండి.

బిం—అలాగే.

కైవ—(కొంతదూరము పోయి మరల వెనుకకుఁ దిరిగి వచ్చి) అప్పయ్యగారూ! ఈ యింటికి మాలక్ష్మివి. కొంత నామాట గేపకముంచుకొని యిల్లొదిలిపెట్టి ఎల్లకమ్మా!

బిం—అది మన మాలోచించుకొనవచ్చునులే. మేము వెళ్ళుటనుగూర్చి యింకా నిశ్చయము కాలేదు. వెళ్ళినను గొన్ని నెలలే కాని యెల్లకాల మక్కడ నుండము. కోఁతల నాటికి తిరిగి వత్తుము. ఈయిల్లు విడిచి మేముమాత్ర మెక్కడికి పోఁగలము.

అట్లు బిందు తమ కలకత్తాప్రయాణము నిశ్చయము లేదని నాలుగైదుసారులు ధ్రువముగాఁ జెప్పినపిదప నాపల్లెయిల్లాలు మనశ్శాంతి గలిగి మెల్లఁగా వరిగెను. ఆదినము ననే హారిమతి యను పేద గొల్లముసలిది వితంతువగు తనకోడలను వెంటఁబెట్టుకొని బిందుంజూడవచ్చెను. ఆ ముసలిదాని కొడుకు బ్రతికియున్నప్పుడు వాండ్రకు గొంతభూమి కొన్ని పశువులు నుండెను. అప్పుడు పాలు పెరుఁగు లమ్ముకొని వాండ్రు సుఖముగాఁ గాలక్షేపము సేయుచువచ్చిరి. హారిమతికుమారుఁడు మృతినొందుటఁజేసి యాఁడువాండ్రిద్దఱు నేలదున్నుకొనలేక యితరుల కమర్చిరి. పాలికాఁపులు వాండ్రకిచ్చుశిస్తు మిక్కిలి స్వల్పము. ఇల్లు గడవక నొకదాని వెనుక నొకటిగఁ బశువులనన్నిఁటిని వాండ్రమ్ముకొనిరి. చివర కొకటి రెండావులు మిగిలెను. అందుచేత నత్తకోడండ్రిద్దఱు బిందు గృహమునకువచ్చి బిడ్డల జబ్బుచేతగాని మఱియే కారణముచేతగాని యామె పనిఁజేసికొన లేనప్పుడు పనియంతయుం జేసిపోవుచుందురు. బిందు వాండ్ర పేదతనము తీరునంత సాయము చేయలేకపోయినను బంటలసమయమున వాండ్రకు మఱచిపోక చేతనైన సాయముఁ జేయుచు వచ్చెను. ప్రాఁతబట్ట లేవైన నున్నయెడల బిందు చలికాలము ముసలిదియు, నామె కోడలు కప్పుకొనుటకు జాగ్రత్త పెట్టుచుండును. అత్తకోడండ్రలో నెవరికి రోగము వచ్చినను బిందు కనికరము పెంపున వారికి సగ్గుబియ్యము, పటికిబెల్లము సామాన్యములైనమందులు పంపుచుండును. సాధారణముగ బీదవాండ్రు మిక్కిలి చిన్న యుపకారములకు నైతము కృతజ్ఞులై యుందురు. కావున గొల్లముసలిదియు బిందు తనమీఁద నప్పుడప్పుడు చూపుచు వచ్చినదయకు నభిమానమునకుఁ గృతజ్ఞత కలదైయుండి బిందు కలకత్తా బోవునను వార్త నామెయు విని చూడవచ్చి కొంతసే పామె ప్రక్కంగూర్చుండి వెక్కి వెక్కి యేడ్చెను.

బిందు హరిమతి నోదార్చి కోడలికొక ప్రాతచీరనిచ్చి వారిని బంపివైచెను. హరిమతి చనినవెనుక నాయూరి సాలెవాని భార్యవచ్చెను. ఈమె వికారరూపముగల దగుటచే మగఁడామెను సరిగ నొల్లకపోయెను. దానికిం దోడగ నామె యెల్లప్పుడు రోగముఁ గలదై బలహీనురాలై పనిపాటలు సరిగఁ జేయలేకపోవుటచే నత్తగా రెప్పుడు దిట్టి పోయుచుండెను. కడచిన శీతకాలములో నడుములో నొప్పి బయలుదేరినందున నామె చెలువునకుఁబోయి నీరు తేజాలదయ్యెను. అందుకుఁ గోపించి యత్తగా రామెను గొట్టెను. ఏమియుం దోఁచక యామె యవుడేడ్చుచు బిందుకడకుఁబోవ కృపారసపూరితయగు బిందు మందులు తెప్పించి వేయలేకపోయిన నేదో తైలముఁ దెప్పించి యామె నడుములోఁ గూర్చుండబెట్టి యా తైలము నడుమునకుఁ గొన్నిరోజులు మర్దనముజేసెను. ఆ రోగ మా చికిత్సతో నుపశమించెను. సాలెపడంతి యా యుపకారము మఱవక బిందునెడ జాల విశ్వాసము గలిగియుండి యామె గ్రామము విడిచిపోవునని వినివచ్చి యేడ్చెను. ఆమె యేడ్చి పోయినపిదప హీర యను నొక బోయజాతి యాఁడుదివచ్చెను. హీర మగడు పల్లకులమోసి కావలసినంత డబ్బు గడించుచుండును. కాని తెగఁ ద్రాగి యా సొమ్మెల్ల పాడుచేసి యింటికిఁబోయి పెండ్లామును బాదుచుండును. ఆ కథవిని బిందు జాలినొంది భర్తతోఁజెప్ప నతఁడుబోయి దాని మగనిం బిలిపించి చీవాట్లు పెట్టెను. అది మొదలు కొని వాఁడు భార్యను మునుపటంతగా బాధపెట్టుట మానెను. అందుచేత హీర బిందు పేరుఁ జెప్పిన మ్రొక్కుచు నామెయెడ గడు కృతజ్ఞత గలదైయుండెను. ఆమెయు బిందు ప్రయాణమునుఁ గూర్చి విని తన పసిబిడ్డకొక క్రొత్తగుడ్డఁ జుట్టబెట్టి యా బిడ్డ నెత్తికొని బిందువద్ద సెలవుపుచ్చుకొనుటకు వచ్చి మీదయవల్ల యీతూరి నాలుగురూపాయలు వెనకేసుకొని యీరయే డిల్లు చేయించుకొన్నాము. కుఱ్ఱదానికి క్రొత్తరుమాలు కొనుక్కున్నాము. మీ రెల్లకమునువు దీవించం డమ్మా! నన్ను బిడ్డని దీవించండని వేడి కొనెను. బిందు తల్లిని బిడ్డను దీవించెను.

శేషియను బ్రాహ్మణస్త్రీ, భామయను శటగోపస్త్రీయు, శ్యామయను గోరి స్త్రీయు, మోహమాయ యను చాకలిదియు నింక నిట్టి పేదవాండ్రు చాలమంది బిందు దర్శనముఁజేసి యామె తమ్ము విడిచిపోవునని విచారించిరి. పాపము బిందు వారలనందఱ నోదార్చి పంపివేయవలసి వచ్చెను. ఆ గ్రామములో బిందు కుటుంబముకన్న భాగ్యవంతములైన కుటుంబము లనేకము లున్నవి కాని దురదృష్టవంతులు పేదవాండ్రు నగు నిరుగు పొరుగు వాండ్రమీద నీ భార్యాభర్తల కున్నంత కనికరమా యూరిలో నెవ్వరికిని లేదు

ఇంచుకదయ దవ్వఁత యభిమానముఁ గల మనుష్యులయందు భయభక్తులుండుట లోకమందంతటఁ గలదు. హిందూదేశమున నీ విధమైన యనురాగము మఱింతయెక్కువగఁ గనఁబడుచున్నది.

— ♦ —

## ఆఱవ ప్రకరణము.

### చిన్ననాఁటి నెచ్చెలులు.

సాయంకాలము బింబ పెద్దతల్లిగారియింటికిఁ బోయి యచట సుమను, గౌరిని కలిసికొని కౌగలించుకొనెను. మున్ను చిన్నబిడ్డలయి యాడుకొన్న యీ మువ్వురిప్పుడు త్తింటి కోడండ్రై వేఱువేఱు గ్రామముల వసించుచున్నను వారి హృదయములనుండి చిన్ననాటి ప్రేమ తొలఁగిపోలేదు. చాల కాలముఁ గడచిన పిదప నొండొరులం గలిసికొన్నందున నా మువ్వురు నా సాయంకాలము ప్రొద్దుపోవువఱకుఁ జిన్ననాటి ముచ్చటలను, ప్రస్తుతపు గృహకృత్యములను గష్టసుఖములను జెప్పుకొనిరి. కాళి నల్లని మేనుకలదై సార్థక నామధేయురాలై యుండెను. ఆమె మొగము సుందరముగా నుండెను. కాని విచారములు, మనోవ్యథలు, నామె వయస్సు చిన్నదైనను ముఖలావణ్యమును తగ్గించెను. ఆమె కన్నులు కొంచెము గుంటలు పడియుండెను. ఆమె సన్నని చేతుల బంగారు మురుగుల జతియుండెను. పృథువైన యామె కంఠమును శుద్ధసువర్ణమయమైన పట్టెడ యలంకరించెను. అప్పుడామె సాధారణమైన చీరఁ గట్టుకొనెను. ఆమె సహజముగఁ బలుచనివైన తన తలవెండ్రుకలను నాఁడు ముడిగా జుట్టుకొనెను. కాళి గడుసుదనము విశేషముగా నెఱుఁగని సాధుస్వభావము కలది. ఆమె ప్రతిదినము గృహకృత్య మంతయు స్వయముగాఁ జేసికొనుచు రెండుసారులు మాత్రమే భుజించుచు దైవవశమున వచ్చుడి కష్టములను శాంతముతో సహించుచు జనసమ్మతవర్తనముఁ గలిగి కాఁపురము సేయుచుండెను. అంతట నాచెలికత్తెలు మువ్వురకు నీ క్రిందివిధమున సంభాషణము జరిగెను

బిం — కాళీ! ఎంతకాలమైనదే నిన్నుఁ జూచి.

కాళి—బిందక్కయ్యా! ఇంతకంటె తఱచుగా మనమేలాగున కలిసి కొనఁగలము. పెండ్లికాఁగానే నేను వర్ధమానమువెళ్ళి యత్తవారి యింటనే యుంటిని. పుట్టింటి కెప్పుడోగాని నన్ను రానీయరు.

ఉమ—ఎందుచేతనే? నేను ప్రతిసంవత్సరము దుర్గపూజనాటికి పుట్టింటికి వచ్చుచునేయున్నాను.

కాళి—ఉమా! నీసంగతివేఱు. నీకు మాకుసామ్యమా. ధనపురములో నీకు గావలసినంతమంది నౌకరులున్నారు. ఇంటిపని నీవేమీ చేయనక్కఱలేదు. సవారీలోఁ గూర్చుండి హాయిగ వచ్చెదవు నీకేమమ్మా! నీలాగు మాకెలాగున సాగఁ గలదమ్మా! మాది పెద్దకుటుంబము. మావారు, మఱఁదులుఁ గలిసియున్నారు. తెల్లవాఱితే బోలెడు చాకిరీ. నేను లేకపోతే పని యేలాగున జరుగును. ఇప్పుడు నేను వచ్చువఱకు పనిచేసి పెట్టుమని మా యాఁడబిడ్డను బతిమాలుకొన్నాను. ఏలాగుననో దయదలఁచి యావిడ యొప్పుకొన్నది. కొద్దిరోజులు గనుక నామె చేసిపెట్టును కాని చాలకాలమైన నామె యంగీకరించునా?

ఉమ—కాళీ! మీకగ్రహారములు భూములు నున్నవని విన్నాను. వాటిమీఁద మంచి రాఁబడియున్నదఁట కాదూ. మీయాయన కొన్ని గుఱ్ఱపు బండ్లున్నవఁట. అన్ని బళ్ళు పెట్టినయాయన యింటిలో నౌకరుల నెందుకు పెట్టఁగూడదు?

కాళి—బిందక్కయ్యా! నౌకరులను బెట్టి పనిచేయించుట మొదటినుండి యాచారములేదు. మాయత్తగారు చాలనిష్ఠకలవారు. వంటలక్కలు వండినవంటలుతినరు. నౌకరు లేవస్తువు ముట్టుకొనుటకు వల్లకాదు. నౌకరులు చాలమందియున్నారు. వాళ్ళు కచేరీచావడిలోను, మావారిదగ్గఱ పనిచేయుచుందురు. ఇంటిలోపలి పనియంతయు మాయింటి కోడండ్రే యుదయము మొదలు సాయంకాలమువఱకుఁ జేసికొనుచుందురు. అదిగాక మీకున్నంత రాఁబడికూడ మాకులేదు. కర్చుబోలెడు. అప్పులుగూడ నగుచున్నవఁట. ఏమో లోపలపడియుండి యివి యెప్పుడయినను వినుటయేగాని మేమే మెఱుంగుదుము.

ఉమ—మీయాయన దొరలకు పెద్దపెద్ద విందులుచేసి చేసినప్పుడెల్ల మిక్కిలి డబ్బు కర్చుచేయునఁట కాదూ. అప్పులగుచున్న మొదట కర్చులు తగ్గించుకోరాదూ. నీ వామాత్రము సలహా మీవారికిఁ జెప్పలేవంటే.

కాళి—ఈలాటి వ్యవహారములలో నే నేమిటి, యాలోచన చెప్పుట యేమిటి. ఆయన కుటుంబయజమాని. నేనో, యొదిగియొదిగి యుండవలసిన కోడలను. అటువంటి సంగతులగురించి యాయనతో నోరెత్తి మాటలాడఁగలనా? మేనత్తలు చాల సారులు కూకలవేయుగా విన్నాను. వాళ్ళమాట లక్ష్యమా ఆయనకు?

ఓం—అయితే మీవా రేమంటారు?

కాళి—అనుట కేమున్నది? కుటుంబము చాలగొప్పది. పేరుప్రతిష్ఠలు కలది. మనము వెనుకటి యన్నదానములు, నిష్ఠలు జరుపలేము గాక గౌరవము నిలబెట్టుకొనఁ దలఁచుకొన్న, వైభవముతో విందులు మొదలగునవి చేయుచుండవలెనని యాయన చెప్పుచుందురు. ఎందుకక్కయ్యా! నీ వెఱుఁగుదువో లేదో కాని, దొరల కాయనంటే ఎంతో యిష్టము. దొరలు ప్రతి కమిటీలోను యాయనను వేయుదురు. ఆయన లేని కమిటీ యే యుండలేదట. ఆయన ప్రతిదినము నుదయమున సాయంకాలమున వారినిఁ జూడఁబోవుచుండును. అన్ని విషయములలో వారేలాగునఁ జెప్పిన నాలాగునఁ జేయుచుందురు. అందుచేత దొరలు మావారిని పూర్వకాలపు పెద్దమనుష్యులని మెచ్చుకొనుచుందురు.

ఓం—మీవా రస్తమానము దొరలనే చూచుచుండునంటివి కదా, మఱియింటి వ్యవహారము చూచువా రెవరు?

కాళి—మామవారు లేకేమి. మాయత్తగారు లేరూ? ఆవిడ డెబ్బదియేండ్లదైన నిప్పటికి నడుము వంగలేదు. తాటిచెట్టులాగున నిప్పటికి నిటారుగా నున్నది. ఇంటి వ్యవహారములు చక్కబెట్టుటలో నామెకున్న యోపిక, యీ పడుచుకారులో నెవ్వరికిని లేదు. ఆవిడదే పెత్తనము. ఆవిడ మాటేమాట. అంతయధికార మావిడదే. మావారిమేనత్తలు ధైర్యముగలవారే కాని మాయత్తగారి మాటంటే గడగడ లాడుదురు. ఇఁక కోడండ్రము మామాట చెప్పనేల? ఆమెను మేము పూజింతుము. ఆమె పెత్తనముచేత నింటివ్యవహార మంతయు గడియారము లాగున సరిగా జరుగుచుండును. గడియ రాత్రి యుండఁగానే లేచి యావిడ శీతాకాల మైనను సరే వర్షకాలమైనను సరే చన్నీటిస్నానము చేసినట్టు చీరఁగట్టుకొని జపము తపము పూజయు రెండుగంటలసేపు చేసికొనును. ఆమె లేచిన వెనుక మేము నౌకరులు లేచి యెవరిపని వారు చేసుకొనుచుందుము. ప్రొద్దు పొడుచు నప్పటికి నీళ్ళు తోడువాండ్రు, వాకిలి యూడ్చువాండ్రు, పొయిలో నిప్పువేయువాండ్రు

గజగజలాడుచు బనులు చేయుచుందురు. ఆవిడ జపము చాలించి పిల్లలకుఁ జల్దియన్నములఁ బెట్టించి నౌకరుల కన్నములఁ బెట్టించి వంటలుచేయించి మగవాళ్ళ భోజనములైనతరువాతఁ గోడండ్ర నన్నములు తినుడని చిట్టచివర నామె భోజనముచేసి మధ్యాహ్నము కొంచెము సేపు పరుండును. మధ్యాహ్నము నిద్రలేచి మరల సాయంకాలపుఁ బనిఁ జేయించి యందఱు దిని పండుకొనువఱకు నెంతరాత్రియైన నామె నిద్రపోదు. ఇంటిలో నేది యెవరికిఁ గావలసిన నది యామె నడుగవలసినదే. మావారు తల్లి యెంత చెప్పిన నంత. ఆవిడ గీచినగీటు దాటరు. ఇంటిలో నొక సంతర్పణ రానీ సమారాధన రానీ, పెండ్లి కానీ మంచి కానీ చెడ్డ కానీ యేదైన నావిడ చేతులమీదుగా జరగవలసినదే.

బిం—డెబ్బదియేండ్లు దాఁటినయావిడ యింతపనిఁ జేసినదంటే చిత్రముగానే యున్నది. ఆవి డెవరో యసాధ్యురాలు లాగున్నది.

కాళి—బిం దక్కయ్యా! నీవు వేళాకోళము చేయుచున్నావు కాని యాలాటి యావిడ మనదేశమున నెక్కడను లేదు. ఆవిడ పూర్వకాలపు మనిషి. పూర్వపువాళ్ళు పాళ్ళు పంపుళ్ళు లేకుండ నొకయింటనే కలిసియున్నపు డీలాటి పెద్దవాండ్ర చేతిమీఁదుగా సంసారములు జరుగుచుండునవి. ఇప్పటివాండ్రు నాలుగురూపాయలు తెచ్చుకొనుటకు శక్తిరాగానే తమ పెండ్లాములఁ దాము వేఱింటికాపురములు పెట్టి కుటుంబములోనుండి విడిపోవుచున్నారు. దేశములో విభాగములు కాని కుటుంబములు నూటనాటి నొకటి రెండెక్కడనో మా కుటుంబములవంటివే యున్నవి. కాని తఱుచుగా లేవు.

ఉమ—అయితే మీవారి మేనయత్త లీవిడ యధికారమునకు లోబడి యున్నారా?

కాళి—ఉన్నారుమరి. ఒక తల పెత్తనము లేకపోతే సంసార మేలాగున జరుగును? పెద్ద మేనత్త మంచిది. ఏ గొడవలజోలికి రాదు. తక్కిన యిద్దరు ఒక్కొక్కప్పుడు ధుమధుమ లాడినను మా యత్త మాటప్రకారము నడిచి తీరవలయును. మూడవ యావిడ కొంచెము కోపధారి. అత్తగారికంటె నావిడకే మేముండఱ మెక్కువ జడియుదుము.

ఉమ యామాటకు త్తరము చెప్పక కాళి యత్తవారింట వంటయింటిలో దానుండిన పక్షమునఁ బరిచేత, జనసమ్మర్దముచేత నూపిరి సలుపక తాను బాధ పడవలసి యుండునని మనస్సులో ననుకొనెను. ఉమ హిందూసుందరి యయ్యు వేఱింటి కాపురమున కలవడిన దగుటచేతను, బట్టణములలో నివసించువారి మనంబులో నుండునట్టి నవ

నాగరకపద్ధతు లామె మనస్సులోఁగూడ దృఢముగ నాటియుండుటచేతను ముప్పది నలువదిమంది యొకయింటనేఁ గలిసియున్నారనియు, నొక ముసలమ్మ పెత్తనము క్రింద సంసారమంతయు జరుగుచున్నదనియు వినఁగానే శాళి కుటుంబస్థితి బాగుండలేదని యామె జాలినొందెను. కాని యుమ పూర్వాచారము లిష్టములైన స్త్రీ లాలోచించి నట్లు తాను గూడ నీ విషయ మాలోచించినయెడలఁ గుటుంబము లవిభక్తములుగా నుండుటవల్ల శరీరదార్ఢ్యము విద్య గలిగి ధనసంపాదనముఁజేయు నదృష్టవంతుఁడు తన కుటుంబములో నున్న యప్రయోజకులను, దుర్బలులను సత్రములపాలు జేయక వీథుల పాలుసేయక పోషించుటకు వీలుండునని యామెకుఁ దప్పక తోఁచియుండును. అటు లామె తలపోయుచుండ నంద ఱొక్కనిమేష మూరకుండి పిమ్మట నీ విధమున సంభాషించిరి.

శాళి—ఉమా! మీ వారు కలకత్తా వెళ్ళినారఁటే?

ఉమ—ఆ! వెళ్ళినారు. పదిపన్నెండు మాసములనుండి యచ్చటనే యున్నారు. ఈమధ్య నన్నుగూడ దీసికొనిపోవఁ దలఁచుకొన్నట్లు తలికి వర్తమానము పంపించినారు.

శాళి—ఔను. మా తమ్ముఁడు శరచ్చంద్రుఁడు చెప్పినాడు. మీ యాయన కలకత్తాలో దివ్యభవన మొకటి యద్దెకుఁ బుచ్చుకొన్నారని ఎంతో సొమ్ము ఖర్చుపెట్టి చిత్రవస్తువులతో నింపినారని విన్నాను. ఒక జత నల్లగుఱ్ఱములను మఱొకజత గోధుమ రంగు గుఱ్ఱములను గొన్నారట. మీ వా రెక్కుడు గుఱ్ఱపుబండ్లవంటివి సాధారణముగా రాజులకైన లేవని మావాఁడు చెప్పినాడు. అంతేగాక యాయనగారు కలకత్తాలోనున్న పేటలలో నెక్కడో యొకచోట బూఁదోటయున్న మేడ యొకటికొని పూలమొక్కలు వేయించి, పొదరిండ్లు కట్టించి మేడయడుగున స్ఫటికపురాయి పరపించి దానిని దేవేంద్ర సభ జేయదలఁచుకొన్నారఁట. ఆహాహా! ఏమే యుమా నీ యదృష్టము!

ఉమ—(చిఱునవ్వు నవ్వి పిదప మొగమున విచారముతోప) శాళీ! నల్ల గుఱ్ఱముల జతలు, గోధుమ గుఱ్ఱముల జతలు, పూలతోటలు, స్ఫటికపురాళ్ళు, తాపడము చేసిన మేడలు మొదలగునవే యాఁడుదానికి సౌఖ్యము లేఁజాలినపక్షమున మీయుమయు నదృష్టవంతురాలే. కాని బ్రహ్మదేవుఁడు ఘనసుదుట నేమి వ్రాసినాడో యెవ్వరెఱుఁగు దురు. (అని యామె నిట్టూర్పు విడిచెను.)

బిం—(దానినిఁ జూచి) ఉమా? ఏమి వ్రాసినాఁడో యననేల? అదృష్టమే వ్రాసినాఁ డనుకొనరాదూ?

ఉమ——బిందక్కయ్యా ! జ్ఞాపకమున్నదా ? మన చిన్నతనములో నదృష్టములు చెప్పు బైరాగి వచ్చినాడు. నీకు జ్ఞాపక మున్నదో లేదో వాఁడు మనచేతులు చూచి మన యదృష్టములు చెప్పినాడు.

బిం——నాకు జ్ఞాపకము లేదే.

ఉమ——కాళీ ! నీకైన జ్ఞాపకము లేదఁటే.

కాళీ——నాకసలే జ్ఞాపకము లేదు.

ఉమ——వాఁడు చెప్పినమాటలు నామనస్సుమీఁద నచ్చు గ్రుద్దినట్లు నాటినవి. అందుచేతనే నాకెక్కువ జ్ఞాపకమున్నది. పదిరెండేండ్ల క్రిందట మన మీ నెలలోనె యీచుట్టుప్రక్కలనే యాఁడుకొనుచుండఁగా నప్పుడే సాయంకాలమయినది. కొంచెము గ్రుడ్డివెన్నెల వచ్చినది. అప్పుడొక బైరాగి పెద్ద జడలు తాను వచ్చి మనదగ్గఱ నిలుచుండెను. అప్పుడు భయముచే గడగడ వడకితిమి. అప్పుడతఁడు "భయము లేదమ్మా ! డబ్బులు తెచ్చికొనుడు. మీ యదృష్టములు చెప్పెద" నని కూర్చుండెను. కాళి యొక డబ్బిచ్చి తనచేయి చూపించి కొన్నది. మన కాళి గొప్పనిష్ఠప్రతిష్ఠగల కుటుంబములోనికి వెళ్ళునని యాతఁడు చెప్పెను.

బిం——ఆమహానుభావుఁడు నన్ను గురించి యేమి చెప్పినాఁడే !

ఉమ——ఇదిగోఁ జెప్పుచుండఁగానే——మీ యమ్మప్పుడు చెఱువునకు వెళ్ళినది. చెఱువునకు వెళ్ళకపోయినను మాపిన్ని దగ్గఱ, పాపము డబ్బొకప్పుడున్నదాయేమి ? డబ్బు తేలేక యూరకే నీవు చేయిచూపించి కొంటివి. అప్పుడు నీచేయి చూచి వాఁడిట్లు పల్కెను. 'నా చిట్టితల్లీ ! నీవు భాగ్యము, ప్రతిష్ఠగల కొంపలోఁ బడవు. పేదవాని చెట్టఁబట్టి వానితోఁ గలిసి యింత కలోగంజో త్రాగుచుందువు.

బిం——ఏమీ ! బాగుగానే యున్నదే. అతఁడు చెప్పినమాట నా కిష్టముగానే యున్నది. అయితే నిన్నుగురించి యేమి చెప్పినాఁడు.

ఉమ——చెప్పుచున్నాను. విను. ఆవేళ మాయమ్మ నాకిచ్చిన నాలుగు డబ్బులు నేను వానిచేతిలోఁ బెట్టితిని. ఆడబ్బులు పుచ్చుకొని వాఁడు నామొగము కేసి చేతికేసి మొగా దిగా చాలాసేపు చూచి నన్నుదగ్గఱగాఁ బిలిచి చెవిలో నిట్లు గుసగుసలాడెను. "అమ్మా ! నీవు భాగ్యవంతుని బెట్టఁబెట్టెదవు కాని భాగ్యమే సుఖము తేఁగలిగిన పక్షమున నీవుసుఖపడుదువు. గ్రహస్థితి మాత్రము సరిగ లే" దని పలికి వాఁడు తన దారిం

బోయెను. ఆమాటలు విని భయముచే నిశ్చేష్టురాలనయి యక్కడనే పాతుకు పోయినట్లు నేను నిలిచి యుంటిని. (ఈవృత్తాంత మెఱింగించునపుడు శరీరము వడఁకెను.)

బిం__(తొందరగలో) ఏమే యుమా ! అలాగున వడఁకుచున్నావేమే ? ఎన్నఁడో పన్నెండేండ్లక్రిందట నెవఁడో బైరాగివాఁడు వచ్చి ప్రేలిన యవక తవక మాటలు తలచి కొని నిజమని నమ్మి నీ గ్రహచారము బాగు లేదనుకొను చున్నావా ? ఎంతవెఱ్ఱిదానవే! కష్టములు దుఃఖములు వచ్చునని భయపడెద వేమి ? అంతభాగ్యము నంతవైభవముఁ గల దానవు నీవే యిట్లనుకొంటే యింక మే మేమను కొనవలయును.

ఉమ__(కన్నీరు తుడుచుకొని, ధైర్యము దెచ్చుకొని గుంభనముతో) నాకే లోటును లేదు. ఆదేశదిమ్మరి బైరాగివాడు చెప్పినది నేను మాత్రము నమ్మినానను కొన్నావా ? అదేమోకాని కలకత్తా ప్రయాణముమాట తలఁచికొన్నప్పు డెల్ల నాకేదో కడుపులో బెంగగానుండును. కాని బిందక్కయ్యా ! మీరు గూడ కలకత్తారానై యున్నారు కదా. మన కాళి వర్ధమానములో నుండును గదా ? అది కలకత్తాకు మూఁడు నాలుగుగంటల ప్రయాణము. మనము ముగ్గురము చిన్నతనములో నప్పచెల్లెండ్రవలెఁ బెరిగినాము. యావజ్జీవము మనమాలాగుననే యుండుదము. మనలో నెవరికైనఁ గర్మము చాలక యేదురదృష్ట మయిన సంభవించినను మనలో మన కనురాగము పోకుండనుండిన నదేచాలును.

అని పలుకునప్పు డుమకంఠధ్వనిలో యంతర్గతము లైన దుఃఖములు, నవ్యక్తము లయిన మనస్తాపములు కాళికి, బిందుకుఁ బొడకట్టును. కాళిబిందులు కారణము చెప్పుమని యామెను బలవంత పెట్టక తమ చీఁకొంగులతో నామె కన్నీరు దుడిచి తమ యనురాగ మెన్నఁటికి మందగింపదని ధ్రువముగఁ బలికి యామెకు ధైర్యముఁ గొల్పిరి. ఒక యూరనే పుట్టి పెరిగిన చెలిమికత్తె లైనందున నామువ్వురు చీఁకటి పడ గానే యెవరి గృహములకు వారు పోవఁదలఁచి లేచినప్పుడు మువ్వురిహృదయములు చెవరి యేకాలమున కెవ్వరి కే కష్టములు మూఁడునోగదా యని భయపూరితము లయ్యెను.

—♦—

# ఏడవ ప్రకరణము.

## మాతాపుత్రులు.

కలకత్తానుండి బొంబాయికిఁ బోవునట్టి సాయంకాలపు మెయిలు బండి మఱు నాఁడు మధ్యాహ్నమున మొగలుసరాయిమకామును జేరెను. కాశి వెళ్ళఁదలచిన బాటసారులాబండిని విడిచి గుంపులు గుంపులుగా నక్కడనుండి కాశికిఁ బోవు వేఱొకబండి నెక్కుటకు మూటలుచేతఁ బట్టికొని బయలుదేఱిరి. ఆరెండవబండి వారిని గంగాతీరము వఱకుఁ దీసికొని పోయెను. ఈకథాకాలము నాఁటికి గంగమీఁద వంతెన కట్టఁబడి యుండ లేదు. కావున బాటసారులు చిన్నపొగయోడ నెక్కియో నావల నెక్కియో గంగానదిని దాఁటి యద్దరినున్న కాశి చేరవలసి వచ్చెను. వచ్చిన తీర్థవాసులు నానావర్ణములవారు కదా. ఇట్లు నానాజాతులు సమావేశమగుట హిందూదేశమునందే గన్పడును. ఆజాను బాహులు, దృఢశరీరులు నగువిహార దేశస్థు లొకచేత బాణాకఱ్ఱయు, రెండవచేత మూటయుఁ బట్టుకొని కాశిలో దిగిరి. ఈజనులు పాటుపడుటకుఁ గష్టములోర్చుటకు నలవడినవారు. ఒకపూట నన్నము లేనంత మాత్రమున శోషిల్లరు. సాధారణముగా నేయటుకులోఁ దిని కడుపు నిండించికొని పయనములు సలుపఁగలరు. హిందూదేశము నందు నానాభాగములందుఁ దిరిగి వర్తకము సేయుటకుఁ బ్రసిద్ధికెక్కిన మారువాడీ వర్తకులు రాజపుత్రస్థానమునుండి బయలుదేఱి, భాగ్యవంతులగు తీర్థవాసుల కమ్ముఁ జూపుటకు సీమమల్లుతానులు, జపానుపట్టుగుడ్డలు, బొంబాయిబట్టలు, చెన్నపట్టణపు చారలగుడ్డలు పూలయద్దకపు గుడ్డలు పెద్ద పెద్ద పెట్టెలతో వారణాసిలో దిగిరి. పొట్టి యాకృతులు, గట్టిశరీరములుం గల చోటానాగపురముజనులు పుణ్యక్షేత్రములకెల్లఁ బుణ్యక్షేత్రమయిన కాశికానగరము వచ్చిరి. బంగాళాదేశమునందలి పల్లియలనుండియు బట్టణములనుండియుఁ బయలుదేఱిన యాఁడువాండ్రు తమ యాజన్మమనోరథమైన కాశికాపుర గోపుర దేవాలయ సందర్శనము నిమిత్తము తహతహ పడుచు, భాగీరథీ పుణ్యజలంబుల బలుమాఱు తనివోవక చూచుచు, బెదరి యిటునటు గనుఁగొనుచు జనుల గుంపులనడుమనుండి యొక్క శ్రేణిగాఁ బోవఁజొచ్చిరి.

శరచ్చంద్రుఁడు గంగ యొడ్డున దిగి యప్పటికి సాయంకాల మయినందున నుపవాసమునుండి నిరాహారిణియై యున్న తన తల్లినిఁ జిన్న యంగడియొద్దకుఁ దీసికొనిపోయి

ఫలాహారము చేయించెను. శరచ్చంద్రుఁడు తల్లిని, తల్లికి సాయముగా నుండుటకు నొక పనికత్తెను వెంటబెట్టుకొని కాశికిఁ బయనమై, వర్ధమానపురమందు బొగబండి నెక్కి, నడుమ మొగలుసరాయి వద్ద దిగి వేఱొక పొగబండి నెక్కి గంగయొడ్డున జేరెను. పూర్వాచార ప్రియులగు హిందువులు పొగబండి ప్రయాణములో నే పదార్థము నైన భుజించుట యనాచారము కావున, శరచ్చంద్రుని తల్లి పయనము చేసిన యెనిమిది జాములు గూడ నుపవసించెను. ఫలహార మైనపిదప నతఁడద్దెనిమిత్తె మేర్పడిన యొక చిన్న యింటికిఁ దల్లిని దీసికొనిపోయి సామాను లొకగదిలోఁ బెట్టించి భోజనము చేయించి పండుకొనుటకుఁ బ్రక్క వేయించెను. తీర్థవాసు లనేకు లాపూటనే రేవుఁదాటి యద్దరినున్న కాశినిఁ జేరుచున్న నారాత్రి యాకసము మబ్బులోఁ గప్పబడియుండుట చేతను, దఱుచుగా మెఱుపులు కన్పడుట చేతను, శరచ్చంద్రుఁడు మరునాఁ డుదయమున, రేవుదాటవచ్చునని రాత్రి యీవలయొడ్డున గడపెను.

రెండుగడియలరాత్రియుండఁగా లేచి ముసలమ్మ కాలకృత్యంబుల దీర్చికొని స్నానమొనర్చి జపముఁ జేసికొని సిద్ధముగ నుండెను. అంతలోఁ గుమారుఁడు మేలుకాంచి తల్లినిఁ దోడ్కొని రేవుదాఁట నదియొడ్డునకుఁ బోయెను. అప్పుడే సూర్యుఁడుదయశైలము నలంకరించి గంగానదిలోఁ బ్రతిబింబితము లగుచున్న యానగరగోపుర దేవాలయ శిఖరసౌధములమీఁద బంగారుమేలిముసుంగుఁ గప్పెనో యన మెల్ల మెల్లఁ దనకాంతిం బ్రసరింపఁజేసె. గంగ కీ దరినుండి చూచితిమా కాశీ నగరమువలె నయనానందకరముగా భక్తిజనకముగా గనంబడుపట్టణము ప్రపంచమున మఱొకటి లేదు. దేవాలయముయొక్క శిఖరము లాకాశమండలమును భేదించికొని పోవుచున్నట్లున్నతములై చూడ నెంతో ముచ్చటగా నుండును. అడుగున నీటిదరినున్న దేవాలయపు మెట్లమీఁద నెక్కువారు, దిగువారునై తీర్థవాసు లెడతెగకయుండురు. విశాలగర్భముగల యమ్మహానదియొక్క పుణ్యజలంబులు గుళ్ళయొక్కయు, గోపురముల యొక్కయు, మేడలయొక్కయు ముందటిభాగములఁ బడిపడి పావనముఁ జేయుచుండును. అనేక దేవస్థానములనుండి గంటలమ్రోఁతలు శంఖనాదములు గంభీరముగ నీదరినున్నవారి కా ప్రభాతసమయమున వినవచ్చెను. ఎఱ్ఱని టెక్కలు, తెల్లని గొడుగులు దూరమున దృగ్గోచరములయ్యెను. అదివఱ కెన్నఁడు నట్టిపట్టణముఁ జూచి యెఱుఁగదు కావున శరచ్చంద్రుని తల్లి కాశికానగర దివ్యసౌందర్యమును జూచినతోడనే హర్షమునకుఁ నద్భుతమునకు బరవశత్వమునకుఁ లోనయ్యెను. సంసార సంబంధములను దెగఁగోసి, బంధువుల విడనాడి, భూలోక స్వర్గమయిన

యమ్మహానగరమున ధర్మకార్యములఁ జేయుచు భక్తితత్పరుఁడై తన జీవితమునందలి చరమావస్థ గడుపం దలంచిన హిందూవితంతువునకు సాధారణముగా నిహలోక వైభవమేదియు సంపాదింపలేని లోకసామాన్య సంతోషము కాశీసందర్శనమువలనఁ దప్పక కలుగును. అమాయకురాలయిన యాయవ్వ నదియొడ్డున నిల్చి దాని మహామహిమం దలంచి యానదిలో స్నానముఁ జేయునట్టిభాగ్యము తన్నుఁజేరకమునున్న కాశీనగరముఁ జూచునట్టి భాగ్యము భగవంతుఁడు మహానుగ్రహము పెంపున నొసఁగఁ గలిగించి జన్మము సఫలముఁ జేసి నందుకుఁ బట్టరాని సంతోషమొంది యానందబాష్పముల విడిచెను.

కాలేజిలో నింగ్లీషుఁ జదువుకొనుచున్న నవనాగరకుఁడయ్యు శరచ్చంద్రుఁడు గూడ నమ్మహానగరవైభవమును మొదటిసారి కనుగొనినప్పుడు మహాద్భుతము నొందెను. ఆర్యుల కళలకు, విద్యలకు, మతములకు మేటిగా గాంచి చెప్పఁబడిన యాపురముం జూడ మూఁడువేల సంవత్సరముల క్రిందటి జనుల ప్రజ్ఞానము వాని తలపుఁ బాఱెను. ముప్పది శతాబ్దముల క్రిందట నుత్తర హిందూస్థానము భారత రామాయణాదులగు నితిహాసములతో బ్రసిద్ధికెక్కిన కౌరవపాండవులయొక్కయు గోశల విదేహులయొక్కయుఁ బరిపాలన క్రిందనున్నప్పుడు కాశీరాజులు పాండిత్యమునకుఁ బ్రతాపమునకుఁ బేరువడి యుండిరి. పురాతనములైన యుపనిషత్తులుఁ గూడ నేఁటికిఁ బ్రసిద్ధులగు కాశీరాజుల చరిత్రములను జ్ఞప్తికిఁ దెచ్చుచున్నవి. మహాత్ముఁడగు గౌతమబుద్ధదేవుఁడు మొట్టమొదట నేవనమునందు నిష్కలుషములగు తన సిద్ధాంతములను జనులకు బోధించెనో యాలేడి తోఁట సారనాథ మనియెడు పేరుతో నీవారణాసియందే యున్నదని బౌద్ధమత గ్రంథములు చెప్పుచున్నవి. ఈనగరము శివుని త్రిశూలాగ్రమందున్న దనియుఁ బ్రళయకాలమందుఁ బన్నెండుగురు సూర్యులు మింటనొకసారి వెలుగుచుఁ బ్రపంచమును భస్మపటలముఁ జేయునాఁడును బుష్కలావర్తమేఘములు వానను కురియుచున్నప్పుడు కురిసి ప్రపంచమును ముంచునాఁడును, వారణాశికి నెవ్వియు భయము లేదని పురాణములు పలుకుచున్నవి. ఆఱువందల యేండ్ల మహమ్మదీయ పరిపాలనము నీ శాంతపురము నప్పుడప్పుడు తుడిపెట్టి యుండవచ్చును. కొన్ని దేవాలయములను పడఁగొట్టి యుండవచ్చును కాని దుర్భేద్యమైన యార్యుల మతవిశ్వాసము పరమతసహనము లేని యౌరంగజేబు మహమ్మదీయ చక్రవర్తుల చేతులలో లేదు. అందుచేతనే యెన్ని సారులు కొల్లపెట్టఁబడినను, ఎన్ని దేవాలయములు నేలం గూల్పఁబడినను నీనగరము మూఁడువేల సంవత్సరముల క్రిందట

నెల్లుండెనో, నేఁడును నట్లులే చెక్కుచెదరక యార్యులకు వందనీయమై, దర్శనీయమై స్మరణీయమై యొప్పుచున్నది. హిందూ దేశమందలి మహారాజులు రాణులు దమజన్మములు చరితార్థములు చేసికొనుటకు దానమున నొండొరుల మించునట్లు యీపుణ్యనగరంబున సత్రములు, చావళ్ళు, గుళ్ళు, గోపురములుఁ గట్టించి నిరతాన్నదానంబులు నిత్యోత్సవంబులు జరుగునట్లు మాన్యముల, నగ్రహారంబుల ధారాదత్తముఁ జేసిరి. నేపాళ భూపాలురు, దక్షిణదేశపుఁ బ్రభువులు, హోల్కారుభార్యయగు నహల్యాబాయియు, శిఖుల దొరయగు రంజితసింగును, గాశీనగరంబునకుఁ బ్రస్తుతసౌందర్యము గల్గించిన మాన్యులు. ప్రపంచమునం దనేకరాష్ట్రములు పుట్టిపోయినవి. అనేకమతములు తలయెత్తి నశించినవి. కాని హిందూరాష్ట్రము, హిందూమతము మాత్రము నశింపలేదు. అందుచేతనే హిందూదేశముయొక్క ప్రాచీనమతము, ప్రాచీనవైభవము జనులహృదయముల నేఁటికిని నాటికొని యున్నది.

శరచ్చంద్రుఁడును, తల్లియు నొక చిన్ననావ నెక్కి గంగదాటి శ్రీవిశ్వేశ్వరాలయమందలి గంట భగవంతుని యుదయకాల సేవలకు రావలసినదని జనులను బిలుచుటకో యన మ్రోఁగుచుండఁగానే స్నానఘట్టములవద్ద దిగిరి. కుమారుఁ డదివరకు జాబులమూలముగా గుదిర్చిన యింటికేఁ దల్లిం దీసికొని పోవం దలఁచెను. కాని యామె కానంద పారవశ్యమున నేమాటయు వినఁబడదయ్యె. కన్నులకు మిఱుమిట్లు గొలుపుచున్న విశ్వేశ్వరాలయ శిఖరము తప్ప మఱియేవస్తువు నామెకుఁ గానబడదయ్యె. ఆకోవెల జూచినతోడనే యా యవ్వ దానికి ముమ్మాఱు ప్రదక్షిణముఁ జేసి సింహద్వారమువద్ద ముమ్మాఱు సాగిలఁబడి లేచి యాలయముఁ బ్రవేశించెను. అపుడామె మనసున ప్రపంచమే లేదు. గర్భాలయములోఁ జిరకాలమునుండి యాశ్రయించియున్న చీఁకటులను బోగొట్టనందులకువిచారించి చిక్కెనో యనునట్లు మూఁడునాలుగు దీపములు కళాకాంతులు లేక వెలుఁగుచుండెను. అర్చకుఁడు వేదమంత్రముల జదువుచుండెను. కంగుకంగుమని పెనుగంటలు మ్రోఁగుచుండెను. నానాజాతుల తీర్థవాసులు కనుపండువుగాఁ జూచుటకు గుంపులుగుంపులుగా విశ్వేశ్వరవిగ్రహముచుట్టుం జేరిరి. ధూపధూమములు గర్భాలయము నావరించి విశ్వేశ్వరు నర్చించువారికన్నులు కనఁబడకుండఁ జేసి మెల్లగ ద్వారమునుండి యావలకు వెడలిపోయి యాకాశమునం గలియుచుండెను. ప్రతిమనుష్యుఁడుఁ దాను దెచ్చిన పుష్పములను సామి యెదుటనున్న పళ్ళెరమునఁ బడవేయఁ జొచ్చెను. అర్చకుఁ డాపువ్వులతో మహేశ్వరుం బూజించి, గంగానదీ పుణ్యజలంబులు తీర్థవాసులపైఁ జల్లి, వారు ప్రార్థనలు మూగించి

మ్రోఁగెడుగంటలు మ్రోఁగుచుండఁగనే వచ్చెడు క్షేత్ర తీర్థవాసులు వచ్చుచుండఁగనే జగదీశ్వరుఁడగు విశ్వేశ్వరునకుఁ గడపటి ప్రణామముఁ జేసి పోవుచుందురు.

శరచ్చంద్రుఁడు డింగ్లీషుకాలేజిలోఁ బట్టపరీక్షకు జదువుచున్న వాఁడగుటచే గుడిలోనికిం బోక యావలనే తల్లికొఱకుఁ గనిపెట్టుకొని యుండెను. పోవకున్నను మహా గంభీరములైన వేదమంత్రములు చెవినిబడుటయు, భక్తిపరవశులగు తీర్థవాసుల సాష్టాంగ దండప్రణామములు కంటఁబడుటయు నతఁడుగూడ మనసుకరఁగ లోలోపల విశ్వేశ్వరుఁ బ్రార్థించె. క్రైస్తవమతబోధకులయొక్కయు నింగ్లీషు నేర్పు నుపాధ్యాయులయొక్కయు బోధనలు హిందూవిద్యార్థుల మనస్సులను బూర్వాచారములనుండియు బ్రాచీనమతము నుండియుఁ ద్రిప్పి వానిమెడ ద్వేషము గల్గించెను కాని, యిటీవల నవీనమైన మతము దేశమున బయలువెడలి యతిపురాతనములైన యుపనిషత్తులలోని ధర్మములే యార్యుల ధర్మములనియు నవియే విశ్వసింపఁదగిన ప్రమాణములనియు హిందూబాలురకు బోధించుచున్నది. వేదాంతశాస్త్రము దనగాఁ నుపనిషత్తులలో గంభీర వాక్యములతోఁ దొలుదొల్తఁ జెప్పఁబడి నదియు నీనాఁటి హిందువులవలనఁ బెంచుటకుఁ బ్రయత్నము సేయు చున్నదియు నగు పరిశుద్ధాస్తికమతమును నిర్మూలించుటకు గ్రీకులు, పారసీకులు క్రైస్తవులు పోరాటంబులు సలిపిరి కాని యవియెల్ల వ్యర్థములయ్యె.

శరచ్చంద్రునితల్లి యన్నపూర్ణాలయమునకుఁ దక్కిన ముఖ్యాలయములకుఁ బోయినపిదపఁ గాని బసజేరుట కిష్టపడదయ్యె. మాతృవిధేయుఁడైన యా కుమారుఁడు తల్లివెంట జనసమూహముల నడుమనుండి సన్నని సందులలోఁబడి యొకగుడినుండి మరియొకగుడికిఁబోయెను. ఆ సందుల కిరువంకల మేడలు, మిద్దెలు క్రిక్కిరిసి యుండెను. వాఁటిమీఁద నానాదేశములనుండి వచ్చిన నానాజాతి స్త్రీపురుషులు పలుపలువిధములగు చిత్రవస్త్రముల ధరించి, పలుభాషలు మాటలాడుచుఁ గ్రిందనడచువారిం జూచుచు నిలిచిరి. దుకాణాదారులు తమతమ కాణములలో బియ్యము,పప్పు, కూరగాయలు మొదలగు నవి గంపలలోఁ బోసి యమ్మజూపిరి. ఆ సన్నసందులనుండి యాఁబోతులు ప్రక్కయరుఁ గులమీఁది యంగళ్ళలో నున్న బియ్యము, ధాన్యము వీలయినపుడు నోరెడు తీసి బొక్కుచు నెవరిజోలికిఁబోక, నెవ్వరిచేత నదవు సేయఁబడక స్వేచ్ఛగాఁ దిరుగుచుండును. ఎఱ్ఱని జరీపట్టుచీరలు కట్టికొని మహారాష్ట్ర స్త్రీలు, కొంగులు వ్రేలాడ విలువకోకలు గట్టిన బంగాళి స్త్రీలు, నేలఁదాఁకునట్లు పావడలఁ గట్టియు యుత్తరహిందూస్థాన స్త్రీలు దారిలోఁ జెట్లక్రిందను, దేవాలయములలోను గనంబడు దేవతావిగ్రహములకు దబ్బులు,

పళ్ళు సమర్పించుచుఁ గలసి మెలసి తిరిగిరి. దేహమునిండ బూడిదఁ బూసికొన్న సన్యాసులు, గోపిచందనము మొగము నిండ మెత్తుకొనిన భక్తులు, తీర్థవాసులగౌరవంబునకును దానంబులకును, పాత్రులైరి. ఈ విధముగ నెడతెగని లేక తీర్థవాసులతో నిండి యున్నను వారణాసియందు నన్ని నగరములందువలె వాణిజ్యము విశేషముగఁ జరుగుచుండును. అంగళ్ళు యూరోపుఖండమందుఁ నాసియాఖండమునందు బండిన సరకులతో నిండియుండును. గొప్పవర్తకుల కొఠీలు హిందూదేశమంతకు హుండీలు వ్రాయుచు నితర వర్తకుల హుండీలు చలామణి చేయుచు నుండును. నూలుగుడ్డలు, పట్టుబట్టలు, వెండి బంగారు నగలు, కట్టాణిముత్యములు, జాతిరత్నములు, జయపురపు నినుపపాత్రలు, కాశీ రాగిసామానులు, మాఱుమూల సందులలో నైతము కొట్లలో నమ్మఁబడి బాటసారులకు వెలకు దొరకును.

దివ్యస్థల సందర్శనము ముగిసి మధ్యాహ్నము తిరిగినపిమ్మటఁ దల్లికొడుకులు మరల నొకసారి స్నానము చేయవలయునని గంగకై పరిగిరి. గంగలోపలనుండి పైవఱకు నన్ని మెట్లున్నియు స్నానార్థమై వచ్చిన యాత్రికావృందముతో నిండి యుండెను. పురోహితులు, పండాలు భాగ్యవంతులగు తైర్థికులవెంటఁ బ్రతిదివ్యస్థలమునకుఁ బోవుదురు. బ్రాహ్మణులు స్నానములు చేసి గంగలో మొలబంటి నీళ్ళలో నిలిచి జందెములు చేతఁబట్టుకొని మంత్రములు చదువుచుండిరి. దశాశ్వమేధ ఘట్టమునందున్న మణికర్ణికా క్షేత్రముయొక్క మెట్లు భాగీరథీ పుణ్యజలములలో మునిఁగి బహుజన్మసంచితమైన పాపమును గడిగివేయదలఁచు తీర్థవాసులయొక్క కాళ్ళ రాపుడుచే నఱిగిపోయెను. జాము ప్రొద్దువేళకు మాతాపుత్రులు బసఁజేరి యేదోయింత వండికొనితినిరి. పాపమా యిల్లాలు భర్తృవియోగమైన తరువాత నంతటి యానందముఁ బొందిన దినమదే తప్ప యొండులేదు. పతి కాలధర్మము నందిన దినము మొదలామె కాశీకానగరమునకుఁ బోయి యచ్చట నుపవాసములు, పుణ్యకార్యములు, దానధర్మములు, దేవతాదర్శనములుఁజేసి జీవనము గడప వలయునని తలంచిన తలంపు నేఁటికి సఫలమయ్యెనని సంతసించెను.

శరచ్చంద్రుఁడు తల్లితోఁ గలసి మూఁడురాత్రులు, మూఁడుపగళ్ళు, కాశీకానగరమున గడపెను. తనయూర నున్నపుడే శరచ్చంద్రుఁడు కాశిలోఁ దన తల్లికొక బసకుదుర్చుమని యొక పండాబ్రాహ్మణునికి వ్రాసి యున్నందున నతఁడు వారువచ్చునప్పటికి నదిగొడ్డున నొకమేడలో రెండవయంతస్థు మీఁద రెండుగదులు కుదుర్చియుంచెను. ఆపండాబ్రాహ్మణుఁడు ప్రతిదినమామె వెంట దివ్యస్థలముల కన్నిటికరిగి, పురోహితుఁ

డయి సహకారిణియై, హితోపదేశకుఁడై మెలంగుచు వచ్చెను. తీర్థవాసులు పుణ్యక్షేత్రములను జేరఁగానే, పండాబ్రాహ్మణులు వారికి బసలు కుదిర్చి సౌఖ్యము లొనగూర్చి వారిచ్చు స్వల్పధనములు గ్రహించి సంతసింతురు. ఈబ్రాహ్మణులు క్షేత్రములకు వచ్చు తీర్థవాసుల పేళ్ళన్నియు వ్రాసికొని వంశపరంపరగాఁ దను పుత్త్రపౌత్రుల కిచ్చిపోవుచుందురు. ఈజాబితాలలో మనపూర్వులెవ్వరు తీర్థయాత్రలు చేసిరో వారి పేర్లుండును. ఇట్టిపండాలు, కాశిలో, ప్రయాగలో, మధురలో, బృందావనములో ననేకు లున్నారు.

ఆపండా శరచ్చంద్రుని తల్లినిమిత్త మొకవంటలక్కనుఁ గుదిర్చెఁగాని యాయవ్వయామె చేతివంట దిన నిష్టపడక స్వహస్తపాకము జేసికొని వితంతువులకు విధింపఁబడిన యేకభుక్తమును జరిపెను. అందుచేత నాపంటకత్తె పనికత్తె యగుటకు మాఱుముసలమ్మకుఁ జెలికత్తెవలె నుండి సాయ ముండుట కుపయోగించెను. ఇట్లు మూఁడు రాత్రులు మూఁడు పగళ్ళు గడచుటయు ముసలమ్మ నాలుగవనాఁ డుదయమున స్నానము జపము ముగిసిన పిదపఁ గొడుకుం బంపివేయవలసి వచ్చినందుకు మిక్కిలి విచారగ్రస్థయై కొడుకుం గలిసి విశ్వేశ్వరాలయమునకుఁ జని దేవతాదర్శనకాలము సమీపించినదని తెలుపుటకు మ్రోఁగుచున్న ఘంటానాదము విని తీర్థవాసులు మందమందలుగా లోనఁ జొరఁబడుచుండఁగా నామె లోని కరుగఁ జాలక కొడుకున కెదురుగానిలిచియుండి ముడతలుపడిన ముదిచెక్కులనుండి కన్నీరుసోనలుగా బ్రవహింపఁ గొండొక సేపూరకుండి విశ్వేశ్వరు నుద్దేశించి యిట్లు వేఁడుకొనియె. "ఓవిశ్వేశ్వరా! సంసారబంధములనుండి విడిపోవుట మిక్కిలి కష్టము. ఈదీనురాలు నీపాదసేవలే యేమఱక సేయునట్లు కటాక్షింపుము. ఈ సేవకురాలి యేకపుత్త్రుఁడు సంసారయాత్రలో గష్టములబారి బడకుండునట్లు దీవింపుము."

అంతట శరచ్చంద్రుఁడు తలవంచి తల్లియెదుట నిలువంబడుటయు నమ్మాతృదేవత కొడుకుతలపైఁ జేయివైచి, నిమిరి, యాశీర్వదించి యిట్లనియె. "నాయనా! వెళ్ళు. మీ నాయనగారు నడచినధర్మమార్గములనే నడువుము. కులగౌరవము పెద్దల పరువుప్రతిష్టలు నిలువం బెట్టుము. పాపము మీయక్క కాలినోరు వాయి యెఱుఁగనిది. దానినేలాగున కనిపెట్టెదవో. నేను నీకు నేనే చెప్పనక్కఱలేదు. దాని భారమే నీది. హేమచంద్రుఁడు, బిందు, సుధ నీతోఁ జిన్నప్పటినుండియు స్నేహము చేసినవారుకదా! వారందఱికి కిష్టుఁడవై యెప్పటివలె నుండుము. వెళ్ళు నాయనా! వెళ్ళు. ఈకాలఁపు చదువులు చదువుకొని, గొప్పవాఁడవై యుద్యోగములు చేసి, బిడ్డలతండ్రివై భగవంతుని పాదములే నమ్ముకొని యుండుము. ఆప్రభువే వన కన్నికష్టముల దాటింపఁగలవాఁడు.

నాయనా! మీయమ్మమాట నీవు తలపెట్టక యామె నీపుణ్యస్థలములో విడిచిపొమ్ము. మనశాస్త్రములలోఁ బెద్దలు విధించిన ధర్మములను, జపతపములను జేసికొని, ఈగంగామృతమే ప్రతిదినము ద్రావి కాలక్షేపముచేసి మీయమ్మ తనయస్థికల నీగంగలో నేకలుపుము. తండ్రీ! నీ వెక్కడనున్నను మీయమ్మ దీవనలు నీవెంటవచ్చి నిన్ను గాపాడును." అని మఱియు నేదియో యనబోయెను. కాని దుఃఖమంతకన్న నామెను బలుకనిచ్చినదికాదు. శరచ్చంద్రుఁడు సహజముగ ధైర్యముగల పడుచువాఁడయ్యుఁ దల్లి కడసారి పలుకులతోఁ బ్రత్యుత్తర మీయలేక యామెయడుగులపైఁ బడి వెక్కివెక్కి యేడువసాగెను. అంతలో విశ్వేశ్వరాలయములోని గంటలు ఖంగుఖంగని మ్రోయఁ జొచ్చెను. వేదమంత్రనాదములతో గుడి ప్రతిధ్వనులిచ్చెను. అవి వినఁగానే తల్లికొడుకుల హృదయములు దుఃఖమును విడిచి భక్తిపరవశములయ్యెను. తల్లి కన్నీరుఁ దుడుచుకొని "బిడ్డా! నన్ను విడువుము. అవల స్వామిసేవాకాల మయినది. నేను గుడిలోనికిఁ బోవలయును. ధర్మమూ నెఱవేర్చవలసినప్పుడు పిఱికితనము విడిచి ధైర్యముఁబూనుము. దయగలవాఁడవై పదిమందిచే మంచివాఁ డనిపించుకొమ్ము. మీపూర్వులపద్ధతులే యనుసరింపుము పెద్దలయాచారములే నడుపు" మని పల్కెను. అప్పుడు మాతృభక్తి యావేశింప శరచ్చంద్రుఁ డామె కిట్లనియె. "అమ్మా! నీకోరిక ప్రకార మెల్లప్పుడు నడచుకొనియెదను. నీయిచ్ఛకు విరుద్ధముగా సంచరించునప్పుడు నేను బ్రతుకక పోవుదును గాక!" అని పలికి మఱలఁ దల్లియడుగులకు మ్రొక్కి యామె పాదములు కన్నులనద్దుకొని యామె సెలవుఁగైకొని తన నిమిత్తము కని పెట్టుకొనియున్న నావనెక్కెను. పడవవాండ్రు వెంటనే యానావదరి ద్రోసిరి. అది క్షణములో నావలియొడ్డు జేరెను.

మఱల దేవాలయఘంటానాదము, వైదికమంత్రధ్వనియు బయలుదేఱెను కాని యవి యాపుత్త్రవత్సలకు శ్రవణగోచరములు గావయ్యె! సంసార బంధమునఁ జిక్కి యాయిల్లాలు భగవంతుని సేవకైతము మఱచిన దీయొక్కసారియే ఆమె ధ్యానమంతయు నామె భూలోక సౌఖ్యాధారమై, కనులచందమామయైన యాపుత్త్రరత్నము మీఁదనే యుండెను. కన్నీటిచే మాంద్యముఁ జెందిన యామెదృష్టి కొడుకెక్కిన యా చిన్ననావ కంటి కగపడినంతవఱకు దానిమీఁదనే నిలిచెను. అనంతరము గంటలు మ్రోఁగుట మానెను. వేదపనసోచ్చారణములు ముగిసెను. ఉదయ ప్రభాకరుఁడు గోపురములమీఁద దేవాలయముమీద దన కాంతి పర్వజేసెను. ఆయవ్వ యాలయముఁజొచ్చునప్పటి కామెమనసు మనసులో లేకపోయెను. అయినను జాలసేపామె విశ్వేశ్వరస్వామిం బ్రార్థించి పుత్త్రవియోగమునఁ బరువెక్కిన హృదయములో మెల్లఁగ బసకుఁ జనియెను.

# సుధాశరచ్చంద్రము

## రెండవ భాగము

### ఎనిమిదవ ప్రకరణము

#### పట్టణము.

బిం—సుధా ! నీ వీలాగున నొకసారి వచ్చెదవా ?

సుధ—అక్కయ్యా ! పిలచుచున్నావా ?

బిం—అవును. ఆ చీర నుదికినాను. అది యింటిమీదఁ నారవేయుము. నూతి దగ్గఱ నీళ్ళు పోసికొని నిప్పంటించెదను. పాలది వచ్చువేళయైనది. అబ్బా ! ఈనూతిదగ్గఱ స్నానముచేయుట నాకెంతో కష్టముగా నున్నది. మనయూరి చెఱువెంత మంచిదే ! హాయిగ నీళ్ళలోదిగి స్నానముఁ జేయవచ్చును.

సుధ—(చిఱునవ్వునవ్వి) కలకత్తాలో నేదిచూచినను నీకుఁగిట్టదు. నాకిక్కడ స్వర్గములో నున్నట్లున్నది. ఇది యెంతమంచి పట్టణమే ! ఆహాహా ! ఆ బజారులు, ఆ దుకాణములు, ఆ పెద్దపెద్ద మేడలు, అంతములేని వీథులు, వేలకొలఁది మనుష్యుల గుంపులు, ఆ గుఱ్ఱపుబండ్లుచూచి యెవరు సంతోషింపరు ? మన తాళ్ళచెఱువులో నిట్టివేమైన నున్నవా ?

బిం—బజారులకు దుకాణముల కేమిలే. పల్లెటూరైనను మనయూరు మన తాటాకుల యిల్లు స్వర్గము కాదఁటే ! అక్కడ హాయిగనిట్టటు దిరుగవచ్చును. మంచి గాలి, వెలుతురు. దొడ్డిలో కావలసినన్ని పాదులు కూరలు గదా ? తోఁటలో

మామిడిచెట్లు. ఈకలకత్తా యింటిలో నవి యెక్కడున్నవే? గుఱ్ఱములు బండ్లు భాగ్యవంతులకుఁ గాని మనకెందుకు? మనకీ పెద్దయిటుక యిండ్లెందుకే. సరిగా వెలుతురైన లేదు. శుభ్రమైన గాలిరాదు. చుట్టాలనెవరినైనం జూడవలయునంటే పల్లకీ లెక్కి తలుపులు మూసికొని వెళ్ళవలెను. మనమిక్కడ పంజరములోఁ జిలుకలవలె నున్నాము.

సుధ—అక్కయ్యా! మనము పయికి వెళ్ళునప్పుడెన్ని చిత్రములు చూచుచున్నామో యాలోచించు. మొన్న బావ మనలను బండియెక్కించి మ్యూజియమునకుఁ దీసికొని పోయినాఁడా! ఆహా! యెన్ని చిత్రవస్తువులు చూచినామే యక్కడ. అక్కడ నుండి ఆవేవో తోఁటలలోనికి వెళ్ళినామా! అక్కడ చిత్రమైన పక్షులు, జంతువులు మనము చూడ లేదూ? ఇల్లు కదిలినామంటే అన్నీ చిత్రములే.

బిం—నాకెల్లప్పుడు బండ్లమీఁద తిరుగుట యిష్టములేదు. మనయూరిలో బండి యెక్కవలసిన యవసరమే లేదు. ప్రతిదినము హాయిగనడిచి చెఱువునకు వెళ్ళి స్నానము చేయఁగలముగదా. అక్కడందఱిని మనమెఱుఁగుదుము. మనల నందఱెఱుఁగుదురు. అందఱు మనలం జూడవత్తురు. మన మందఱను జూడఁబోదుము. అక్కడ మనకేగోషా లేదు. పట్టణమన్న పేరేగాని యీమహారణ్యములో నొకరి నొకరెఱిఁగినట్లు కనఁబడదు.

సుధ—అక్కయ్యా! కొంతకాలముంటే యిక్కడ మనుష్యులు పరిచయ మగుదురు. మొన్నను దేవీప్రసన్నుఁడు గారి నౌకరువచ్చి వారియాఁడవాండ్రను జూచుటకు రమ్మని పిలువలేదూ! చంద్రనాథుఁడు నిన్నను కొన్నిపండ్లు మిఠాయిలుఁ బంపినాఁడు కదా!

బిం—సరే కొన్నాళ్ళుంటే ఎవరోకొందఱు పరిచయులు కాకపోదురా యేమిటి? వాళ్ళు భాగ్యవంతులు; మనము పేదవాళ్ళము. వాళ్ళకు మనకు మన సెట్లు కలియఁగలదు? వారు మనతో గౌరవముగా మాట్లాడుటయే మనకుగొప్ప.

సుధ—ప్రతిరోజుదయమున శరచ్చంద్రుఁడు మనయింటికివచ్చి అందరి మనుష్యులను గురించి యన్నిసంగతులం గురించి చిత్రచిత్రముగఁ జెప్పుచుండును గదా! అతఁడు పుస్తకములం జదివి యర్థము జెప్పినపుడు నాకూరకే వినవలయునని యుండును.

బిం—శరచ్చంద్రు నంతమంచివానిని మనము సాధారణముగఁ జూడము. అతఁడు పగలెల్ల పరీక్షకుఁ జదువుకొని పాపము సాయంకాలము తప్పక మనలం జూడవచ్చును.

బిం—సుధా చూడమ్మా ! మీడాబుల కలకత్తా పెరుగుచూడు. ఇది నాలుగు డబ్బుల పెరుగట. కొంచెము నీళ్ళు కలిపిపోసుకో. లేకపోతే నీకైన సరిపోదు. ఎవరు వారు? దాసీదా యేమిటి?

దాసి—(ఎదుటికివచ్చి) అవునమ్మా నేనే.

బిం—ఓసీ ! ఈరోజున బజారుకు కొంచెము పెందలకడ వెళ్ళు. ఈవేళ మావారు పదిగంటలకే యెక్కడకో వెళ్ళవలెనట. త్వరగా వంట గావలెనట ఏ చేపలు తీసికొని రాగలవు ? మంచి కోయి చేప తేగలవా !

దాసి—లేలేకమ్మా ! అయి పిరం. మంచి కోయిచాప రెండు మూడు నాలుగుడబ్బు లుంటది.

బిం—ఏమిటి ? అయితే కలకత్తామనుష్యులు తిండి తినకుండ ఊరికే బండ్లో తిరుగు చుందురా యేమిటి ?

దాసి—తినకేమండమ్మా; కరుచు చేసుకుంటారు. తింటారు. మేము నాలుగు డబ్బుల చాపలు తెచ్చుకుంటామండి. అదే సందాలా పొద్దున్న గడుపు కుంటాము.

బిం—అయితే మాగరుచేపధర యెంత ?

దాసి—మాగరూ సెత్తకమ్మా ! అదొక్కొక్కటి నాలుగు డబ్బులో అయిదు డబ్బులో ఆరు డబ్బులో. బజారు మండి పోతుందమ్మా. కానలేము. మేము పల్లెటూ లోళ్ళమే, అక్కడున్నప్పుడు సంతలో చాపలు కొనుక్కునోళ్ళం. అదరికే కలకత్తాలో రమ్మంటే వత్తాయా? రొండుపూటలూ పట్టుడన్నం యేల్నొ రెడతారు గనుక మీపాదా ల్నీడని బతుకుతూవున్నాం గాని లేకపోతే చణముండ గల్నాండి.

బిం—సరే వెళ్ళువెళ్ళు. మట్టగిడసకాని బొమ్మిడాయికాని నీకు తోచినది మరేదో మంచిది తీసుకురా ! ఒకడబ్బు రొయ్యలు తీసుకురా ! వాటిలో పులును కాచ వలెను. ఒకడబ్బుతో టకూరకూడ తీసుకురా. మాయూరిలో నున్నప్పుడు మా దొడ్డిలోc గావలసినంత బచ్చలికూర, ఎంతమందికొ పెట్టి మేము తినేవాళ్ళము. బంగాళాదుంప లిక్కడ చాల ప్రియము. అవి చాలా తీసికొనిరాకు; వాటిబదులు కందో, పెండలమో, చామో, చిలగడదుంపలో తీసికొనిరా ! కొంచె మరcటిదూట అరcటిపువ్వు తీసికొనిరా !

తేమి పాపమువచ్చినదే, అమ్మా! అరఁటిదూఁట అరటిపువ్వు డబ్బుపెట్టి కొనవలసి వచ్చినది. మాయూరిలో నరఁటిచెట్లడవిలాగున పెరుఁగు చుండును.

అని బిందు పాలదానివద్దనుండి పాలుఁ బెరుఁగు తీసుకొని డబ్బులిచ్చి దాసిని బజారునకంపి పాలుఁ గాచి మేడమీదికి దీసికొనిపోయెను. అప్పటి కామె బిడ్డలిద్దఱు లేచిరి. ఆ బిడ్డలకన్నముపెట్టి పాలుత్రాగనిచ్చి పక్కలెత్తి యా మొగది యూడ్చుకొనెను. అంతలో దాసి బజారునుండి కూరలు తెచ్చినందున బిడ్డల నాడించుమని దానికప్పగించి తాను వంటయిల్లు ప్రవేశించెను. సుధ సామానులందిచ్చి యక్కగారికి సహాయురాలై పైపని చేయుచుండెను. అందుచేత నామె బియ్యము కడిగి యిచ్చి కూరలు తరిగి నూనె యుప్పు మిరపకాయ తాలింపు మసాలాలు చుఱుకుగా నందిచ్చెను. బిందు వంటఁజేసెను.

పైసంభాషణలంబట్టి హేమచంద్రుఁడు సుధా బిందులందోడ్కొని కలకత్తా నగరమునకు వచ్చినట్లు చదువరులకుం దెలియునుగదా! అతఁడట్లువచ్చి కొన్ని దినములు శరచ్చంద్రుని యింటనుండి తరువాత రెండంతస్తుల మేడ నద్దెకుపుచ్చుకొని యందులో ప్రవేశించెను. వారిని తనయింటఁ గాఁపురముచేసి సొమ్ము పాడుచేసికొనక తనతోఁగలిసి యుండుఁడని శరచ్చంద్రుఁడు ప్రతిమాలెను. తమయునికి యాతని చదువునకు భంగము కలుఁగఁజేయునని తలంచి వారక్కడ నుండరైరి. అందుచేత శరచ్చంద్రుఁడే వారి నిమిత్తము భవానీపురములో నెలకుఁ బదిరూపాయలయద్దె కొకయిల్లు కుదిర్చెను.

ఆ చుట్టుప్రక్కల మనుష్యుల ననేకుల శరచ్చంద్రుఁ డెఱుఁగును. అందుచేత హేమచంద్రుఁడుఁగూడ వారికి బరిచితుఁడయ్యెను. అందులోఁ గొందఱు కలకత్తా హైకోర్టులో ప్లీడర్లు; కొందఱు గవర్నమెంటు కచ్చేరీలలోను తెల్లవారి వర్తకసంఘముల లోను గుమస్తాలు, కొందఱుద్యోగములు లేక సొంతయాస్తిమీఁద జీవించువారు. కొందఱు చీనాబజారులోను బారాబజారులోను దుకాణములు పెట్టికొన్నవారు. వీరుగాక యనేకులు తగిన జీవనాధారములేక యెప్పటికప్పుడే పట్టి యాకలిగొలుపు నా మహాపట్టణమున కష్టపడి పొట్టగడుపుకొనుచుండిరి. భవానీపురములోనున్న భాగ్యవంతులు పల్లెటూరినుండివచ్చి నూతనపరిచయ గౌరవమును గల హేమచంద్రుని మిక్కిలి యాదరించి తమ దివ్యభవనముల కప్పుడప్పుడతని బిలుచుచు హృదయపూర్వకమైన మైత్రితో, దయతో, నాతనిఁ బలుకరించుచు వచ్చిరి. అప్పుడప్పుడాయనను కొందఱు విందులకుఁ బిలుచుచు వచ్చిరి. ఈ విధముగఁ బరిచయము క్రమముగ నభివృద్ధి పొందుటకు

వతని కక్కడకొంతలు మిత్రులేర్పడిరి. హేమచంద్రుఁడు తనభార్యవలెనే తన పల్లెటూరు సౌఖ్యము, స్వేచ్ఛ, యిక్కడలేదని విచారపడుచుండును. కలకత్తాలోనున్న సందడి గొడవ వానికి గిట్టక పోవుటఁ దనయూరిస్నేహితులతోఁ గలిసియుండుటకు తనయూరి గొడవలు వినుటకుఁ గుతూహలము పడజొచ్చెను. క్రొత్త మిత్రులు తనయెడఁ జూపిన దయ కతఁడు సంతసించెను. కాని మేడలపట్టణమని చెప్పఁదగిన కలకత్తాలో గొప్పవారికి భాగ్యవంతులకు సాధ్యమయినంతవఱ కతఁడు దూరముగానే యుండెను హిందూదేశపు రాజధానియైన యానగరమున నున్న గొప్పవారు దొరతనమువారివలన గౌరవములు, బిరుదులు, మెప్పులు బడయఁ దలఁచి పడెడుపాటులను హేమచంద్రుఁ డొకయూళ కాఁపుర ముండియు సూక్ష్మబుద్ధి యగుటచేఁ గనిపెట్టి యాశ్చర్య మొందుచు వచ్చెను. ఎక్కడఁ జూచినను గొప్పవారికి విందులు, వన సంతర్పణలు, నాట్యములు, సభలు, ఎక్కడ చూచిన గొప్పకార్యముల నిమిత్తము చందాలు, ఎక్కడచూచిన నున్నత పురుషుల స్తోత్రపాఠములు, జనుల కెడతెగని వినోదములు మహోత్సాహముఁ బుట్టించు వ్యాపారములు గదా! ఈ ప్రయత్నములఁ జేయుచేయు, నోపికగల వేఁటకాని గురితప్పక యేటుతగిలి పడెడు జింకవలెనే, మనోరథములైన బిరుదులు మెప్పులు చిట్టచివర కపేక్షించినవారికి వచ్చుచుండును. హేమచంద్రుని కట్టియాశలు లేమి యట్టిపోకలంబోక యీ బిరుదుల వేఁటకాండ్ర చమత్కృతములు మాత్రము కనిపెట్టి యక్కజపడుచు వచ్చెను. అతనికి విశేష లోకానుభవమే యున్నపక్షమున నీ యుత్సాహము కలకత్తా నగరమందేగాక ప్రపంచమునం ప్రతిస్థలమునందుండు ననియు, జ్ఞానవంతులుఁ బ్రశాంతులు పరోపకారార్థము తనవలెనే జీవింపఁ దలఁచువారు పందెపు పరుగులవంటి యీ యాశల పొంతం బోవరనియుఁ దెలిసికొని యుండును.

ఎప్పటివలెనే జూనునెలలో వర్షములుకురియ నారంభించెను. ప్రపంచమునందలి యితరదేశము లందువలెనే హిందూదేశమునందుగూడ గాలిమార్పులు విలక్షణముగ గన్పట్టుచుండును. శీతకాలమందు, అనఁగా నవంబరునెల మొదలు ఫిబ్రవరినెల వఱకు నాకాశము నీలమై మంచుకురిసెడు చలిగాలితో నిండియుండును. ఆకాలమున గోధుమలు మొదలగు ధాన్యములు పండును. పండుగలు వ్రతములు నోములు తీర్థయాత్రలుఁ జేసికొనుచు జనులిత్తరి మహానందభరితులై యుందురు. సాధారణముగా మార్చినెలలో వేసవికాల మారంభమగును. పశ్చిమోత్తర గ్రామములందు వీఁచు వేఁడిగాల్పులు భూములార్చివేయును. నానాఁటికి సూర్యుడు మంటలం గ్రక్కునట్లు తీక్ష్ణుఁడై గ్రామంబులఁ బట్టణంబులఁ దపాతపా నొందఁజేయును. పడమటిభాగముల నెన్న యెడారులనుండి వేఁడి

గాడ్పులు వీఁచి శరీరంబుల శోషింపఁజేసి జంతువులను వడపీనుఁగులను జేయును. కూలివాండ్రలసి పోదురు. దుకాణదారులు కునికిపాట్లు పడుచుందురు. పంటకాఁపులు వెచ్చనూర్చుచుందురు. సూర్యుఁడు సహస్ర కిరణములతో దేశములు దగ్ధము సేయునట్లుండు కాలమున జంతుజాలమెల్ల చైతన్యము దక్కినట్లుండును. బంగాళాదేశమందు వేడిమిక్కుటే కాని తేమ యెక్కువగ నుండుటచే నా వేఁడిమి మిక్కిలి బాధకరముగ నుండును. జూను నెలలో వానలు కురియఁగానే దేశము చల్లఁబడును. ఈ వర్షములు సమారమి నాలుగు నెలలవఱకు నసఁగా కార్తిక మాసమువఱకు గుంభవృష్టిగ కురియును. ఈ వర్షములచేత బంగాళాదేశమందు వేలకొలఁది మైళ్ళ నేల జలప్రళయమువం దున్నట్లుండును. పల్లెలు సముద్రమధ్యమందలి దీవులవలె కానబడుచుండును. చెఱువులు మడుగులు సరస్సులు జలపూరితము లగును. నదులు గట్లమీఁదనుండి పొరలి ప్రవహించును. ప్రతి గ్రామమునందు నీడ నొసంగెడి చెట్లతోఁపులు దట్టముగనుండును. వరిచేలు విశాలములగు మైదానములమీఁద మొదట నాకుపచ్చగాను, పండిన పిదప బంగారు పోతబోసినట్లు పచ్చగాను దర్శనీయములై పంటకాఁపుల నానందవార్ధి నోలలాడించును. వానలు పట్టణవాసులకు విశేషసౌఖ్యకరములు కవు. కావున మేఘచ్ఛన్నమై నల్లనైన యాకాశమువలెనే హేమచంద్రుని హృదయము విషాదపూరితమై యుండెను. కొలఁది భయపడినట్లే యా రాజధానిలోఁ దగిన యుద్యోగము సంపాదించుకొన వలయునని యతఁడు చేసిన ప్రయత్నములు నిష్ఫలములయ్యెను. జీవనాధారములు దొరకక గిజగిజ తన్నుకొనుచు సర్వప్రయత్నములం జేయుచు నొండొరలం గెంటికొనుచు నానా శ్రమలంబడుచుండు జనులమధ్య తన మొగము జూచువారు తనకుఁ దోడ్పడువారు దొరకరని యతఁడు నిరాశఁ జెందెను.

అతఁడు పట్టణమునఁ జూడవలసినవారిం జూచి చేయఁదగు ప్రయత్నము చేసి గృహమునకు వచ్చునప్పటికిఁ బరమపతివ్రతయు సాధుశీలయు నగు బిందు భర్తనిమిత్త మేదో మంచివస్తువుచేసి యుంచును. కొఱుకు ముక్కలు పచ్చకాయబద్దలు ఊరవేసిన యుసిరికాయలు నిమ్మపండ్లరసముఁ జక్కెరయు కలిపిన చల్లని నీరు సిద్ధముచేసి బిందు మగనికి వేసవికాలశ్రమ దీర్చుచుండును. అవి త్రాగి సేదదేఱి హేమచంద్రుఁడు మనో విషాదమునెల్లఁ దొలఁగించుకొని బిందు సంభాషణలను విని సకలవ్యథలను భాగములను మఱచిపోవును. సాయంకాలమైనకొఁడనే బిందు తన యిద్దఱిబిడ్డలం దీసికొని డాబా మీఁదికి బోయి భర్త సహాయమునఁ గూర్చుండి తను ముద్దుమాటలం దలపెట్టి ప్రశాంతమైన యా గ్రామమునకును మనుష్యులగుంపుల నెడు మహాతరంగములతో నిండియున్న

యీ పట్టణ మహాసముద్రమునకునుగల భేదముఁ జెప్పుచు నాతని వినోదపెట్టుచుండును. ఆమె తన యూరనున్నప్పటికంటెఁ గొంచెము చిక్కెను. కలకత్తాలో నెల్లప్పుడు గాలి లేని గదులలో నివసించుటచేత మొగము వివర్ణమై వికాసశూన్య మయ్యెను.

పరమమిత్రుఁడగు శరచ్చంద్రుఁడు మాత్రము ప్రతిసాయంకాలము వారిం దప్పక చూడవచ్చును. అతఁడు రాఁగానే బిందు వంటయిల్లు విడిచి యాముదపు దీపము వెలిగించి చాపపఱచి యొకకడఁ గూర్చుండును. శరచ్చంద్రుఁడు హేమచంద్రుఁడు సుధాబిందులం గలసి యిష్టగోష్ఠితో సాయంకాలము సుఖముగా గడుపుచుండును. శరచ్చంద్రుఁడు వాకచక్య మధికముగఁ గలవాఁడు కాలేజీలో నేర్పబడి విద్యార్థుల మనస్సుల మీఁద ముద్రితములైనట్లు నాటుకొను ప్రకృతిశాస్త్రములు దేశచరిత్రములు మొదలగు వాఙ్మయ విద్యలం గూర్చి యతఁడు విసుఁగు విరామము లేక వారితోఁ జెప్పుచుండును. అప్పుడప్పుడు కలకత్తా నగరముయొక్క సంపదలు దారిద్ర్యములు మహాసౌఖ్యములు దుఃఖములు వర్ణించి చమత్కారముగ నుపన్యసించుచుండును అందు ముఖ్యముగ దన దేశస్థులైన మహనీయులు లోకోపకారార్థమై పడెడుపాటులం గూర్చి యుపన్యసించునపు డతఁడు కంఠమెత్తి తీవ్రమైన పలుకులం బలుకుచుండును. ఆ లోకోపకారులలో ముఖ్యముగ నేమహనీయుఁడు సంఘసంస్కరణమునకు బంగాళాభాషాభివృద్ధికిఁ దనజీవితము ధారవోసెనో యావిద్యాసాగరుఁ, తన్మిత్రమే శరీరసౌఖ్యము గోలుపోయి ప్రాణమర్పించిన యక్షయకుమారునిఁ బలుమాఱులు ప్రశంసించుచుండును. బంగాళాదేశమందు శ్రీ రాజారామమోహనరాయలువలెనే యుత్తరహిందూస్థానమందు బరిశుద్ధాస్తిక మతముం బోధించిన శ్రీదయానంద సరస్వతింగూడ శ్లాఘించుచుండును. బంగాళాభాషలో ననేక చిత్రవచన కావ్యములు వ్రాసిన బంకించంద్ర చటర్జీయు నగ్గలమైన కవిత్వముఁ జెప్పిన మధుసూదనదత్తు విద్యావిషయమున జనులకు గ్రొత్తత్రోవలు తెలిపిన మెచ్చుచుండును. మఱియుఁ బ్రపంచమునందలి యితర భాగములలో బ్రిటిషు వారి పాలనక్రింద నున్న జనుల కేస్వాతంత్ర్యములు గలవో యవియే మనదేశస్థులకుఁ గూడ సంపాదింపఁ జాల బ్రయత్నించిన రామగోపాలుఁడు హరిశ్చంద్ర ముఖర్జీ సుస్తవనీయు లని భాషించుచుండును. శరచ్చంద్రుఁడు వెనుకటి మహనీయుల ప్రశంసతో దనివినొందక పూర్వులమార్గము నే యనుసరించి దొరతనమువారి కొలువుకూటములలో హిందూదేశస్థుల యభిప్రాయములు గూడ నెఱిఁగించి స్వాతంత్ర్యముల సంపాదింపఁ దలంచుచున్న నాటి సత్పురుషులం గూర్చియు నెడనెడఁ జెప్పుచుండును. అప్పటిగవర్నరు జనరలుగారైన

రైపను ప్రభువుగారు దేశపరిపాలనమందు హిందువుల యాలోచనమును సహాయమును స్వీకరించినందు కాయనను బహువిధముల బహుమాఱు కొనియాడుచుండును. శరచ్చంద్రుని యుపన్యాసములను హేమాంగుడు తమ్ముని మాటల కలరు సన్నవలెనే విని సంతసిల్లుచుండును. చిన్నప్పుడు తాళ్ళచెఱువు గ్రామమున మామిడికాయలు జామపండ్లు దొంగిలించిన కుఱ్ఱడగు శరచ్చంద్రుఁడు కలకత్తాలో బహువిద్యల నేర్చి యింతవాఁడైనాఁడని పక్షపాతము గదుర, తోబుట్టువట్టు వాతని ప్రజ్ఞకు మెచ్చి ఓందు సంతసించుచుండును. మళమళలాడుచున్న చిన్న దీపము గల యాగదిలో శరచ్చంద్రుని యుపన్యాసములను బిందు హేమచంద్రుడే గాక మఱియొకర్తుగూడ వినుచుండును. విశాసవంతమైన శరచ్చంద్రుని మొగము కనఁబడిన తోడనే సుధ నిద్రాహారములు మఱచి యొకమూల కూర్చుండి యాతని పలుకులే వినుచు నాతనివంకనే చూచుచుండును. దేశసేవలఁజేసెడు లోకోపకారులను మెచ్చుకొనుచు వారివలెనే తన జీవితముంగూడఁ బరోపకారార్థము గడుప దలంచినట్లు పలికెను శరచ్చంద్రుని మృదుమధుర సంభాషణలను సుధ విని సంగీతము విన్నంత హాయిఁజెంది పరవశ యగుచుండును.

శరచ్చంద్రుఁడు మేఁటేరి తన యుపన్యాసముల సందడి బడి యొకప్పుడు చమురంతయుఁ గాలి దీప మాఱిపోవువఱకు రమారమి రెండుజాములరాత్రి వఱకు వారి కడనుండి విధిలేక వారివద్ద సెలవుపుచ్చుకొని యెన్నో క్షమార్పణలు చెప్పి బయలుదేఱి నక్షత్రకాంతులు మాత్రమే గల యా నిశీథసమయమున నిశ్శబ్దములగు పురవీథులంబడి తనయింటికిం బోవుచుండును. అప్పుడు హేమచంద్రులు చాలసేపగుటచేతఁ జల్లబడి బిరుసెక్కిన యన్నముఁ దిని పండుకొందురు. సుధ మద్యమువలె పారవశ్యము నొందించు మహానందములో నిద్రించును. నిద్రాసమయములోఁ గూడ నిశ్శబ్దమైన తక్కిన రెండు జాములలో నామె చెవులలో మనోహరుఁడైన యొకానొక పురుషుని శ్రావ్య కంఠధ్వని యమృతబిందువులవలె పడుచుండును.

---

## తొమ్మిదవ ప్రకరణము

కాలము గడచిన కొలఁది శరచ్చంద్రునకు నూతనచైతన్యము గలిగినట్లుండెను. విద్యాభ్యాసము నిమిత్తము పల్లెటూళ్ళనుండి పోయి కలకత్తా మొదలగు పట్టణములలో

కానబడుచుండును. పుస్తకములమీద ధ్యానము లేనప్పుడామెమీదఁ ధ్యానము నిలుపుచు వచ్చెను. మనోహరములుగ నుండిన ప్రాచీన దేశచరిత్రముల, వంతకంటె రుచిలేని యీకాలతత్త్వశాస్త్రములను జదువ నతఁడు ప్రయత్నించునపుడు మనసు వాటిమీఁద కరుగదయ్యెను. పులకాంకురములు మేనంతయుఁ బొడమఁజొచ్చె. కాలేజి యావరణములో నతఁడొంటిగఁ దిరుగునప్పుడు చెవిలో మృదువైనస్వరము లాతనికి వినఁబడఁ జొచ్చెను. తన మనోరథంబులకుఁ దన యనురాగంబులకు నిలయమైన యాగృహమునకు బ్రతిసాయంకాల మతఁడు పోవుచుండ వాగింజూడవలయునను కోరిక గాక యంతకంటె నెక్కువదేదో యాతనిని ముందుకు గెంటజొచ్చెను. స్వసౌఖ్యప్రదమగు రహస్యాభిలాషను దీర్చుకొనవలయునని మనమేదో పనిఁజేయునప్పుడు నయితము దానిని మఱచి పోయి, పరోపకారము నిమిత్తమే పాటుబడుచున్నట్లు మన మప్పుడప్పుడు తలంచుకొను చుందుముగదా! అటులనే ప్రతిదినము సాయంకాలము చదువు గట్టిపెట్టి ప్రియజన దర్శనము చేయఁగలందని శరచ్చంద్రుఁడు హేమనీహారమునకుఁ బోవునపుడెల్ల శ్రీరంగపట్టణములో నెవ్వరి నెఱుఁగక నొంటిగనున్న తన తగూరివారి కుపకారము సేయ బోయినట్లే భావించుకొను చుండును. ఆ గృహంబునుండి యర్ధరాత్రమున నిర్మనుష్యములగు వీధులలో నడిచి యింటికి బసకుఁ బోవునపుడు తనసహాయము నపేక్షించిన చుట్టాల నిమిత్తము తాను చదువైన మానుకొని వెళ్ళినట్లతని మనస్సు సంతుష్టిఁ జెంది సంతోషముఁ జెందుచుండును.

ఒకనాఁడు శరచ్చంద్రుఁడు సాయంకాలమున మిత్రగృహమునకుఁ బోయినప్పుడు హేమచంద్రుఁ డప్పటి కింటికి రాలేదు. బిందు వంటయింట బనిఁజేసికొను చుండెను. సుధ డాబామీఁద శరచ్చంద్రుని సమీపమునఁ గూర్చుండెను. అప్పుడు నల్లని యాకాశ మండలమున నక్షత్రములు వజ్రములవలె మెఱయుచుండెను. మలయమారుతములు చెట్ల కొమ్మలం గదలించుచు [illegible] వారికి చల్లగాలి యెంతో సౌఖ్య ప్రదముగ [illegible] తోటలు [illegible] మెత్తి దాఁగకొనునో [illegible] యా [illegible] సుధ [illegible] యాకసమును [illegible] తో జూచుచుండెను. ఆ త్తరి చంద్రబింబమువలె మెఱయుచున్న సుధ ముఖారవిందముఁజూడ శరచ్చంద్రునకు వలపుకైపులు తలకెక్కెను. అదివఱకు పలుమాఱులు తేజోరాసులగు నక్షత్రముల కాంతిగూర్చి వారిరువురు ముచ్చటించిరి. శరచ్చంద్రు డదివఱ కెన్నోసారులు

గ్రహరాజగు సూర్యునిచుట్టుఁ దిరుగుచు గగనమండలమును తేజోవంతముగ జేయు గ్రహముల నామధేయముల నామెకుజెప్పి మూఁడువేల సంవత్సరముల క్రిందటనే మన పూర్వ జ్యోతిశ్శాస్త్రజ్ఞులీగ్రహసంచారమును మిక్కిలి నేర్పుతోఁ గనిపెట్టిరని బోధించుచు వచ్చెను. మఱియు నక్షత్రము లనంతకోటు లనియు మనకన్నులకుం గనఁబడునవిగాక కానఁబడనివి కోటానుకోటు లున్నవనియు దక్షిణదిక్కునుండి యుత్తరదిక్కునకు వ్యాపించి మనకన్నులకుఁ దెల్లగ నగపడు రేఖనే మన పెద్ద లాకాశగంగయని చెప్పుదు రనియు బలుమాఱు చెప్పి జ్యోతిశ్శాస్త్ర సంబంధములైన మన పూర్వగాథల ననేకముల నెఱిఁగించుచు వచ్చెను. మఱియు సర్వనియామకుఁడగు భగవంతుని శాసనంబునఁ దమతమ కర్తవ్యలలో నించుకేనియుఁ గ్రమము తప్పక సంచారములు చేయు ననంతగ్రహములంగూర్చి యుపన్యసించి యా గ్రహములలో చిత్రవిచిత్రములగు జంతుకోటు లున్నవనియు లేవనియుఁ బండితులు సేయు వాదములఁగూర్చి ప్రసంగించి జ్యోతిశ్శాస్త్రవిషయమునఁ జాల జ్ఞానమును గలిగించెను. ఈ యుపన్యాసమువలన సుధ క్రొత్త ప్రపంచముఁ జూచినట్లు సంతసించెను. నక్షత్రములంగూర్చి క్రొత్తకథ లనేకములు నేర్చికొనెను. ఈ జ్ఞానముఁ గలిగించిన జ్ఞాననిధానమైన బాలకునియందు మునుపటికంటె నెక్కువ ప్రేమము గలిగెను. అట్లు కొంతసేపు చుక్కలవంకఁ జూచి యామె సంతసించి "ఈ రాత్రి నీవు నక్షత్రముల గుఱించి చెప్పవలేదేమి? వాటిగూర్చి నీవు చెప్పుచుండఁగా నాకు వినవలెనని యున్న" దని శాస్త్రి [illegible] బలుకరించెను. శాస్త్రి [illegible] కలగనుచు మేల్కొన్న [illegible] చుక్కల [illegible] మొగమువున్న సుధ నేత్రములవంక జూచి నేనీవు నక్షత్రములఁ గూర్చి యాలోచించుట లేదని పలుకు చెప్పెను. అనవుడు సుధ తన సహజమైన [illegible] "అట్లయిన నీవు దేని గూర్చి యాలోచించుచున్నా" వని యడిగెను "నేనా! ఈ ప్రపంచమును గుఱించి; యందులో నా కుటుంబమునుగుఱించి యాలోచించుచున్నా"నని బదులు చెప్పెను. "కుటుంబమునుగూర్చి నీవాలోచింప వలసిన దేమున్నది; తల్లి, అప్పగారు కావలసినంత మంది బంధువులు నీకున్నారు. మీయూరిలో నీకు మంచి యిల్లున్న" దని సుధ నుడివెను. "మాయూరు నాకు మిక్కిలి ప్రియమైనదే కాని యొందరున్నను నాదింకను సంపూర్ణమైన కుటుంబము కాదు గదా? అప్పలు చెల్లెండ్రు తల్లిదండ్రులు మొదలగు చుట్టములవలనఁ గలిగెడు సౌఖ్యముగాక మనుష్యున కితరసౌఖ్యములు గూడ కలవుగదా" యనెను. అనఁగానే సుధ క్షణమూరకుండి యతఁ డేవిషయమును మాటలాడుచున్నాఁడో యని తెలిసికొనలేక సమాధానములేని మనస్సుతో "నీవన్నది నాకుఁ దెలిసినదిలే, నీవు మంచి

యదృష్టవంతుఁడవు. నీకు మంచి కుటుంబసౌఖ్యమే కలుగును. నీకు త్వరలోనే పెండ్లి యగును. నీ పెండ్లామంత యదృష్టవంతురా లెవ్వతెయు నుండదు. నీ పెండ్లియైన తరువాత మేమందరము మీయింటికి వచ్చి నీ పెండ్లామును జూచుచుందు" మని సుధ మాటలు పలికెను. అప్పుడు సుధ పలికిన పలుకులకుఁ దగిన యుత్తరము తనమనంబున దోపమి శరచ్చంద్రుడు మొగ మవ్వలపక్కకుం ద్రిప్పి తన చేతితో నామెచేయిం బట్టుకొనెను. అప్పటికిని సుధ యాతని మనోభావము గ్రహింపలేక "యేమోయి! నీ చేతులు చల్లగ నున్నవేమి. మాటాడవేమి? నామీఁద కోపము వచ్చినదా యేమి. లేక నాకుఁ జెప్పఁగూడదని దీర్ఘాలోచన యేమైన నున్నదా" యని ప్రశ్నవైచెను. వైచుటయుఁ జిరకాలమునుండి మనంబున నడఁగియుండిన యభిలాష పొంగిపొరల నేదోయొకమాట యనదలచి, "అందునా మామనుమనా" అని యతఁడు కలవరము పడఁజొచ్చెను. ఎట్టకేలకు మాటయు నోటి చివరకు వచ్చెను. కాని యా కాలము స్థలము వానిమెడ శత్రుభావము వహించెను. అంతలో డాబా మెట్లమీఁద నడుగులచప్పుడు వినబడెను.

హేమచంద్రుఁ డింటికిఁ బ్రొద్దుపోయివచ్చి బిందుతోడ్కొని డాబామీఁదికి వచ్చెను. బిందు సుధాశరచ్చంద్రులజూచి మగనితో "చూడండీ! యీకుఱ్ఱవాండ్రు. ఈ నక్షత్రముల గొడవలో బడి యన్నముగూడ మఱచిపోయినా"రని పలికెను. ఆ దంపతులు మెట్లెక్కి వచ్చుచున్న జాడ గనిపెట్టి శరచ్చంద్రుఁడు దొంగవలె సుధాసమీపము విడిచి డాబాచివరకు బోయి యేమియు నెఱుగనివానివలె నక్షత్రములు జూడ నారంభించెను. అతని గుండెలు తటతట గొట్టుకొనెను. అతని కాళ్ళు వణకసాగెను. అప్పుడతఁడు మనసులో "అమ్మయ్యా! దేవునిదయవల్ల నోటిచివరకు వచ్చినమాట జారవిడువలేదు నయమే; భగవదనుగ్రహమువలన పరువు దక్కినది కాని లేకున్న కొంప త్రవ్వుకొని పోవును. నమ్మి చనువిచ్చినవారియింట నేను ద్రోహము దలపకుండ దైవము కాపాడె" నని తలంచి తనకీయాపద గడువంబెట్టినందుకు భగవంతుని నొక్కనిముసము ప్రార్థించి మనస్సు కుదురు పరచుకొని బిందుకడకువచ్చి యామెతో మెల్లగ నిట్లు మాటాడెను.

'బిందు వదినె! ఔను. నీవన్నట్లు నక్షత్రములవంక జూచుచు నింక సపకతవక ప్రసంగముల జేయుచు తిండి మఱచిపోయి కాలము వృథాగా పాడుచేయుచున్నాము. ఇఁకనైన జాగ్రత్తగ నుండవలయును. పరీక్ష దగ్గరకు వచ్చుచున్నది. పరీక్షలో నెగ్గవలెనన్న గట్టిగాఁ గృషిచేయవలెను. మీకిల్లు ప్రస్తుతము సుఖముగ నున్నదిగదా! మీకేమైన సదుపాయములు కావలసివచ్చినప్పుడు మీరు నాతోఁ జెప్పండి. ఇఁక మేము

మునుపటివలె ప్రతి సాయంకాలము, బహుళః వారమున కొకసారియైన వచ్చుటకు వీలుండదు' అనవుడు హేమచంద్రుడిట్లనియె. 'అది మంచిపని. నీకాలము మామూలమున వృథయైపోవుచున్నదని మేము తలంచుచుగా నుంటిని భయపడుచున్నాము. మాకేమి కావలసినను దప్పక నీకు వర్తమాన మంపుదుము. మాకు నీవు చేయదగినపని యేమున్నను నీసహాయము తప్పక పొందుదుము. మేము మరియొకలాగున ననుకొందుమని తలంపకు. మన మన్నదమ్ములవంటి వాళ్ళమే! పరీక్షకు మాత్రము గట్టిగా జదువుము. నీవు ముందు ముందు వృద్ధికాగలవాడవు. నీపనిమాత్రము మానుకొనవద్దు. తనకుమాలినధర్మము కలదా!' అనిన తత్క్షణమే వారు విడిపోయిరి. శరచ్చంద్రుడు సుధవంక మఱియొకమారు చూచి మఱేమియు బలుకక వీధిలోనికిబోయి చీకటి యను మహాసముద్రమునబడి బసకు బోవజొచ్చెను. అతడు మెట్లదిగి వెళ్ళగానే సుధ 'అక్కయ్యా! శరచ్చంద్రునకు మనమీద నెందుకైన కోపము రాలేదుకదా!' యని వ్యాకులచిత్తముతో బలికెను. పలుకుటయు బిందు 'అబ్బే! కోపమెందుకే. అతడు తనపరీక్ష యేమగునోయని బెంగ బెట్టుకొన్నా' డని బదులు చెప్పెను. అనంతర మొకగంట తరువాత హేమచంద్రుడు భోజనముజేసి తన యొప్పటివాడుకచొప్పున వీధిలోనికి షికారుబోయెను; సుధాబిందులు నిద్రపోయిరి. అప్పటికి జంద్రోదయ మయ్యెను. వెన్నెలతో నిండిన వీధులు కలకల నవ్వుచున్నట్లుండెను. హేముడు తనలో దానేదో యాలోచించుకొనుచు సుమారము యొక గంటసేపు తిరిగెను.

కలకత్తాలో నిశ్శబ్దములైన వీథులన్నియు జంద్రోదయమున దీపితములయ్యెను. హేముడు భవానీపురము దాటి, చాలదూరముపోయి బాలిగంజియను పేట బ్రవేశించు నప్పటి కొక గుఱ్ఱపుబండి చప్పుడువలన నతని యాలోచన కంతరాయము గలిగెను. అప్పుడతడు వెనుకకు దిరిగి చూడ ధగధగ మెఱయుచున్న జోడుదీపములు గల తెల్లని జోడుగుఱ్ఱములబండి యొకటి వాని కగపడెను. హేముడు ప్రక్క కొత్తిగిలి నిలువబడెను అబండి యాతని ప్రక్కనుండి వేగముగ బోయి మంచిదీపములచేత నలంకృతంబై తోటనడుమ నున్న యొక గృహమువద్ద నిలిచెను. ఆబండియాగిన క్షణమునకు నల్లగుఱ్ఱములు గల మఱియొకబండి వచ్చి యాదారినే పోయియాతోటనే ప్రవేశించెను. ఆబండి నడుచు చుండగా హేమచంద్రునకు లోపల కూర్చుండిన స్త్రీలనవ్వులు వినబడెను. అది యేమో తెలిసికొనగోరి యాతడాతోటద్వారముకడకు బోవ నక్కడ గుమ్మము ముందర నిట్టటు జరుగుచున్న దీర్ఘస్కంధకాయుడగు మనుష్యుడొకడు కనబడెను. లోపల నడచుటకు జక్కగ దీర్పబడిన బాటను గలిగి నానావిధములగు మొక్కలుగలిగి

యక్కడక్కడ స్ఫటికవిగ్రహములు కలిగి చిత్రచిత్రముగ నీటిం బయికి వెదజల్లు ధారాయంత్రములు గలిగి యతిమనోహరమగు నొక యుద్యానవనము కనఁబడెను. అందుండు భవనములలో వెలిఁగించిన దీపములకాంతి ప్రతిగవాక్షమునుండి మంటలట్లు గనఁబడుచుండెను. అవి యన్నియుం జూచి హేముఁడు మెల్లఁగాను వినయముగాను దర్వాణా! యీతోఁట యెవరిదని యడిగెను. ఆ ద్వారపాలకుఁడు చేతిలో గడ్డము మీసముసవరించుకొని యిట్లుత్తరము చెప్పెను. "అయ్యా! ఈతోఁట, యిల్లు నెవరివో యెఱుఁగవా! ఈపట్టణమునం దున్న గొప్ప వారందఱీతోఁట యిల్లెఱుఁగుదురు. అందఱు నిందు విందారగించిన వారె! నీవు క్రొత్తవాఁడ వని తోఁచుచున్నది" "అవును. నేనీమధ్యనే యిక్కడకు వచ్చినాను కాని యీవైపెప్పుడు రాలే" దని హేముఁడు బదులుచెప్పెను. "అంతే కావచ్చును. ఏమన నీచుట్టుపక్కల నున్న వారందఱు నీ యిల్లెఱుఁగుదురు. గొప్ప బిరుదులు పొందినవారు, జమీందారులు, షీడరులు, వర్తకులు వేయేల? కలకత్తాలో నున్న గొప్పవారంద ఱీతోఁటలోనికి వచ్చి పోవుచుందు" రని ద్వారపాలకుఁ డుత్తరముఁ జెప్పెను. "నీవు చెప్పినది నిజమే. నేను పేదవాఁడ నగుటచేత నీయుద్యానవనము సంగతియు దీని యజమానుని సంగతియు నాకంతగాఁ దెలియదని హేముఁడు పలికెను. అనవుడు ద్వారపాలకుఁడు చిఱునవ్వు నవ్వి యొకవిధమైన ధీమతో "అవును. మా యజమానుఁడు మీవంటి బీదవానిని పిలుచునా? ఈరాత్రి మంచి మేజువాణీ యున్నది మాయజమానుని స్నేహితులందఱు వచ్చుచున్నారు. ఈ యూరినాటకశాలలో నాట్యమునకు మిక్కిలి ప్రసిద్ధికెక్కినదొకర్తె యామేజువాణీ జరుపుటకు నొప్పుకొనెను. కలకత్తాలోనున్న పెద్దమనుష్యులనేకులు దాని నగుమోము జూచిన మాత్రముననే తరింపఁగలమని దానికొఱకే వత్తు" రని పలికెను. "యీతోఁట యజమానుఁ డెవరో చెప్పవైతి" వని హేముఁడు వానిని మరల నడుగ నతఁడు నవ్వుచు నిట్లనియె. "ఓయి వెఱ్ఱివాఁడా! నీవు నిజముగ నెఱుఁగనె యెఱుఁగవా? ధనవర్జమీందారులైన ధనంజయ ప్రభువుగారిదీ తోఁట. ఈమాటలు వినఁగానే హేమచంద్రుఁడు పిడుగుపాటున నడిగినట్లు భయపడి చప్పునప్పున వీధిప్రక్కనున్న యొక యరుఁగుమీఁద చతికిలపడి తన రెండుచేతులం బట్టుకొని కూర్చుండెను. అప్పు డతనికి నిమిషమొక యుగముపగిదిఁ దోఁచె. కన్నులనుండి పొంగుచు బాష్పములు నేల తడుపఁ జొచ్చె. అప్పుడు కొండొక సేపువగచి నిట్టూర్పు విడిచి యాతఁడు తనలో నిట్లనుకొనియెను "అయ్యో! ఈశ్వరా! భాగ్యము మేడలు మిద్దెలు నల్లగుఱ్ఱములు తెల్లగుఱ్ఱములు సౌఖ్యము నీయజాలవు గదా? ఇంతచేతనే నీవెల్లప్పుడు లో చిన్నవోయి మనసులో నేదో బాధపడుచున్నట్లు కనబడుచుందువు" అట్లు తలంచుచు హేమచంద్రుఁ

డరగంటసేపు నోటమాటరాక విచారించి యెట్టకేల కతఁడొక దృఢనిశ్చయముఁ జేసి కొనెను. ధనంజయుఁడు వివాహమైనప్పటినుండి తాళ్ళచెఱువు గ్రామమునకు వచ్చుచు బోవుచుండుటఁ జేసి హేమచంద్రునకుఁ బరిచితుఁ డగుటయేగాక యాతనిమీఁద గౌరవము జూపుచువచ్చెను. అందుచేత నాతనికి మంచి సలహానిచ్చి దురాచారములనుండి యాతనిం ద్రిప్పఁ దలచెను. ఇట్లు చేయుట కా రాత్రియే యాసందడిలోనే ధనంజయునిఁ జూచి మాటాడుట మంచిదని హేముఁడు తలంచెను. తలంచి లేచి ద్వారముకడకుఁ బోవ, నీకేమి కావలయు నయ్యా! చాలాసేపటినుండి యేమి పనిపాటును లేకుండా నీవీ చుట్టు ప్రక్కలనే తిరుగుచున్నావని ద్వారపాలకుఁ డడిగెను. "నేను మీయజమానునిఁ జూడ వలయును. లోనికి బోవచ్చునా?" యని హేముఁడు మరల నడిగెను. అప్పుడు ద్వార పాలకుఁ డిట్లనియెను. "ఈసరికి నెవ్వరిని లోపల రానీయరని నేతలంచుచున్నాను. ఇటు వంటి మహోత్సవ సమయములయందు మీవంటివారిని సాధారణముగ బిలువరు మీరు లోపలికిఁ బోవుట మాయజమానున కిష్టముండదు" అన హేముఁ డిట్లనియె. నాపేరు హేముఁడనియు నేను తాళ్ళచెఱువునుండి వచ్చితి ననియు మీయజమానునితో జెప్పుము. చెప్పగానే యాయన నాకు సెలవిచ్చును. అప్పలుకులకు ద్వారపాలకుఁ డిట్లు బదులు చెప్పెను. 'చాలమంది పల్లెటూళ్ళవారు తాళ్ళచెఱువునుండి నల్లచెఱువునుండి మాయజ మానునిఁ జూడవచ్చుచుందురు. అలాంటివారిని జూచుట కాయన కిష్టము పట్టణములోఁ దీరు బడియే యుండదు' అన హేముఁ డీక్రింది తెలుఁగున వానికి బదులుచెప్పెను. 'దర్వాంజీ! మీయజమానుని యత్తవారు తాళ్ళచెఱువు. అందుచేత బాల్యమునుండి యెఱిఁగినవాఁడనగు నన్ను లోపలకు రానియ్యకపోఁడు' ఈమాటలు వినఁగానే ద్వారపాలకునకు కొంచెము జంకు పొడమ 'నీయనను లోపలకు పోనిత్తునా' యని తలంచి సందేహించి మరల తనలో 'ఈయన మాయమ్మగారి పుట్టినింటివంకవాఁడైన పక్షమున నీయన కగౌరవము జేసితినని మాయజమానుఁడు కోపింపవచ్చు' ననుకొని యాయనకొక కుర్చీనిచ్చి కూర్చుండబెట్టి యాయన రాక యజమానునకు నెఱిఁగింప లోపలకుఁ బోయెను. హేముఁ డరగంట కని పెట్టుకొని యుండ నెట్టకేల కాపరిజనుఁడు వచ్చి "యజమానుని సెలవైనది. లోపలకు దయచేయుఁ" డని చెప్పి తాను ముందుండి దారిచూపి విశాలములైన మెట్లమీఁదనుండి గొంపోయి మేడ యెక్కించి యొకగదిఁ బ్రవేశపెట్టెను.

ధనవృత్తు జమీందారులైన ధనేశ్వరకుటుంబము వారిలో ధనంజయుఁడే పెద్దవాఁడు. హేముఁడు లోపలి కరుగునప్పటి కతఁడు తన శృంగారపు చెలికాండ్రు పరివేష్టింప నొక

గదిలోఁ గుర్చీమీఁదఁ గూర్చుండెను. హిందువు లెంతభాగ్యవంతులైన నెంత దురాచారములలోఁబడి భ్రష్టులైనఁ దమచుట్టములను గౌరవించుట మాత్రము మఱవరు. ధనంజయుఁడు కుర్చీమీఁదనుండి లేచి తన భార్య పినతండ్రికూఁతురు మగఁడగు హేమచంద్రునిఁ బలుకరించి కుశల మడిగి అతలషుమెత్తలుగల కుర్చీమీఁద గూర్చుండబెట్టెను. తోడియల్లుడు చేసిన గౌరవమునకు హేముఁడు మిక్కిలి సంతసించి గదివైపుఁజూచి యచట చేయబడిన యలంకారమును గని యద్భుతము నంది నిశ్చేష్టుఁడయ్యెను. అతఁడదివరకు కొన్నిసారులు వీధిలో నిలిచియుండి చౌరంగియను పేటలో నున్న దివ్యభవనముల వంటి దొరల మేడలు చూచెను మఱియు గవర్నరు జనరలుగారి మహామందిరముయొక్క సింహద్వారములను గూడ బలుమారు చూచెను. కాని సాహసించి యెన్నఁడు లోనంజేరలేఁడు. డాలహౌసీ చౌకులోను హైకోర్టు వీధిలోను మహాశోభతో దీర్పఁబడి యుండు నింగ్లీషు వర్తకుల యంగళ్ళు (షాపులు) గూడ కొంత దవ్వునుండి పలుమాఱు తొంగితొంగి చూచెను. కాని జన్మమధ్యమం దెన్నఁడు ధనపుగపు జమీందారు తోఁటలోనున్న మందిరమువంటి రాజమందిరమును బ్రవేశించి యెఱుఁగఁడు.

ఆ జమీందారుని స్నేహితులలోఁ గొందఱు చమత్కార సంభాషణలకు దెలివితేటలకుఁ బేరువడిన వారదివరకే యక్కడకు వచ్చియుండిరి. ధనంజయుని కుడిప్రక్క చిఱునవ్వులు నవ్వుచు సుమతి యనునొక నవయౌవన ప్రాయుఁడు నల్లని యంచులు గల ధోవతిగట్టి యట్టియంచులే గల యుత్తరీయ మొకటి వల్లెవాటుగ వేసికొని కూర్చుండెను. ఈయన కేయుద్యోగము లేదు. ఈయన కలకత్తాలో గొప్పబిరుదులు కలవారియొక్కయు భాగ్యవంతుల యొక్కయు నండను నంటిపెట్టుకొని తిరుగు చుండును. ఈతఁడు తేనెటీగవలె భాగ్యవంతుల గృహములనుండి ధనము స్వీకరించి తేనె పట్టువంటి తన యిల్లు నిండ వేసికొనును. ఈయన బోడుగుఱ్ఱపుబండి పురజనుల కందఱకు నానవాలే. ఈయన తనఖా దస్తావేజులు వ్రాయించుకొనియు, ప్రామిస్సరీ నోట్లు వ్రాయించుకొనియు సాధారణముగ వడ్డీ కప్పులిచ్చి ముఖ్యముగ ముందుముందు జమీందారులు కావలసిన మైనర్లకు సలహాలు చెప్పి వారికెంతో యాప్తుడై యుండునని యాయనం జూచినతోడనే చుట్టుప్రక్కలవారు గుసగుస లాడనారంభించిరి. కాని యా మాటలు గట్టిగా నెవరు చెప్పకొనలేదు. సుమతి వద్ద చమత్కార సంభాషణలు ప్రజ్ఞలు నోటిమంచితనములు గలవనుటకు సందేహము లేదు. అతని పొరుగున యదునాథు డను పెద్దమనుష్యుఁ డొకఁడు కాపురముండెను. ఆయనయు జిత్రసంభాషణలకు విశేషజ్ఞానమునకు నందెవేసిన చెయ్యియని చెప్పవచ్చును; ఆయన ప్లీడరు. వేషభాషలయందు నాచారములయందు నీతఁ డింగ్లీషువారి పద్ధతుల నవలంబించెను. అందుచేత నాంగ్లేయపద్ధతుల మీఁద విందులు నకుపునా రాజష

యము లైన సంగతు లేవి తెలిసికొన వలసివచ్చినను వారికన్నిటికి నీయనయే ప్రమాణము. విదేశపు సారాయములలో నేది మంచిదో యాయనయే చెప్పవలయును. విందులకు బిలుచునపుడు పంపబడు చీటుల విషయమున నాయనమాట ధర్మశాస్త్రమే. ఆయన యుపన్యాసము లిచ్చుటలో మేటి. ఆయన వెనుక నొకసారి హిందూజాతీయత్వము హిందువుల యాచారముల శ్రేష్ఠత్వము ననువిషయములం గూర్చి నగరమందిరమున నిచ్చిన యుపన్యాసములు విని పురజనులు మహానంద భరితులైరి. ఆయన యదృష్టమేమో కాని పడుచువాండ్ర కందఱ కాయనమాట గురి. భాగ్యవంతుల కాయన పరమమిత్రుడు. వివాహసంబంధములు గావలసినవారి కాయన యాలోచన మత్యావశ్యకము.

ఆయన వెనుక పూర్వపు పద్ధతిలోని వాడగు హరిశంకరుడు కూర్చుండెను. తెల్ల కోటు, కోటుజేబునకంటి తళతళ మెరయుచున్న దట్టమగు బంగారపు గొలుసుగల పూర్వపద్ధతివేషము నాయన ధరించెను. ఈయన పూర్వకాలపు వాడగుటచే నూహలు మాటలు బూర్వకాలపువై యుండెను. ఆయన కింగ్లీషు భాషలోగల జ్ఞానము విశేషమైనది కాదు. కాని తెలివి మాత్ర మసాధారణమైనది. కావున బుద్ధిసూక్ష్మతకు పేరువడిన పడుచువాండ్ర నేకులు హరిశంకరుడు సుఖముగా జేసెడు జీవయాత్రను జూచి లెము కట్టిని సంధింప దయ్యెనని విచారపడుచు వచ్చిరి. నవనాగరికులగు నీకాలపు బంగాళీలవలె బోడితలలతో నీయన కచేరీలకు వెళ్ళక సన్నని పాగ చుట్టుకుమురులాగున జుట్టు తలపై పెట్టుకొని పోవుచుండును. ఈయన మాటలాడునట్టి యింగ్లీషుకూడ పూర్వకాలపు వారి యింగ్లీషువలె మిక్కిలి రోసగానుండును. అందుచేత క్రొత్తపద్ధతులు నేర్చికొని పాడుగాక యున్న పూర్వాచార పరాయణుడని యూరోపియను లతనిమీద దయ గలిగియుండిరి అంతియెగాక పూర్వాచారములకు మతవిషయము లకు నతడే ప్రమాణమనియు నవనాగరికులై పెద్దపిన్న తారతమ్యము లెరుగక తెల్లవార యెడ వినయము జూపక యుండునట్టి యీనాటి పడుచుబంగాళీ లందఱికాయనం జూచి మర్యాదలు నేర్చుకొన వలసినదనియు యూరోపియను లభిప్రాయపడుచు వచ్చిరి. హరిశంకరుడు లోక వ్యవహారవేదియై పూర్వకాల వేషము లాభసాటి వ్యవహారమని తోచి నందున దానినే యవలంబించెను. అందుచేత హిందువులు తెల్లవారి వేషభాషల నవలంబించుట యిష్టములేని యూరోపియనులు హరిశంకరుడు స్వతంత్రుడనియు బాబు కాని వాడనియు మెచ్చుకొని యాతనికంటె ఎక్కువ తెలివి, యెక్కువ చిరకాలాను

భవము గలయుద్యోగస్థుల ననేకులను మూలకు ద్రోసి యీయనకే జీతము వృద్ధిజేయుచు వచ్చిరి. ఈయనయు నలుగురతోడిపాటు స్నేహితులు హెచ్చరించుచుండ నొక గ్లాసు చీకటిగదిలోఁ బుచ్చుకొని యప్పటికి గృహమునకుఁ బోయి పిదప పూర్వాచార పరాయణులు కడుపు చెక్కలుగ నవ్వునట్లు నాటిరాత్రి యచ్చట జరిగిన వినోదములెల్ల రసపుష్టిగ జెప్పి త్రాగుబోతులను వెక్కిరించెను.

హరిశంకరుని ప్రక్కను పశ్చిమఖండాచారములు సర్వోత్తమములని, కంకణము గట్టుకొన్నవానివలె వాదించు కర్మకారుఁడు కూర్చుండెను. ఈకర్మ కారుఁడు యూరపు ఖండమునకుఁ బోయి యచ్చటి నాగరికత నంతను దనతోఁ దెచ్చెనో యన్నట్లు ముడుతలు లేనికోటు మెడపట్టి క్రొత్తమాదిరి సులోచనముల జోడు దాల్చెను. యూరపు ఖండములో నేకొత్తసారాయి బయలుదేఱినను దాని నితఁడు చవిచూచి తీరవలసినదే. అతని యాంగ్లేయభాషోచ్చారణము నిర్దుష్టమైనది. ఆయన యింగ్లీషు పద్ధతులు చిత్రములైనవి. వేయేల? ఆయన యింగ్లీషువారికంటె నెక్కువయింగ్లీషువాఁడు. ఆయనపద్ధతులు చేష్టలు చూచి యాయనకంటె తక్కువ చదువుకొన్న మిత్రులు మెచ్చి కొనియాడుచు వచ్చిరి. అజ్ఞానాంధకారమయమైన మనదేశముమీఁద నీయన పశ్చిమఖండమునుండి తెచ్చిన జ్ఞానతేజస్సును వెదజల్లుచున్నట్లు కొందఱు తలంచిరి. ఒకరినను సరించు నిష్టము గల కుఱ్ఱవాండ్రు కర్మకారుని యభినయములు సంభాషణలుఁ గొంతవఱకు పట్టుకొని తాము నాగరకతలో మిక్కిలి వృద్ధిపొందినట్లు తలంచుచు వచ్చిరి.

హరిశంకరుని రెండవప్రక్కను దిగంబరుఁడు విశ్వంభరుఁడును గూర్చుండిరి. వీరు తోఁటకు జుట్టుప్రక్కల నున్నవారిలో గొప్పవారు. గొప్పవర్తకులగు ముక్తియారులు, వారివెనుక సన్నని తెల్లకోటులు పట్టుదుమాళ్ళు దాల్చి దృఢశరీరములు గల పడుచు వాండ్రు కొందఱు కూర్చుండిరి. కమ్మని తావియు మకరందముఁ గల పుష్పగుచ్ఛము మీఁదఁ దుమ్మెదలు వ్రాలినట్లు సొమ్ము నిష్ప్రయోజనముగాఁ బాడుచేయుటలో మితి యెఱుఁగని ధనపురపు చిన్నజమీందారుని చుట్టు నానాపద్ధతుల మనుష్యులు చేరిరి. ఈ విధములైన కలయికలు విందులు మన పల్లెటూళ్ళు విడిచిపోయి చూచితిమా యితర ఖండములయందు మేలులేక కానఁబడుచుండును.

అటువంటి సభలోఁ బాపము హేమచంద్రుఁడు ధనపురపు జమీందారున కెట్లు సలహా చెప్పగలఁడు? ఆయన నెట్లుచీవాట్లు పెట్టగలఁడు? ఆయన హితము నుపదేశింపఁ

ప్రయత్నించి వాని నుపోద్ఘాతముగా హేమచంద్రుఁడు తోఁట, తోఁటలోని మేడలు మిక్కిలి దర్శనీయములై యున్నవని పలికెను. పలుకుటయు నచట చేరిన మిత్రులందఱు క్రొత్తగ గొన్ని మేడలు దివ్యసుందరములుగా నున్నవని బళిబళియని మెచ్చిరి. ధనంజయుఁడు గూడ వారి పలుకుల కలరి కొంచెము సేపుండి జరుగఁ దలచిన మేజువాణి జూచి పోవలసినదని హేముని గోరెను. హేముఁడాసందర్భమున తనయొక్క తండ్రి మాటయుఁ దాళ్ళచెఱువు గ్రామము మాటయు నించుక తలపెట్టెను. పేదబంధువుల మాట తలపెట్టుట ధనంజయునకు బొత్తుగ నిష్టము లేక పోయెను. జ్ఞానసంపన్నులైన యాతని మిత్రులు హేముని సంభాషణలను ధనంజయునికంటె నెక్కువ యసహ్యించుకొనిరి. కాలము వ్యర్థమగుచున్నదని యందఱు తొందఱపడిరి. సమయానుగుణముగ శృంగార వేషములు ధరించిన నవవిలాసినుల నవ్వులు ప్రక్కగదినుండి వినంబడి యమ్మహారసికులకు వీనుల విందొనరించెను. ఆసభాసదులలో నొకఁడు వీణపై చేయివైచెను. మఱియొకఁడు సారాయిపోసి త్రాగెను గ్లాసులపంక్తి నువ్విళ్ళూరుచుఁ జూడసాగెను. వేరొకఁడు గడియారమువంక చూచెను. ఆసూచన లెఱింగి హేమచంద్రుఁడు ధనంజయునివద్ద సెలవు పుచ్చుకొని విచారగ్రస్థుఁడై పోయెను. ఇప్పటికి పాపము హేమునకుఁ గొంత ప్రపంచ జ్ఞానము కలుగబోలు. అతఁడు గృహమునకుఁ బోవునప్పటికి రెండుజాముల రాత్రి దాటెను. ఇల్లుజేరి యతఁడు భార్యతో మాటలాడక పండుకొనెను. పాపము దుఃఖాతిశయముచేత నతఁడు పలుకలేక పోయెను.

---

## పదియవ ప్రకరణము.

తెల్లవారఁగానే హేమచంద్రుఁడు మేలుకాంచి తన మనోగత వృత్తాంతము నెవ్వరికిం జెప్పక దాచినందున ప్రయోజనము లేదని గ్రహించి తనలో నిట్లనుకొనెను. "కష్టములు వచ్చినప్పు డాఁడువాండ్రు కాఁడువాండ్రే సహాయము చేయవలయును. కావున నాకుఁ దోఁచిన దంతయు నాభార్య కెఱిఁగించెద. ఆవిడ యేమిచేయవలయునో యది చేయును" అనియతఁడు తలఁచుచుండఁగానే బుద్ధిమంతురాలగు బిందు విషాదమనియెడు నీడచే నావరింపఁబడిన నతని మొగముఁజూచి [illegible] "ఏదైన దుర్వార్త తెలిసినదా?" యని యడిగెను. హేమచంద్రుఁడు కడచిన రాత్రి తాను కన్నులారఁ జూచిన

దంతయు బూసగ్రుచ్చినట్లు భార్యకు వినిపించి చాల విచారపడెను. అంత సతీ పతులిట్లు మాట్లాడిరి.

హేమ__ధనంజెయుఁడు తెలివిమాలి పడుచుతనముచేతఁ జెడుస్త్రీవలలోఁబడి పాడైనాఁడు. అతనిచుట్టు పచ్చిదొంగలవంటి మోసగాండ్రు చేరినారు. అతని యాస్తి యతని స్వాధీనములో నెంతోకాలముండదేమో యని భియపడు చున్నాను. పాపము భార్యయొంటికత్తెయె. దయే సంతోషములేక బెంగఁబెట్టుకొని క్రమముగాఁ జిక్కి చచ్చి పోవునని నాకు విచారముగా నున్నది.

బిం__(ఈమాటలు భర్తనోట వెడలఁగానే కన్నుల నీరుపెట్టుకొని కొంతసేపటికి దన చీరకొంగుతో నీరద్ది) ఇంతమట్టుకు వచ్చునని నే నెరుంగుదు. నేనేకాదు పాపము! ఉమకూడ నెరుంగును.

హేమ__కలకత్తాకు రాకముందామె యెట్లెరిఁగి యుండును?

బిందు__ అది నేను చెప్పఁజాలను. ఇక్కడికి రాకముందె యామెకు మగని దురాచారములు కొన్ని తెలిసి యుండును. కాని యామె గంభీరమైనది. గనుక మనో వ్యధలు పైకిఁ జెప్పుకొనుట కిష్టము పడినది కాదు. వెనుక తాళ్ళచెరువు గ్రామము విడిచి వెళ్ళునప్పుడామె తన ముందుస్థితి విచారకరముగా నుండునని కొంచెము గ్రహించినట్లు తోఁచుచున్నది. ఏమంటే ఊరు విడిచి వెళ్ళునప్పుడేదో పెద్దబెంగ పెట్టుకొన్న వాళ్ళేడ్చిన ట్లేడ్చినది.

హేమ__అయిన నిప్పుడు మన మేమిచేయఁ గలము. నేనువిన్నదానిని బట్టి చూడఁగా ధనంజయుఁడు కొద్దికాలములోనే యైశ్వర్య మంతయుఁ బోగొట్టుకొనును. విశేషించి రోగిష్ఠివాఁడగును. అప్పుడు పాపము అంతచక్కని యుమ డబ్బు కిబ్బందిపడి నానాబాధలు పడవలసి వచ్చును.

బిం__మీరెప్పుడో రెండేండ్ల సంగతిం గూర్చి విచారించు చున్నారు. నేనుదాని ప్రస్తుత బాధను గురించి విచారించుచున్నాను. ఉమ యెంతో యభిమానముగలది. మగఁడు చేసెడు నిరాదరణమెట్లు భరించుచున్నదో గదా! ధనపురములో నున్నప్పు డెంతోమంది చుట్టాలలోఁ గలసి మెలసి యది యుండినది ఈ కలకత్తాలో రెండవ యాఁడుదాని మొగమైనఁ జూడకుండ ఖైదులో నున్నట్లేలాగున నున్నదో గదా! పోనీ

వాళ్ళు గొడవలోఁ బడియుండుటకు బిడ్డలు పాపలు లేరుగదా! కొంచెముసేపు, ఉబుసు పుచ్చుకొనుటకు చుట్టాలు పక్కాలు లేరుగదా. మనసులోనున్న కష్టము సుఖము వెళ్ళబుచ్చుకొందమంటే అప్తులులేరుగదా. పోనీ మీరైన వెళ్ళి యొకపర్యాయము దాని నెందుకు చూడలేరూ?

హేమ—రాత్రి కోటలో సంగతులు కన్నులారఁ జూచినతరువాత నాకు వారింటికి వెళ్ళుటకు మనస్కరించుటలేదు. పోనీ నీవువెళ్ళి కొంచె మోదార్చు. తరువాత భగవంతుఁ డున్నాఁడు.

ఆ దినమే మధ్యాహ్నభోజనములైన తరువాత బిడ్డలను సుధ కప్పగించి బిందు సవారిలో గూర్చుండి తలుపులు మూసికొని భాగ్యవంతురాలైన యమునను జూడ బోయెను. సుధయు నమును జూడవలయునని ముచ్చటపడెను. కాని బిందు "యీవేళ గాదు. వీలైనప్పుడు మరియొక సారి నిన్ను దీసికొని వెళ్ళెదనులే" యని చెల్లెలను వారించెను. బిందు కూర్చున్న సవారీ ధనపురపు జమీందారున్న యింటి వీధిగుమ్మముదాటి తిన్నగా లోపలికిఁ బోయెను. హిందూదేశములోఁ జిరకాలము మహమ్మదీయుల పరిపాలనము నిలిచినందున స్త్రీలకు ఘోషా ప్రబలుటచే నీ దేశస్త్రీలు ముఖ్యముగా నుత్తర హిందుస్థాన స్త్రీలు సాధారణముగా నొకరినొకరు చూడవలయునన్న నిదే పద్ధతి. దక్షిణ హిందూస్థానములో స్త్రీల కింత ప్రబలమైన ఘోషాపద్ధతి లేదు. బిందు సవారీదిగి మెట్లెక్కి మేడమీఁదికిఁబోయి విశాలమైన పడకటిల్లు గాంచి యందు తలదువ్వుకొనుచుఁ గూర్చుండిన యమునను గనుగొనియెను. కనుగొనినతోడనే భయముచే బిందు మేనించుక వడక "ఏమీ! మా యగారిలోను దేశమంతటను జక్కనిచుక్క యని పేరుపడిన యమున యేనా యిది" యని సందియంపడెను.

యమునయన నామె ముఖము తెల్లఁబడి జబ్బుగానుండెను. కన్నులు పూర్వలావణ్యము నెడబాసి విషాదమును సూచించుచుండెను. భుజములయెముక లగపడుచుండెను. చక్కఁదనమునకు నిలయమైన యామెశరీరము శల్యచర్మావశిష్టమై యుండెను. అప్పటికి నాలుగు మాసముల క్రిందట నవనవోన్మేషము గలిగి మెరుగులు గొలుపుచుండిన యా బాలిక యప్పుడు జబ్బుగానుండి నలువదియేండ్ల దానివలె కనఁబడెను. పట్టుపేనులై మెడమీఁదఁ బడుచుండెను. శుష్కించిన హస్తములకు ముడుతలు పడుచుండెను. మెట్ల మీఁదనుండి పైకి వచ్చుచున్నప్పుడు చప్పుడు విని యమున తలయెత్తి బిందుంజూచి లేచి

వెళ్ళఁబోయి మొగమున గొంత సంతోషము మొలకలెత్తఁ దన చిన్ననాఁటి చెలిమికత్తెను కౌఁగిలించికొనెను. అంతట వారికీ క్రిందసంభాషణము జరిగెను.

ఉమ—చిట్టచివఱకు మీరిక్కడికి వచ్చినారూ? ఈ నాలుగు మాసములనుండి నే నెన్నిమాఱ్లు నిన్ను దలఁచికొన్నానని చెప్పను. నీవు సుఖముగా నున్నావా? పిల్లలు బాగున్నారా?

బిం—(ఉమయొక్క స్థితి యామె ముఖచర్యవల్లను దీర్ఘ చింతం దెలియఁజేయు మాటలవల్లను దెలిసికొని తన మనోవిచారము నడఁచుకొని) అమ్మాయి! మేము బాగున్నాము. నీవేలాగున్నావమ్మా? నీవింత చిక్కిపోయినావేమే.

ఉమ—దానికేమిలే. నేను కలకత్తాకు రాఁగానే నీటిక్రొత్తచేతఁ గొంచెము జబ్బుపడినాను. ఇప్పుడు నెమ్మదిగానున్నది. ఇప్పటికి దగ్గు అప్పుడప్పుడు వచ్చుచున్నది. ఈ యూరినీరు పడదేమోమఱి తెలియదు. ధనపురపుగాలి యింతకంటె మంచిది.

బిం—ఇంతలో నీవు ధనపురము వెళ్ళుటగాని మనయూరు వెళ్ళుటగాని లేదా యేమి? మేము దేవీపూజలనాఁటి కక్కడికి వెళ్ళుదుము. మీరురారూ?

ఉమ—బిందక్కయ్యా; ఆ మాట నేనేలాగునఁ జెప్పఁగలను. మావారు నన్ను వెళ్ళనిత్తురా?

బిం—అయిన నీసంరక్షణ మిక్కడ కనుఁగొనువారెవరు? మేమెక్కడో దూరమున నున్నాము. పిల్లలను వదలిపెట్టి వచ్చుట చాల కష్టము. నీకు పాడుదగ్గు పట్టుకొన్నది. చిక్కి శల్యమైపోయినావు. నిన్ను చూచువారెవరు ఉమా?

ఉమ—మీ మఱఁదిగారు డాక్టరును పిలుచుకొని వచ్చినారు. ఆయన ప్రతిదినము వచ్చి చూచుచున్నారు. ఆయన యిచ్చిన మందు పుచ్చుకొనుచున్నాను.

బిం—కావచ్చును. దాని కేమి. ఇప్పటి నీ స్థితిలో నెవరోయొకరు చుట్టాలో మఱొకరో నిను గనిపెట్టుకొని యుండవలెను. మీయమ్మకుత్తరమెందుకు వ్రాసినావు కావు? వ్రాసినపక్షమున నావిడవచ్చి కొన్నివారములు నీవద్ద నుండును గామా? ఉండి కొంచెము నీకు జవ చేరినతరువాత నిన్ను తాళ్ళచెఱువు తీసికొని వెళ్ళును. స్థలము మార్చుటవల్ల కొంతజబ్బు కుదుర వచ్చును.

ఉమ—మాయమ్మ నెందుకు కష్టపెట్టవలెను? డాక్టరువచ్చి యేదోమందిచ్చు చున్నాఁడు గదా? కావలసినంతమంది నౌకరులున్నారు. వారేకనిపెట్టఁగలరు. ఏమో నా కేలోటు లేదుగదా! ఆవిడకు వర్తమాన మంపుట యెందులకు? విచారము గలుగ జేయుట యెందుకు?

బిం—నీకు వైద్యులు లేకపోలేదు. నౌకరులు లేకపోలేదు. తల్లి సంరక్షణమువంటిది మరియొకటికాదు. ఆలాటిదక్షత నీకిప్పుడు తప్పక యుండి తీరవలయును. నౌకరులే గాని, మీవారు కనుగొనుట లేదా?

ఉమ—(నెమ్మదిగా) కనుగొనకేమి. కావలసినవన్నీ యియ్యనేయిచ్చుచున్నారు.

అనఁగానే తన మనోగత విచారమును లోకమందెవ్వరికిని ప్రాణమిత్రులకైనను చెప్పక యుమ లోలోన బాధపడుచున్నదని బిందు కనిపెట్టెను. "ఈ మౌనమును నే నెట్లుభేదింతు నీరహస్యము నెట్లు తెలిసికొందు నీమె కెట్లు సౌఖ్యము నొడగూర్తు" నని బిందు తనలో వితర్కించుకొని సోదరీ స్నేహముపురికొల్ప వెండియు నిట్లనియె. "ఉమా! నామాట వినవే. మీయమ్మ వచ్చి కొంతకాలము నీవద్దనుండుట మంచిదని నాకుఁదోఁచు చున్నది. అప్పు డప్పుడు మనము రోగములచేత దుఃఖములచేత బాధపడక మానము. అప్పుడాత్మ బంధువుల యాదరణము మన శరీరరోగములను మనోరోగములను మాన్పును. నీవు మిక్కిలి జబ్బుగాఁ గనఁబడు చున్నావు ఆ దగ్గుండ గూడదు. నీవు శరీర విషయమై జాగ్రత్త పుచ్చుకొనవలెను. మీయమ్మ కీవేళ జాబువ్రాయుము. లేదా యింటికిబోయిన పిదప నన్ను వ్రాయనిమ్ము. అమ్మాయి! కొన్ని నెలల క్రిందట నేను నిన్ను జూచినపుడు నీవెంతో బాగుంటివి. ఇప్పుడా మనిషివే కావని తోఁచు చుంటివి. ఎంత మారిపోయి నావే తల్లి!" అని యామె మొగముమీఁద జేయివైచి యామెతల తన హృదయమునకు దగ్గఱగఁ జేర్చుకొనియెను. మౌనమును భేదించుటకు మిక్కిలి ప్రశస్తములైన చులకని యుపాయములను స్త్రీలే యెఱుఁగుదురు గదా! అందుచేత నుమ ప్రేమానుభరితమైన బిందు ప్రసంగముచే మెత్తవడియెను. దయారసశీతలములైన యటువంటి పలుకుల నామె విని చిరకాలమైనది. ఆ పలుకులతో నామె హృదయము నిండిపోవఁ గన్నులు దడిసెను. అంతవారిట్లు ప్రసంగించిరి.

ఉమ—బిందక్కయ్యా! చిన్నప్పటినుండి నీకు నేనంటే పంచప్రాణములుగదా! అమ్మా! (అని మఱి మాటాడ లేక కన్నీరు చీఱకొంగులోఁ దుడుచుకొనఁ జొచ్చెను.)

బిం__వెఱ్ఱిపిల్లా ! నీకు నేనంటే మాత్ర మంతప్రేమ చిన్నప్పటినుండి లేదా; ఇప్పుడు లేదా ?

ఉమ__అక్కయ్యా ! నీవంటే నాకాలాగే యున్నది. నాకంఠములో ప్రాణమున్నంత కాలము నీమీఁద ప్రేమ నాకు పొమ్మన్నను బోదు.

బిం__అయిన నీమీఁద నెంతో ప్రేమ నాకున్నప్పుడు నామీఁద నెంతోదయ నీకున్నప్పుడు నీకడుపులో బాధ నాకు తెలియకుండా దాఁచవలె నను ప్రయత్నము నీకెందుకే ? నీ మనసులో నెంతక్షోభపడుచున్నావో నాకు తెలియదూ ? నీయాశలన్నియు నడుగంటిపోయిన వనియు నీవిప్పుడు తెగించి యున్నావనియు నేను తెలిసికొన లేదనుకొన్నావు ? నీవు క్రొత్తగాఁ గాఁపురమునకు వెళ్ళినప్పుడు నీమగఁడు నిన్ను నేల నడువనీయకుండ నెంతో గారాబముతోఁ జూచుచుండువాఁ డని సంతోషము కడుపులోబట్టలేక నీవెన్నిసారులో నాచెవిలో రహస్యముగాఁ జెప్పితివి. ఆమాటలిప్పుడు జ్ఞాపకములేవా ! ఆసంతోష మంతయు నేఁడు సన్నగిల్లి పోయినదని నేను కని పెట్ట లేదనుకొన్నావా ? ఇప్పటికి నాదగ్గఱ నీగుట్టు దాఁచఁ దలఁచుచున్నావా ? అమ్మాయీ ! నేను నీవు క్రొత్తవాళ్ళవలె యొకరిగుట్టొకరివద్ద దాఁచుకొన్నపక్షమున మన కిక్కడ తల్లితోడు ఎవరుందురు ?

ఈపలుకులు హృదయమును జయించుటంజేసి యుమ తాళలేకపోయెను. మౌనము భేదిల్లెను. అంతట నుమ తన మొగము బింబకను వులో బెట్టుకొని కన్నీరు విడిచి కడుపు పగిలి కొంతసేపేడ్చి యవ్వల మొగమెత్తి యిట్లనియె. బిందక్కయ్యా ! నేనిదివఱకెన్నఁడు నాగుట్టు నీకడ దాఁచలేదు. ఇఁక ముందు దాఁచఁ దలఁచుకోలేదు. నామాటవిని యీవేళ కూరుకో ! ఈమాటు వచ్చినప్పుడు నాకథ నంతయు నీకుఁ జెప్పెదను.

బిం__కాదు కాదు. నీకథంతయు నాకీవేళనే చెప్పి తీరవలయును. కడుపులో దిగమ్రింగిన పక్షమున బాధలు దుఃఖము మనస్సును దహించివేయును. తల్లితోడుతో కష్టముఁ జెప్పుకొన్నపక్షమున కొంత మనస్సునకుఁ దేలికగా నుండును.

ఉమ__బిందక్కయ్యా ! నే నేమియు దాఁచను. నీవద్దఱ దాఁచవలసినదేమియు లేదు.

బిం__ఉమా ! నీశరీరములో నింతజబ్బుగా నున్నదిగదా ! నీమగఁడు, ఈస్థితిలోఁ గనుఁగొనవలసినంత సరిగాఁ గనుగొని నిన్నాదరించుచున్నాఁడా ?

ఉమ—నాకు కావలసినదంతయు నిచ్చుచున్నారు. నా చికిత్స నిమిత్తమొక వైద్యుని బెట్టినారు.

బిం—ఉమా! ఈలాగున, ఆకను అందకుండా పోఁకను పొందకుండా యేవో రెండు కల్లబొల్లిమాటలు చెప్పి నన్ను పంపివేయఁ దలఁచుకొన్నావా? నేను క్రొత్తదాన ననుకొన్నావా? అన్నము, బట్ట, వైద్యుఁడు ఇవియేనా మనము భర్తలను కోరదగినవి? నే నివన్నియు నిన్నడుగ లేదు. నీవు క్రొత్తగాఁ గాపురమునకు వెళ్ళినప్పుడు నీమీద చూపినంతదయ నీభర్తగారిప్పుడు నీమీఁదఁ జూపుచున్నారా? అదినాకు కావలసినమాట! ఆఁడది యాఁడదాని నింతకన్న స్పష్టముగా నడుగవలెనఁటే? మగనియనుగ్రహమే భాగ్యవంతురాలికిఁగూడ భాగ్యము. పేదరాలికిఁ బెన్నిధానము. ఆడవాళ్ళ కందరకుఁబతి యనుగ్రహమే ప్రాణాధారము, బ్రహ్మానందము. అటువంటి యనుగ్రహము నీభర్తగారికిఁ గలదా?

అనవుడు ఉమ నోటినుండి మాటరాక తలయూఁచి బిందుకడుపులోఁ జేర్చెను. బిందు చెల్లెలియవస్థఁ జూచి విషాదపూరితయై మెల్లన నిట్లనియె: ఉమా! పతియనుగ్రహము పోగొట్టుకోఁదగినది కాదు. పెనిమిటికి నీమీఁద దయతప్పి పోకుండ శక్తివంచన లేక చేయవలసిన ప్రయత్నములన్నియు జేసితివా?

ఉమ—అక్కయ్యా! ఆయనదయ నిలుపుకొనుటకు నేపడినపాట్లు పరమాత్ముఁ డెఱుఁగును. ఆయనకు నామీఁద ననుగ్రహము తప్పినను నా కాయనమీఁద దయపోలేదు. ఆయన నొక్కసారి కన్నులారఁ జూడవలయునని నేనెంతో తహతహపడుచుందు. పాపమాయనకు నామీఁద విసుగుపుట్టినది కాఁబోలు (ఈకడపటి పలుకులకు నప్పు డుమ యెంతో చిత్తక్షోభము నొందెను.)

బిందు—నీ కాయనమీఁద ప్రేమ యున్నదన్నమాట చెప్పవలయునఁటే తల్లీ! నాకు తెలియదా? నీమనసు నేనెఱుఁగుదును. నీకంఠములోఁ బ్రాణముండగా నీవాయనమీఁద ప్రేమ తీసివేసుకోలేవు. కాని ఆఁడదానికి భర్తమీఁద ప్రేమయున్నంత మాత్రముచేత చాలదు. మగవాఁడు కూడా, ఆడుదానివద్దనుండి యొక్క ప్రేమమాత్రమే కోరఁడు. గుంభన యెందుకు? ఆడది ఆఁడదానితో మాట్లాడినపుడు తోడఁబుట్టినది తోడఁబుట్టినదానితో మాటలాడినట్లు నేను నీతో మాటలాడెదను. పెనిమిటిని సంతోషపెట్టుటకు, ఆయనకటాక్షము తనమీద స్థిరముగా నిలుపుకొనుటకు ఆఁడది యెన్నో నేర్పులు నేర్వవలయును, ఒక్క ప్రేమతోఁ జాలదు.

ఉమ—అక్కయ్యా! చెప్పుచెప్పు. వినుచున్నాను.

బిం—ఉమా! నీకు తెలియనిది నేనిప్పు డేమియుజెప్పలేను. నీకేగాను. ఈజ్ఞాన మాడవాళ్ళకందరకు స్వతస్సిద్ధముగానున్నది. మగఁడు మనకు ప్రాణస్నేహితుఁడు, సహకారి గనుక ఆయన వచ్చునప్పటికిల్లు కలకలలాడుచుండు నటులు సంతోషము తాండవ మాడుచుండునట్లు ఆయన మనసులో నుండు విచారము లన్నియు బోవునట్లు మనము చక్కఁజేసి యుంచవలెను. పతికిఁ గోపము వచ్చినప్పుడు మనము శాంతము వహించవలెను. చీవాట్లు పెట్టినప్పుడు మన మవి మఱచి పోవలయును. ప్రతి దినము వచ్చునట్టి కష్టనిష్ఠురములకు మనము మనసు పాడు చేసికొనక భక్తి వినయములు గలిగి యుండవలెను. ఈస్వల్పవిషయములు మనము నేర్చుకొన్నపక్షమున మన యిల్లు సంతోషమునకు పుట్టినిల్లయి యుండును. ఇవి నేర్చుకొనకపోతిమా బ్రతుకు పాడు బ్రతుకై యుండును. ఉమా! అతి భాగ్యములో నుండుటచేత లోకవ్యవహారము నీకంత చక్కగాఁ దెలియదు. పేదసంసారము కలదాన నగుటచే లోకానుభవము నాకెక్కువగా గలదు. నిష్కళంక చరిత్రలుగల మగవారిని పరమపతివ్రతలైన యాడువారిని యెందరనో యెరుంగుదును, పరస్పర ప్రేమలోను వారికిఁ గొఱత లేదు. కాని వారి దాంపత్యములు దగ్ధపటలములైనవి. ఎందుచేతనో వారు పడునట్టి క్షోభ యింతంతగాదు. ఎల్లప్పుడు మగవాని మొగము మటమట. ఆఁడుదాని మొగము కొఱకొఱ. వారి గృహములు సంతోషరహితములై దగ్ధమైపోయిన సౌఖ్యానురాగముల స్మశానము లట్లు కనబడు చుండును. రవంతయోరిమి జీవనమునకెంతో వికాసమును దెచ్చును. ఓరిమిలేక పోయెనా యిల్లు చీకటికోణమట్లుండును. మనస్సులు చెడిపోయిన తరువాత కార్యములేదు. ఎండిన మోళ్ళైనను జిగురించును. గాని విరిగిన మనస్సు లతుకుకొనవు. ఆశ లడుగంటి పోయిన వెనుక అనురాగము లకాలమందే యంతరించిన వెనుక భార్యాభర్తలు తమతప్పులు తెలిసికొని "అయ్యో, మాలో నెవరివద్దనైనఁ గొంచెము శాంత మున్నపక్షమున సంసారమింత నిస్సారము గాకుండ, నీదినము లన్నియు నెంతో సౌఖ్యముగా వెళ్ళునుగదా" యని పశ్చాత్తాపము నొందుచుందురు. పొందిన కార్యమేమి? పాకము ముదిరిపోయిన తరువాత దేవాయాత్ర నడపుట మఱియొకసారి యాడి చూచుట కాట గాదు. గతించినది గతించుటయే. యౌవనము మరలిరాదు. పోయిన సంసారము కుదురుపడదు.

ఉమ—అక్కయ్యా! నీవు చెప్పినది కఠినముగానున్నను సత్యమే. ఈప్రపంచమందనేక గృహములు గతించిన యనురాగములయొక్క ఛాయచే నల్లబడి కేవలము

స్మశానములవలె నున్నవి. మనచిన్నతనమందు పుస్తకములలో సీతారాములయొక్క దాంపత్యము, సావిత్రీసత్యవంతుల యనురాగమును జదివి వివాహములైన తరువాత మన జీవనములుగూడ నావిధముగానే యెడలేని సౌఖ్యపరంపరలై యుండునని యెంతెంతో యూట లూరితిమి. కాని పెద్దవాళ్ళమై లోకవ్యవహారములు చక్కఁగా దెలిసికొన్న తరువాత వెనుకటి మనకోరికలు స్వప్నములని తెలియుచున్నవి. ఇప్పటికి కన్నులు తెరచివా మని తెలిసికొనఁ గలము. శాంత సంతోషములు తప్పక నిలుచు నని తలఁచినచోట్ల ఎడతెగని వైరము నిలుచుట చూడఁగా శరీరము వణకునుగదా. అధికారము కొఱకు, డాబులకొఱకు ఆడువాళ్ళు, మగవాళ్ళు గిజగిజ తన్నుకొని చచ్చుట చూడఁగా ప్రపంచము మీఁద విసుగుపుట్టును. సజ్జనుల మంచితనములు కనిపెట్టి తాము సౌఖ్యపడు దుష్టమతుల మనము చూచుచుందుము. స్వలాభము జూచుకొనని యోగ్యులయొక్క నెత్తురు పీల్చివేయునట్టి యాత్మలాభ పరాయణులఁ గూడ మనము చూచుచుందుము. తెంపులేని యీకయ్యము లేండ్లు గడచిన కొలది మరింతదట్టమై భయంకరమగును. చిట్టచివర కిద్దరిలో నెవరో యొకరుచచ్చి బూడిదయైన తరువాత కలహమంత మగును. అప్పుడు కొంపమీద పెంకు లెగిరిపోవునట్లు లేడుపులు, పెడబొబ్బలు బయలుదేరును. చచ్చిన వాని కన్నులు చేరడేసి యున్నట్లు పోయినవారలను వేయినోళ్ళఁ బొగడుచు కూనిరాగములు దీయుచుందురు. చచ్చినతరువాతఁ జేసెడు విలాపముల కంటెఁ బ్రతికియున్నప్పుడు రవంతకనికరము జూపినను, ఒక్క మంచిమాట యాడినను, నెంతో బాగుండి యుండును గదా యని యప్పుడు పయివారికిఁ దోఁచును. బ్రతికియున్నప్పుడు కట్టుకొనుటకు బట్టలియ్యనివారు చచ్చినతరువాత శ్రాద్ధభోక్తలకు వస్త్రములిత్తురు. బ్రతికియున్నప్పుడు తిన్నగాఁ దిండియైనఁ బెట్టనివారు చచ్చినతరువాత భోక్తలకు మామిడిపండ్లు వడ్డించి పంచభక్ష్య పరమాన్నములతో భోజనమిడుదురు. ఇవి మన బ్రతుకులలో నున్న విచారభాగము. మన పూర్వకవీశ్వరు లిటువంటికథల నెప్పుడు వర్ణించి యెఱుఁగరు. వారేగాదు, ఈనాటి ప్రబంధవేత్తలు గూడ నీకథల వ్రాయరు. ఇది వ్రాయుటకు వీలులేనంత యరుచిగా నుండునని గాబోలు వారు వీటిని ముట్టరు.

బిం_ ఉమా! నీవు చిత్రముగా మాటలాడు చున్నావేమి? నా మాటలకు నీవు తప్పర్థము చేసికొన్నట్లు తోఁచుచున్నది. కయ్యాలు ప్రతి గృహమందుఁ గలవు. కొన్నింట్లలో నవి ముఖ్యముగ సంతోషమును గూకటివ్రేళ్ళతోఁ బెల్లగించివేయును. ఇప్పుడు నేను చెప్పునవి నూటసాట నొకటిగాని యెల్లసంసారములలోను జరుగునవిగావు లోకములో నాఁడువాండ్రు మగవాండ్రు పరిపూర్ణులుగారు కావునఁ గొన్ని లోపము

లుండును. అయినను సంసారములో నొకరికొకరు సహాయముఁ జేసికొనవలసియున్నారు. కాబట్టి యోరిమి గలిగి యొకరితప్పుల నొకరు క్షమించుకొనుచు దేహయాత్ర నడపవలయును. ఉమా! నీవు చాలా బాధలుపడినావు. అందుచేత సంసారము నిస్సారమని తలంచు చున్నావు. నీమాటలు వినఁగా నాకు భయమగుచున్నది. నీ సంగతి నాకు బోధపడినట్లే లేదు.

ఉమ—అక్కయ్యా! నా సంగతి నీకు బోధపడునట్టి కాలము రాకపోవుటయే మేలు. జాలిగుండె గలవాని భార్యవు నీవు. ఆరోమయములవలె నున్న సంసారముల సంగతి నెట్లు తెలిసికొనగలవు? తాళ్ళచెఱువులో నున్న మీతాటి యాకుల యిల్లు భూలోకస్వర్గము. పేరయేండ్లకు నది యాలాగుననే యుండవలెను. నా అదృష్టము వేరు. నేను నీవలెఁ బెనిమిటి కనుకూలముగా నడచుకొను దాననైనాను. ఆయన గూడ నీభర్తవలె శాంతమూర్తిగాదు. బిందక్కయ్యా! ఇన్నెందులకు? మాగొడవలు తలచి తలచి యడుగకు. ఈ సంసారపు పందెము మేముగూడ నొక్కసారి వేసిచూచినాము. అందులో గట్టిదెబ్బ తిని యోడిపోయినాము.

బిం—ఉమా! ఓడిపోయినట్లు నీవనుకొను చున్నావు. కాని నీవోడిపోలేదు. ఏదో మగఁడు చిన్నతనముచేతఁ గొంచెము తప్పుత్రోవపడినాఁడని యిరువదియేండ్ల పిల్లవు సమస్తము మునిఁగిపోయిన దానివలె నన్నియు వదలుకొని కూర్చుండుట బాగులేదు. ఇది నేనొప్పుకొను. నీకు కావలసినంత యదృష్టము పట్టఁదలఁచి యున్నది. ఏదో సాధనము చేసికొనుటకు వీలులేని యాపదలు లేవు. సరియైన ప్రయత్నముఁ జేసినయెడల మంచి మార్గమునకుఁ దిరుగనిమగవాఁడు లేఁడు. ఎడతెగని ప్రేమచేతను, పతిభక్తి చేతను, ఆఁడుది సుష్టుపఱచుకొనుటకు వీలులేని సంసారముండదు. మన యజమానులు అనఁగా మగవారు తమ కుక్కలమీఁద చూపించినట్లే చిఱునవ్వులు నవ్వుచు నొకప్పు డను రాగమును జూపుదురు. మఱియొకప్పుడు మనము వారిపాదములపైఁ బడి వేఁడుకొను చున్నను ఆపాదపద్మములతోఁ దన్ని వేయుదురు.

బిం—పైవిధమున నెంత బ్రతిమాలుచున్నను మనస్సుమాత్రము కలక దేఱినందున నామెమాట లన్నియు నప్రియములై దెలుపుచుండెను. ఉమకు గలిగిన యవమానముల నామె నోటినుండి చెప్పించి యామెకు బాధ గలిగించినందుకు బిందు మిక్కిలి విచారించెను. ఏలయన నుమ సహజముగా గర్వము గాంభీర్యము గలది గావున తనయవస్థ

నెవ్వరికిం దెలుపుట కిష్టము లేనిదై [illegible] డొకసేపు విచారించి బిందు మఱికొంతసేపు మారుమాటాడఁజాలకపోయెను. అయిన నుమమీఁద నామె కధికప్రేమ యుండుటచేతను, ఆమె మనస్సు స్వస్థపరచఁగల నను నమ్మకముండుట చేతను దనకు దగ్గఱచుట్టముఁ బ్రియసఖియు నైన యామెను దుఃఖమహారణ్య మధ్యమున విడిచిపోవుట కిష్టము లేక యామెను మఱింత దగ్గఱదీసి యక్కునఁ జేర్చి తలమీఁదఁ జేయివైచి నిమిరెను. ఉమయు మిక్కిలి యలసిపోయిన చంటిబిడ్డవలె తల కడుపులోఁ జేర్చి యామె యొడిలోఁ బండుకొనెను. అప్పుడు బిందు మెల్లగ నిట్లనియె. "అమ్మాయీ! ఉమా! నీవిలాటిమాట లాడకే. నీమాటలు వినఁగా నాకెంతో బాధగానున్నది. బాధలు దుఃఖములు మన కందరకు వచ్చును. మన స్థితిగతులెట్లున్న నాకష్టములను ధైర్యముతో నెదురుకొని మనము వాటిని జయింపవలెను. పూర్వకాలములో నాఁడవాళ్ళు అత్తమామలలోను, ఆడబిడ్డలలోను, గాఁపురములు చేయుచుండెడివారు. కొడుకులు తమసంపాదనమంతయుఁ దెచ్చి తండ్రిచేతిలోఁ బోసెడివారు. కోడళ్ళందఱు నత్తగారు చెప్పినట్లు నడుచుకొని పనిపాటలు చేసెడివారు. తల్లిదండ్రుల పెత్తనము క్రిందనుండి సంసారము లెంతో గుట్టుగా గౌరవముగా జరిగిపోవుచుండెడివి. ఈమాయకాలములో పెండ్లాలు కాపురానికి రాఁగానే యత్తమామల యదుపాజ్ఞలు లేకుండ, మగఁడు పెండ్లాము వేఱేయుండవలెనని బుద్ధులు పుట్టుచున్నవి. అన్నదమ్ములు వేరేయుండుటయేగాని మునుపటిలాగునఁ గలిసి యున్నకుటుంబ మొక్కటియు లేదు గదా. ఇది యొకందుచేత మంచిదైయె యుండవచ్చును. కాని క్రొత్తకాపురములు పెట్టినపుడు మగవాఁడు ఇల్లు దిద్దుకొనుటకు సమర్థుఁడై యుండవలెను. ఆఁడది గృహకృత్యములు నేర్చి యుండవలెను. ఉబలాటపడి క్రొత్తకాఁపురములు పెట్టుటయే గాని మనవాళ్ళవిమాత్రము నేర్చికొనుట లేదు. అందుచేత ననురాగ ముండవలసినచోట కలజడి, యైకమత్య ముండవలసినచోట వంతశ్శీతములు బయలుదేఱుచున్నవి. నామాటనమ్ము. మన సుఖదుఃఖములకు మన బుద్ధులు మనము కర్తలము గాని యదృష్టలోపములు గావు.

ఉమ—(కొంతవరకు మనస్సు కలకదేర) అక్కయ్యా! చూడగా నాబుద్ధికి మన పూర్వపుపద్ధతులే యింతకన్న సౌఖ్యములుగాఁ గనఁబడుచున్నవి. పెద్దవారికి జడిసి పడుచు మగవాళ్ళు భయభక్తులు గలిగి యుండెడివారు. కోడళ్ళు పనిపాటలు శ్రద్ధగలిగి చేసెడివారు.

బిం—అమ్మాయీ! మన మాడవాళ్ళము. ఈ మంచిచెడ్డలు విచారింపఁదగిన వాళ్ళము మనము కాము. ప్రపంచ మంతటఁ బూర్వపద్ధతు లణగిపోవుచున్నవనియు

నిప్పటి పద్ధతిప్రకారము మగఁడు పెండ్లాము ......నుండి తమ భార్యకొకరికి తగలనీయ కుండఁ దమకష్టసుఖములకుఁ దమరే పూఁచీపడి సంసారఘోరయుద్ధమును జేయుటకు ధైర్యసాహసములు గలిగి యుండవలెనని మీ బావగారు తరుచుగాఁ జెప్పుచుందురు. ఇదియే గాక మఱియొకటికూడ నున్నది. తమకుటుంబములనుండి బంధువులనుండి విడిపోయి ఏదోసత్కార్యమును మీఁదవేసికొని దానినిమిత్తమయి తమయావచ్ఛక్తివినియోగించువారనేకులు కలరు. సకల సకల సంసార బంధములను దెగగోసి యీశ్వరారాధనము నిమిత్తమే పాటుపడువారు కొందఱు గలరు.

ఉమ — అక్కయ్యా! ఈశ్వరారాధనమునకై తమజన్మము వినియోగించెడువారు ధన్యులుగదా. అటువంటి మహానుభావులు సంసారములు వదలివేసి చేతనైనంత మట్టుకు లోకుల కుపకారములు చేయుచు నొకచోట నిలువక దేశాటనము చేయుచు నెల్లప్పుడు బ్రహ్మానంద మనుభవించు చుందురనియు వారు వచ్చినపని ముగిసినవెనుక ననాయాసముగఁ బరమపదము పొందుదురనియు మనశాస్త్రములు చెప్పుచున్నవి. ధనపురములో మేమున్నప్పుడు కాషాయవస్త్రముల ధరించుకొని మాయింటి కప్పుడప్పుడు యోగులు యోగినులు వచ్చుచుండెడివారు. నేను వారిని దఱచుగా జూచెడిదానను. అప్పుడు నేను వారినెంతో గౌరవించి భోజనముపెట్టి వారు చూచిన దివ్యస్థలములను గురించి దేవాలయములను గురించి చిత్రచిత్రములుగ వర్ణించి వారు చెప్పుచుండఁగా రాత్రి ప్రొద్దుపోయెడిదనుక మేలుకొని యెంతో ఆసక్తితో వినుచుండెడిదానను. జ్ఞానులైన మన పెద్దలు దుఃఖభాగముచేతఁ గ్రుంకిపోయినవారి కటువంటి జీవనమే యుత్తమమని యేర్పఱిచినారు. అటువంటి నెమ్మది నాకుఁ గూడఁ గలిగిన బాగుండును.

బిం — ఉమా! వారు ధన్యులన్నమాట నిజమే కాని యది మనవంటివారికొఱకేర్పడినది గాదు. ఈ లోకములో మనవంటివారముగూడ ధన్యులమగుటకుఁ గొన్ని ధర్మము లేర్పడి యున్నవి. అవి మన నిత్యకృత్యములలోనే యున్నవి. ఈ కృత్యములను మనము భక్తిశ్రద్ధలతోఁ జేసితిమా మనము లోటు లేకుండ భగవంతు నారాధించినవారమే యగుదుము. దయాళుఁడైన భగవంతుఁడు మహామునులయొక్క, ఋషులయొక్క కార్యముల నెంతయాదరించునో మన చిన్నచిన్న పనులఁగూడ నంతగానె యాదరించును. ఈ విధముగా శ్రమపడి మనధర్మముల మనము నెరవేర్చితిమా యవసానకాలమందు గతదినములలో మనము జేసిన చర్యల నన్నిఁటి జ్ఞాపకము దెచ్చుకొని నిశ్చయముగా మనము శరీరము విడువవచ్చును. సర్వసాక్షిఅయిన భగవంతుడు గూడ మన చర్యలను మెచ్చును.

ఉమ — చెప్పు అక్కయ్యా ! చెప్పు. (అని బాష్పములతో నిండిన తన కన్నులెత్తి యామెవంకఁ జూచి) సంతాపము నొందిన నా మనస్సునకు నీమాట అమృతమువలె నున్నవి. చిన్నప్పుడు నీమాటలు నే నెంతో ప్రీతిగా వినుచుండెడి దానను. ఇప్పుడు పెద్దదాన నైన తరువాతఁగూడ నీ మాటలు నీ సలహాలే కావలసినదాన నైతిని. నేను పట్టి తెలివి తక్కువ మొద్దును. నాతల్లీ! నీకు దండము పెట్టుదును. గాని నేను చేయవలసినపని యేమిటో తెలియజెప్పి నన్ను నీ కడుపులోఁ బెట్టుకోవే.

బిం — "ఓసీ ఉమా ! అలాగంటివా నీకు స్మారకము లేదనుకొనవలసి వచ్చును. నీవంటి నిగర్వులున్నారఁటే. నీకున్న భాగ్యము, నీకున్నఠీవి మఱొకరికున్న పక్షమున జిన్నప్పటి స్నేహితులతో, అందులో మావంటి పేదవాళ్ళతో పల్లెత్తి మాటలాడుదురా? ఇంత మంచి మనస్సున్న యాఁడుది అన్నికష్టములుదాటి గట్టెక్కి తప్పక సుఖపడగలదు. ప్రస్తుతము నీకున్న బాధలను బోఁగొట్టుకొనుటకుఁ బ్రయత్నించు. ఆఁడుదాని కుండవలసిన శాంతము, విశ్వాసము నీ మనస్సులో నుంచుకో. అటుపిమ్మట పెనిమిటి మనస్సు మెప్పించిన భార్యవై కుమాళ్ళ తల్లివై యెంతోఅంత సుఖ పడుదువు" ఈ మాటలు వినఁగానే యుమయొక్క పెదవులమీద పచ్చియు రాని జిరునగవు కొంచెము మొలక లెత్తెను. కాని యామె దానికిఁ బ్రత్యుత్తరముమాత్ర మీయలేదు. అంతలోఁ దలవాఁకిట, గుఱ్ఱపుబండి చప్పుడు నౌకరుల పరుగులు గడబిడలు వినవచ్చెను. ఆధ్వనియేమో వెనుకటి యనుభవమునుబట్టి యుమ చక్కఁగా నెఱుఁగును. అంతట నామె తన పినతండ్రి కూతురువంకఁ జూచి లోలోపలనుండి వచ్చుచున్న గుబులు నడఁచుకొని మిక్కిలి మెల్లగా నామెతో నిట్లనియె : "బిందక్కయ్యా ! ఆ కిటికీలోనుండి యొక్కమారు చూడు. మా సంసారసౌఖ్యము కొంత నీ కగపడును" అనవుడు బిందావంకఁ జూచెను. చూడఁగానే యామెగుండె దడదడ లాడెను. ధనంజయుఁడు కోటలోనుండి యింటికి వచ్చెను. ఆయన కట్టిన వస్త్రములు చెదిరిపోయి యుండెను. ఒంటిమీఁద గుడ్డ యెఱుఁగక స్మారకము లేకయున్న యా పురుష విగ్రహమును సేవకులు పట్టుకొని మేడమీఁదికి దీసికొనిపోయి త్రాగిన సారామత్తు నిద్రలో దిగిపోవుటకై పండు కొనఁ బెట్టిరి. ఆయవస్థ జూడగానే బిందుకన్నులు బాష్పపూరితములు కాగాఁ నుమవద్దకు వచ్చి కౌగలించుకొని, "తల్లీ ఉమా ! ఆడఁది పడవలసిన బాధలు, అనుభవింప వలసిన యనుభవములు ననుభవించు చున్నావే అమ్మా ! నీవెంతబాధపడు చున్నావో దేవునకే తెలియవలెను. నాలుగుమూఁడు మాసములలోనే యెంతో మారిపోయినావు.

నీవు చిక్కి మారిపోయియున్నావు. అయితే అయినదియేలెమ్మా! తొందరపడకు. కోపగించుకొనకు. ఎంత దుఃఖము వచ్చిన నంతదుఃఖము పడకు. ఈబాధలన్నియు నెంతో రూపికతో పడుము. యిప్పటికిని, ఆయనను సంతోష పెట్టుటకు మంచిమార్గమున ద్రిప్పుటకుఁ బ్రయత్నముఁ జేయుము. ఇంతకంటె దుర్వ్యసనములలోఁ దగిలి తిన్నగా భ్రష్టులై పోయి తిరిగి బాగుపడి పవిత్రమైన సంసారసౌఖ్యమును మరిగి నడచుకొన్నవారినెందఱినో యెఱుంగుదును. ప్రకాశమానమైన నీబ్రతుకున కడ్డమువచ్చిన దుఃఖమేఘములను దొలగింప జేయుమని నేను దైవమును వేయివిధములఁ బ్రార్థించెదను. ఇది భగవంతుడే చేయవలెను. మనుష్యమాత్రునివలనఁ గాదు.

ఉమ__భగవంతుఁడుగాదు, నామరణమే యీదుఃఖమును దీర్చును. అని మెల్లగాఁ దనలో ననుకొనుచుండఁగా బిందు వెళ్ళెదనని చెప్పి కన్నులనుండి బాష్పములు దొరగ నామెను వదలి వెళ్ళెను.

---

## పదునొకండవ ప్రకరణము

### దేవీనవరాత్రములు

దేవీనవరాత్రములు సమీపించినవి. దేశ మంతయు నవనవ వికాసముతో నిండి యుండెను. స్త్రీలుపురుషులు తమకు, బిడ్డలకు నూతనవస్త్రములుసంపాదించియవిధరించుటకెంతో ముచ్చటపడుచుండిరి. పాఠశాలలు కట్టివేసిరి. పూజలు జరుగుచున్న గృహములలో నాటకములాడుటకు, జాతరలు చేయుటకు నేర్పాటు చేయఁబడెను. సింహవాహనము నెక్కిన వీరరసాధిదేవతయగు కాళికాదేవి యొక్క విగ్రహములు కుమ్మరవాండ్రు వెలకొలఁది చేసి యలంకరించి యమ్మఁజొచ్చిరి. గృహయజమానురాండ్రు, భోజనపదార్థములు సంగ్రహించుట మొదలగు ప్రయత్నములు విరివిగా చేయఁజొచ్చిరి. పెండ్లియైన కూతుళ్ళుగలతల్లులు తమ యల్లుళ్ళనిమిత్తమై మంచి మంచి పిండివంటలు వండి సిద్ధము చేసిరి. దూరప్రదేశములలో నుద్యోగములు చేయుచున్న పడుచువాండ్రభార్యలు పుట్టిన యిండ్లనుండి యీపండుగకుఁ దప్పక తమ భర్తలు వత్తురని నిశ్చయించుకొని దినములు లెక్కపెట్టుకొనఁ జొచ్చిరి. "నామగనికి సెలవుదొరకునా? దొరగా రాయనను కక్కడికి

రానిత్తురా? ఎందుకు రానీయరు? ఆదొరలు మాత్రము తమ స్వదేశములో నున్న తమ భార్యలను జూడవలయునని అప్పుడప్పుడు తలంచుకొనరా? అని భర్తల యాగమనమును బ్రతీక్షించుచున్న యువతులెంతోఁ దలంపఁ జొచ్చిరి.

భాగ్యవంతులకు విలాసవంతులకు భోగ మనుభవించు కాలమిదె. రహస్య స్నేహములు గలపడుచువాండ్రు తమ ప్రియురాండ్రతోఁ గలిసి పడవ షికారు వెళ్ళుటకై నావలద్దెకు పుచ్చుకొనిరి. నాటకశాలలో నృత్యగానములు సల్పుటకై తగిన యేర్పాటులు చేయఁబడెను. ఈమహోత్సవమునకు సర్వవిధప్రయత్నములు జరుగును గనుక ఇది యున్నదా అది యున్నదా యని వేరుగ నడుగనక్కరలేదు. ఈపండుగసంతోషము పట్టణములలోకంటెఁ బల్లెలలో విశేషముగా నుండును. భగవతియైన భూదేవి శరత్కాలపు పంటలను లోకమున కొసంగెను. రైతులు చేలుకోసి కుప్పలునూర్చుకొని భూయజమానులకు శిస్తులిచ్చివేసి ఋణదాతలకు బాకీమొత్తములుతీర్చి ధాన్యములు గాదులలోను పురులలోను బోసికొనిరి. మంచిపంటలు పండించిన కాఁపుల పడుచుభార్యలు గాదుల లోని ధాన్యము కొంతచాటుగఁ దీసికొని దగ్గరసంతలకుఁ బోయి ఆధాన్యమిచ్చి అంచు చీరలు, వల్లపూసలు, గాజులుకొని తెచ్చికొనిరి. స్త్రీలుఁ బురుషులు తమతమస్థితికిం దగినట్లు పోడిమిగఁ బంటపండుగులు చేసికొనిరి. మొత్తముమీఁద నీదేశములో నున్నట్లు పోడిమిగ తనివిగలిగి జీవించు పంటకాఁపులు లోకమందెక్కడను లేరు.

వానలు వెనుక బట్టినవి. మునుపు వందల కొలఁది మైళ్ళస్థలము నాక్రమించి పెచ్చు పెరిగి గట్లకగదాసిన మహానదులు ప్రవాహములు కాలక్రమమున సన్నగిలి నిజగర్భముల మాత్రమే యాక్రమించుకొని యుండెను. భూదేవియుఁ బావనస్నానముజేసి క్రొత్తబట్ట కట్టుకొన్న దానివలెఁ బచ్చనయు దార్ప్య రమణీయముగఁ గనఁబడెను. మనోహరమైన యాశరత్కాలమునందు చంద్రమండలము సంపూర్ణ ప్రభావంతమై పొలములమీఁదను బురములమీఁదను గ్రామములమీఁదను ఆరామములమీఁదను ధవళకిరణములం బ్రసరింపఁజేసి వెన్నెలలఁ గురియుచు మహానందజనక మయ్యెను. వాయువులు వేఁడిమియును జలియును లేక సుఖముగ శరీరముల స్పృశియించుచు భోగ్యములై యుండెను. వేయేల? ప్రతివస్తువు పండుగ దినములలో నుండవలసిన విధముగ సుఖప్రదముగ శుభసూచకముగ నుండెను. గ్రామములయందలి ప్రతిగృహమందు ధాన్యములను దంపుటవలనను చెరుగుటవలనఁ గలుగుచప్పుడులు వినఁబడుచు వచ్చెను, గుడిసెలలోఁ గాఁపురము సేయు

పేదలు గడ్డితోఁ దమయిండ్లను చేసికొనిరి. ఈశరత్కాలపు పూజ పంటకాలపు పూజయే యని చెప్పవచ్చును. ఏలయన, సింహరాశి వెనుకవచ్చెడు కన్యారాశినే సింహము మీఁద నెక్కివచ్చెడు పర్వతకన్య యైన పార్వతిగ జనులుభావించిరని తోఁచు చున్నది. సంతోషకరములైన యీపండుగ దినములు సయితము, ఉమకు సంతోషమును గలిగింపఁవయ్యె. స్వభావముచేత నామె మితభాషిణి. దానికిం దోడుగ మగని యనాదరణమును మనోరథ భగ్నతయు నామె హృదయమున లోతుగా నాటుకొనియెను. ధనంజయుఁడు ఉన్నత చిత్తయైన యామెకంట నెప్పుడు పడిన నొకవిధమైన సిగ్గును ఖిన్నతనమును బొందఁజొచ్చెను. కాని యతనివద్ద నున్న మంచిగూడ మనము చెప్పుకొన వలయును. తప్పుమార్గమును బట్టి సొమ్ము వమ్ము చేయుచున్న యాదూబ యసహ్యకరములైన తన దుర్వ్యసనముల మానవలయు ననియు మానలేకున్న నధమపక్షము పైకతిఘోరముగఁ గనఁబడకుండ నుండ వలయుననియు హద్దుమీఱకుండ నుండవలయుననియుఁ గొన్నినాళ్ళు ప్రయత్నించెను. కాని యతఁడు దుర్బలుఁడుఁ బరాధీనుఁడు నగుటచేతఁ జిరకాలమునుండి యాశ్రయించిన దురభ్యాసములు వానిప్రయత్నముల నణఁగఁద్రొక్కెను. అదియునుఁగాక, అతనివలన బ్రతికి, అతనినెత్తురుఁ బీల్చుచున్న స్నేహితులతని కొకవేళ మంచిబుద్ధి పుట్టినను మనసు విరిచి దానిని క్షణములో ద్రిప్పివేయఁ జొచ్చిరి. అందుచేత నెప్పుడైన క్షణకాల మతఁడు వ్యసనముల జిక్కక యున్నను వెంటనే మునుపటికంటె నెక్కువ యగాధములోదుముకుచు వచ్చెను. దానిఫలమేమన, తనభార్యకు మనోవ్యధ కలుగు నేమో యని తెలివి వచ్చినప్పుడు కొంచెమాలోచించుకొని సాధారణముగ భార్యయున్న లోపలిమందిరమునకు, బోవుటయే మానుకొనెను. ఉమ సంభవించిన దురవస్థం దలంచి లోలోపల కుళ్ళి దుఃఖము దిగమ్రింగుటయే గాని యొకరిని నిందింప లేదు. తనకడుపులో బాధ నొకరితోఁ జెప్పికొనలేదు. బిందు వచ్చి యీమెదురవస్థకు వగచినప్పుడు మీఁదపడి యేడ్చినప్పుడు గూడ ఉమ లేనిచిఱునవ్వు మొగమున దెచ్చి పెట్టుకొని తనగుట్టు చెప్పక యేవో మాటలతో నామెనోదార్చి పంపివేసెను. తనగృహకృత్యముల నెప్పటి యట్లె తప్పక చేసికొనుచు నామె బిందుతో ఇంతో శాంతముగాను అప్పుడప్పుడు సంతోషముగాను మాటలాడుచు వచ్చెను. అదియునుఁ గాక ఆమె రుచిగల వంటకము లెన్ని స్వహస్తముతోనే వండి, యనురాగబంధమును దెంపివేసి లోపలికి రానొల్లని యాజీవితేశ్వరుని కొఱకై చావడిలోనికిఁ బంపుచుండును.

అట శరచ్చంద్రుఁడు హేమచంద్రుని యింటికి తరచుగ వచ్చుట మానెను. అప్పుడప్పుడు బిందుమాత్ర మతని నొకసారిరమ్మని వర్తమాన మంపుచు వచ్చెను. ప్రతిదినము

మధ్యాహ్నమున బిందుయొక్క పనికత్తె కోసిన చెఱుకుముక్కలు, పంచదార నద్దిన యనాస పండుముక్కలు మఱికొన్ని భక్ష్యములు శరచ్చంద్రుని నిమిత్తము కష్టపడి సుధ సిద్ధము చేయుచున్నదని యాతఁడు స్వల్పకాలములోనే గ్రహించెను. "పాప మీయాఁడువాండ్రు నా నిమిత్త మింతకష్టముల పడవలయును? నానిమిత్త మిటమీఁద నీవస్తువుల దీసికొని రావ" ద్దని యతఁడొకటి రెండుసారు లాపనికత్తెతోఁ జెప్పుచు వచ్చెను. అట్లనుటయే గాని తెచ్చినప్పుడెల్ల నొక్కముక్కయైన మిగుల కుండ నతఁడు భక్షింపుచు వచ్చినందున నాబెట్టుసరి పైపయిదేగాని మనఃపూర్వక మైనది గాదని యాపనికత్తె గ్రహించి యెప్పటియట్ల ప్రతి దినము ఫలహారములఁ దెచ్చి పెట్టుచువచ్చెను.

ఇట్లు కొన్నివారములు గడువ దేవీనవరాత్రములు వచ్చెను. భవానీపురమందు మిక్కిలి సంపన్నుఁ డయిన దేవీప్రసన్నుని గృహమందు గొప్పయుత్సవములు జరిగెను. ఆగృహమందు గొప్పదుర్గావిగ్రహము పూజింపబడెను. అహోరాత్రము లెడతెఱపి లేక గానములు జరిగెను. అచ్చటి జాతరలు నాటకములు చూచుటకు జనులు గుంపులు గుంపులుగ వచ్చిరి. దేవీప్రసన్నునిభార్య ముంయ వసారాలో నొక తెఱవెనుకఁ గూర్చుండి మూఁడు రాత్రులు దీపములు పెట్టినది. మొదలు తెల్లవారు వఱకు మేలుకొని కన్ను మూయక జాతరలు చూచెను. ఇరుగుపొరుగున నున్న గౌరవము గలయిండ్లలో స్త్రీలందరు వచ్చి యామెచుట్టునుఁ గూర్చుండి యాయుత్సవములం జూచిరి. అక్కడి నాటకపు కథలు రాధాకృష్ణుల శృంగారకథల నుండి తీసికొని వ్రాసినవి. పాడినపాట లెంతో రమ్యముగా పరవశము చేయునవిగా నుండెను. చూడవచ్చిన స్త్రీలు తమబిడ్డలను గూడ దీసికొనివచ్చి రాత్రియంతయుఁ దమలపాకుల నములుచు, కథాభాగముఁ జెవులు దోరబెట్టుకొనివినిరి. ఆనాటకప్రయోగమందు విరహతాపముచేత బాధపడుచున్న రాధ యనురాగ బద్ధుఁడయ్యుఁ దన్ను వంచన జేసి పోయిన యాటక్కరి గోపాలకృష్ణుని లీలలను గూర్చి గానము జేసి యేడ్చినప్పుడు, చూడవచ్చిన స్త్రీలందరు విశేషముగ దుఃఖించిరి. దేవీ ప్రసన్నునిభార్య బిందునుగూడ బిలిచినందున వెళ్ళకపోవుట మంచిదిగాదని యామెకూడ నుత్సవమునకుఁ బోఁ దలఁచి యొకనాటిరాత్రి బిడ్డల నిద్దరను సుధ కప్పగించివెళ్ళి రాధాకృష్ణ నాటకములను జూచెను. ఆమె తిరిగివచ్చి భర్తతోఁ గలిసి మాటలాడు నప్పటికి తెల్లవారెను "నాటకము చక్కగా నున్నది. ముఖ్యముగాఁ దనమీఁద మహాకోపము దాల్చినరాధకు శ్రీకృష్ణుఁడు బతిమాలినకథపట్టు మిక్కిలి బాగున్నది మీరొక రాత్రి వెళ్ళి యెందుకు చూచి రాఁగూడదు?" అని బిందుభర్తతోఁ బలికెను. "చాలు

చాలు; కొత్తగా గాపురమునకు వచ్చినప్పుడు నారాధను నేను బతిమాలువప్పటికే నాప్రాణము విసికిపోయినది. ఆయనుభవము మఱొకసారి నాకక్కరలేదు" అని హేమ చంద్రుఁడు పరిహాసముగా బదులుచెప్పెను. "లేనిపోనికథలు కల్పించకండి. నానెత్తిమీద నపవాదులు వేయకండి. మీకు పాపము రాఁగలదు" అని తనచేయి మగనినోటికడ్డము పెట్టెను.

దేవీపూజ, ఆశ్వయుజ శుద్ధ నవమినాటితో సమాప్తమయ్యెను. ఆదినము గొప్ప యుత్సవము జరిగెను. క్రిక్కిరిసిన వీధులలోను, గృహములలోను కూడలి మొంద లగు ప్రదేశములలోను నదీతీరములను మృదంగాది వాద్యముల ధ్వనులు ఫిక్కటిల్లెను. స్త్రీలు బురుషులు తమకుఁగల సమస్తాభరణములం ధరించి మేలి వస్త్రములను గట్టుకొని సముద్రతరంగములవలె వెనుకకు ముందుకుఁ బోవుచు వీధులు నిండిరి. పేదలలోఁ బేదలు కూడ నెట్లో సంపాదించి క్రొత్తబట్టలఁ గట్టుకొనిరి. భాగ్యవంతులు వైభవములచేతను దానములచేతనుఁ దమభాగ్యముల బ్రకటించిరి. దేవీవిగ్రహములను భేరీమృదంగాది వాద్యములతోను సంగీతములతోను వీధుల వెంబడి నూరేగించిరి. సాయంకాలము కాఁగానే యీయూరేగింపులు కాగడాలతోను, నెరదీపములతోను బచ్చుదీపములతోను జరిగెను. ఊరేగింపు కాఁగానే ప్రతి విగ్రహము నదిలో బాఱఁవేయఁబడెను. అనంతరము చిత్రమై సంతోషకరమై హిందూదేశమందు మాత్రమే వ్యాప్తమయిన యాచారము జరిగెను. అది యేదనఁగా గొన్ని మాసముల క్రిందటను సంవత్సరము క్రిందటను మిత్రులు బంధువులు, తల్లిదండ్రులు, బిడ్డలు, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు నొక్కసారి కలిసికొని పరస్పర యోగక్షేమము లడిగి తెలిసికొనుట, పెండ్లియైన యాఁడు పడుచులు మేలిముసుఁగు వేసికొని భర్తలకును బెద్దలకును మ్రొక్కుదురు. చిన్న పిల్లలు గుంపులు గుంపులుగాఁ గూడి బంధువుల దర్శనము చేయఁదలఁచి వారు బసలుదిగి యున్నగృహము లన్నిఁటికిఁ బోవుదురు. ముసలమ్మ లాబిడ్డలను గౌఁగిలించుకొని కన్నుల నానంద బాష్పములు గారఁ జిరంజీవులు గమ్మని వారిని దీవింతురు. "నానెత్తి మీఁద నెన్నివెండ్రుక లున్నవో యన్నియేండ్లు బ్రతుకవలెను. లక్ష్మీదేవియు సరస్వతీదేవియు మీయిండ్లలో శాశ్వతముగాఁ బడియుండవలెను. మీరు బంగారపు కలములఁ జేతఁబట్టి పేరుప్రతిష్ఠ సంపాదింప వలయును. కుమాళ్ళతండ్రులై మనుమలను మునిమనుమలను నెత్తి సుఖముగా నుండవలయును" విలువ గలదుస్తులు ధరించి వచ్చి తమ పాదములకు భక్తితో మ్రొక్కిన చిన్నబిడ్డలను తలలు నెఱసినవృద్ధస్త్రీలు కొందరు నీవిధమున మనఃపూర్వకముగా

దీపించిరి. ఈయుత్సాహములోఁ బూర్వము మనస్సులో నాటుకొనియున్న కోపము, అసూయ మొదలగునవి యంతరించిపోయెను. అనేకసంవత్సరములనుండి మనస్సులు విరిగి పోయి మాటలులేక యున్న చుట్టములు స్నేహితులు ఆనాఁటిరాత్రి సమాధానపడి నట్లును, తల్లిదండ్రులమీఁద కోపగించి యిల్లు విడిచి లేచిపోయిన పెంకి పిల్లలు పశ్చాత్తాపపడి యెంతో వినయముతో మరల మాతాపితలను జేరినట్లును అనేక నిదర్శనములు గలవు. సర్వజన సంతోషకరమైన యీదిన మనేకాభిప్రాయ భేదములను నణఁచి వేయును. అనేకహృదయ వ్రణములను మాన్పివేయును. మరియు వైరములు శాశ్వతములు కావనియు పొందుగలిగి యున్న యెడల లాభము గలవనియు స్త్రీలకు బురుషులకుఁ దెలియఁ జేయును.

బిందు రాత్రి భోజనము ముగించునప్పటికి రమారమి పదియొకండుగంట లయ్యెను. బిడ్డలు నిద్రపోయిరి. సుధయు భోజనముచేసి పండుకొనఁ బోయెను. హేమచంద్రుఁడు గూడఁ బండుకొనెను. హిందూగృహములలో నున్న వాడుకప్రకారము గృహయజమాను రాలొక్కతెయే భోజనముచేసెను. పనికత్తెయుఁ బగలెల్ల పనిచేసి యింటికి బోయెను. భోజనానంతరము బిందు వంటయింటి తలుపుమూసి గొళ్ళెమువేసి మేడ మీఁదికిఁ బోవఁదలచు చుండఁగా నెవరో తలుపుఁ దట్టినట్లు చప్పుడు వినఁబడెను. "ఇంత ప్రొద్దుపోయిన తరువాత వచ్చువారెవరు చెప్పుమా" అని సందేహించి బిందు తలుపుఁ దీయక యూరకుండెను. అంతలో నాచప్పుడు రెండవమారయ్యెను. "ఎవరాతలుపుదగ్గర" అని యామె బిగ్గరగా నడిగెను. అందుకుఁ బ్రత్యుత్తరములేదు. భర్తకొరకైవచ్చి యుండురేమో యని యాయన నొకసారి యామె లేపఁదలఁచెను. కాని హేమచంద్రుఁడు మిక్కిలి యలసిఁ పండుకొని నిద్రపోవుటచేత వచ్చిన మనుష్యునిపేరు తెలియకుండ మగనిని లేపుటకామె యిష్టపడదయ్యెను. ఇష్టపడక మెల్లమెల్లఁగా నడుగులు పెట్టుకొనుచు వీధితలుపుదగ్గరకు వెళ్ళి నెమ్మదిగాఁ దలుపుతీసెను. తీయఁగానే యొకమనుష్యుఁడు లోపలఁ బ్రవేశించెను. అతఁడెవరో చీకటిలో బిందునకుఁ దెలియలేదు. కాని యొక నిమిషములోనే వచ్చిన యతఁడు శరచ్చంద్రుఁడని యామె తెలుసుకొనెను. కాని యతఁడెంతో మార్పుజెంది యుండెను. అతని తలవెండ్రుకలు చాలకాలమునుండి కత్తిరించుకొనక పోవుటచేత మొగముపై బడజొచ్చెను. అతనికన్ను లెప్పటియట్లుండక మునుపటికంటె మెరయుచుండెను. అతని మొగము తెల్లబడెను శరీరము మిక్కిలి కృశించియుండెను. భుజములపైనున్న యుత్తరీయము ఉండవలసినంత పరిశుభ్రముగా లేదు.

"బిందూ! ఇంతకాలమునుండి నిన్ను జూచుటకు రానందుకు నీవు నన్ను క్షమింపవలెను. ఈవేళ ఆశ్వయుజ శుద్ధ దశమి యగుటచేత నీకు నమస్కారములు చేసి పోవలెనని వచ్చితిని" అని శరచ్చంద్రుడు పలికెను.

"అబ్బాయి! నీవు చిరంజీవివై త్వరగాఁ బెండ్లికొడుకవుగమ్ము. నేను బ్రతికి యుండగా నీవు ఒక యింటివాఁడవై హాయిగా నున్నప్పుడు నిన్ను చూడవలెనని యున్నది. అప్పగారు తమ్మునికింతకంటె నెక్కువ దీవనలేమి యివ్వఁగలదు" అని బిందు బదులు చెప్పెను.

అందుకు శరచ్చంద్రు డేమియు నుత్తర మీయక వంగి బిందు పాదములకు నమస్కారము చేసెను. బిందు వానిని మరల దీవించి లేవనెత్తెను. అప్పుడు వారిట్లు మాటాడిరి.

బిం—నీ క్షేమవర్తమానము మేము ప్రతిదినము వినుచుండుటచేతను మాకేదైన దిక్కు సంభవించినయెడల నీవు తప్పక వచ్చి సహాయము చేయుచుందువని నమ్మి యుండుటచేతను నీవిన్నాళ్ళనుండి మాయింటికి రాలేదని నాకుఁ గోపములేదు. కాని నాయనా! రాత్రి పగ లొక్కటేవరుసను జదివి శరీరము పాడుచేసుకొనుచున్నావేమి? ప్రాణములకంటెఁ బుస్తకము లెక్కువా? నీకండ్లు గుంటలు పట్టినవి. మొగము తెల్లబడినది. నీవు రాత్రి చాల ప్రొద్దుపోయినదనుక మేలుకొను చున్నావని తోఁచుచున్నది. నీవు చిన్నప్పటినుండి యుక్తాయుక్తములు చక్కగా నెరిఁగినవాఁడవు నీకు నేను చెప్పవలసిన యవసరమున్నదా? నామాట విను. రాత్రులు సరిగా నిద్రపో. అన్నము వేళపట్టున తిను. నీవంటి తెలివితేటలు గలవాఁడు పరీక్షలను గురించి భయపడనక్కరలేదు."

శర—(చిఱునవ్వుతో) బిందూ! పరీక్షలలో నెగ్గుటవల్ల మనుష్యునికి సౌఖ్యము కలుగునా? మన హేమచంద్రుఁడు ఏ పరీక్షలయందు నెగ్గినాడు? అతఁడు పొందెడు సౌఖ్యములలో నూరవవంతైనఁ బొందెడివారెంద రున్నారు?

బిం—ఇన్ని సంగతులు తెలిసినవాఁడవు పరీక్షకోసము బెంగపెట్టుకొని శరీరము చెడగొట్టుకొవలసిన యవసర మే మున్నది?

శర—పరీక్షను గురించి నాకు బెంగే లేదమ్మా!

బిం—అట్లయిన నీకీ మనోవేదన, బెంగ దేనివల్ల కలిగినది?

అందుకు శరచ్చంద్రుఁడు ప్రత్యుత్తరము చెప్పక యెత్తుగానున్న చప్టామీఁద బిందును గూర్చుండఁబెట్టి యామె ప్రక్కను దాను కూర్చుండి యామె రెండు చేతులు పట్టుకొని తన వొంగముమీఁదఁ బెట్టుకొనెను.

బిం—ఇదేమిటోయి కంటనీరు పెట్టుకొనుచున్నావాయేమి? నేను వినగూడని బెంగ యేదైన నీ మనస్సులో నున్నదాయేమి?

శర—మనమిద్దరము అప్ప తమ్ముఁడు పెరిఁగినట్లు పెరిగినాము. నీవు వినఁగూడని బెంగలు నా హృదయములో నేమియు లేవు. నీ మనస్సులో నున్నది మర్మము లేకుండ నీవు నాతోఁ జెప్పుదువు. అలాగే నేను నీతోఁ జెప్పుదును.

బిం—అది తెలిసియుండియు మన చిరకాల స్నేహము మఱచి నన్ను గ్రొత్త దానివలెఁ జూచుట నీకు ధర్మమా?

శర—నీవే క్రొత్తదానవైతే ఇఁక నీ లోకములో నావాళ్ళు లను శబ్దము నా కుండనే యుండదు. నాకడుపులో నున్నది దాఁచక నీదగ్గఱ వెళ్ళబోసుకొనుటకే వచ్చినాను. కాని నేను పట్టి దురదృష్టవంతుఁడను. నిర్భాగ్యుఁడను (అని అతఁడు గొంచెము వడఁకెను అతని కన్ను లెఱ్ఱబడెను.)

బిం—(ఆతురతతో మెల్లఁగా) భయపడకు. నీ మనస్సులో నున్నదంతయు అప్పగారివంటిదాన నగు నాతోఁ జెప్పు.

శర—చెప్పనా? కాని నా మనస్సు పాడుమనస్సు అయిపోయినది. నేను స్నేహమున్నచోట ద్రోహముచేసిన పాపాత్ముఁడనైనాను. మా అప్పవంటిదానవు నీవు కనఁబరచిన దయకు విశ్వాసఘాతుకుఁడనైతిని. నా హృదయము చీఁకటివలె నల్లగానున్నది. ఇటువంటి పాడుహృదయము నీకుమాత్రమెట్లు వెల్లడిచేయగలను! (అని యతఁడు ఆమె వ్రేళ్ళు ఎఱ్ఱబడునట్లు బిందు చేతులు గట్టిగాఁ బట్టుకొనెను.)

శరచ్చంద్రుఁడు అప్పటికిని గడగడ వడకుచుండెను. అతనికన్నులు నిండనిప్పులవలె ఎఱ్ఱపడెను. ఇటువంటి స్థితిలో నతని నెన్నఁడును బిందు చూచియెరుఁగదు. చిన్నతనము నుండియు వానిని సోదరభావముతోఁ జూచుచున్న తన విషయమున నతఁడు చెడ్డతలంపులు తలంచుచుండునా యని యామె యొకసారి సందేహించి, అటువంటిది స్వప్నమందైన జరుగదని మరల నిశ్చయించుకొని మరల భయంకరాకారముతో నొడలు

తెలియనియట్టులున్న యీ పడుచువానిని జూచి మనస్సులో భయపడి యీ భయమును నివారింపఁ బ్రయత్నించి మునుపటివలెఁ జనువుతోఁగాక కొంచెము కఠినముగా "నేను నిన్ను చిన్నప్పటినుండి నా తమ్మునివలె జూచినాను. మీ యప్పవలె నీవు నన్ను చూచినావు. అందుచేత అప్పగారితోఁ దమ్ముఁడు చెప్పవలసిన విషయమైనయెడల నీమనస్సులో నున్న సంగతి తప్పక చెప్పుము" అని పలికెను.

శర—అయ్యో ! నా మనస్సులో నున్న యూహలు అప్పగారితోఁ జెప్పఁదగినవి కావే.

బిం—అయినఁ జెప్పకు. అందుచేత నీ ప్రకారముగాఁ నీవు పట్టుకొనఁగూడదు. అప్పగారియెడల నెంతగౌరవ ముండవలెనో యంతగౌరవముతో మాటాడుము. (అని కోపముతోను దుఃఖముతోను బదులు చెప్పెను.)

అంతట శరశ్చంద్రుఁ డామె చేతులు వదలివైచి తల వంచుకొనియెను బిందు తత్తరపడి "అంతటి దయాళుఁడై అంతటి సత్యవంతుడై అంత శాంతస్వభావుడై యున్న ఈ చిన్నవాఁడు అట్టి చెడ్డతలంపులను మనస్సులోఁ బెట్టుకొనియుండునా ?" యని మరల వితర్కించి సందేహమునుండి విముక్తురాలై ధైర్యముతో నిట్లనియె "అబ్బాయీ ! నేను వినఁగూడనిది నీ మనస్సులో నేదియునుండదు. నీ మనస్సులో నున్నది స్వేచ్ఛగాఁ జెప్పు. నేను వినఁదలచుకొన్నాను."

శర—ఈదయఁ జూపినందుకు భగవంతుఁడు నీకు సకల సౌఖ్యములిచ్చుగాక ! నేను మర్మమువిడిచి నా మనస్సులో నున్నది నీతోఁజెప్పెదను గాని నేను చెప్పకమునుపు నాకొక అభయప్రదానమిమ్ము. ఈనా కోరిక నెరవేరక భగ్నమై పోయినయెడల నా మాటలు నీ హృదయములో నే స్థాపితములై యుండవలయును. గాని యెన్నఁటికినిఁ బైకి రాగూడదు.

ఆశ లడుగంటిపోవ, దీర్ఘ విచారమగ్నుండనై, బ్రతుకవలసిన దుర్గతి నాకుఁ బట్టవచ్చును. కాని నేను దానికి సిద్ధుచేయను. నాకంటె పవిత్రయై, గౌరవార్హయైన పడఁతిని గురించి లోకులు కాకులట్లు తేలికమాట లాడుట నా కిష్టములేదు.

"శరచ్చంద్రుఁడా ! నీవు నామాట నమ్ముము. నేను నీ రహస్యమును బయటఁ బెట్టను" అని బిందు ప్రత్యుత్తరము చెప్పెను.

అంతట శరచ్చంద్రుఁడు తన యంతరంగ సంక్షోభము నడఁచుటకో యనఁ జేతులను హృదయముమీఁదఁ బెట్టి యదుముకొని ప్రార్థనపూర్వకముగా బిందు హస్తమును బట్టుకొని తన మొగమామె కగపడకుండ చేయుటకై తలవంచికొని స్పష్టముగా వినఁబడని సన్న యెలుగుతో నిట్లనియె : 'నీ చెల్లెలు'. నిర్మలహృదయముగల యా వితంతువు సుధ, భూలోకమునకుం దిగివచ్చిన యప్సర. ఆమె నా భార్యయగున ట్లనుగ్రహింపుము.

శరచ్చంద్రుని హృదయమందలి మోహపు జడివాన నిప్పుడు బిందు గుర్తెరింగెను. కడచిన యారుమాసముల చిత్రచరిత్ర యామె కిప్పు డర్థమయ్యెను. హిందూవితంతు వివాహము పరమ పాతకము, లోకనింద; ఆలోచించుటకు వీలులేని వెఱ్ఱితలంపు.

అట్లెఱిగియు నతఁడు చంచలమైన యామోహము పలికించిన ప్రేరణ నిట్లు పలుకఁజొచ్చెను. "అక్కా! బిందూ! నామాటవినుము. నమ్మినందుకు ద్రోహముచేసిన దుర్మార్గుని మాట వినుము. మీరు చూపిన యాదరణకుఁ గృతజ్ఞత లేక విశ్వాసఘాతుకుఁడైన వాని మాట వినుము. తొల్పుకాయ గ్రామమున మీయింటి వితంతువై యుండిన మీచెల్లెలు సుధను నేను చూచి యాఱుమాసము లైనది. చూచినతోడనే నాలో క్రొత్త జీవనము బైలుదేరినట్లు నేను తెలిసికొంటిని. అంతకుముందు నే నేకాకియగు విద్యార్థిని. పుస్తకములుతప్ప నాకు మిత్రులులేరు. చదువు తప్ప వేఱే వ్యాపారములేదు. పడుచువాండ్ర యన్యోన్యానురాగములంగూర్చి నేను పుస్తకములలో మాత్రమే చదివితిని. కాముకులు రంగస్థలము మీఁదినటులని తలంచితిని. ఈశ్వరదత్తములైన సహజమాధుర్య సౌందర్యములు కలిగి తన వైధవ్య మందభాగ్యతయేమో గుర్తెఱుంగక యుండిన యా యమాయకురాలిని, అనవనీతహృదయురాలిని, ఆచిన్నదానిని నేను చూచినప్పుడు నాకదివఱ కెన్నఁడును గలుగని - యిట్టిదని వర్ణింపరాని యొక మనోవికారము కలిగెను. కాలమే క్రమక్రమముగ నట్టివికారము నడంచు నని నేను నమ్మియుంటిని. నావిద్యాగోష్ఠి, తత్సంబంధమగు వ్యాపారములు దానిని తుడిచివేయునని విశ్వసించియుంటిని. కాని నేను కలకత్తాకు వచ్చినతరువాత, పెరిగిన నామోహము దూరమున్న తరువాత అది మంతకంతకు నాకెక్కువైనది. అక్కా! బిందూ! దినదినము మీయింటికి వచ్చినప్పుడు నన్ను సోదరప్రేమను జూపి సమాదరించితివి. తమ్మునిగారాము సేయుచుంటివి. యన్నవలెనే ప్రేమముచే నన్ను గారవించెదవు. హృదయమునందు మోహాగ్ని రవులుకొల్పుచు, మాటలయందు మాయచేయుచు నేను మీపవిత్రగృహముఁ జొచ్చితిని. అనేకమాసము

సౌందర్యముగల యాదివ్యవిగ్రహమును కనుల పండువుగా నేను చూచినకొలంది నిషిద్ధమైన యాప్రేమరసమును నేను జుఱ్ఱుకొన నారంభించితిని. పలుమఱులు సాయంకాలము దిక్కడకువచ్చి నక్షత్రము లాకాశమున జ్యోతులవలెఁ బ్రకాశించువరకు నేనామె ప్రక్కను గూర్చుండుచు వచ్చితిని. అపుడు నామనస్సున బైలుదేఱినవికాసము నాయంతరంగము నుఱ్ఱూతలూపుచు వచ్చెను. నీకు దయకలదేని పిచ్చివాని విపరీత భావములను క్షమింపుము. నమ్మినవారియెడ ద్రోహముచేసిన మూర్ఖుని దురాలోచనలను మన్నింపుము" అని శరచ్చంద్రుఁ డాగెను. ఆగుటయు బాష్పపూర్ణములైన యాతని నేత్రములు తళతళ మెఱసెను. అట్లాగ నిముసమాగి ప్రశాంతస్వరముతో మరల నిట్లనియె.

"ఒక నాఁటి సాయంకాలమున నేను కన్నులు తెరచితిని. నేనొక పెద్దగోతిలోఁ బడియుంటినని తెలిసికొంటిని. నేను సుఖనుకూడ బాధించుచుంటినేమో యను భయమునఁ బిచ్చియెత్తినట్లయితిని. నాయొనర్చిన యపరాధమునుండి పాపమునుండి భగవంతుఁడామెను గాపాడెనని నేను నమ్మి నా మనస్సులో నేపడుచున్న యపారబాధ యించుకేనియు నామెకుఁ దెలియకుండఁ జేసితిని. ఆదినము మొదలుకొని నేనుమీయిల్లు వదలిపెట్టి తిరిగి గుమ్మము త్రొక్కి చూడలేదు. మఱచిపోవుటకై ప్రయత్నించితినిగాని నా ప్రయత్నములు వ్యర్థమయ్యెను. ప్రాణముతోనే గాని తుడిచివేయుటకు వీలులేని భావములు కొన్నియుండును. పనిబడ్డుఁడు చేతులెత్తి ప్రవాహము నాపుటకుఁ బ్రయత్నములు చేసినట్లు నేనీరెండు మాసములు నాయనురాగ ప్రవాహము నాపఁబ్రయత్నించి వ్యర్థుఁడనైతి. నామనస్సు పుస్తకములమీఁద స్థిరముగ నిలువుటకుఁ బ్రయత్నించితిని. నాట్యరంగములకుఁ బోయి నా మనస్సును కేళీలోకమార్గమునకుఁ ద్రిప్ప సమకట్టితిని. సెలవుదినములలో నా కళాశాలలోని విద్యార్థులతోఁ గలిసి మెలసి, యాడితిని; పాడితిని, ముచ్చటించితిని. ఎన్నో సంగీత సభలకేగి గానమును వింటిని. కాని యొక్కదినము కాదు కదా? యొక్కనిముసమైన నేనీ తలంపుల మఱవజాలనైతిని.

ఈ రెండుమాసముల చరిత్రను చెప్పి నీకు విసుగుపుట్టింపఁ దలచుకొనలేను. తలఁదాచుకొనుటకిల్లులేక వీధిలోనే కాలక్షేపము చేయు నిర్భాగ్యుఁడుసైతము నాపడిన పాటులు పడియుండఁడు.

అక్కా! విను! నా మనస్సులోనున్న దున్నట్లు చెప్పుటకు నీవనుమతించితివి గావున నేను నిర్భయముగఁ బలికితిని. ద్రోహిని గర్హించినట్లు గర్హింపక నా మీఁద మునుపు చూపిన ప్రేమ చూపుము. మైత్రి తగ్గింపకుము. నేనెంతో పాపము చేసితిని.

నేను నిన్ను వంచించితినను మాట పరమేశ్వరుఁడెఱుఁగును. నీవు నాయెడలఁ దిరస్కారముఁ జూపుదు వేని, ప్రపంచములో నిఁక నామీఁద నభిమానముఁ జూపువారెవరు? నేను మునుపు గట్టి మనోధైర్యము కలవాఁడ ననుకొంటిని. ఇప్పుడు పసిబిడ్డకన్న బలహీనుఁడను. అక్కా! బిందు! నన్ననుగ్రహింపుము. నన్ను దిరస్కరింపకుము."

ఆ పలుకుల కేమని బిందు ప్రత్యుత్తర మీయఁగలదు? హిందూ వితంతువు యొక్క వివాహము తలఁచుకొనుటయే పాపము. ఆకార్యము మహాపాతకము కంటె ఘోరకృత్యమని హిందూ ప్రపంచమంతయు మీఁద పడును. ఆమాట బిందు శరచ్చంద్రున కప్పుడెట్లు చెప్పఁగలదు? ఆశాభంగము చేత నా పసివాఁడు ఘోరకృత్యమే దయినఁ గావించుకొనవచ్చును, లేదా బ్రతికియుండఁగానే యతఁడాశాభంగముచేత నుత్సాహ మెల్ల డీలువడి మరణదుఃఖ మనుభవింపవచ్చును.

కాని యా యువతి, యువతీజన సామాన్యమైన విజ్ఞానము, వివేకము మెఱయ, లేనిశాంతముఁ దెచ్చిపెట్టుకొని యెంతో సానునయముగ నిట్లు పలికెను.

"శరచ్చంద్రుఁడా! దుఃఖపడకుము. పాపము చేసితినని, నేరము చేసితినని నిన్ను నీవు నిందించుకొనకుము. చిన్ననాఁటనుండియు నాతమ్మునివలె నిన్నుఁ జూచుకొన్న దానను నేను నిన్నుఁ దిరస్కరింతునా? భగవంతుఁడు నాకన్నదమ్ముల నియ్యలేదు. ఆ ప్రేమ విడనాడి యిప్పుడు నేను నిన్ను దిరస్కరింతునా? నేనాలాగున చేయలేను. సాధువైన యాఁడుదిగాని మగవాఁడుగాని తిరస్కరింప వలసినంత మహాపాపము నీవు చేసిన దేదియు లేదు. సంఘసంస్కర్తలు కొందఱు పైలుదేటి యీ నడుమ వితంతు వివాహములను మఱల నుద్ధరించినను, మనయాచారములు వితంతు వివాహములను సమ్మతింపవు. అబ్బాయి! నీవుకోరిన కోరిక మిక్కిలి యసాధ్యమైనది. ఈవిషయమై భర్తగారితో మాటలాడి, యాయన యిష్టప్రకారము నిర్ణయింపవలెను. కావున దుఃఖింపకుము. నా భర్తగారు దీనిని సమ్మతించినను సమ్మతింపకపోయినను మేము బ్రదికియున్నంత కాలము నీమీఁద మాకు మునుపటియనురాగమే, మునుపటి దయయే, మునుపటిమైత్రియే యుండునని నిశ్చయముగా నమ్ముము"

శరచ్చంద్రుఁడు—అక్కా! నీవింతదయగా మాటలాడినందుకు పరమేశ్వరుని యనుగ్రహవర్షము నీపైఁ గురియుఁగాక! నేను నాపాపములను దాపక యొప్పుకొనిన యీ పాడుదినమున నాస్నేహితురాలు మహాకోపమున మొగము త్రిప్పుకొనక యెప్పటి మైత్రినే నాపై నెఱపునట్లు చేసిన యీ వాగ్దానమును నేనెన్నఁడు మఱవను."

బిం—"నీవు మాపైఁ జూపిన ప్రేమకు, మామీఁద గురిసిన దయావర్షమునకు మేము కృతజ్ఞులమై యుండక, యీమాత్రమునకే కోపించి మొగముల ద్రిప్పుకొన్నచో మేము నాశనమై పోవలసినదే. గాని యీరాత్రి యాసంగతి మఱలఁ దలపెట్టకుము. మఱియొక ప్రసంగము చేయుదుము. నీవు భోజనము చేసినట్లు లేదు. ఏమైనాతిందువా? మావారికని మిత్రము పలుచనియట్లు పోసినాను. అందులోఁ గొన్ని మిగిలినవి. కాళ్ళు చేతులు కడుగుకొని నాలుగట్లు భక్ష్యములుతిని యింటికి వెళ్ళుదువు గాని."

శర—అక్కా! నన్ను క్షమింపుము. నాకేమియుఁ దినవలెనని లేదు. తింటినా జబ్బుచేయును. నేనింటికి వెళ్ళెదను. నేను కొంచెము విశ్రమించవలెను.

బిం—అట్లయిన రేపుదయమున వచ్చి మావారితో నాలోచింపుము. నీ మనస్సులో నున్న దంత వారి యెదుట వాకొని చెప్పుము.

శర—"హేముని మోసట నా పక్షమున నీవే వహించి వాదింపుము. అంతయు నీకే వదలివేసితిని. ఈ విషయ మేదో తేలువరకు నే నతనినిఁ గలుసుకొనఁ జాలను."

బిం—"ఇది లోకములో లేని వ్యవహారము గనుక మావారు దీని నిటో యటో తేల్చుటకుఁ గొంత కాలము పట్టును. ఈలోపున నీవెప్పటి వలెనే యప్పుడప్పుడు మాయింటికి వచ్చుచుఁ బోవుచుండుము."

శర—ఈ వ్యవహారము తేలువరకు హేమునిగాని సుధనుగాని నేను చూడఁ దలఁచుకొనలేదు. నన్ను క్షమింపుము. కాని యీసంగతి పొంచాటున నైనను, ఆమె చెవి చేరనీయకుము. ఆశాభంగము చేతను, దుఃఖముచేతను గుందవలసి నట్లు నావిధి యుండవచ్చును. కాని సుధ బాధ పడవలసిన యవసరము లేదు."

బిం—"అయితే సరే. నీవే వచ్చి మమ్ముఁ జూచుట కిష్టములేక పోయిన పక్షమున మావారేమి నిర్ణయింతురో నీకు జాబువ్రాసి తెలియఁజేసెదను."

శర—"వద్దు వ్రాయవద్దు. నేనే యెప్పుడో వచ్చి యాసంగతి రహస్యముగా దెలిసికొని పోదును. నే నెప్పుడు రావచ్చునో, యెప్పుడు మీనిర్ణయము తెలిసికొనుటకు వీలుగా నుండునో చెప్పుము."

బిం—"అబ్బాయి! నే నెట్లు చెప్పఁగలను? ఒకపూట రెండుపూటలలో నిర్ణయించ గల విషయము కాదు గదా యిది! ఇది జాగ్రత్తగా నాలోచించ వలసిన

విషయము. అంతలో మావారాలోచన చేయుటకు చాల కాలము పట్టును. రెండు మూడు వారములు తరువాత వత్తువా ?"

శర—"అలాగే కానిమ్ము అది దీపాలమావాశ్య యగును. ఆదినమున వత్తును."

---

## పంద్రెండవ ప్రకరణము.

### అమ్మలక్కల సంభాషణము.

శరచ్చంద్రుడు బిందుగృహము విడిచి వెళ్ళుచుండగా దేవీ ప్రసన్నుని గృహము నుండి పనికత్తెయొకర్తె దేవికి నివేదనము చేసిన భక్ష్యములు కొన్ని తీసికొని లోపలికి వచ్చెను.

అప్పుడు బిందుకు దానికి ఈ క్రింది సంభాషణము జరిగెను

పనికత్తె—మా అమ్మగారు మిమ్మందఱిని చాలాచాలా అడిగినారని చెప్పి దేవికి నైవేద్యము పెట్టిన పిండివంటలు కొన్ని మీకిమ్మని చెప్పినది. నేను మీయింటికే గాక చాలాయిండ్లకు వెళ్ళి వచ్చినాను. అందుచేత ఆలస్యమైనది

బిం—ఆపళ్ళెములో బెట్టు; మీ పళ్ళెము నేను పంపించెదను

పనికత్తెయట్లు చేసి తన మేలిముసుగు సవరించుకొని, మొగమొక ప్రక్కకు త్రిప్పి, ఏదో భావగర్భితముగా చిన్నగ నవ్వెను.

బిం—నీవెందుకు నవ్వుచున్నావు? ఈపూజాదినములలో మీయింట నేమైన వినోదములుగాని చమత్కారములు గాని యున్నవా యేమి?

పని—నే నెఱిగినంతవఱకు మా అమ్మగారింట్లో అటువంటి వేమియు లేవు. (అని బిందుకు వినబడవలెనని కొంచెము పెల్లగా దనలోఁ దానిట్లను కొనెను) ఇదే గొప్ప వినోదము. గొప్పవారిటువంటిపనులు చేసిరా అది వినోదము. మావంటి పేదవారు చేసిరా అమ్మలక్కలాడిపోసికొందురు.

బిం—నీవేమిటి గొణుగుచున్నావు? వినోద మేమిటి?

పని—కాదమ్మా! కాదు; మేము కడుపుకూటికి పనిచేసికొను పేదవాళ్ళము. మా జీతములు తెచ్చికొని మా పొట్ట పోసికొందుమేగాని గొప్పవారి గొడవలెత్తుటకు మాకేమి హక్కున్నదమ్మా!

బిం—ఆమాట కర్థమేమిటి! స్పష్టముగాఁ జెప్పలేవఁటే పిల్లా!

పని—(మఱల మేలిముసుఁ గొకప్రక్కకుఁ దొలగించి విషపునవ్వు నవ్వి) లేదమ్మా! మాకేమి లేదు. ఇప్పుడే మీలోపలినుండి వెళ్ళిన పడుచాయన యెవరు? ప్రొద్దుపోయిన తరువాత ఈలాటప్పుడు ఎవరైన స్నేహితుఁడు మిమ్ము చూడవచ్చినాఁడా యేమిటి?

బిం—(కొంచెము భయపడి తనలో) వీధితలుపు తీసియున్నా? శరచ్చంద్రునికి నాకు జరిగిన సంభాషణము పొంచుండి యిది వినియుండునా? (ప్రకాశముగాఁ దొట్రుపడుచు) ఏమే? నీకన్నులు పోయినవా యేమిటి? శరచ్చంద్రుని నీవెఱుఁగవా? ఎఱిఁగియుండి యెఱుఁగనట్లు నటించుచున్నావా?

పని—లేదమ్మా! లేదు. మీదయవల్ల నాకన్నులు పోలేదు. శరచ్చంద్రుఁడుగారే యనుకొన్నానమ్మా! కాని తల్లీ! గొప్పయింటి పడుచుపిల్లలు ఈలాగున చేయవచ్చునా? మీయూరిపద్ధతు లేమో నాకుఁ దెలియదమ్మా! కలకత్తాలో నే నిరువది తొమ్మిదియేండ్లు పనిచేసినాను. కాని యిటువంటి సంగతి నే నెక్కడను జూడలేదు. గొప్పవారి పద్ధతులతో మాకేమిపని తల్లీ! మాజీతాలు, రెండుపూటల భోజనాలు మాకు సరిగా నందితే చాలు. ప్రొద్దున్న, సాయంకాలము మాకు కడుపునిండ కూడు దొరికినన్నాళ్ళు మాచుట్టుప్రక్కల నేమిజరుగునో చూడవలసిన యవసరము మాకేమున్నది?

దేవీప్రసన్నుని యింటిపనికత్తెలు పెంకెతనమునకుఁ బేరుపడినట్లు బిందు మునుపే యెఱుఁగును. కాని యిటువంటి యప్రశస్తవాక్యములు పలుకునని యామె యెన్నఁడు తలఁచియుండలేదు. అయినను అటువంటి సమయమున శాంతము విడిచి కోపించుట వ్యవహారము మఱింత పాడుచేయుట యని యామెగ్రహించి లేచి చిఱునవ్వు తెచ్చిపెట్టుకొని పలికెను.

బిం—ఏమే పిల్లా! శరచ్చంద్రుని పద్ధతులు పిచ్చివని నీవెఱుఁగవా? అతఁడు కుఱ్ఱవాఁడు. వివాహము కాలేదు. దీక్షగాఁ జదువుటచేతను, ఏకాకిలాగున నొక్కఁడే యుండుటచేతను మతి చెడినది. అతనిమాటలు, చేతలు లక్ష్యపెట్ట నక్కఱలేదు.

పని—అమ్మా! మతిచెడిపోవచ్చును. దానికేమి? కాని యీలాగునఁ జేయవచ్చునా? పెండ్లిపిచ్చ యెత్తినపక్షమున వెళ్ళి వివాహమాడవలెను. కాని నీముందర యీవిధముగ వెఱ్ఱి వెఱ్ఱి ప్రేలాపనలు ప్రేలుట మంచిదా? అమ్మా! ఆయనకు నిన్ను పెండ్లి చేసికొనవలెనని లేదుకద?

బిం—ఛీ! నీమొగము మండ! యీలాటిమాట లాడుటకు నీకు సిగ్గు లేదఁటే? కాదే పిల్లా! అతఁడొక చక్కని పిల్లను చూచినాడు. దానిని పెండ్లిచేసికొనవలెనని కోరుచున్నాఁడు. తల్లి కాశిలో నున్నది గనుక ఆమెతోఁ జెప్పుటకు వీలులేక నాతో జెప్పుటకు వచ్చినాఁడు.

పని—అమ్మా! ఎవరా పిల్ల?

బిం—వివాహము స్థిరపడిన తరువాత నీకే తెలియఁగలదు.

పని—అమ్మా! దాపఱిక మెందుకు? చెవులు లేవా, కన్నులు లేవా మాకు! కనఁబడక పోవుటకు వినఁబడక పోవుటకు మాకంత ముసలితనము రాలేదు గుండె పగిలి పోవునేమో యన్నట్లు మీసుధకోసమాయన మొఱఁబెట్టుట నే వినలేదనుకొంటివా? సరే, సరే, దాచుకోతల్లీ! కాకపోతే యింటిగుట్టు బైటపెట్టుకొని అపకీర్తి కొనితెచ్చుకొనువారు గలరా యేమిటి? ముండమోసిన పిల్లకు పెండ్లా? దేవవాని కొంపలో ఇటువంటిమాట పుట్టినా కులమువాళ్ళు కఱుఁ జేరి యీపాటికి తప్పు పట్టరా? అధీనము తప్పినపిల్లకు పెండ్లా? చాకలి కొంపల్లో మంగలికొంపల్లో సైతమిటువంటి మాటెప్పుడు వినలేదు.

యీపలుకు చెవిని పడఁగానే బిందు మొదటిసారి భయపడెను. శరచ్చంద్రుఁడు తన యెడలఁ జూపిన మోటుతనమును గూర్చి ఆపాదుపనికత్తె మాటలాడి నంతసేపు లక్ష్యము లేక పోయెను. ఒక పెంకిదానిమాటవల్ల తన నిష్కళంక జీవనమునకు మచ్చ కలుగదనియు, తనసదాచార సంపత్తి జగద్విదితమగుటచే నట్టి దెవ్వరు నమ్మరనియు నామె యెఱుఁగును. కాని సుధ చిన్నబిడ్డ, వితంతువు; లోకనింద నలుసంత పుట్టినను యావజ్జీవము దాని పేరు చెడిపోవును. శరచ్చంద్రునికోరిక పిచ్చి కోరిక యని బిందు

మనసునకు తెలియగును. ఆ వివాహము జరుగునది కాదనియు నామె నమ్మకము. కాని సుధాశరచ్చంద్రుల పెళ్ళిమీఁద నపనిందాచ్ఛాయయైన ప్రాఁకెనా, అది కాఱుచిచ్చువలె వ్యాపించి బాలికను, దానికీర్తిని నాశనముచేయును.

ఒక్కనిముసములో నామె మనస్సు మితిమీఱిన బాధపడెను. బింబ మనోధైర్య మించుకేనియు కదలక చిక్కఁబట్టి పెట్టెతెఱచి యొక నాణెము తీసియిచ్చెను. భక్ష్యములు మొదలగు నూడిదములు తెచ్చిన పరికత్తెలకు రెండుమూఁడణాలు బహుమాన మిచ్చుట సాంప్రదాయ సిద్ధము. ఆవంకఁబెట్టి బింబ రూపాయతీసి యారాత్రి దానిచేతిలోఁ బెట్టి యిట్లనియె. "నీవు దేవీప్రసన్నుఁడుగారియింట చిరకాలమునుండి పనిచేసిన పరికత్తెవు. ఈ నవరాత్రములలో ఈరూపాయ పెట్టి క్రొత్తచీరకొని కట్టుకో. శరత్తు విషయమై నీవువిన్నది కన్నది రెండవ కంటివారికిఁ దెలియనీయకు. తెలివితేటలుగల స్త్రీలు పిచ్చివానిమాటలు పాటిసేయరు, ఈ వివాహము జరుగునది కాదు. వితంతువుతో వివాహమన్నది కన్నదా, విన్నదా? కులస్థులలో ఇంతో అంతో పేరుప్రతిష్ట గలవాళ్ళము. మావారంటే ఇరుగు పొరుగువారికి, స్నేహితులకు మితిమీఱిన గౌరవము. శరచ్చంద్రుని తల్లి భూదేవతయని మహా పతివ్రతయని కాశీలోవారుసైత మామెనెంతో గౌరవము చేయుచున్నారు. అతని చెల్లెలను ఆచార వ్యవహారములు, మంచి సాంప్రదాయముగల గొప్పయింటివారు చేసికొన్నారు. అన్నిమర్యాదలకుఁ గంటకప్రాక్క యిటువంటిపెండ్లి చేయుటకు తరమా? లోకానుభవముగలవారు పిచ్చివాని ప్రేలాపనలు లెక్కసేయరు. అతని పిచ్చిచేష్టలు నీవు రెండవ కంటివానికిఁ దెలియనియ్యఁగూడదు సుమా!"

ఆ పరికత్తె బిళ్ళకుడుములాగున తెల్లనిరూపాయ చేతిలోఁ బడఁగానే శాంతించి వెనుకటి ప్రసంగము మఱచిపోయెను. ఒక్క నిముసములోనే మారి యామె యెంతో వినయముతో బింబతో మాటలాడెను.

పరికత్తె — "అమ్మా! మీరన్నమాట నిజము పిచ్చివానిమాటలెవరు పాటిచేయుదురు? శరచ్చంద్రుఁడుగారు నేటిరాత్రి కొంచెము సిద్ధిపుచ్చుకొన్నారేమో? అది మనలో ఆచారమే కాని తప్పుకాదు. మాయింటిలో మాత్రము పడుచువారేమి చేయుచున్నారనుకొన్నారు? వారు రాత్రి చాటుగా జాతివారిసారాయి తెచ్చి తప్పత్రాగుదురు. అమ్మా! వారిగంతులు, కేకలు నే నేమని మనవి చేయఁగలను! పిల్లలు తల్లిదండ్రుల మాట వినరు. చుట్టాలయెదుట, పెద్దలయెదుట, ఇటువంటిపనులు చేసినందుకు సిగ్గుపడరు. పాడుకాలము వచ్చినదమ్మా! పడుచువారు తమరు చేయవలసిన పనులు మఱచిపోయి

చెడిపోయి అల్లరిగఁ దిరుగుచున్నారు. శరత్తుగారిమీఁద నేనెందుకు నిందలు మోపవలె? ఆయనవనడకను గురించి నేనొకరితో కొండెము లెందుకు చెప్పవలె? నామాట నమ్ముతల్లీ! నేనిది బయలుపుచ్చుదునని మీమనసులో బెంగ పెట్టుకొనవద్దు.”

ఆ పనికత్తె మిక్కిలి సంతుష్టిఁ జెంది యా యిల్లు విడిచిపోయెను. కాని గ్రుడ్లను పెట్టుటకు సిద్ధముగానున్న కోడిపెట్టవలెనే యా రహస్యమెక్కడ గ్రక్కునా యని యామె తల్లడిల్లఁ జొచ్చెను. దానిస్వభావము తెలిసికొని తెలివిగలిగి యూహాపోహ చేసికొనక పోయినపక్షమున మిక్కిలి బాగుండును. ఎందుచేతననఁగా దాసివానికి రహస్యముచెప్పి దాచుమనుట విరివిగా వెల్లడిచేయుటకు మొదటిసాధనము. కలకత్తాలో గృహములయందలి పనికత్తెలు తమ యజమానులగుట్టు పట్టు బైలుపెట్టునంత మహావేగమున విశ్వప్రపంచమందలి నానా భాగములయందుండు పత్రికాపత్రికలు బహిరంగవార్తలసైతము వెల్లడి చేయఁజాలవు.

దేవీప్రసన్నునిభార్య మఱునాఁ డుదయమునఁ దనయింట నొక చాపమీఁద గూర్చుండి యిద్దఱు వృద్ధవితంతువులతో మాటలాడఁ జొచ్చెను. స్త్రీ సామాన్యమునకు సహజమైన లోకనిందయే యామె పల్లవిగా నెత్తికొని, యంతము లేనివ్యాఖ్యానము చేయుచు, నిచ్చవచ్చిన తెఱఁగున ముచ్చటించెను.

అక్కలారా! సరిగా నేననుకొన్నట్లే జరుగుచున్నదమ్మా! ఈ సంగతి జరుగునని నే నెఱుఁగుదు. ఏమంటే ఈ దినములలో గొప్పయింటివాళ్ళకు నీచులకు భేదమేమి? అష్టమైనది ఆపల్లెనుండి వచ్చి నేను కాయస్థజాతి దాననని చెప్పుకొని కాయస్థులతోఁ గలసి మెలసితిరుగుచుందును. వీళ్ళిందఱు పరువుప్రతిష్ఠలుగల కాయస్థులా తల్లీ! పనిపడు నాలుగుతరములలో వీళ్ళెప్పుడైన గొప్ప కాయస్థ కుటుంబములతో సంబంధములు చేసినారా యేమిటి? అలాటివాండ్లతోఁ గలసినందులకు మా నోటిలో గడ్డి పెట్టవలెను. వాండ్లతప్పేమున్నదమ్మా! మా వారు కచేరినుండి సాయంకాల మింటికి రాఁగానే ఆయనతో నేనీసంగతి చెప్పకమానను. అమ్మా! ఇంతెందుకు? తనవన్నె, తనగొప్ప, తన పరువు, తనప్రతిష్ఠ మావారు గుర్తెఱుఁగకున్నారు గాని యెఱిఁగినపక్షమున నిటువంటి వారితో కలసి మెలసి యుండుట కిష్టపడుదురా? ఇది యీలాగున జరుగునని నే నెన్నాళ్ళ క్రిందటనో తెలిసికొన్నాను. వాండ్లు భవానీపురములో కాపురము చేయుటకు వచ్చిన క్రొత్తలో, మా యింటికి వచ్చి యొక్కమాటు చూచుటకే తీరుబడి లేకపోయినదఁట.

దానినిబట్టే వారెటువంటివారో నాకు తెలిసిపోయింది. అంతకన్న చిత్రమైనసంగతి చూచినారా! ఆ విధవపిల్ల అంచుచీరలు కట్టుకొని మగనితో కాఁపురము చేయుచున్న దానివలె నున్నదమ్మా! అయ్యో! అయ్యో! ఇది యంతయు జరుగునని నే నెఱుఁగుదు నమ్మా! ఏమంటే, మర్యాదలు పుట్టుకతో రావలెనుగాని నేర్చుకొంటే రావమ్మా! కిరస్తానులలోను తురకలలోను విధవవాండ్రకు వివాహములున్నవఁట గాదు? అమ్మా! అలాగే! అచ్చముగా అలాగే! తురకలకన్న, కిరస్తానులకన్న మనవాళ్ళ కేమంతమర్యాద మండి పోయినది.

అనవుడు వృద్ధవితంతువులలో శ్యామతల్లి యిట్లనియె. "నిజమే అమ్మా! నిజమే. ఇంతెందుకు? విధవపిల్ల అపురా! మంచివితంతువు లందఱు చేసినట్లు ఆపిల్ల ఏకాదశినా డుపవాసముండదుసుమా! పుణ్యస్త్రీలవలె చేపలకూడ ఆపిల్ల తినునఁట! ఈవేళ శుద్ధ ఏకాదశికదా, మన మీరాత్రి పగలు రేపుసాయంకాలము వఱకు కూడ నన్నమునీళ్ళు ముట్టుకోమన్నప్పటికి మనము ముట్టుకొందుమా?"

ఇంతలో భామితల్లి యందుకొని యిట్లుపలికెను. అక్కా! ఈచిత్రము విను. ఆవిధవపిల్లను గుఱ్ఱపుబండ్లమీఁద నెక్కించి షికారు తీసికొని వెళ్ళెదరు. ఏమి చెప్పను! మ్యూజియం చూచుటకు, పువ్వులతోటలు చూచుటకుఁ గూడ దానిని తీసికొని వెళ్ళినారఁట! ఇంతకన్న ఉన్నదా లోకనింద? ఈసిగ్గు చాలదు?

ఆయిద్దరు వృద్ధవితంతువులు తనమాటాడుటచేత మఱింత యుత్సాహము కలిగి, దేవిప్రసన్నుని యిల్లాలు మాలల విజృంభించి యిట్లనియె. "ఆపిల్లకు, పిల్లనుగన్న తల్లికి ఇంతకంటె అప్రతిష్ఠ ఉన్నదా? ఆసిగ్గుమాలినపిల్ల తలమీఁద కొంగుముసుఁగు వేసికొనకుండా బాపగారితో ఎదుటఁబడి మాటలాడునఁట! శరచ్చంద్రునికి మంచి మంచి పిండివంటలు, వేపుడుకూరలు తయారుచేసి పంపించునఁట! ఇందులో శరచ్చంద్రుని తప్పేమున్నది అక్కా! అతఁడు మగవాఁడు. పైగా పెండ్లికాలేదు. ఆపైని సెరజాణలు అప్పచెల్లెండ్రిద్దఱు పట్టి లాగుచుండగా కుఱ్ఱవాఁడు వలలో పడకపోవునా? ఆఅప్ప చెల్లెండ్రను మాగుమ్మముదాటి రానియ్యను."

ఉత్సాహముతోఁ గూడిన యీసంభాషణము యొక్క ధ్వని దూరముగా నున్న నాగేంద్రునకు వినఁబడెను. ఇటువంటి పడుచులు, కోడండ్రు పడుచు హృదయములకు [illegible] వృక్షాటప్పరాగములు వప్పకొనుటలో లోకాపవాదములు వినుటకు

సాధారణముగా నేదో పనికల్గఁబెట్టి యక్కడకుఁ జేరుచుందురు. వారీ విధముగా మాటలాడిరి.

"అక్కా! ఏమిటమ్మా! యీగొడవ? ఈకోపము, [illegible]" అని యొకతె యడిగెను.

"ఏమి? నీవు వినలేద? అయ్యోవాకిళ్ళ! అట్లయిన ఏమి విన్నావు?" అని మఱి యొకతె బదులుచెప్పెను.

"చెప్పవమ్మా! ఎవరో మంచిపిల్లను గురించి గొప్పమాటలాడుకొనుచున్నట్లు లున్నది."

"చెప్పెద నుండవమ్మా! ఏదోయూరినుండి యీమధ్య హేముఁడని ఒకతఁడు వచ్చి భవానీపురములో కాఁపురము చేయుచున్నాఁడు. ఎఱుఁగుదువా? అతని పెండ్లాము మఱఁదలు ఉన్నారు. విన్నావా? ఆమఱఁదలు వితంతువు. ఆవిధవపిల్ల శరచ్చంద్రుని వివాహమాఁడునఁట!"

"పుక్కిటి పురాణాలు చెప్పకు. నేనివి నమ్ముదననుకొన్నావా యేమిటి? ఇంత చిత్రాలు ఉన్నావా? విధవపిల్ల యేమిటి? పెండ్లిచేసి కొనుట యేమిటి? లేనిది పుట్టించకు."

"లేనిదేమిటమ్మా? గొప్పపండితులు విద్యాసాగరుల వారిని గురించి నీవు వినలేదు? 'సీతావనవాస' మని ఆయన చేసిన పెద్దపుస్తకము మున్నదే కాదటమ్మా నీవు చదివినావు; ఆవిద్యాసాగరులవారే మన హిందువులలో విధవలు తిరిగి వివాహము చేసికోవచ్చునని తీర్పు చేసినారు. ఆయనయే పురోహితులై కొన్ని వివాహములు చేయించినారు. అంతదూర మెందుకు? ఆయనకొడుకే విధవముండను వివాహమాఁడినాఁడు."

"అక్కా! నిజమే నమ్మా! నిజమే. విధవముండలకు వెదకి వెదకి మగలను సంపాదించి పెట్టునట్టి ఆవిద్యాసాగరుఁడు గొప్పపండితుఁడే; ఇలాగైన పక్షమున ముసలి ముండల కర్మ మేమికాలింది? వాండ్లుకూడ పెండ్లిచేసికొని హాయిగ ఉండవచ్చును."

"ఉండకేమి? మాడతలపడిన అనుభవమేముగాక, ఆ కొన్నిరోజ్ళకు కలసివచ్చు పెండ్లికొడుకు లున్నపక్షమున వారు పెండ్లిచేసికో వచ్చును."

"సరే. అట్లయినయెడల శ్యామతల్లికి, భామితల్లికి తిరిగి కల్యాణయోగము కలుగును కాంబోలు ! పాపము ! అడుక్కునాలిన ముండలు వైధవ్యబాధలు పడలేక, ఉపవాసములు చేయలేక నానాశ్రమలు పడుచున్నారు. ఎప్పుడో ఒకనాడు నోరు పట్టలేక ఒక చేపముక్క కొరికి, తినరానివస్తువులు తిని కక్కుర్తిపడి వైధవ్యపీడ మాన్పుకొనుచున్నారు. ఆకక్కుర్తి అక్కఱలేకుండా స్వేచ్ఛగా ఉండవచ్చును. అక్కయ్యా ! నిజముగా విద్యాసాగరుడు వారి పాలిటి దేవుడైవచ్చి, వైధవ్య విమోచనముచేయించి, పెండ్లిచేయించి, పుణ్యస్త్రీలనుచేసి మగలతో కాపురాలేర్పఱుప వచ్చును."

"ఆలాగున నోటికి వచ్చినట్లు మాటాడకు. ఈనీమాటలు అవిధవవాళ్ళు విన్న పక్షమున నీపని మట్టము చేయుదురు. శరత్తుమాట చెప్పనేల ? అతడు తెలివిగలవాడు, ముందరికి రాదగినవాడు అని విన్నాము. మంచిపిల్లవాడని కూడ చెప్పుకొనుచున్నారు. ఇటువంటి అప్రతిష్టపెండ్లి చేసికొని అతడెందు కపకీర్తి పాలు కాదలచుకొన్నాడో"

"వలపు కొలుపులోబడినవారికి తెలివితేటలు చచ్చిపోవునని పెద్దలు చెప్పుదురు. వినలేదా ! పాపమా చిన్నవాడు శరచ్చంద్రుడు ఆపడుచుముండ మాయలలో బడినాడు. ఆవలపు విషములాగున తలకెక్కినది. ఇంక వానిపని చెల్లె"

"అవిధవ పిల్లకు వయస్సెంత ?"

"పదహారని చెప్పుకొనుచున్నారు. అది యెఱ్ఱగా బుఱ్ఱగా నున్నది. మాయ నవ్వులు నవ్వుచు శరత్తును పలుకరించి బుట్టలో బెట్టుచున్నది. పానకాలు, మజ్జిగ తేటలు పంపునట. అందులో ఏమిమందులు కలుపుచున్నదో ఎవరెఱుగుదురు ? పాపము శరచ్చంద్రుడేమి చేయగలడు ? ఎంత చదువుకొన్నప్పటికి మగవాడు కదా ! పెద్ద పెనుభూతములాగు అవిధవపిల్ల ఎదుర బడగానే ఈకుర్రపాడవ కట్టు లాగ గలదా ? అతని మనసు కొడిపోయి దాని స్వాధీనమై పోయినాడు."

"అట్లయిన వారికి అదివఱకే స్నేహ ముండవలెను."

"వారిస్వగ్రామములో కలసి యున్నప్పుడు ఒకరినొకరు ఎఱుగుదురని అదివఱకే స్నేహమున్నదని చెప్పలెనా ? అక్కడ ఏమిజరిగినదో నాకు తెలియదు. విశ్వము తల క్రిందులు కానీ, వాళ్ళనుగుఱించి ఒక్క అబద్ధపుమాట చెప్పను. వారు కలకత్తాకు వచ్చినది మొదలుకొని ఏమి జరుగుచున్నదో అందఱకు తెలిసియున్నదే. శరత్తు ఆపిల్లను తీసికొని వెళ్ళి తనయింట్లో ఉంచుకొన్నాడు. దానినే కాదు. దానప్పను!

అప్పు చెనిమిటిని గూడ తన దగ్గఱనే పెట్టుకొన్నాఁడు. ఇందుచేతనే శాంబోలు హేమాఁడు మనసులో అనుమాన మేదో తోఁచి వేఱే ఇల్లొకటి అద్దెకు పుచ్చుకొని పెండ్లామును మఱందలును తీసికొని అక్కడకువెళ్ళి పోయినాఁడు. అమ్మా! నాతల్లీ, అవిలాస మేమని చెప్పను నీకు? కృష్ణమూర్తికోసము బెంగపెట్టుకొని ఎంతచిక్కిశల్యమైనదో నీవెఱుఁగుదువు కదా! అలాగే ఊరిలో లేనప్పుడు ఆవిధవపిల్ల బెంగటిల్లి సగమై పోయినదఁట. అప్పుడు పరుగుపరుగున శరత్తువెళ్ళి ప్రక్కను గూర్చుండి, బుజ్జగించి, రాత్రి పగలు వదలక ఓదార్చినాఁడు. అబ్బో! ఇది పెద్దచిత్రకథ. అక్కా! అంతకథ నేఁజెప్పఁగలనా? విద్యయను చిన్నది సుందరుఁడను చిన్నవాఁడు ఒకరి నొకరెంత మోహించినారో వినలేదా? వారు ఒకరినొకరు విడిచిపెట్టి ఉండలేక పోయినారు. సుందరుఁడు కేలసొరంగములోనుంచి విద్య పడుకొన్నగదిలోకి చల్లగా వెళ్ళినాఁడు. ఆకథే ఇప్పుడు తిరిగి జరుగుచున్నది. ఈనాఁటి పడుచుపిల్లకాయ లందఱు సుందరుఁడు చేసినటక్కరి తనము చక్కఁగా గుర్తెఱుఁగుదురు గనుక జాగ్రత."

ఈయపవాదము నూతిదగ్గఱనుండి దాసీజనము పనిచేయుచోటికి మెల్లమెల్లఁగా ప్రాకెను. ఆపనికత్తెలు కదిపిన తేనెపట్టులోని తేనెటీగలవలె ఎడతెఱిపిలేక అఱచుచు పఱచుచు ఝుంకారముతోఁ జెప్పుకొనఁ జొచ్చిరి.

"అప్పా! నిజమేనా? ఆవిధవపిల్ల నిజముగా పెండ్లిచేసికొనునా?"

"అందులో నీకు సందేహ మెందుకు? ప్రధానమై పోయినది. ప్రయత్నమిది వఱకే యైనది. మఱందలకు హేమాఁడు పెండ్లిబట్టలు కొన్నాఁడు. నగలు చేయించినాఁడు, నిజమా, నిజమాఅని మూలము తెలియక నీవడుగుచున్నావు."

"గొప్పవారియింట విధవవాళ్ళు పెండ్లి చేసికొనుట తప్పులేకపోతే పేదవాళ్ళ ఇంటిముండలు గూడ నిర్భయముగా పెండ్లి చేసికోవచ్చును."

"ఎల చేసుకోగూడదు? ఆపల్లెపిల్లవాఁడు నీకు బజారులో కనఁబడినప్పుడు ఎన్నోసారులు నీవతనితో మాటలాడుచుండఁగా చూచినాను. వాఁడు దిట్టమైన విధవముండను చేసికో దలఁచుకుంటే వాఁడునీకు తగినవాఁడేనా?"

"నిర్భాగ్యురాలా! సిగ్గు, సిగ్గు; ఛీ అలాటిమాటలు నన్ననకు. నీసంగతి నాకు తెలియదనుకొన్నావా ఏమిటి? ఆ పడుచ కోమటి కీమధ్య భార్య చచ్చిపోయిందికద?

ఏలకులు, లవంగాలు అమ్మకొనే ఆయన ఆయన కిల్లు చూచిపెట్టఁదగినవారు అన్నము వండిపెట్టువారు ఎవరులేరు. ఏదో యేలకులు లవంగాలు కావలెనని వంకఁబెట్టి, నీవన్ని మాట్లో ఆయనదుకాణమునకు వెళ్ళి, అరగంటసేపేదో గుసగుస లాడుచుండగా నేను చూడలేదా? ఇల్లుచక్కబెట్టుటకు నీలాటి దిట్టమైన పిడిరాయంటిదుండను ఆయన నేను కొంటే బాగుండును గాదు?"

"నీ మొగముమండ! నిన్ను కాటిలోఁబెట్ట! పాడుముండా! పేలకు"

ఈ మరొక్కతల్లి యప్పటికిని తాల్పూరుగ్రామములోనే యుండెను. ఈ యపనింద యామె చెవినిఁగూడ పడెను. పడగానే గ్రుడ్లనీళ్ళు గ్రక్కుకొని తనలోఁదానే విలపించి, అట్టి అప్రతిష్ఠకార్యము చేసి మల్లికవంశమునకు మచ్చ తేవలదని బావమఱఁదురగు బిందుకు జాబిట్లు వ్రాయించెను.

"కూఁతురా! మీ తండ్రిగారు బ్రతికియున్న పక్షమున తన వితంతుపుత్రిక మఱల వివాహము చేసికొనుట కొప్పుకొనునా? నాతల్లీ! నీయమ్మ బ్రతికియున్న పక్షమున ఈ యప్రతిష్ఠకార్యమున కామె సమ్మతించునా? సుధ ఏమియెఱుఁగును? అది చిన్నపిల్ల. తల్లివైనను దండ్రివైనను దానికి నీవేకదా బిందూ! ఈ భూమిమీఁద దానిని కష్టముల పాలుచేయకు. అది విధవదియై పరువుమర్యాదలతో బ్రతుకకుండ దానికి పెద్దమచ్చ తెచ్చిపెట్టకు. దానిని గంగలోఁదింపకు దానిని మఱింత నిర్భాగ్యురాలిని చేయకు."

ఈవార్త వర్ధమాన పురమునకుఁ బ్రయాణము చేసెను. అక్కడ కాళీ జబ్బుచేసి మంచమెక్కి భర్తకుపచారములు చేయుచుండెను. ఆమె బిందుకిట్లు విచారముతో జాబు వ్రాసెను.

"మావారు మంచ మెక్కినారు. నేను రాత్రి పగలు ఆయన మంచము వదలి పెట్టక యున్నాను. ముందు శీతకాలములో వచ్చినచోటగుటచే రాణిగంజికి, ఆయనను తీసుకొని వెళ్ళవలసిన దని వైద్యులు చెప్పుచున్నారు. మేమక్కడ ఒక యిల్లు కుదుర్చుకొన్నాము. ఒక వారము దినములలో మేమక్కడికి పోవుచున్నాము. నే నెక్కడున్నప్పటికి నీకు సుధకు ప్రేమతో మేలు కోరుచుందును.

ఓసీ! బిందూ! సుధను గురించి కొన్ని చెడ్డవార్తలు వినుచున్నాను. ఈ వార్త లేమిటి? మచ్చలేని మన కుటుంబమునకు శాశ్వతపు డాగువేయఁ దలఁచుకొన్నావా?

బిందూ! నీవు తెలివి గలదానవు నీగుణము బంగారమువంటిది. మాతమ్మునకు పిచ్చియెత్తిన పశువువలె మీ యింటి నుండి వెళ్ళఁగొట్టుఁడు అప్రతిష్ఠపనికి ఒప్పుకొనవద్దు. విధవపిల్లలకు వివాహము చేయవద్దు. మీ రటువంటి పెండ్లిచేసినపక్షమున నా అత్తవారి ఇంటిలోనివారు నా మొగ మింక చూడరు, మీ కాలి మీకేఁక మీఁద కనబడదు"

ఆ జాబులు బిందు తన భర్తకుఁ జూపి లోలోపల దుఃఖించెను. బిందు కడురహస్యముగా దాఁచఁ దలఁచిన రహస్యము భేరీజిహ్వాగల యపవాదము దేశమంతటను వ్యాపింప జేసినది. పాపము! అమాయకురాలైన యామె చెల్లెలి పేరు ముందటి కీడ్చి తెచ్చి జనులు తిరస్కారము చేయ జొచ్చిరి.

శరచ్చంద్రుఁడు కోరిన కోరిక యేదో విధముగ పరిష్కరింపఁ బడునంతవఱకా విషయము సుధచెవిని బడకుండునట్లు హేమంతుఁడును బిందు సర్వప్రయత్నములు చేసిరి. ఎన్నఁటికిని మనోనాథుఁ డగుటకు వీలులేని మనుష్యునకు గాఢంపువలపు గలదని వితంతువునకుఁ దెలుపుట, సంతోషశూన్యమైన యామె వ్యర్థజీవనమును మఱింత కష్టభాజనము చేయుట గాక యన్య ప్రయోజన మేమున్నది? ఏ యపనిందతో జనులామెపేరు కలిపి వాడుచున్నారో, యా యపనింద నామె శ్రవణ గోచరము చేయుట వలన నామె కుళ్ళి కుళ్ళి యేడ్చి కృశించిపోక మానునా?

కొంతకాలము వారు చేసిన ప్రయత్నము సాగినది. కాని పూర్తిగా దాఁచుట యసాధ్యమయ్యెను. అనుమానములు లేని యమాయకురాలయ్యు సుధ గృహములో నేదో చిక్కు సంభవించిన దనియు, గొప్పసమస్యయేదో తన యక్కయొక్కయు, బావయొక్కయు మనస్సుల నాక్రమించిన దనియు జాడకట్టెను. సుధ తన యక్కయొక్క విచార సూచకమైన మొగమును, మౌనభావమును పలుమారు విలోకించి, యిటులుండుటకుఁ గారణమేమని యడుగఁ దలఁచియు సాహసించి యడుగలేక పోయెను. మిత్రులనేకులువచ్చి హేమంతుని జూచి మాటలాడుటయు, నుదయకాలమందతఁడు పలుజాబులు వ్రాయుటయు, రాత్రి ప్రొద్దుపోవువరకు బిందుతోఁ గలసి యాలోచనలు చేయుటయు నామె కనిపెట్టెను. తన పేరు, శరచ్చంద్రుని పేరు పలుమారెత్తి వకొలఁది తమయింటి పనికత్తెతో నరగంట కంటె ఎక్కువసేపు గుసగుసలాడుట యామెకు వినఁబడెను. వారమునకొక్కసారి వారియింటికిఁ బోవుచుండెడి భావగర్భితముగ సుధనుజూచి చిన్న నవ్వునవ్వి మనసుపట్టలేక యెట్టకేలకు స్వల్పకాలములోనే యింటి యజమానురాలవై యుందువుగా కన్నుల చల్లగా నిన్ను

చూడఁగోరుచున్నానని పరిహాసముగాఁ బలికెను. రహస్యములు బయటపెట్టవద్దని తన కామాట చెప్పినవారింకో యొట్టుపెట్టించుకొని చెప్పినను, చాకలిది శరచ్చంద్రుని యొక్కయు సుధయొక్కయు బట్టలు తనకే యుదుకుటకు వేయుమని కోరెను.

ఈయాఁడువాండ్ర యభిప్రాయ మేమైయుండును? పైకి వేఱర్థమిచ్చునట్టి దెప్పుడు మాటలతో నొక పేద వితంతువును వారు పీడించుచున్నారని యన వచ్చునా? అట్లు వారుచేయుదురని సుధ భావింపలేదు. ఏలయన నామె యెవ్వరి మనసు నొప్పించి యెఱుఁగదు అంతకుమును పెవ్వరు మిక్కిలి పేదకురాలైన యాబిడ్డను కూట మాటలతో నొప్పింపలేదు. అట్లయిన నిటువంటి మాటల భావమేమై యుండును? ఆపలుకుల భావములు స్పష్టముగఁ దెలుపవలసినదని సుధ నొక్కి యడిగెను. కాని మంగలిది మౌనము వహించి నోరెత్తదయ్యె. చాకలిది మాత్రమిట్లనెను. "శరచ్చంద్రుడు గారు తప్పక యాలస్యముగానో పెందలకడనో యెవరినో యొకరిని పెండ్లిచేసికొనక మానరు. పేదదానను గనుక ఆయింటి వాడుక నాకే యిప్పించవలసినదని యడిగినాను."

సుధ దానిమాటలలో యథార్థము గ్రహించినదో లేదో మన మూహింపఁ జాలము. అనుమానములు లేని యమాయక స్త్రీ లోకప్పు డిటువంటి విషయములలో మన మూహింపఁజాలనంత దీర్ఘదృష్టిగలిగి లోతుగఁ బరిశీలింతురు. ఈచిత్రకథ యంతయు నామెకు మూలముట్టదెలియక పోయినను, చీకటితెఱమఱుగున నిలిచి యావలిగుట్టు తెలిసికొనుటకై గిజగిజ దన్నుకొనుచున్న స్త్రీబుద్ధికుశలత మార్గప్రదర్శియగు ప్రభా కిరణమును గనిపెట్టలేదని చెప్ప వలనుపడదు. అజాగ్రతగా నోట వెలువడు సామాన్యపు మాటల నామె యధికశ్రద్ధతోఁ జెవియొగ్గి వినఁ జొచ్చెను. సాధారణముగా నెవ్వరుగాని సరకుచేయని యల్పసూచనల నత్యంత జాగ్రతతో నామె గమనించుచు వచ్చెను. తన భవిష్యత్కాలస్థితిని, తన యదృష్టమును మఱుగుపఱుచుచున్న యారహస్యాంధకారమునఁ బ్రవేశించి చూచుటకు, ఆమె స్త్రీస్వభావము భగీరథ ప్రయత్నము చేయఁజొచ్చెను. ఆమె యెవ్వరి నేప్రశ్న లడుగలేదు. ఏసమాచారమునకైఁ బ్రయత్నింపలేదు. కాని వెల వెల బాఱుచుండిన యామె మొగము, కన్నులలోని తళుకు నిశ్శబ్దమైన యామె యాలోచనమును, హృదయగతమైన సంతోషమును వెలిపుచ్చుచుండెను.

ఎట్టకేలకు యథార్థమంతయు తెలుసుకొమ్మని యామెమనస్సు నెదుట పొఱసెను. ఒకనాటి సాయంకాల మామె పండుకొన బోవుచుండఁగా నేలమీఁద యొక నలిగిన

కాగితము కనఁబడెను. అది యామె తీసి చూచెను. అందలి వ్రాత తన పినతల్లిదని యామె కనిపెట్టెను. అందు రహస్యము లుండునని యనుమానము తోఁచినందునను, తన పినతల్లి యభిప్రాయమేమో చూడవలయునను కుతూహలము పొడముటచేతను, జాబు నామె యామె దీపము కడకుఁ దీసికొనిపోయెను. అది బిందుపేర వ్రాసినజాబు. బిందు చదువుకొని దానిని జాగ్రత్తగాఁ బాఱవైచెను. ఆజాబులోని సంగతులు చదువుకొన్న కొలఁది సుధరయొక్క చేయివడఁకెను, గుండె కటకటఁ గొట్టుకొనెను. కాగితము చేతిలో నుండి నేలజారిపడెను. చేష్టలుతగ్గి కొయ్యబారి వెనుకకు మఱి తడబడుచు నెట్టకో మంచముపైఁబడెను.

అట్టి సమయమున హిందూవితంతు వనుభవించు లజ్జాదుఃఖములు మూర్తి భావములై యామెమనసులో మెలఁకలెత్తెను. అంత మంచివాఁడు, అంతదయ గలవాఁడు, అంతచదువుకొన్నవాఁడు, అంత బుద్ధిమంతుఁడు గదా శరచ్చంద్రుఁడు. అట్టివాఁ డిటు వారి యప్రతిష్ఠకార్యము నేల తలపెట్టెనో? ఆమెను తనకిమ్మని యేల యడుగవలె? ఏల యామెను కలుగుటలో నవమానపఱుపవలెను? ఈసంగతి పినతల్లికిఁ దెలిసినది. శరత్తు తోఁబుట్టువునకుఁ దెలిసినది. ప్రపంచమంతకుఁ దెలిసినది. తనచుట్టములకు, జతకత్తెలకు నామె తన మొగమింక నేలాగునఁ జూపఁగలదు? అపవిత్రమై, యమంగళమైన విషయము తన పేరుతో సంకేతమైన దన్న జ్ఞానము మితిమీఱిన లజ్జాభావము బాల మనసు నావరించెను. తలగడమీఁద మొగము పెట్టుకొని కన్నీరు వెలికిఁ దోఁపకుండ నేడ్చెను.

నిశ్శబ్దమైన యాచీఁకటిరాత్రి యందు నిదుర లేక నిమేషమైన విశ్రాంతి లేక యామె మంచముమీఁద బండుకొనియుండ, బాధకరములైన తలంపు లామె హృదయమును తల్లడిల్లఁజేయఁదొడఁగెను. ఆమె పరాభవ సముద్రములో మునిఁగి పోయెను. తాను పలుమాఱులు చదివియున్న రామాయణ మహాకావ్యమందలి కథానాయిక యగు జనక రాజనందనవలెనె భూదేవి రెండుపాయలుగాఁ బగిలి మానవుల కన్నులకుఁ దా నెన్నఁడుఁ గనఁబడకుండ దన్ను నిజగర్భమునకుఁ దీసికొనిపోవు నట్లు చేయుమని ధరాదేవిని వేఁడుకొనెను. గంటలు గడచిపోయెను. అర్ధరాత్రమందలి మహాంధకారరాశి క్రమక్రమముగా సన్నగిల్లి యుషఃకాలమునందలి మంద మంద తేజోరేఖగా మారఁ దొడఁగెను. కాని సుధకు దుఃఖవిమోచనము కాలేదు. తెల్లవారఁగానే దగ్గఱచుట్టములకు, దాపున జేరియుండు వారు ఏదనేల, తన చుట్టములకు మొగ మామె యెట్లు చూపఁగలదు?

ఉదయకాలమందలి యరుణారుణప్రభలు తోఁచిన తోడనే సుధ తన యప్ప మొగముఁ దేఱిపాఱఁ జూచుటకును, మేడమెట్లు దిగిపోయి యెప్పటియట్ల గృహకృత్యములు నెఱవేర్చుటకును భయపడినదియుంబోలె నప్పుడు చేయకుండ తనమంచముదిగి, దొంగదానివలె లోపలికి వెళ్లెను. వెళ్లి యంట్లుతోమి, చెంబులు తొలిచి, వాకిలియూడ్చి నీళ్ళుతోడి మనోవ్యథ మఱచుటకో యన నేదోపని చేయఁజొచ్చెను. తలుపుతెఱచి సేవకుఁడు లోపలఁ బ్రవేశించినప్పుడామె యులికిపడి వడఁకెను. ప్రొయిలో నిప్పు వేయుట కామె వంటయింటిలోనికిఁ బోయినప్పుడు నిత్యము పాలుతెచ్చుగొల్లది వచ్చెను. ఆమెను జూచికూడ సుధ భయపడెను.

ఈ విధముగా దినములు నిశ్శబ్దమైన సంక్షోభముతోఁ గడచెను. గాఢమైన లజ్జాభావ మామెను దిగఁద్రొక్కఁజొచ్చెను. ఆమె లేతహృదయము మహాభారముచేత గ్రుంగిపోయెను. ఈ చిత్తక్షోభము చాటున, నీ మహాభయముమాటున నామె హృదయమున నాశయనియెడు రహస్యప్రభారేఖ మెఱయకపోయెనేని సుధ స్త్రీస్వభావమునకు విరుద్ధలక్షణములు కలది యగును. ధీరస్వభావము గల శరచ్చంద్రుఁడు పిన్నవాడయ్యు ప్రపంచమంతయు నేకమై భిన్నాభిప్రాయముఁ జూపినను సరకు సేయక దయారసపూరితమైన హృదయమున నామెయందు గాఢానురాగమును బెంచి, వారియింటికి రాకపోయినను సుధనే తలంచుచు, వివాహము చేసికొనుట కామెనిమ్మని తెగించి యడిగినాఁడు కదా! ఈ తలంపు లామె మనస్సున మొలకలెత్తఁజొచ్చినప్పుడు యువతీజన సహజమైన రహస్యానందమును బొంది కంపమొందఁజొచ్చెను. ఎడనెడ నది యపవిత్రమై యపరిశుద్ధమైన యానందమని తలంచెను. నవనవోన్మేషభాజనమైన యా యువతి హృదయమందలి యంధకారావకాశము లెల్ల మహాశాసూర్యప్రభలచేత దీపితంబులు కాకపోయిన పక్షమున నామె మానవాంగనకంటె నతీతమో యధమమో యైన జంతువై యుండవలయును.

ఒకనాఁడు మధ్యాహ్నము విందు సుధ పండుకొను గదిలోనికిఁ బోయెను. అప్పుడు సుధచేతిలో నొకపుస్తకముదాల్చి చదువుచు, గవాక్షములోఁ గూర్చుండెను. అక్కను జూడఁగానే సుధ పుస్తకము మూసివైచెను.

"అమ్మాయి! నీవు చదువుచున్న పుస్తకమేమిటి?" అని తెలిసికొన వలయునను కుతూహలముతో నడిగెను.

"ఇది బంకించంద్రచటర్జీ చేసినపుస్తకము" అని సుధ సిగ్గునఁగన్నులు వంచి ప్రత్యుత్తర మిచ్చెను.

"ఆ పుస్తకము పేరేమిటి?"

"దాని పేరు, విషవృక్షము."

అనపుడు బింధు కోపదృష్టితోఁ జూచి కొంచెము కఠినస్వరముతో "ఆ పుస్తకము నాచేతికిమ్ము. అది చదువవద్దన్నాను!" అని మందలించెను.

సుధ పుస్తక మప్పచేతికిచ్చి "ఇది చదువఁగూడని చెడ్డపుస్తకమా యేమిటప్పా!" అని మెల్లగా నడిగెను.

"సుధా! చెడ్డది కాదు, బంగాళీభాషలో నిది ప్రశస్తమైన చిత్రవచన కావ్యము. నీవు చిన్నదానవు. ఇపుడే యిది చదువఁగూడదు."

"అప్పా! పోనీ, దానికథ సంగ్రహముగాఁ జెప్పు. కథ యెట్లు పరిణమించునో తెలిసికోవలెనని కుతూహలపడుచున్నాను."

"కథచిన్నదే. ఒక బాలవితంతువు చిత్రకావ్యములోని కథానాయకుని వివాహమాడును. కాని పెండ్లిచేసికొని యామె సుఖపడలేదు. బహుకష్టముల ననుభవించి తుదకు విషము తిని చచ్చినది."

ఈ మాటలు వినఁగానే సుధ మొగము వెలవెలఁబోయెను. వెంటనే మాఱు మాటాడక యామెగది విడిచి యావలకుఁ బోయెను.

---

## పదమూడవ ప్రకరణము

### దీపాలమావాస్య

హిందూదేశము చిత్రము లగుపండుగలకుఁ బ్రసిద్ధి కెక్కినది. అవి యెన్నోగలవు. అందు దీపాలమావాస్యవలె మిక్కిలి చిత్రమైనదియు మనస్సునకు నచ్చునదియు మఱి

యొకపండుగ లేదు. అది దేవీపూజలు జరుగు మాసమున ననఁగా నాశ్వయుజమాసమున నమావాస్యనాఁటి రాత్రి జరుగును. పల్లెయనక, పట్టణమనక, కుగ్రామమనక, గొప్ప యూరనక దేశమందంతట ప్రతిగృహమందు దీపములు వెలిగింతురు. మహానందముతో బాణసంచ కాల్తురు. ఆ దీపముల యొక్కయు, బాణసంచయొక్కయు దేదీప్యమాన కాంతులముందఱ నమావాస్యనాఁటి కాఱుచీఁకటులు పటాపంచలై పోవును. ఆకాశము నందలి నక్షత్రములు భూమిమీఁది జ్యోతులముందట మినుకుమినుకు మనుచు వెలవెలఁ బాఱును. భాగ్యవంతుల భవనములు బహుదీపపంక్తులతో నలంకరింపఁబడును. నిఱుపేద యైన స్త్రీ సైతము తాను చెమటోడ్చి సంపాదించుకొన్న యొకటిరెండు డబ్బులు వ్యయముచేసి చమురుకొని ప్రమిదతోఁ దన కుటీరము ముందఱ నొక్కదీపమైన వెలిగించును.

ఈ పండుగనాఁటి రాత్రి కలకత్తానగర మెప్పటియట్లే ప్రభాభాసమానమయ్యెను. ధనవంతులు పుణ్యము నిమిత్తమై దరిద్రులకు నపూర్వముగాఁ గనకవర్షము గురిపించిరి. ఘన కార్యములు చేయ సమకట్టియున్న చాకచక్యము గలవారును నడఁగి పోయిన తరువాత నేలమీఁద కలక్రిందుగాఁ గూలునట్టి యుత్సాహపూరిత యువజనంబులవలెనే పేక జువ్వలు నక్షత్రమండల మంటి పెటుక్కున ప్రేలి క్రిందఁ బడఁజొచ్చెను. ఔటులు, నేలటపాకాయలు పెటేలుపెటేలని గొప్పధ్వని చేసి యీనాఁటి యనేక యువకవిజనం బులవలెఁ బేరు లేక యదృశ్యములయ్యెను. లంకాపురులు మహోజ్జ్వలములగు నగ్నిచక్ర ములవలె గిర్రున దిరిగి కొంతవడికిఁ జూడ నేవగింపుఁ గొల్పెడు కొయ్యముక్కలు మాత్రమే మిగిలెను. వీధులలోను, వాకిళ్లలోను, డాబాలమీఁదను పిల్లలు గుంపులు గుంపులుగాఁ గూడి ఎఱ్ఱమతాబులు, పచ్చమతాబులు కాల్చి సంతోషించిరి. ఎండిన జనపకఱ్ఱమోపు లంటించి కొందఱు పెద్దపెద్ద సెగడిమంటలు వేసిరి.

శరచ్చంద్రుఁడు వెలయుచున్న దీపములను, మతాబులు మొదలగు బాణసంచలను జూడక చెవులు దిబ్బడివేయునట్లు మ్రోగుచున్న నేలటపాకాయల చప్పుడు, పేలుచున్న పేకజువ్వలచప్పుడు వినక, ప్రతిగృహమందు జనులచేత నాఁటిరాత్రి విధిగాఁ బూజింపఁబడిన కాళికావిగ్రహమును సరకు చేయక, యిల్లు వెడలిపోయెను. చప్పుడు కాకుండ నడుగు లిడుచు, గుండె దడదడఁ గొట్టుకొన నతఁడు హేముని బసఁజేరవలెనని భవానీపురమునందలి సందుగొందులం బడి విసవిసనడిచిపోయెను. అనుకొన్న ప్రకారము బిందు వచ్చి తన నిమిత్తము వీధిలో నిరీక్షించుచు నుండునని యతఁడు తలంచెను. కాని హేముఁడే వచ్చి

యతనిరాక కెదురు చూచుచుండెను. అతఁడు శరచ్చంద్రుని చేయిపట్టుకొని వెలుపలి గది లోనికి దీసికొనిపోయెను. పాపమీ చిన్నవాఁడతనివెంటఁ గల ఏచుకొని కొండంత యాసయుఁ, గ్రుంగఁదీయుభయము హృదయమును మల్లడిఁగొన గ్రుడ్డివాఁడువలె నెటు పోవుచున్నది చూడలేక లోపలఁ బ్రవేశించెను.

హేముఁడు దీప మెగసనఁద్రోసి యిట్లనియె: "శరచ్చంద్రుఁడా! నీవు చెప్పినమాటలు నాభార్య నాతోఁ జెప్పినది."

అని నెమ్మదితో మాటలాడుటకు ధైర్యము తెచ్చుకొని శరచ్చంద్రుఁ డీవిధముగ బలికెను "నేనతిసాహసము చేసి యుంటినిగా, నీవుంచితివనువాను, నీవు నాయందుంచిన విశ్వాసమునకు దగినట్లు నేను ప్రవర్తింప లేదని నీవెంచిన పక్షమునఁగాని, నీవు చిన్న నాటనుండియు నన్ను మిక్కిలి ప్రేమతో నాదరించితివి. గావున నాసాహసమును నీవు మన్నింపుము"

"అబ్బాయీ! శరచ్చంద్రుఁడా! నీవు చేసినతప్పులేదు. నేను మన్నింపవలసినది లేదు. లోకులంతయు నిన్ను నిందింపనీ, నాకు నీయెడగల గౌరవప్రేమలు మార్పుఁ జెందక యథాప్రకారముగానే యుండును."

ఆమాటలకుత్తర మిచ్చుటకు శరచ్చంద్రునికి మాట రాలేదుగాని యాతని కన్నులు వాగ్రూపముగాని కృతజ్ఞతను దెలుపుచుండెను. అది హేముఁడు చూచి మరల సంభాషణము మొదలు పెట్టెను.

"మీరు చిన్నపిల్లలైన నాటనుండియు నిన్ను నాభార్యయు సోదరునివలెఁ జూచుచువచ్చినది. ఇకముందుఁగూడ నామె నీయెడ వెనుకటిప్రేమ చూపకమానదు. నీవు మమ్మడిగినదానికి మాకు నీపైఁ గోపములేదు. ఎప్పటిగౌరవమే కలదు. ఈ విషయమున నీకుఁగల దయకు, ధైర్యమునకు, నిన్ను మేము గౌరవించుచున్నాము.

"నీదయకు, బిందు చూపినదయకు నేనాజన్మాంతము కృతజ్ఞుఁడనై యుండెదను" అని శరచ్చంద్రుఁడు పలికెను. హేముఁడు మనోరథసిద్ధి నూదింపని వ్యవహారశీలిలో మాటలాడుచున్నాడని శరచ్చంద్రుఁడు గ్రహించి దిగులుపడ జొచ్చెను.

అప్పుడు హేముఁ డిట్లనెను "ఈవిషయమై మున్ను నీభాగమునుండు సంగతి సందర్భములు చక్కగా విచారించినావా? క్షణభంగురమైన మోహావేశమున నీవు పలుకుట లేదుకద?"

"సోముఁడా! నామాట వినుము. నేను మిమ్మడుగకముందే చాలకాలము మిక్కిలి జాగ్రత్తగా ఆవిషయమై విచారించితిని. నేను మిక్కిలి చక్కఁగాఁ బనిచేసితినని నాయభిప్రాయము"

"నీవు నాకంటె యెక్కువ చదువుకొన్నావు, శరచ్చంద్రుఁడా! అయినప్పటికి నాకన్న వయసులో నీవు చిన్నవాఁడవు. ఒకటి రెండు విషయములు నీకుఁ దోఁచక పోవచ్చును. అటువంటివి నన్నుఁ జెప్పనీ. నీవు చేసికొందలఁచుకొన్న వివాహము పూర్వాచారపరాయణుల కందఱ కసహ్యము."

"మూఢవిశ్వాసముచేత దురభిప్రాయము పెట్టుకొని గ్రుడ్డివారివలె సన్మార్గముఁ గానక మాటలాడువారి యభిప్రాయములను నేను లెక్కచేయను. మనసులో నేవిధమైన బాధపడక, ఇటువంటి నిందల నే నిదివఱకే భరించినాను. యావజ్జీవసుఖము నిమిత్త మిటువంటి నిందలను నే నవలీలగా భరింపఁగలను."

"శరచ్చంద్రుఁడా! దీనికి నిన్ను వెలివేయుదురని యెఱుఁగుదువా?"

"మన పూర్వాచార పరాయణులు కావలెనంటే వెలివేయనియ్యి"

"మిక్కిలి పరువుప్రతిష్ఠలు గల నీకుటుంబమున కిది కళంక మగునని యెఱుఁగుదువా?"

"సోముఁడా! ఇది పాపకార్యము కాదు కాఁబట్టి కళంకముగాదు. ఇది యపవిత్రమైన పాపకార్యమని నీకుఁ దోఁచినయెడల మానివేయ వలసినదని చెప్పు. నీమాట ధర్మశాస్త్రముగా నేను శిరసావహించెదను."

"వితంతువు పునర్వివాహము చేసికొనుటలో దోషమెంతమాత్రము లేదు. మన సనాతనధర్మశాస్త్రములు, మన యాచారములు సమ్మతించినదే యిది. ఇటీవల నేఁటి కాలమునందే అది చేయఁగూడదని జనులకు దాని విషయమై వ్యతిరేకాభిప్రాయము కలిగినది.

"దానిసంగతి అంతే అయినపక్షమున, తప్పులేనిదియు తప్పక మేలు కలిగించునదియు నైన యీశుభకార్యమును మన యీమాత్రపుఁ బిచ్చియభిప్రాయములకే మాన వలసినవారమా? ఏఁబదియేండ్ల క్రిందట సముద్రము దాటి వెళ్ళకూడదని మన పెద్దలందఱు అభిప్రాయపడినారు. కాని యీదినములలో వందలకొలఁది యాఁడువాండ్రు మగ

వాండ్రు ఓఢ్రదేశమునకు, బర్మాకు, చెన్నపట్టణమునకు. సింహళమునకుఁ బ్రతివారము సముద్రముమీఁద బోగరోడలెక్కి వెళ్ళుచున్నారు. దీని పేరే యభివృద్ధి; మార్పు బొత్తిగా లేకపోవుటచేత చైతన్యరహితమై జాతినాశము నొందును ”

“శరచ్చంద్రుఁడా! నీవు మంచిబుద్ధిమంతుఁడవు. చక్కనియాలోచన గలవాఁడవు. విను; ఈవిషయమంతయు మర్మము లేకుండ నీ యెదుట విప్పిచెప్పెదను. మనస్వభావ మొకప్పు డాకస్మికముగా నత్యుత్సాహపూరితమై యుండును. అది యావజ్జీవము వెనుకటి బలిమి గలిగి స్థిరముగా నుండదు. యౌవనప్రారంభమునకు సహజమైన యనురాగాతిశయముతోడను గాఢదయతోడను నీవు సుభను వలచుచుంటివని నే నెఱుఁగుదును. వయసుముదిరిన కొలఁదివలపు నేఁడున్నంత దృఢముగా నుండకపోవచ్చును. ఇది అసంభవము కాదు. నామాట కడ్డమురాకు. నేను చెప్పఁదలఁచుకొన్న దేదో తుదముట్టఁ జెప్పనియ్యి. సావధానముగా విను. సుభపై నీకు నిజమైన గాఢానురాగము కలదా లేదా యని సందేహించను. అయినప్పటికి నేఁడున్నట్టి ప్రేమ సన్నగిల్లవచ్చును. తొందరపడి చేసినకార్యము యావజ్జీవ దుఃఖహేతువు కావచ్చును. నిన్ను వెలివేయుదురు. ప్రాతపద్ధతివారు నీకుటుంబముతో సంబంధబాంధవ్యములు మానుకొందురు. నీకూఁతులకు వరులు దొరకరు. పదిమంది చుట్టాలుకలసి కూర్చుండుచోటికి నీకొడుకులను జేరనీయరు. పడుచుతనములో తొందరపడి సాహసకార్యముచేసి యుండకపోయిన పక్షమునను, మిక్కిలి నాప్తులైన ప్రియమిత్రుల హితోపదేశములవిని యుండిన పక్షమునను, జీవితముయొక్క యవసానదశయందు బంధువైరము, బహుదుఃఖము కలుగకుండ మాటు విశేషసుఖము, విశ్రాంతి కలిగి యుండుననియు, స్త్రీపుత్రులు బహిష్కరింపఁబడి నిరాదరింపఁబడక, కావలసినవారిచే గౌరవింపఁబడి యాదరింపఁ బడుదురనియు ముసలితనములో నీవు వ్యర్థమైన పశ్చాత్తాపము నొందవచ్చును. చిన్నవాఁడవైనను నీవు స్వతముగా నెల్లవిషయములు, తెలిసికొనుటకుఁ దగినయోచన గలవాఁడవు. కలకత్తాలో ననేక కాయస్థగృహములలో సుభను మించిన చక్కనిపిల్ల లెందరో యున్నారు. నీవంటి యల్లుఁడు దొరకినప్పుడు కన్నుల నద్దుకొని స్వీకరించని మామగారు కాయస్థులలో లేఁడు. ఇదసిద్ధమని నిర్ణయించుటకు ముందు లెస్సగా నాలోచించు. తొందరపడకు. చిరకాలము బ్రతుకఁదలచిన వాఁడవు. ముందుమాట గట్టిగా నాలోచించుకో. పద చురితనకుండ వివేకముతో వర్తించి ముసలితనమునకై సుఖము మూటకట్టి దాచికొనుము”

ఆమాటలన్నియు శరచ్చంద్రుఁడు శాంతముతో నాలకించి మెల్లఁగా నిట్లు బదులు పలికెను. “ఓ మామాఁ! నన్ను నమ్ము. ఆకస్మిక మనోవికారముచేతఁ గాని, గ్రుడ్డివలపు

చేరఁగాని నేనీ వ్యాపారములో దిగలేదని మున్నూటికి నమ్ముము. నాజీవయాత్రలో సుఖపడఁ గోరుచున్నానుగాని పోరాడఁ దలఁచుకొనలేను. వార్ధకమందు నాకుఁగలుగఁ బోవు పశ్చాత్తాపమును గూర్చియు నీవు చెప్పినావు. నలుప్రక్కలఁ బరికించి యొకసారి చూడుము. మనజాతిలో గౌరవపాత్రములైన ప్రముఖులెందఱున్నారో? చిన్నతనమందు ధైర్యముతోడను గౌరవముతోడను నమ్మినట్లు లాచరించి వార్ధకమున వగచి పశ్చాత్తాపము నొందినవాఁడొకఁడైన వారిలోఁ గలఁడా? హిందూదేశములో సత్యములైన మతధర్మములు బోధించినందుకు బహిష్కరింపఁబడినవారు పెక్కురు గలరు. ప్రతిష్ఠ, పాండిత్యము, మహాధికారము, గొప్పపదవి, మొదలగునవి సంపాదించుటకై యూరపు ఖండమునకు వెళ్ళినవారనేకులు గలరు. సంఘసంస్కరణము ప్రారంభించి తమ గృహములయందు, తమ కుటుంబములయందు దానిం బ్రవేశపెట్టి కార్యశూరులై ఘనకీర్తిఁ గాంచిన వారనేకులు గలరు. ప్రశస్తతమమైన సంఘజీవనమును సంస్థాపించిన యీ మహాత్ములలో నొక్కఁడైన బాల్యకాలమునఁ దాను జూపిన ధైర్యసాహసములకు వగచి పశ్చాత్తాపము నొంది బాధపడినవాఁడు గలఁడా? వెలివేయఁబడినందుకు విచారించినవాని నొక్కనిని వేలు మడిచి చూపఁగలవా? బహిష్కారమున కిప్పుడంత భయము లేదు. మునుపటిబాధ లిప్పుడుండుటకు వీలులేదు. ఇప్పుడు బహిష్కరింపఁబడిన వానికి ధర్మకార్యము నిమిత్తమై బాధలు పడిరిగదా ఇదే చాలునని సంతోషించుటకైన నవకాశము లేదు. తుపాకిమందుఁ గనిపెట్టిన తరువాత, అమ్ములు విండ్లు మూలఁబడినట్లే పూర్వాచార పరాయణులచేత గొప్ప యాయుధమైన బహిష్కార మిప్పుడు మూలఁబడి త్రుప్పు పట్టుచున్నది. యూరపుఖండములో విద్యనేర్చుటకుఁబంపని గొప్పకుటుంబము కలకత్తాలో నేఁటికాలమున నొక్కటియు లేదు. వారిని వెలివేయువాఁడెవఁడు? దేశమందున్న ఋజువర్తనులను బుద్ధిమంతులను వెలివేసినపక్షమున సంఘములో నిఁక యోగ్యులు, తెలివితేటలు మిగులనేమిగలవు? మనల నడిపించువారు మనకు విద్య నేర్పువారు, మనకై శాస్త్రములు వ్రాయువారు, సంఘసంస్కరణముకై పాటుపడువారు, రాజకీయ విషయములలో మనయభివృద్ధికై పోరాడువారు హిందూసంఘములోనుండి బహిష్కరింపఁబడదగినవారే యగుదురా? ఇంతేందుకు? హేమచంద్రుఁడా! వినుచుంటివా? ఎవరిపరిశ్రమము మనజాతి పురోవృద్ధికి మూలాధారమో యభివృద్ధిమార్గమున నడచునపుడు మనకెవ్వరి ఋజువర్తనము మార్గదర్శకమై మంచి ప్రోత్సాహము కలిగించి, మనచేతఁగూడ ధీరకార్యములు చేయించునో ఆమహాత్ములందఱు, ఆ నాయకులెవరు వారే. మహానుభావుఁడైన విద్యాసాగరుఁడు, మనీషావంతుఁడైన మధుసూదనదత్తు, మహోత్సాహశూరుఁడైన

కేశవచంద్రసేనుఁడు, దేశాభిమాని యగు సురేంద్రనాథ బెనర్జీ మున్నగువారిని మనవారి దినములలో, వేఱునకు మాత్రము వెలివేసినారు. ఈ నాయకులను దలఁచుకొనకుండ హింసాసంఘము మాట లెవ్వరు తలఁచుకొందురు? ఈ నాఁటి హిందువులలో మిక్కిలి గొప్పవారుగా శ్రేష్ఠులుగా వీరిని పేర్కొని గర్వింపని హిందువుఁ డెవఁడున్నాఁడు? నా పిచ్చిమాటలు పాటింపక మన్నింపుము. ఈ సంబంధములో నపూజ్యులైన యా మహాత్ముల నామధేయములఁ బేరుకొన్నందుకు నన్ను క్షమింపుము. నేను నవనాగరికుఁడను గాను. నాయకుఁడను గాను, పేదవిద్యార్థిని. స్వసౌఖ్యముఁ జూచికొనునట్టి యాత్మలాభపరాయణుఁడను కాని యీదినములలో వెలివేయుట పిచ్చిప్రయత్నమని మాత్రము చెప్పఁదలచుకొన్నాఁడను. అధర్మము కానిదియు, అగౌరవము కానిదియు నైన కార్యమొకటి చిన్నతనమందుఁ జేసినందుకుఁ జెడిపోయిన వాఁడెవఁడును లేఁడు."

"నీవు మిక్కిలి సమర్థతతో లెస్సగా వాదించినావు. నీవు తొందరపడలేదనియు గ్రుడ్డివలపునకుఁ జిక్కి పరవశుఁడవై పని చేయులేదనియు నీ నిశ్చితాభిప్రాయమును బట్టి, సంమతి సూచించుచున్నాను. నామాట వినుము. స్వయంకృతాపరాధములచేతను సాహసములచేతను మన దుఃఖములను మనమే తెచ్చిపెట్టుకొనుము గాని లోకము మనకు దుఃఖము తెచ్చి పెట్టజాలదు."

"హేమచంద్రా! నే నాలోచింపఁ గలిగినంత నెమ్మదిగా నాలోచించి చూడఁగాఁ దేలిన యవసాన మేమనఁగా, నేను దురదృష్టములు తెచ్చుటకుఁ బ్రయత్నించుటలేదు. సౌఖ్య సంపాదనమునకే నేను ప్రయత్నించుచుంటిని. ఆమెను నే ననేక దినములు, అనేక మాసములు పరిశీలించి చూచితిని. ఆమె నాయనురాగిని చేసిన పక్షమున నన్నందఱికంటె నెక్కువ ధన్యునిఁ జేయఁగలదు. ఆమె యమాయకత్వమును బట్టియు, విశ్వాసమును బట్టియు, ఆమె వినయమును బట్టియు, భక్తిని బట్టియు, ఆమె సత్యాసక్తిని బట్టియు, పవిత్ర చరిత్రమును బట్టియు, నే నామె వలపు నిలిపితిని. ఎవని హృదయమును ఎవని జీవనమును తన యనురాగముచే యామె యనుగ్రహించునో అతనిని భగవంతుడు నైతి మనుగ్రహించును. హేమచంద్రా! నేనెంతో నెమ్మదిగాను మోహావేశ శూన్యముగాను మాటాడుచున్నాను. ఈరెండు మాసములనుండియు నాహృదయమును బ్రదలుచేసి తలఁచుకొన్నప్పుడెల్ల నాకు శక్తి యుత్తించినట్టి యావికార భావములను నేనిప్పుడు నామనస్సు చెంతకు రానిచ్చుటలేదు.

కాని యొక్కమాట మాత్రము చెప్పెదను. ఏమనఁగా ఈవిషయములో నామనోరథము భిన్నమై నాయాశ లడుగంటె నేని నాప్రయత్నములు వ్యర్థములు. నాజీవనము నిష్ప్రయోజనము. నే నెందుకు బనికిరాను. నేనింకఁ బ్రయత్నింప వలసిన విషయమే యుండదు. సంతోషరహితమై పరమార్థశూన్యమైన యీబ్రతుకు నేనేమిచూచికొని బ్రతుకుదును ?"

"శరచ్చంద్రుఁడూ! సిగ్గు సిగ్గు! అలాగనబోకు. దేహమనోదార్ఢ్యములు గల నీవంటి పడుచువాఁడు తాను వలచినకన్య తనకుఁ జిక్కలేదని జీవితపరమార్థములను భ్రష్టములు చేసికొని, ప్రయత్నములు భగ్నములు చేసికొని పాడగుట భావ్యమా? సుధ నీకు చేజిక్కనది కాదని అటువంటిమేధను అటువంటిశక్తిని, వ్యర్థము చేసికొని యావజ్జీవము సేయఁ దలఁచిన మహాకార్యము లన్నిఁటిని మానుకొని ఆశలనుగంగఁ ద్రొక్కికొని చెడి పోవచ్చునా ?"

"హేమసుఁడా ! నీనిశ్చయ మిదా ? ఎంతదృఢమైన హృదయమైనను, జీవయాత్రలోఁ దనకుఁ జేదోడు వాదోడుగా నుండి కాపాడుటకుఁ బరసహాయ మపేక్షించునన్న మాట నీవు మఱచితివి. ఆశలేకుండనే మనుష్యుఁడు బ్రదుకు చుండును గాని దానివలె నిరర్థకముగా పనిచేయఁడు. నీవిదివఱకే ఏదోఫక్కిగా నిశ్చయించుకొన్న పక్షమున నావాదము వ్యర్థము. అందుచేత నీకును బిందుమను నేను చేసిన యపరాధము మఱచి పొమ్ము. చేయవలెనని నేనేయపరాధమును జేయలేదు. గావున నాతెలివి తక్కువను మన్నింపుము. మనయూరిలో నేను చిన్న పిల్లవాఁడ నైనప్పటినుండి నామీఁద నీవు చూపుచువచ్చిన యాప్రేమతోనే నన్నెప్పుడప్పుడు తలఁచుకొనుము."

అని శరచ్చంద్రుఁడు బాష్పబిందువులు వెడలుచున్న తనకన్నులు వాని కగపడకుండ జేయుటకై తన మొగమావలకుఁ ద్రిప్పికొనెను. హేమసుఁడు మెల్లగా తనపై చేయి వైచి యిట్లనియె. "నీమనస్సునకు నొప్పి కలిగించితి నేని నన్ను క్షమింపుము. నీవు తొందరపడి క్షణభంగురమైన మనోవికారముచేత నిటుల పలుకుచుంటివేమో కనుగొనుట సుఖము నీకుఁ గూడ క్షేమమే యని తలంచితిని. నీవు సంపూర్ణముగా నాలోచించి, యిది యుంచిదే యని తలంచిన పక్షమున నీధైర్యమునకు నేను మెచ్చుకొనుచున్నాను. నీదయకు నేనాశ్చర్యపడుచున్నాను. నీవివాహమును నేను హృదయపూర్వకముగ నంగీకరించుచున్నాను. నాభార్యలతనకీవిషయ మంగీకారమే యని తననోటితో తానే సంతోషముగాఁ జెప్పుటకై నేడుమీఁద నీకోసము కనిపెట్టుకొని యున్నది. ఆహారకనుకా

సముద్రుఁడగు భగవంతుఁడు పాపము మందభాగ్యురాలగు సుధయొక్క జీవనమునకు సంతోషము, సౌఖ్యము ప్రసాదించి యనుగ్రహింపఁ దలఁచుకొన్నప్పుడు నాభార్యయు నేను దానికడ్డముగా నిలిచి చెడఁగొట్టుదుమా? పరమేశ్వరుఁడు మీకెల్లప్పుడు నిరంతరానందమిచ్చి రక్షించుగాక!"

ఆమాటలకు శరచ్చంద్రుఁడు ప్రత్యుత్తరము చెప్పలేకపోయెను. శరచ్చంద్రుని యంతవరకుఁ బిగఁబట్టి యుంచిన బాష్పబిందువులు హేముని చేతిమీఁదఁబడెను. హేముఁడు మాఱుమాటాడక మేడమీఁదకు వెళ్ళుమని చేతితో సంజ్ఞచేసెను.

బిందు మేడమీఁద నాముదముదీపము పెట్టి నేలఁ జాపవైచికొని కూర్చుండెను. అప్పుడు శరచ్చంద్రుఁడు కలతపడిన మనస్సుతో, సిగ్గుతో నెఱ్ఱని మొగముతో నామె కడకుఁ బోయెను. తన కృతజ్ఞతను గౌరవమును దెలియఁజేయుటకై యతఁడు బిందు పాదములకు నమస్కరించెను.

"అంధకార బంధురమగు నాజీవనముమీఁద సూర్యప్రభ జిమ్మితివి. ఇందుకు నేను నీ కేమి ప్రత్యుపకారముఁ జేయఁగలను, బిందూ!"

మన దేశములో స్త్రీలు తోఁబుట్టువుల భర్తలగు బావలను, మఱఁదులను హాస్యముచేయునట్టి యాచారము కలదు గావున బిందు శరచ్చంద్రుఁడు తన చెల్లెలికి మగఁడై, తనకు మఱఁదియైనట్టే భావనచేసి యిట్లు పరిహాసోక్తులు పలికెను. "అబ్బాయీ! శరచ్చంద్రుఁడు! నాజోలికి రాకు; నాపాదములకు నమస్కరింపవద్దు. ఈవిధముగా బతిమాలుకొని అనుగ్రహము సంపాదించుటకో వలసినవారు వేరే యున్నారు. నేను కాను"

శరచ్చంద్రుఁడు సంతోషపారవశ్యమునుండి తెలివిఁ దెచ్చుకొని కృతజ్ఞతాసూచకముగా మరల నిట్లనియె. "నీవు నాపక్షముఁ బూని నీమగనితో వాదము చేసినావు. ఈ కార్యమున కతనిసమ్మతి పుచ్చుకొన్నావు. యావజ్జీవ సుఖప్రదానము చేసినందుకు, నేను నీఋణ మేలాగునఁ దీర్చుకొనఁగలను?"

"మాసమ్మతి యెందుకు నాయనా! పెండ్లికొడుకు తానే మనసిచ్చి ముందుగా పెండ్లికూఁతురిని వరించినాఁడు. పెండ్లికూఁతురు పెండ్లికొడుకుమీఁదఁ దన కటాక్షమిదివఱకే సమ్మతించినది. మధ్య సమ్మతించుటకు మానుటకు మే మెవరము?"

"బిందూ! నీమాటిపోటిమ ట లొక్కనిమిషము కట్టిపెట్టు. ఇందుకు సమ్మతించితి వని మనఃపూర్వకముగాఁ జెప్పి మా యిద్దరిని దీవించవమ్మా! ఈ భూలోకములో అన్ని విషయములకంటె నీదీవన నే నెక్కువగా భావించుకొందును! సుధ ఇప్పటికిని చిన్నపిల్లే కదా? అప్పగారు తెలపీయకుండ ఆమె యేలాగున సమ్మతింపగలదు?"

"అది ఇప్పుడు చిన్నపిల్ల కాదు. చిన్నదైనను ఈ విషయములు మాకంటె దానికి బాగుగాఁ దెలియును. అమ్మయ్యో! అదెక్కడ! చిత్రవిచిత్ర గ్రంథాలు చదువుకొంగలదు. పలుకులు కులుకులు దానికిచక్కగా తెలియును."

"వేళాకోళము కట్టిపెట్టి కొంచెము నీవు వ్యవహారసరళిగా మాట్లాడవమ్మా! నీకు దండము పెట్టెదను"

"నన్నీలాగున బతిమాలుకొనకయ్యా! మీ యావిడ కోప పడగలదు. నా చెల్లెలికి కోపము తెప్పించుట నా కిష్టము లేదు. ఆమె వ్యవహారములలో జోక్యము కలుగఁ జేసికొని పెత్తనము వహించుట అంతకంటె ఇష్టము లేదు."

"నే నోడిపోయినా నమ్మా! ఈ యుత్కృష్టసమయమున మీ సలహా పుచ్చుకొని వ్యవహారము పరిష్కరించుకోవలెనని యనుకొన్నాను. ఏదేమో కాని నీవతి కఠినముగా నున్నావు! ఎంతబతిమాలుకొన్నను మెత్తఁబడకున్నావు"

"వ్యవహారము పరిష్కరించకో. ఎవరొద్దన్నారు? పెండ్లికొడుకు పెండ్లికూఁతురు కలిసి రహస్యముగా వారిష్టము వచ్చినట్లు వ్యవహార మిదివరకే పరిష్కరించుకొన్నారని నే ననుకొన్నానే! ఇఁక పురోహితుఁడు వచ్చి పీటలమీఁద కూర్చుండఁబెట్టి పెండ్లి చేయుటే తరువాయి. మఱచిపోయినాను; కాలేజీలలో చదువుకొను పిల్లవాళ్ళు మంత్రములు మానివేసి పురోహితుని పిలువక వివాహములు స్వయముగా తామే చేసికొందు రేమో! ఆఁడవాళ్ళు చేయవలసిన లాంఛనములు కొన్నియున్నవి. అవి మేము చేయ వచ్చునా? లేక పెండ్లికూతురే చేసికొనగలదా? సుధను పిలుతునా? పోనీ, ఇప్పుడే వివాహము జరిగించుకోవచ్చును.

బిందుయొక్క హాస్యప్రసంగమున కాశ్రాంతి విరామములు కనఁబడక పోవుటచే శరచ్చంద్రుఁడు విసిగి వెళ్ళిపోవుటకై లేచి కడసారి యొకవిన్నపము చేయఁదలఁచుకొని, యామెచేతులు రెండు పట్టుకొని యిట్లనెను. "నీవు కఠినముగాను నిర్దయగాను

మాటలాడుచున్నావు గనుక నేను వెళ్ళిపోయెదను. నేను వెళ్ళకముందు దయతో ఒక్కమాటమాటాడి మా వివాహము 'సరే. మంచిదే' యని దీవింప వమ్మా! నీదీవన, నీ ప్రేమ నాకీలోకములో అందరి దీవనలకంటె, ప్రేమకంటె యెక్కువ. నీ వంటివారు నాకీలోకములో లేరు,"

ఆ విన్నపము విని బిందు మెత్తపడి సామాన్యధోరణి నీ విధముగాఁ బలికెను.

"దయాసముద్రుఁడైన భగవంతుఁడు నా చెల్లెలికి వివాహసౌఖ్యము సిద్ధింపననుగ్రహించి నప్పుడు నేను దానికడ్డము నిలుతునా? దిగఁబడినవారి కూఁతకోలయై లేవనెత్తి నిరుపేదలను నెనరుతో రక్షించునట్టి భగవంతుఁడు నా చెల్లెలికి సుఖము గలుగఁజేసి రక్షించుగాక! ఇటువంటి దృఢమైన హృదయము, దయాస్వభావము గల మనుష్యునకు ఎటువంటి గొప్పదశ దగియుండునో అటువంటి గొప్పదశ, అభివృద్ధి ఐశ్వర్యము నీకు కూడా భగవంతుఁ డీయవలెనని కోరుచున్నాను. సుధ నీకు సధ్యేయురాలై, పతివ్రతయై పదిమందిలో ఇటువంటి ఆఁడది లేదనిపించుకొనునట్లు నడచుకొని నీకు సుఖము కలుగఁ జేయవలెనని కోరుచున్నాను"

ఈ సంభాషణ ముగునప్పటికి రాత్రి ప్రొద్దుపోయెను. శరచ్చంద్రుఁడు బిందువద్ద సెలవు పుచ్చుకొని వెళ్ళెను. వెళ్ళునప్పుడతఁడు తనంతటి యదృష్టవంతుఁడీ భూలోకములో లేఁడని యానందించెను. అతఁడు మెల్లమెల్లఁగా మేడమెట్లుదిగి ముందటి వాకిలిలోనికి వచ్చెను. వచ్చునప్పటి కెవరో కిటికీ తెరచిన చప్పుడు వినఁబడెను. వినఁబడఁగానే అతఁడు కదలక అక్కడ నిలిచెను. ఆమె ముఖ్యముగా చేతిలో ... పట్టుకొని ... కొట్టుచు తలుపు వేయుచు సుధ కానఁబడెను. ఆ ... ఆ సుందర విగ్రహమును శరచ్చంద్రుఁడు సరిగా రెండుమాసములనుండి చూచుటలేదు. అందువలన యతఁడు తన మనోరథమై, తన వలపుల కాణాచియై వెలయుచున్న యా యువతి విగ్రహమును రెప్పపాటు లేక చూచుచు, నిశ్చేష్టుఁడై నిలువఁబడెను. అతఁ డొక్కమాట మాటలాడఁజాలక నిలువఁబడినప్పుడు మనోజ్ఞమైనకైపు తలకెక్కినట్లు మాటలకతీతమై వర్ణించుటకు వీలులేనితలఁపులు తండోపతండములై యతని యంతరంగమునఁ బ్రవేశించెను.

సుధ తలుపు గొళ్ళెము వైచి, తాళము తగిలించి రెండడుగులు ప్రక్కకు నడచెను. మరలిన ప్రక్కను నిశ్చేష్టుఁడై నిలిచి మాటాడఁ జాలక తన్నుఁ జూచుచున్న శరచ్చంద్రవిలాసుని శరచ్చంద్రునిఁ జూచెను. ముద్దులుమూటగట్టు నామె మొగము సిగ్గుతోఁ జెలఁగెను.

ఆసిగ్గునఁ దలవంచికొనెను. శరచ్చంద్రుని దృష్టిప్రసారమునుండి తన మొగమును గప్పి పుచ్చుటకు మొదటిసారి యామె మేలిముసుఁగు కన్నుల కడ్డముగాఁ దీసికొనెను. నిలువఁబడినప్పు డామె మేనువడఁకెను. నులివెచ్చని నెత్తురు పైకి ప్రవహించి మొగమునకును, మూసికొనిన కన్నులకును సుందరమైన యరుణకాంతినిఁ గలిగించెను. అంతట నామె దీపమూఁది యార్పివైచెను. ఆర్పివైచిన సిగ్గుకలిగించుచున్న యాయవస్థనుండి తప్పించుకొనుటకై మరియొక చోట కరిగి దాగి యుండెను.

భరతఖండములో వధూవరుల కింతకంటె యెక్కువ సమావేశములు, సంభాషణలుఁ గలుగవు.

---

## పదునాల్గవ ప్రకరణము

### మాతృశాసనము.

అర్ధరాత్ర మయ్యెను. పండుగరాత్రి 'వెలిగించిన జ్యోతులు క్రమక్రమముగా నారిపోయెను, సంతోషములోఁ గలిసికొన్న మనుష్యులగుంపు లదృశ్యము లయ్యెను. ఆసమయమున శరచ్చంద్రుఁడు నిర్జనములైన మాటుమణఁగి సందులగొందులనుండి మాఱుమూలనున్న తనబసకుఁ బోయెను. నాఁటిరాత్రి జరిగిన వృత్తాంతములు తలఁచుకొన్నకొలఁది వానిగుండె దడదడఁ గొట్టుకొన సాగెను. ఈమహాసౌఖ్య మనుభవించు నదృష్టమతనికిఁ బట్టునా లేక యాపండుగరాత్రి వెలిఁగించిన దీపములు జ్యోతులు క్రమక్రమముగ నారిపోయిన తరువాత నంధకారబంధురమగు ప్రపంచమువలెనే, యాస లన్నియు నశించిపోవ నతని హృదయము మునుపటికంటె నధికముగ దుఃఖభాజన మగునా?

అడుగులు చప్పుడు కాకుండ నతఁడు తన బసఁజేరెను. చేరఁగానే సేవకుఁడొకఁడు జాబొకటి తెచ్చి చేతిలో బెట్టెను. పెట్టఁగానే యందతఁడు వడఁకెను. మేడమీఁద దీపము లేదు. అతఁడు మేడమెట్లు మెల్లమెల్లఁగా నెక్కుచుండ నేవో క్రొత్తకీడు తనకు మూడఁ దలచుకొన్నదని గొప్పభయ మతనిమనస్సు నావరించెను. కడచిన రెండుమాసములనుండియు నతఁడున్న వ్యాకులముచేత నతని నరములు బలహీనములయ్యెను. అతఁడు

దీపముకడకుఁ బోయి జాబు జదువ సమకట్టునప్పటికి వాని చేతులు వడఁకెను. దానిమీఁద కాశీ టపాముద్ర చూడఁగానే అతని కంపము మఱింత వృద్ధియయ్యెను.

ఆజాబు వానితల్లివద్దనుంచి వచ్చెను. అందులో నిట్లుండెను.

“బిడ్డా! శరచ్చంద్రుఁడా! నీవు నిరంతరారోగ్యముఁ గలిగి చిరంజీవి వగుటకు, నీప్రయత్నములు మనోరథములు సిద్ధి పొందుటకు, నీకెల్లప్పు డానందము కలుగుటకు భువనేశ్వరస్వామిని నే నెల్లకాలము ప్రార్థించుచున్నదానను.

కుమారా! నీవిషయమై నే నొకచెడ్డవార్తను విని మిక్కిలి ఖేదపడుచున్నాను. నీవు నాకు సుపుత్రుఁడవు. నీతల్లిమీఁద నీకు మిక్కిలి ప్రేమ. నీమీఁద నెంత చెడ్డవార్తను పుట్టించినను నేనది నమ్మను. భర్తను గోల్పోయి దుఃఖించుచున్న తల్లిని మఱింత దుఃఖపెట్టవని నే నెఱుఁగుదును.

ఆవిధవపిల్లను సుధను నీవు పెండ్లియాడుదువని ఇక్కడ అందఱు చెప్పుకొను చున్నారు. అది పాపకార్యము. అందువల్ల నీతండ్రిగారి కప్రతిష్ఠయు, నామనస్సునకు మేర లేని దుఃఖమును సంభవించును. నీవు వినయవిధేయతలు గలవాఁడవు. మాతృభక్తికల వాఁడవు. కనుక తల్లిమనస్సు నొప్పింపవు.

నాయనా! ఈప్రపంచములో నేనెన్నోకష్టములు పడియున్నాను. మీతండ్రి గారు నన్ను దుఃఖసముద్రములో ముంచి వెళ్ళిపోయినారు. నీచెల్లెలికోసము నే నెంత దుఃఖపడుచుంటినో నీవే యెఱుఁగుదువు. నీవే నా నిక్షేపము. నీవే నాప్రాణాధారము. నేను నీమీఁద పుట్టెడాస పెట్టుకొని యున్నాను. నేను బ్రదికి నన్నాళ్ళు బ్రదుకఁ బోను. కాబట్టి యీముసలితనములో బ్రతికియున్న నాలుగు దినములు నన్ను దుఃఖ పెట్టకు నాయనా!

నా తండ్రీ! నా తలమీఁద ఎన్నివెంట్రుక లున్నవో అన్ని సంవత్సరములు బ్రదుక వలెను. దయాసముద్రుఁడైన విశ్వేశ్వరుఁడు నిన్ననుగ్రహించి, నీమనస్సు పవిత్రమై, న్యాయము మీఁద నిలుచునట్లు చేయుఁగాక! ఇంతకంటె తల్లి కుమారుని నిమిత్తము వేఁడఁదగిన దే మున్నది? నాయనా! నిన్నొకసారి చూచిపోవలె నని త్వరపడి కలకత్తాకు వచ్చితిని.”

శరచ్చంద్రుఁ డాజాబు మొదటనుండి చివరవఱకుఁ జదువుకొనెను. అంతలోఁ దృప్తినొందక మఱలమఱలఁ జదువుకొనెను. అంతట జాబు పట్టు లేక చేతులనుండి

పాలై సుఖమెఱుఁగక దిక్కుమాలినదై యామె యుండవలసినదా? మొదలు వితంతువు వివాహము చేసికొ దలఁచుటయే నింద. ఆనింద యెట్లో పోఁద్రోవచ్చు ననుకొనఁగా, జేసికొందలఁచుకొన్న పురుషుఁడు చేసికొనక, కారణము చెప్పక, యకస్మాత్తుగా మాని కొనుటచే నేదోదోషము దానికడ నుండబట్టి యతఁడు వదలివేసె నని లోకులు వ్రేలు పెట్టి చూపి కలకాలమామెను నిందింతురు. ఆమె పేరు సంసారస్త్రీ లెత్తఁగూడని పేరుగా నెంచి యమ్మలక్కలు గుసగుసలాడుదురు. ఇట్లు పరిత్యక్తయైన యామందభాగ్యురాలు గడినోర్వలేక, మనోవ్యాధిపీడితయై మంచమెక్కవచ్చును. వెళ్ళబుచ్చుటకు వీలులేని దుఃఖభారముచేత గ్రుంగి యనేకులు గతించినట్లు యామెయు నకాలమృత్యువువాత బడవచ్చును. ఈతలంపులతో నతని తల గిఱ్ఱున దిరిగెను. ఆరేయి వీచుచున్న చల్లనిమంద మారుతములు తనపై బ్రసరించి సేద దేర్పవచ్చునని యతఁడు తల కిటికీలోనుండి యావలకు బెట్టెను. లోకమంతయు నిద్రించుచుండెను. అంధకారము భూమి నంతయు నావరించెను. ఆశరత్కాలరాత్రి యందు లెక్కకు మిఱినచుక్కలు సమ్మోహనము జెందిన విశాల ప్రపంచమును జూచుచుండెను.

కాలక్రమమున తూర్పుదెసయందు దెల్లనిరేఖలు పొడచూపెను. అంతలో నతనికి దల్లి జ్ఞప్తికి వచ్చెను. దుఃఖసముద్రములో మునిఁగియు దన్ను మితిలేని గారాబమున బెంచి, బ్రదికి నన్నాళ్ళు బ్రతుకజాలక, జీవితశేషమందు సంరక్షకుఁడుగా, నూతకోలగా, నీడుగడయుగా దన్నే నమ్ముకొని యున్న మాతృదేవత మనఃపథమున జొచ్చెను. “ఓతల్లీ! నీవు చెప్పినమాట వినక, నేను నీయెడల దుర్వినయము జూపవలసినదా? నీమనసునకు నేను నొప్పి గలిగింపవలసినదా? ఈభూమిమీఁద నీవుండవలసిన కడపటి దినములలో నీకేసౌఖ్యము లేకుండఁజేసి నిన్ను నేను బాధింపవలసినదా? శతవృద్ధవైన నీమనస్సు క్రొత్తదుఃఖములతో నింపి, నీజీవితకాలము హ్రస్వముచేసి నీకు నేను శీఘ్ర మరణముఁ గలిగింపవలసినదా? నాతల్లి మాటదాటిన తరువాత నేను బ్రతికి యెందుకు? చచ్చి పోవలసినదే.”

అట్లు తలంచుచు నతఁడు గవాక్షము మీఁదనే తల పెట్టుకొని యుషఃకాలము నందలి చల్లనిమందమారుతములు మేను సోఁక నిమేషకాలము నిదురించెను. ఉదయకాల సూర్యమయూఖములనుండి కెంజిగురాకులవంటి యరుణకిరణములు గదిలోఁ బ్రవేశించుటకు నతఁడా విధమున నిదురించి కొండొక వడికి మేలు కాంచి యెట్టయెదుట వెలవెలబారు

మొగముతో దయారసము గ్రక్కుచున్నఁ జూడ్కులఁ బ్రసరింపఁజేయుచు నిలిచి యున్న యొక యవ్వను జూచెను.

"నాయనా! నీ మొగమున నెత్తురు లేదు. వెలవెలఁ బాఱు చున్నది. బెంగ పెట్టుకొన్నట్లున్నావేమి? రాత్రి యంతయు ఎందుకు మేలుకొన్నావు తండ్రీ! పరుపుమీఁదపండుకో. కొంచెము ప్రొద్దెక్కినదాఁక నిద్రపో." అని తెల్లవారు జామున బండిదిగివచ్చిన తల్లి శరచ్చంద్రునిపైఁ జేయివైచి పలికెను.

తల్లి మాటలు చెవినిఁ బడగానే యతని హృదయము మీఁద పన్నీరు చిలికి నట్లయ్యెను. వెంటనే యతఁడు కూర్చుండినచోటునుండి లేచి యామె పాదముల వద్ద గూర్చుండి కన్నీరుతో మాతృపాదారవిందముల కభిషేకముచేసి గద్గదస్వరముతో మాటలాడెను. "అమ్మా! నీమనస్సునకు నేను నొప్పి కలిగించినపక్షమున నాబుద్ధిహీనతను మన్నింపుము. నేను నీమాట జవదాఁటను."

అని తల్లి యెదుటఁ బ్రియపుత్రుఁడు మాటలాడ వలసిన భయభక్తులతో మాటలాడెను. హిందువుల మనస్సులో సమస్తభావములకంటె మాతృదేవత యెడల భక్తిభావము మిన్నయై వెలుఁగు చుండును గదా!

తన ముసలికన్నులు బాష్పబిందువులతో నిండి క్షణకాలము గ్రుడ్డివగునట్లు లాయవ్వ యట్లనియె. "అబ్బాయీ! కాఁటికి కాళ్ళు చాపుకొని యున్న తల్లిని బాధపెట్టవని నే నెఱుఁగుదును. పుట్టి బుద్ధి యెఱిగిన తరువాత నామాట దాఁటి యెఱుఁగవు. భగవంతుఁడు పాలించి నీ కన్ని సౌఖ్యములు కలుగఁజేయును."

ఇది జరిగినయొక వారము తరువాత నొకనాఁటిరాత్రి యొక పడుచువాఁడు హౌరా రైలుస్టేషనుకడకు వెళ్ళుటకు హుగ్లీనదిమీఁది వంతెన మీఁదుగా నొక్కఁడు బోవుచుండెను. బాటసారులు గుంపులుగుంపులుగా నతనిప్రక్కనుండి పోయిరి. ఎడతెఱపి లేక బండ్లు వేనవేలు పరంపరగా నడచెను. అనేకకంఠముల ధ్వని నభోమండలమంత వ్యాపించెను. కాని యాపడుచువాఁడు వంచినతల యెత్తక తనదారిఁ బోయెను. వంతెన మీఁద వెలిఁగించిన దీపములు క్రింద నీటిలోఁ దళతళ మెఱసి సంచలించెను. హిందూదేశ మంతటితో సర్వాధిక వ్యాపారము గల యాస్టేషనువద్దనుండి సరకుబండ్లు కట్టుకట్టుగుని నడిచి, మహాపట్టణమునఁ బ్రవేశింపఁ జొచ్చెను. కాని శరచ్చంద్రుఁడు దాని వంకఁజూడనే లేదు. అతని మనసు విచారముతో నిండి యుండెను. అతని యడుగులు మెల్లమెల్లగాఁ బడెను.

దీపాలపండుగు తరువాత మహావిచారపీడితుఁడై యతఁడు కలకత్తాలో నొక వారము గడపెను. అతఁడు మిత్రులను జూడవెళ్ళుట మానుకొని గదిలోనే కూర్చుండెను. కాని యొకనాఁడైనఁ జదివి యెఱుఁగఁడు. పుస్తకము తెఱువలేదు మూసిన పుస్తకము మూసినట్లె యుండెను. అతని మనస్సున కేవ్యాపారము సంతోషముఁ గలిగింప లేక పోయెను. ఏలయన జీవన మతనికంధకార బంధురమై, సంతోషరహితమై ప్రయోజనము లేనిదయ్యెను. తన్నిమిత్త మతఁడు స్వార్థమును విడిచెను. ఆస్వార్థత్యాగమువల్ల నతని యాశాబంధము లెల్ల దెగిపోయెను. అతని ప్రయత్నములు వ్యర్థములయ్యెను.

తన భర్తకు సంగతి యధికమయ్యెననియు, నందుచేత మగనిని వెంటబెట్టుకొని తాను రాణిగంజికిఁ బోయి యుండెననియు సోదరి యగు కాళియొద్ద నుండి యతనికి జాబులు వచ్చెను. ఆజాబులు మఱలమఱలఁ జదువుకొనఁగా నతని మనస్సునకుఁ గ్రొత్త తలంపు తట్టెను. తాను రాణిగంజికిఁ బోయి తన బావ కుపచారము చేయవలెనని యతఁడు నిశ్చయించుకొనెను. తాను దలచిన వలపులాడికి దూరముగా నుండ వచ్చునని యతఁడీపనికి దొరకొనెను. ఒకరు వెడలఁగొట్టకుండ తనంతట తానే దేశభ్రష్టుఁడై ఇందందు సంచారము చేసి కాలక్షేపము చేయవలయునని యతఁడు సంకల్పించెను. తన జన్మస్థలములో నెవరికి జ్ఞప్తికి రాకుండ, బంధుమిత్రులస్మరణమునఁ దగులకుండఁ గడు దూరమున హిందూదేశమం దేదో మూల నుండుట కతని కిచ్చ పొడమెను. అట్టియేకాంత జీవనమువల్ల కలకత్తాలోఁ దాను గడపుచున్న దుఃఖజీవనమునుండి తనకు విమోచనము కలుగునని యతఁడు నమ్మెను. భూలోకములో నితరసంతోష మేదియు లేదు. గావున నట్టి ప్రవాసమే యతనికి దుఃఖోపశమనమై యుండును.

"అమ్మా! నన్ను వెళ్ళనీ. పాపము కాళి దుఃఖములోనున్నది. మహాసత్రమువంటి యీ యింటిలో దానిమగనికి సరిగా మందిప్పించి యాదరించువారెవరున్నారు?" అని శరచ్చంద్రుఁడు తల్లితోఁ జెప్పెను.

"నాయనా! కలకత్తాలో నన్నొక్కర్తెను విడిచి నీ వెట్లువెళ్ళెదవు! మాట పలుకు ఆనువారులేక, నా అన్నవారులేక, కాశీలోనుండక, కొడుకు దగ్గఱలేక, ఈ మహాపట్టణములో ఒక్కదానను నేనెట్లాగున నుండఁగలను?"

"అమ్మా! నీవొక్కర్తెవు యుండనక్కఱలేదు. నేను లేనప్పుడు హేముఁడే నీకొడుకు; బిందు నీ కూఁతురుకన్న నెక్కువగా నుపచారము చేయును."

"నీవు చదువుమాని యేలాగున వెళ్ళెదవు? పరీక్ష దగ్గఱకు వచ్చుచున్నది కాఁబోలునే?"

"అమ్మా! ఈ సంవత్సరము పరీక్షకు వెళ్ళను. ముందుసంవత్సరము వెళ్ళుదును. కాళిమగనికి మనమిప్పుడు సరియైన వైద్యము చేయించక యశ్రద్ధచేసితిమా, యావజ్జీవము విచారింపవలసి వచ్చును."

ఈ ప్రశ్నకామె యుత్తరమియ్యక యతఁడు పోవుట కంగీకరించెను. రాణిగంజి నుంచి యల్లునకు నెమ్మదిగానున్నవార్త తెలియువఱకుఁ గొన్నివారములామె కలకత్తాలో నుండి పిమ్మట వారణాశికి వెళ్ళఁ దలఁచుకొనెను.

ఇందునిమిత్తమే హుగ్లీపంతెనమీఁదనుండి శరచ్చంద్రుఁ డొకనాఁటిరాత్రి హౌరాస్టేషనునకు వెళ్ళెనని యింతకు మీరు చదివియుండిరి. అతడు వెళ్ళిపోవునప్పుడు హేమునిఁగాని బిందునుగాని చూచి తన ప్రయాణవార్త చెప్పలేదు. అట్లు మర్యాద నతిక్రమించి వెళ్ళినందుకు హేతువు వారూహించికొనఁ గలరని యతఁడెఱుఁగును. తనయెడఁ దప్పున్నపక్షమునఁ దనయందు దోషారోపణముచేసి నిందింపక, వారు భగ్న మనోరథుఁడైన మందభాగ్యుని దురవస్థకు జాలిఁదలఁచి, విచారింతురని యతనికి గట్టి నమ్మకము గలదు.

ఎఱిఁగినవారి కెవ్వరికిఁ గనఁబడకుండ బండిలో నెక్కవలెనని శరచ్చంద్రుఁడు నిశ్చయించుకొనెను. అందు ముఖ్యముగా హేమునకుఁ గనఁబడకుండ వెళ్ళవలెనని యతని సంకల్పము. ఏలయన హేమునిదర్శనము వెనుకటిమాటలు జ్ఞప్తికిఁదెచ్చి బాధకలిగించును. కాని యాలాగున జరుగలేదు. స్టేషనుదాటి యరుఁగుమీఁదకు వెళ్ళఁగానే యతనికి మొదట గనఁబడినమనుష్యుఁడే హేముఁడు.

కనఁబడఁగానే హేముఁడు శరచ్చంద్రుని కిష్టము లేకపోయినను దనచేతితో వానిచేయిం బట్టుకొని యిట్లనియె "ఏమది? నాకుఁ గనబడకుండ మొగము చాటుచేయుచున్నావేమి? ముఖ్య స్నేహితులను జూడకుండ వెళ్ళవచ్చునా? ఇంత తేలికగా స్నేహబంధము విడగొట్టుకొనుటకు మాకీ లోకములో మఱెవ్వరైన స్నేహితులున్నారా?"

"హేముఁడా! కారణములు నీకుఁ దెలియవు గనుకనా? నన్నడుగబోకు. నా నీచవుగుణములను, నా పిఱికితనమును నాకు మఱల జ్ఞాపకము చేయకు."

"ఆహా! శరచ్చంద్రుఁడా! లోకులు నిందించుచున్నారని నిన్ను నీవు నిందించికొనకు. నీవు మిక్కిలి మంచి మనోబలము గలవాఁడవు. నీవు చేసినదానిలో దోష మేమియు లేదని నీవు భావించినపక్షమున ఈ దౌర్బల్యము పోయి యెప్పటి మనోబలము నీకుఁ గలుఁగును. పెద్దది, మాతృదేవత. ఆమె కిష్టములేకుండ సుధను వివాహము చేసి కొనుట ధర్మమని నీవు తలంచుచున్నావా? నీతల్లి గుండెపగిలి, యేడ్చి, బెంగపెట్టుకొని త్వరగా చచ్చిపోవునట్టి కార్యము చేయుటకు మేము మాత్ర మొప్పుకొందుమని నీ వను కొనుచున్నావా? నీ ధర్మము నీవు నెఱవేర్చితివా, లోకములో నెవరికి జడియనక్కర లేదు. పేరునకు నీసోదరుఁడనని అనిపించుకొనుటకు వీలులేకపోయినను, నిజమైన సోదర ప్రేమ నీపైఁజూపి నిన్నాదరించిన మంచిస్నేహితుఁ డీలోకమున నీకొకఁడు గలఁడని నీ వెన్నఁడు మఱచిపోకుము."

అప్పుడు చిట్టచివరిగంట వాయించిరి. ఆమాట లన్నిఁటికిఁ దగిన యుత్తరములు చెప్పుట కవకాశము గాని, శక్తిగాని శరచ్చంద్రునకు లేకపోయెను. "సోదరునికంటె నెక్కువవాడవు. నే నెక్కడ ఉండనీ. ఎన్నఁటికి, నీదయను, నీప్రేమను మఱచిపోను. మా అమ్మకు నా నమస్కారములు చెప్పుము. నామాట జ్ఞాపకముంచు కొమ్మని బిందుతో మఱిమఱి చెప్పు. నన్నెప్పుడు జ్ఞాపక ముంచుకొమ్మని—" అని యింక నేమో చెప్పఁబోవుచుండ జిల్లుమనికూసి బండి వెళ్ళిపోయెను. అందుచేతఁ గడపటిమాట చెప్పుటకు వీలులేకపోయెను.

---

## పదునైదవ ప్రకరణము

### మగనివిచారము.

హేమునిగృహము సందడిలేక సంతోషశూన్యమై చిన్నబోయి యుండెను. అందుచేత నతఁడు స్వగ్రామమగు తొల్పుకారునకుఁ బోవఁగోరుచుండెను. శరచ్చంద్రుఁడు వెళ్ళిపోవుటవలన హేమునిగృహమున కింతోవెలితి గలిగెను. ఆవెలితి కందఱు విచారించుచుండిరి. తమ్మునికంటె నెక్కువగాఁ జూచుకొనుచున్న ప్రాణమిత్రుని వియోగ మునకై హేముఁడు మనస్సున మిక్కిలిదుఃఖపడెను. శరచ్చంద్రుని యున్నతములైన యాశయములను సగర్వముగా విని, రసవంతములైన యతని సంభాషణములను సంతోష

పూర్వకముగా నాలకించు చుండుటచేత బిందుయొక్క యాలోచనలు దీర్ఘములైన యాశీతకాలపు సాయంకాలములయందు వానిమీఁదికి బోవం జొచ్చెను. అంతకుఁ బూర్వము జరిగిన కార్యములంబట్టి హేమునిగృహము కొద్దికాలముక్రిందట మరణము సంభవించిన గృహమువలె నిశ్శబ్దమై శోభాహీనమైయుండెను. ప్రాణసమానుఁడైన యామిత్రుని యెడఁబాటు వారికి బంధుమరణమువలె దుఃఖము కలిగించెను.

సుధ యెన్నఁడు నధరస్పందము చేయలేదు! ఆమె యుదయమునందు సాయంకాలమునందుఁ దన యప్పబిడ్డలకు సంరక్షణ సేయుచుండెను. తక్కిన వేళల నింటి పనిపాటల నెడతెఱపిలేక చేయుచుండెను. పూర్వవృత్తాంత సంబంధమైన తలఁపు హృదయమున నుండినను, వాగ్రూపమున దాని నామె యెన్నఁడు వెలిఁబుచ్చలేదు. ఆమె కన్నులయందు వెనుకటి ధాళధళ్యము లేదు. మనోజ్ఞమైన బాలికావిలాసము పోయి "ప్రారబ్ధకర్మ మనుభవింపక తప్ప" దను వైరాగ్య ముదయించెను. అయినప్పటికిని ముద్దులు మూటగట్టుచున్న యామెముఖము దీర్ఘవిషాదమును సూచించు చుండెను.

కలకత్తా నివాసము తనకు దుఃఖహేతు వయ్యెనని భావించి, తన కనుకూలమైన స్వగ్రామవాసముఁ జేయుటకై వారు ప్రయత్నములు చేయఁజొచ్చిరి. ఒక నాటి సాయంకాలము బిందు పనిచేత నలసి, చెక్కునఁ జేయిఁ జేర్చికొని యేకాంతమునఁ దన గదిలోఁ గూర్చుండ నొకజాబు వచ్చెను. పైపేరు చూడ నది యుమ వ్రాఁతవలెఁ గనఁబడెను.

అనుకూలమైన శీతకాలపుగాలి తగిలినతోడనే యుమయొక్క దేహస్థితి బాగుపడెను. ఆమె తిరిగి యారోగ్యదశ నొందెనని బిందుకు వర్తమానము వచ్చెను. కాని జాబువిప్పి చూచినకొలది విచారసూచన లామె నేత్రములలోఁ గనఁబడెను. ఇటువంటిదని యూహింపరాని భయావేశమున నామె హృదయము కొట్టుకొనెను. ఆజాబు చిన్నది. అం దిట్లుండెను.

"అక్కా! బిందూ! నిన్ను చూడవలెనని యున్నది. ఈసాయంకాలము రాఁగలవా!"

"కొన్నివారములనుండి చిత్రవిచిత్రములైన యూహలు నాతలలోఁ బ్రవేశించినవి. ఎన్నఁడు లేని నిశ్చయమొకటి నామనస్సు నాందోళపెట్టు చున్నది. అది యేమో నీ కిప్పుడు తెలియదు. అది నీకు ముందుముందు తెలియఁగలదు. చిన్ననాటినుండి నాకు

నీమీఁదఁ గల సోదరప్రేమతో నేటిసాయంకాలము నిన్ను గట్టిగాఁ గౌఁగలించికొన వలెనని యున్నది.”

“ఇప్పటి నాబ్రదుకు తలచుకొన్నప్పుడు పిచ్చి యెత్తునేమోయని యొకప్పుడు నాకు భయము వేయుచుండును. అలాటప్పుడు కొల్పుకారులో మనము చిన్నప్పుడాఁడు కొన్న ఆఁట పాటలు, ముచ్చటలు జ్ఞాపకము చేసికొందును. కొంత దుఃఖము దానితో నుపశమించును. మనలను సృష్టించినవాఁడు మనకు సుఖము కలుగఁజేయక పోఁడు. లేదా మనకు శాంతియైన నియ్యకపోఁడు. బిందూ! అంతేనా?

“నీకు నామీఁద గల ప్రేమ నాదుఃఖమును బోఁగొట్టుచుండును. నామీఁద నీకున్నంతి ప్రేమ మాఅమ్మకైనను లేదు. అందుచేతనే ఈ సాయంకాలము నిన్ను చూడవలెనని నాకంత గట్టికోరిక. తప్పక రావలెను సుమీ.”

ఆమె యాజాబు నొకమాఱు చదువుకొని తనివి నొందక మరల మరలఁ జదువుకొనెను. చదువుకొన్న కొలఁది నామె కేదో యిట్టిదనరాని భయము తోఁచెను. అది యాకస్మికముగ వచ్చుటచేతను, దానిశైలి యసందర్భముగ నుండుటచేతను నామెభయము మఱింత యెక్కువ యయ్యెను. అంతటి యాత్మగౌరవము కలిగినది, యంతటి మితభాషిణి యైనది, బాధ లెన్ని పడుచుండినను నంత నిశ్శబ్దముగా భరింపఁజాలినది యైన సుమ యీ విధముగా నెట్లు వ్రాయఁగలిగినది? ఆ చిత్రవిచిత్రములైన యీ యూహలేమి? ఆమెకు కలిగిన యీనిశ్చయ మేమి? ఈశ్వరునివల్ల నపేక్షించుచున్న యీ శాంతియేది? అని తలంచుచున్న బిందు మనస్సున భయంకరములైన భావములు పొడకట్టెను. ఆమె మేనువడఁకెను.

ఆమె లేచి చెల్లెలిం బిలిచెను. “అమ్మాయీ! సునా! పిల్లలను గొంచెముజూచి, అన్నము పెట్టి రాత్రి పండుకొనఁ బెట్టఁగలవా? సుమ పాపము మనోవ్యాధితో బాధ పడుచున్నది. దానిని నేను చూచుటకు వెళ్ళవలెను. నాకోసము కనిపెట్టుకొని యుండ వద్దని, నేనొకవేళ ప్రొద్దుపోయి వచ్చినప్పటికి ఎందుకు రాలేదని యెదురుపెట్టుకొనవద్దని మీ బావతో చెప్పు. సుమ యెంతోకష్టములో నున్నదని నామనస్సులో విశేషము భయముగా నున్నది.”

సుమ జాబులోఁ గూడ నొకపల్లకిఁ బంపినందున బిందు దాని నెక్కి వెళ్ళిపోయెను.

ఉమయొక్క గృహము ప్రవేశించుచుండఁగా నామె గుండియలు దడదడఁ గొట్టుకొనెను. కాని యుమను చూడఁగానే యా భయము కొంతవఱ కుపశమించెను. బిందు పోవునప్పటి కామె నెమ్మదిగా బట్టలు సర్దుకొనుచుండెను. బిందును జూడఁగానే యామె చిఱునవ్వుతో సమీపించి, కౌఁగిలించికొనెను. మనోవ్యాధినిగాని దుఃఖమునుగాని పిచ్చినిగాని సూచించు చిహ్నము లేవియు నామె మొగమునఁ గనఁబడలేదు. అంతకు ముందు జబ్బు పడుటచేతఁ గాఁబోలు మొగ మించుక తెల్లగానుండెను. ఎందుచేతనో గాని యామె కన్నులలో నదివఱకెన్నఁడు పొడకట్టని మెఱుపు కనఁబడెను. బిందు ప్రేమ యుట్టిపడునట్టులామెను గాఢాలింగనము చేసికొని సహజ మృదుమధురమైన విధమున మాటలాడెను.

"అమ్మాయీ! ఉమా! నీజాబు చూడఁగానే నేను కొంచెము భయపడితిని. అందులో నీతప్పు లేదు. నాదేతప్పు. నేను తఱచుగా నిన్నుఁ జూచుటకు రావలసినది. ఆవిధముగా నేను వచ్చినపక్షమున నీమనసులో నీ విధముగా చిత్రవిచిత్రములైన ఆలోచనలు పుట్టకపోవును. ఏమోగాని మనకుఁగూడ కష్టములు సంభవించినవి. అందుచేత దుఃఖములపాలైనాము. నిన్నుఁ జూచుటకు నేను తఱచుగా రాకపోయినందువల్ల నీమనస్సునకు నొప్పి కలుగఁజేసితి నేమో యని నేననుకొనుచున్నాను. అట్లయిన పక్షమున నన్ను క్షమింపవలయునుసుమీ? ఉమా! నీమీఁద నాకున్న ప్రేమ యెన్నటికి మాఱిపోదమ్మాయీ! మున్నాటికి మాఱిపోదు."

"నీకు నామీఁద నెంతో అపేక్ష యున్నదని నే నెఱుఁగుదును. మీరు పడుచున్న బాధలుగూడ నే నెఱుఁగుదును. ఈవేళ నిన్ను చూడవలెనని నాకెంతో ఆతురమైనది. అందుచేతనే నీకు జాబు వ్రాసితిని. నీవు తప్పక వత్తువని నే నెఱుఁగుదును. అంతటిదయ నామీఁద నీకెప్పటికి ఉన్నది. పాపము సుధ యేలాగున్నది? శరచ్చంద్రుఁడు కలకత్తాను, మిమ్మందఱినికూడ వదలివేసి వెళ్ళినాఁడు కాఁబోలేమి?"

"అదికాదే, ఉమా! మనసుధ బ్రతుకు అచ్చటలు ముచ్చటలు లేనిదైపోయినదని దానిమాట తలచుకొన్నప్పుడెల్ల నా కెంతో దుఃఖము వచ్చుచుండును. శరచ్చంద్రుఁడు ఇల్లు వాకిలి వదలిపెట్టుకొని దేశములపాలై పోయినాడు."

"ఈ వ్యవహారము అతని తల్లికి తెలియుదా? అర్థములేని పిచ్చిఆచారముతో యున్నదని పట్టుపట్టి కొడుకును యావజ్జీవము పెండ్లిపేరంటములు లేకుండచేసి నిర్భాగ్యుని జేయవలెనుకొన్నదా యేమిటావిడ!"

"అతనితల్లి తప్పేమున్నదమ్మా! యిందులో, అంతకన్న భూదేవత లోకములో లేదు. కాని మనమతస్థు, ధర్మశాస్త్రము, అటువంటి వివాహము లొప్పుకొనవని ఆమె నమ్మకము. మత విరుద్ధమైనపని కొడుకు చేసినపక్షమున ఆవిడగుండె పగిలి చచ్చిపోవును. అందులో మా దేతప్పు మేము తొందరపడినాము, పడినందుకు ఫలమనుభవించినాము."

"మేలు చేయవలెననే చేసినావు. మన మెంతజాగ్రత్తపడినను, ఎంత దూరదృష్టితో బని చేసినను, మూడదలచుకొన్న కీడులు రాకుండ ఆపలేము. భగవంతుని సంకల్ప మక్కయ్యా! చేతగానిమనుష్యులము మన మేమి చేయగలము? ఒకప్పుడు విశేషబాధ, మన మనుభవించలేనంత విశేషబాధ మనకు గలుగుచుండును. మనము పడవలె. అలాగే పడవలె."

"అమ్మాయీ! ఉమా! నీకడుపులో బాధేమిటో కొంచెము నాకుచెప్పవమ్మా? నీవు పడగలిగినబాధకంటె ఎక్కువబాధే పడుచున్నావు. నీవలె ఎంతో ఓరిమితో సాధారణముగా ఏయాడది యటువంటి కష్టము పడలేదు.

"అక్కయ్యా! ఈకష్టమొక కష్టముకాదు. నాకష్టములన్నిటిని నేనుజయించగలను?"

"ఈమధ్య జబ్బు పడినావుకదా! పూర్తిగా నిమ్మళించినదా జబ్బు? కొంచెము బలము చేరినదా?"

"బలము చేరకేమి? దయ్యము లాగున్నాను. ఒకప్పుడు దయ్యమువలె భ్రమగా నుండవలెనని నామనస్సులో సంకల్పము కలుగు చుండును."

ఈమాటలనుచుండ నామెమోము జేగురువన్నె వాడెను. కన్నులు తళతళ మెఱసెను.

"ఉమా! అలాగనకే. నీమాట వినఁగానే నాకు భయము వేయుచున్నది. పిచ్చి పిచ్చియూహలు ఊహించుకొనకు. ఈలాటి యూహాలు కొసకు కాదు బ్రదికియుండుట. దుఃఖభారములు ఓరిమితో భరించుటకోసము."

"కాని అక్కయ్యా! ఒకప్పుడు మిక్కిలి బలవంతులకు కూడ పడ లేనంతకష్టము వచ్చినప్పుడు ఆకష్టము ఎలాగో ఒకలాగు పోగొట్టుకొన్నట్లు పుస్తకములలో చదివినాను.

యజమానుఁడు కోరడా పుచ్చుకొని వీపు బ్రద్దలగుచున్నట్లు కొట్టుచున్నప్పటికి దెబ్బలు తినునట్టి నీచపు బానిసవాఁడు నిరాశచే నవ్వుచుండునఁట."

"నీవేమో పిచ్చిపిచ్చి మాటలాడుచున్నావే ఉమా! నీవెప్పటి లాగున మాట్లాడుటలేదు. భూలోకములో నేయాఁడవాండ్రకు లేనంత ప్రేమ నీకున్నది. ఏయాఁడవాండ్రు పడనంత కష్టము నీవు పడుచున్నావు. నీవల్లదోష మున్నదని నేనేలాగున ననఁగలను? ఒకమూల ప్రేమ మనస్సులో నిలుపుకొని, ఒక మూల బాధపడుచు, మనకు భగవంతుఁడు విధించిన ధర్మము మనము చేయుచుండవలసిన దని నీమనస్సే నీకు చెప్పఁగలదు. మనభార మవతల పారవేయకూడదు. మఱియొక ఆలోచన చేయఁగూడదు. ఈజీవనమందు మనము పడు బాధలు కష్టములు దుర్బలమైన స్త్రీస్వభావము సహింపలేనంత వేదన కలుగఁ జేయుచున్నప్పటికి దేహములో శక్తియున్నంతవఱకు మనము తప్పటడుగులు పెట్టుచు నైనను, విశ్వప్రయత్నముచేసి మన ధర్మము మనము నడపవలయును. మన పాలఁబడిన ధర్మము మనశక్తివంచన లేకుండ యథావిధిగా నెఱవేర్చి, ఆటమీఁద యేచెట్టుక్రిందపడి గ్రుక్కెడు ప్రాణము వదలినను సరే. ఇటువంటి ధర్మములు తల్లిపాలతో కూడ మన కబ్బినవి. ఈ ధర్మములు మఱచి పోకుండ నీవెప్పటికి మనసులో పెట్టుకో వలసినవి."

"అక్కా! బిందూ! నీవు చెప్పినమాట లెప్పటికి సరియైనవే. నీవెప్పుడు మంచి దానవే. మనము చిన్నపిల్లలమైనప్పుడు ఈ బుద్ధులే నీవు చెప్పుచువచ్చితివి. పెద్దదానవైన తరువాతఁ గూడ నవే నీవు జ్ఞాపకముంచుకొని యాదరించుచున్నావు. ఏమో కాని ఈరాత్రి యివి నాతలకెక్కుటలేదు. అక్కయ్యా! ఆసంగతులు మాని వేరేసంగతులు నాతో మాటలాడు నా కింతమాత్రము తోఁచుటలేదు. నామనస్సు కుదురుగా లేదు."

"ఉమా! అది నేనెఱుఁగుదును. ఆజాబువల్ల నేను తెలిసికొంటిని. విచారకరమైన యీస్థలమువిడిచిపెట్టి మఱొక చోటికి వెళ్ళుటకెందుకు ప్రయత్నము చేయవు?"

"అక్కయ్యా! నేనెక్కడికి వెళ్ళుదును?"

"ఎక్కడికా, మీయమ్మదగ్గఱకు వెళ్ళు. ఆవిడను ఇక్కడకురమ్మని నేను వర్తమానము పంపఁదలచుకొన్నాను. కాని నన్ను నీవు వర్తమానము పంపనీయవుకద. నీశరీరములో నెమ్మదిగానున్నది. గనుక ఒకసారి తొల్పుకారు గ్రామమునకు వెళ్ళు. మనోహరమైన యీశీతకాలమందు గ్రామము నవనవలాడుచు మనస్సున కుల్లాసముఁ గలిగించుచుండును."

"వెఱ్ఱిదానవు కో; అమ్మగారియింట విశేషకాలము నే నుండుటకు వీలౌనా? నీవెఱుఁగవలెనే అక్కయ్యా! అత్తింటికోడలు ఎంతకాలము పుట్టింట నుండఁగలదు? పెనిమిటిని వదలిపెట్టి విశేషకాలము పుట్టింట నున్నపక్షమున ఊరివారందఱు అన్నను, నన్ను కాకులు పొడిచినట్లు పొడవరా?"

"అలాగైన పక్షమున మీయత్తవారి తండ్రితాతలు పూర్వము కాపురముండిన ధనపురము వెళ్ళరాదా? అక్కడ కావలసినంతమంది చుట్టాలు, బంధువులు నున్నారు. అక్కడ ఈలాగున నొక్కర్తెవు నుండనక్కఱలేదు. కలకత్తాలో ఉన్నంత విచారకరముగా నుండదు నీ బ్రదుకు."

"అక్కయ్యా! అక్కడ అంతకంటె నెక్కువ విచారమగుచుండును. ఏమంటే ధనపురములో మాయిండ్లు ఎంతో పెద్దవి. చావళ్ళు విశాలమైనవి. గదిలో మాటలాడితే ప్రతిధ్వనులు బైలుదేరును. అవి నేను వింటినా, ఆధ్వనులు దయ్యముల మాటలలాగున భయపెట్టుచుండును. అక్కయ్యా! ఆపాడుకొంప నాకువద్దే తల్లీ! నేనొక్కర్తెను దిక్కులేని దానవై ఆయింటికి మరల వెళ్ళుట నాకిష్టములేదు."

"అయ్యో! ఏమే అమ్మా! ఈలాగున బాధపడుచున్నదానికి నే సహాయము చేయలేక పోవుచున్నాను. పోనీ, కొన్నాళ్ళు మాయింటికి వచ్చియుండఁగలవా? మేము స్వగ్రామము వెళ్ళిపోవువఱకు మాతో నుండవచ్చును. నీకాప్తులైన దగ్గఱ చుట్టాలతోను బంధువులతోను కొన్నాళ్ళు హాయిగా నీవు గడుపఁదలచుకొంటే మీవారు మాత్రము ఒప్పుకొనరా?"

"అక్కయ్యా! మీకష్టాలకు సాయము నేనెందుకు? మీ రెక్కడ నున్నప్పటికి మీ మనస్సునకు సుఖమున్నది. మీయింట విచారము లుండవు. నేనువచ్చితినా, మీ సుఖముకూడ చెడిపోవును. నావిచారములు నాకష్టములు మీరు ఈఁదవలసివచ్చును. నామనస్సుకు విసుఁగుపుట్టినదాఁక, నాకిల దిక్కెక్కడనా యని నేనెటువంటి యాలోచనలే చేసినాను. కాని నాకష్టము గట్టెక్కించఁగల ఉపాయము కనపడలేదు. అయినప్పటికి నావిచారములు జయించఁగలనని ధైర్యమున్నది. చూచికొని తెలిసికొనఁగలిగితే దిక్కుమాలిన ఆఁడదానికి శరణము లేక పోలేదు."

ఈకపటి మాటలువిన్నప్పు డామె మొగమున లేనవ్వు తోఁచెను. కన్నులలో స్వభావవిరుద్ధమైన మెఱపు కనఁబడెను.

"అమ్మాయీ! ఉమా! నీమనసులో నున్నదేమిటో ఇప్పటికి నాతో నీవు చెప్పలేదు. నేను నీకు మనసు పట్టిందాననే కానా? చిన్నప్పటి స్నేహితురాలను గదా, ఇంతమాత్రము నమ్మఁ గూడదా?"

"నామనసులో ఇప్పటి కేనిశ్చయము చేసికో లేదే అక్కయ్యా! ఆలోచనలు ఒకదానినొకటి తరుముకొని వచ్చినట్లు మనసులో నిండి పోవుచున్నవి. నాకు తల విసుగు పుట్టినది. ఈరాత్రి నీపరిపూర్ణదయ, నీప్రేమ నామీఁదఁజూపి ఓదార్పు, నీదయ కావలసినసమయ మిదే. నామనసులో నేమున్నదో అదియావత్తు కొద్దికాలములోనే నీకుఁ దెలియఁ గలదు."

"సరే. అలాగే కానియ్యవే ఉమా! నేను మరల నిన్ను చూచుటకు త్వరగానే వచ్చెదను. ఆవచ్చినప్పుడు నీమనసులో నున్నదేమిటో వినిగాని వెళ్ళను. ఇప్పుడు రెండు జాముల రాత్రి అయినది. నేఁక వెళ్ళవలెను. భగవంతుఁడే నీకు శరణమై నిన్ను రక్షింపవలె నని నాకోరిక."

"దేవుఁడే మన కెప్పటికి శరణము." అన మాటలే ఉమనోటనుండి కడపట వచ్చెను.

బోయలు పల్లకి మోద్రకింగఁ జెట్టుకొని కనిపెట్టుకొని యుండిరి. బిందును సాగనంపుటకై యుమ మేడమెట్లు దిగివచ్చెను. అక్కచెల్లెండ్రొండొరులను మరల బిగ్గఁగౌగిలించుకొనిరి. ఉమ బిందుకడుపులోఁ దనతలఁ బెట్టుకొని కొంచెము సేపు విచారించెను. అంతకాలమునుండి యామెహృదయములో గట్టితాళము వైచి బంధించిన దుఃఖమంతయు నొక్కమారు పొంగిపొరలి పైకుబికెను. కన్నీటివఱదలు వివృతద్వారములై ప్రవహించెను. ఆమె చాలసేపు మాటలాడ జాలక వివశయై వెక్కివెక్కి యేడ్చెను. గుండెపగిలిపోవునా యన్నట్లాయువతీరత్నము నిట్టూర్పు విడిచెను. అట్లు దుఃఖపడుచు నామె తనయందత్యంత ప్రేమయు నభిమానముఁ గలిగి యాప్రాణమిత్రమును వదలలేక మాటిమాటికి బిగియారఁ గౌగలించుకొని, యేమి తోఁచెనోకాని యాకస్మికముగా బిందును విడిచి చివాలున వేఁగ మెట్లెక్కి తన గదులలోనికిఁ బోయెను.

"దుఃఖపడకు. తల్లీ! దుఃఖపడకు. ఈలాగున దుఃఖపడవలసిన దని భగవంతుఁడు నీనొసట వ్రాసికేసినాఁడ," అని యేడ్చుచు బిందు పల్లకిలోఁ గూర్చుండెను.

తరువాత గంటసేపటికి కాయము నెమ్మదిగాఁ దనబట్టలు, నగలు సర్దుకొనుచుండెను. సుందరమైన కంఠమునుండి యామె కంటె దీసివేసెను. మనోజ్ఞహస్తముల నుండి మురుగులు, పాదములనుండి యందెలుకూడ తీసివేసెను. అంచుచీర విడచి విరంతువులు కట్టుకొను సైనుపంచె తాల్చెను. గదిలోని దీప మార్పివేసెను. అవ్వల నెంత మాత్రము చప్పుడు కాకుండ బొటనవ్రేళ్ళమీఁద నడిచి యావలకుఁ బోయెను.

విశాలమైన యాగృహము నిశ్శబ్దమై యంధకారబంధురమై యుండెను. సేవకులందఱిదివఱకే పండుకొని నిద్రపోవుచుండిరి. వాకిట నున్న దీపములు సైత మార్పివేయఁబడెను. ఈమె మెల్లమెల్లఁగా ననేక ద్వారములు దాటి, నడిమివాకిలి దాటి చప్పుడు కాకుండ వీధితలుపుగడియ తీసెను. తలుపు తీయఁగానే చలిగాలితీవ్రవముగ వచ్చి తాకెను. చీకటిలో నుండి వచ్చియుండుటచేత వీధిలోని దీపములన్నియు నామె కన్నులలో మెఱపులట్లు మెఱసెను. ఒకనిమిషమువఱ కామె చేష్టలు దక్కి యుండెను. మఱియొక్కనిమిషము గడపపై నిలిచి వెనుకకు తిరిగిచూచెను. ఆనిమిషము గడచిపోయెను. ఇరువదిరెండేండ్ల ప్రాయంపు జవ్వని, భాగ్యవంతుఁడగు నొక గొప్పజమీందారుని యిల్లాలు మహాంధకారబంధుర మగు శీతకాలపు రాత్రివేళ నేకతంబ కాలినడకను వీధులవెంబడి సంచరించుచు, నంతఃపురము విడిచి బాహ్యప్రపంచమునం బడియెను.

అరగంటవఱకు నడచునప్పటి కామె యలసిపోయెను. ఆమె అలసిపోయి రాజవీధిప్రక్క నున్నయొకచెట్టుచాటున నిలువఁబడెను. నిలువఁబడి చలి కోర్వలేక గజగజ వడఁకెను. ఆసమయమున మఱల నామె కధైర్యము తోఁచి గుండె కొట్టుకొనెను. మఱల నింటికి బోవఁదలఁచుకొన్న నిప్పుడు నామెకు గావలసినంత వ్యవధియుండెను. ఆమెయింటికి దారి తెలియును. వీధితలుపు నప్పటికిఁ దెఱచియుండెను. ఆమె యిల్లుజేరి, యెప్పటియట్ల కాపురము సేయవచ్చును. తాత్కాలికమైన యీయున్మాదావస్థ రెండవకంటివానికిఁ దెలియదు. బాల్యమున చేసిన ధర్మోపదేశములు, మందలింపులు చెవులలో గింగురుమని యామె కిప్పటికిని వినఁబడుచున్నట్లే యుండెను. ఏదో యొకానొకశబ్దము మందస్వరముతో స్త్రీధర్మముల నామెహృదయమున నుపదేశము చేసినట్లామెకు దోఁచెను. ఆ చలిగాడ్పులు మీఁదవీచి వణకించినప్పుడాయెలనాగ యాగి సందేహింపఁ దొడఁగెను. అప్పుడు సైతమామెయే గృహదేవత? ప్రపంచము శూన్యము.

అప్పుడు నల్లగుఱ్ఱములు లాగుచుండిన గుఱ్ఱపుబండి యాదారిని వెళ్ళెను. దాని దీపములు తళతళ మెఱసెను. ఆ బండిలో స్త్రీలు నవ్వినచప్పుడు వినబడెను. తెల్లని

కోడుగుఱ్ఱములు లాగుచుండిన మఱియొకబండి వెంటనే యాదారిని నడచెను. అది యామె కత్యంతసమీపము నుండి పోయెను. ఆ బండిలోని దీపముల కాంతి తళతళ మని పూర్తిగా నామె మొగముపైఁ బడెను. ఆమె చటుక్కునఁగదలి యాచోటు విడిచి చెట్టువెనుక దాగెను.

బండిదీపముల నిమిషమాత్ర తేజములో నామె మొగము కనబడఁగానే బండిలో కూర్చుండిన మనుష్యులలో నొకఁడుకూడ లేవఁబోయెను. అతనిమిత్రుఁడది కనిపెట్టి, చెట్టుమఱుఁగున దాగిన మానవతివంకఁజూచి "ఆమె మిక్కిలి చక్కనిది. అంత అందమైన కన్నులు నేనెప్పుడు జూడలేదు" అని పలికెను.

"ఆమె చక్కఁదనముమాట నేనాలోచించుటలేదు. వెలవెల బాఱుచున్న యామెమొగము చూడఁగానే నేనెఱిఁగిన స్త్రీ, యొకర్తె నాకు జ్ఞాపకము వచ్చినది. ఆమె యీమెవలెనే యుండును. చాలకాలము నుండి నే నామెను జూచియుండలేదు. మొగమును బోలిన మొగము లుండునను మాట నిజము. పోలిక చిత్రముగా నున్నది" అని రెండవయతఁడు బదులు చెప్పెను.

బండ్లు గబగబ వెళ్ళిపోయెను. చెట్టువెనుకనుండి యువతి యావలకుఁ బోయి దాటిపోవుచున్న బండ్లవంక, దీపములవంక విరుద్ధముగాఁజూచెను. "ప్రాణేశ్వరా! నీకు వేయినమస్కారములు. క్రుంగిపోవుచున్న నా హృదయమును మీరు పురికొల్పితిరి. ఏమి చేయవలెనో నాకిప్పుడు తెలిసినది." అని తనలో ననుకొని యామె యాచోటు విడిచి పోయెను.

మఱునాఁ డుదయమున ధనంజయునిగృహమున గొప్పకలవరము సంభవించినది. పెద్దపెట్టున నేడ్పు వినఁబడెను. ఎప్పటియట్ల పనికత్తెలకామె పరుపుమీఁదఁ గనఁబడలేదు. పరిచారికలు నూతదగ్గఱ, నడిమివాకిలిలోను జూచిరి. గాని యామె యెక్కడను గనఁబడలేదు. వాకిలి తుడుచునట్టిదాసి యామెదాల్చు ప్రాఁతసేలువ నడిమివాకిలిలో దొరికినదని పట్టుకొనివచ్చెను. వీధితలుపుతీసి యున్నదని ద్వారపాలకులు చెప్పిరి. చాలసేపిటటు వెదకిరి. కాని యామె కనబడలేదు. గృహయజమానురా లదృశ్యయయ్యెను.

వెదుకవలసినదని పట్టణమం దన్నిచోట్లకు మనుష్యులు పంపఁబడిరి. అన్వేషణార్థమై ప్రతిబంధువుని యింటికి, ప్రతి మిత్రునియింటికిని పలువురు మనుష్యులు వెళ్ళిరి. అట్లు వెళ్ళిన మనుష్యులందఱు యజమానురాలి వృత్తాంతము తెలియలేదని యొక్క

తొక్కరు దిగులుపడుచు వచ్చిరి. బింధు గృహమునకు వెదకఁబోయిన మనుష్యులు నిశీథము వఱకుఁ గడచినరాత్రి యుమ యింటిపద్ద నుండెనని మఱలివచ్చి చెప్పిరి.

ధనపురమునకు, వర్ధమానమునకు, తాల్పుకారునకుఁ గూడ మనుష్యులను బంపిరి. యజమానురాలి వృత్తాంత మింతమాత్రము తెలియలేదని వారా సాయంకాలమే కాళ్ళీడ్చుకొనుచు వచ్చి చెప్పిరి.

ఉమ కనఁబడలేదని కలకత్తా పోలీసువారికి సమాచారము తెలియఁజేయఁబడెను. ధనము పోలీసువారిని విచారణకుఁ బురికొల్పును గావున సొమ్ము కర్చుపెట్టిరి. కాని పోలీసువారి విచారణలుకూడ వ్యర్థమయ్యెను. తెలిసికొనుట కాధారమేమియుఁ దెలియలేదు.

భయంకరమైన యనుమానము అందరమనస్సులలోఁ దోఁచెను. చెఱువులు నూతులు వెదకిరి. అది వ్యర్థమయ్యెను. దిక్కులేనివారి శవములను బెట్టుచోటికి సేవకులు పోయి వెదకిరి. ఆమె శవమక్కడఁ గనఁబడలేదు.

ధనంజయుని గృహము నిరాశచే దుఃఖభాజనమయ్యెను. ఏడ్పు కొంతసేపటికి కఱఁగిపోయెను. పీనుఁగు వెళ్ళిన యిల్లువలె గృహము పాడువారి యుండెను. ప్రాణము నిలువని శీతకాలపు దినమట్లు వెళ్ళిపోయెను. కళాహీనమైన యా గృహముమీఁద వెలుఁగు గొలుపునట్టి సాయంకాలచ్ఛాయలు వ్యాపించెను. చేసిన భోగట్ట యంతయు వ్యర్థమయ్యెను. వెదుకవెళ్ళినవా రందఱాశ వదలుకొని వెనుకకు వచ్చిరి. ఆమెను గుఱించి యేమియుం దెలియలేదు.

దీపములు పెట్టినతరువాత నుదికినబట్టలు దీసికొని యింటిచాకలిది వచ్చెను. యజమానురాలిని గూర్చి చాకలిదేమో చెప్పఁదలఁచుకొన్నందున విలపించుచున్నవారు దానిచుట్టుఁ జేరిరి; కాని దానికథ స్వల్పము. విచారకరము.

కలకత్తానగరమునందలి స్త్రీలు తెల్లవారుజామున హుగ్లీనదిలో స్నానము చేయుటకై పోవు వేళకుముందే యజమానురాలు నదియొడ్డున నొంటిగఁ దనకుఁ గనఁబడినట్లది చెప్పెను. పట్టణము మేలుకొనకమునుపే పెందలకడ స్నానముచేసి వెళ్ళుటకై యామె తెల్లవారుఝామున నదియొడ్డునకు వచ్చి యుండవచ్చునని చాకలిది తలంచి

యొకటి రెండు మాటలుమాత్రమే యామెతో మాటలాడి తన దారిం బోయెను. అది మఱల నామెను జూడలేదు.

చాకలి దీకథఁ జెప్పుచుండఁగా వినువారు నోట మాట లేక చూడఁ జొచ్చిరి. తమయజమానురాలు కలకత్తాలో నేవిధముగా జీవించెనో వారందఱెఱుఁగుదురు. ఆమె హృదయములో నెట్టితలంపు లుండెనో వారికిఁ దెలియును. చిరకాలక్లేశ మనుభవించుచున్న మందభాగ్యురా లగు తన యజమానురాలు తెల్లవారుజామున స్నానము చేయుటకుఁ గాక నిరంతరాయ మగు వేదననుండి విముక్తిఁ బడయుటకై పరమపావనమగు భాగీరథీమాతృగర్భమున శాశ్వతనివాసము చేసికొనుటకై నదీతీరమునకు వెళ్ళి యుండు నని వారి మనంబునఁ జనించెను. జనించినతోడనే గొల్లుమని పెద్దపెట్టున నేడ్చిరి.

కడచినరాత్రి ధనంజయుఁడు విలాసధాముము లగు తన మిత్రులతోడ గుఱ్ఱపుబండ్లమీఁద నూరుబైటకు షికారుపోయి మిక్కిలి ప్రొద్దుపోయిన తరువాత మఱలి వచ్చెను. అతఁడు బండి దిగునప్పటికి మద్యపుమైకమువల్లఁ గలిగిన యెఱుపు మొగమునుండి జారలేదు. నడచునప్పు డడుగులు నిలువక తడబడెను. సేవకులు చేయూతయిచ్చి మేడలో నతని గదిలోనికిఁ దీసికొనివెళ్ళి యతనిభార్య కనఁబడుట లేదనువార్త మెల్లగాఁ జెప్పిరి. ఆదిపిడుగుపాటువలె నాకస్మికమై భయంకరమై యతనిపైఁ బడి నిర్విణ్ణునిఁ జేసెను. మద్యపుమత్తుచేత నదివఱకే తలతిరిగి తూలుచున్న యాపతితుఁ డది విని నిశ్చేష్టుఁ డయ్యెను.

అనంతరము భార్యగదిలోనికి వెళ్ళి మిణుకుమిణుకు మను దీపపువెలుఁగున నేమియుం దోఁచక తెల్లవారువఱకు నిట్టట్టు పచారు చేసెను. అతని హృదయము పూర్వము దయావంతమైన దగుటచే నతఁ డెప్పు డెంత దుర్వృత్తుఁడైనను దురంతమైన యాదుర్వృత్తనము వాని హృదయమునుండి జాలిని వెడలఁగొట్ట లేకపోయెను. తాపపూరితములైన యాలోచనలచేత మద్యప్రకోప మెగిరిపోయెను. మగనిలాలనకుఁ బాత్రమైనవోఢ యెట్లువచ్చె నట్లే లలితవిలాసయై, లావణ్యరాశియై కొంజిగురాకువలె మెత్తనై కృపారసనిలయమై యామె యతనిం జేరెను. నూతనసమాగమమైన యాదినములలో స్త్రీసహజమైన యామె గాఢానురాగము, మధురవిలాసము, మనోజ్ఞమనోరథములు, రహస్యభాషణములు, శృంగారచేష్టలు, చిఱునవ్వులు నతని యధీనము చేసెను. అతనికంటె నామెకుఁ బ్రేమస్థానము లేదు. అతనికంటె నన్యుఁ జూచి యెఱుగదు. తలచి యెఱుఁగదు. ప్రతిరాత్రి యామెలనాగ యతని ప్రక్కను గూర్చుండి, తనహృదయ మాతని వక్షమునం జేర్చి మనోజ్ఞము లైన

తనయాలోచనలను, తనకోర్కెలను, తన కష్టసుఖంబులను నతనిచెవిలో రహస్యంబుగఁ జెప్పి యతనిమన సుప్పొంగఁజేసెను. అతని కన్నులముందటనే యాచిగురుబోడి బాల్యమును విడిచి మిసమిసలాడు నిండుజవ్వని యయ్యెను. అలరుఁదీగ క్రమాను వల్లుకొను తెఱఁగున నామె యతని వలపుననే తగులుకొని యుండెను. అంతే కాదు. ప్రాణాంతమువఱకు నప్పరమసాధ్వి మూగదియుం బోలె కిమ్మన్క, మెట్టో యనక, యెట్టిపరాభవములు ప్రాప్తించినను, నేమియు ననక కన్నులప్పగించి శాంతముగ వానిననుభవించెను. ప్రియురాలులేని యాశూన్యగేహముఁ జూచినకొలఁది నతనికన్నులనుండి చుక్కవెనుక చుక్క పాఱెమి, యెఱ్ఱని చెక్కులనుండి దిగజారఁ జొచ్చెను. తాను మొగముఁ జూడకే పోయినప్పటికి, నాత్మహత్య గావించి కొన తలసినంత దురవస్థకుఁ దోలినప్పటికిఁ దన్నే దైవముగా నమ్మికొని ప్రేమించిన యాకాంతిపై నతనితలఁపులు పాఱెను.

బండిదీపముల తళతళకాంతులు ప్రసరించునప్పుడు వీధిలో దనకుఁ గనఁబడిన యావెల్ల మొగము మనస్సున మఱల నిలిచెను. ఆనడుమ జబ్బుపడినందున రోగచిహ్నము లామె ముఖమును బాయలేదు. కాని దీర్ఘ విచారచ్ఛాయలు బలవత్తరములై, రోగచిహ్నములం గప్పివైచెను. ఆమె కన్నులు బండిలోఁ గూర్చుండి పోవుచున్నప్పుడొక్కనిమిష మతనిపై నిలిచెను. ఆనిమిషమందామెకు మనసులో నించుకయాశవోడమి యుండవచ్చును. అది ప్రేమాస్పదమైన నిమిషము. ఆకన్నుల కతఁడు తగిన ప్రత్యుత్తర మీయలేదు అందుచేత నవి శాశ్వతముగా ముకుళించుకొని పోయెను.

దీర్ఘ విషాదమున గుండె పగిలిన యాయింతి సర్ది చక్కగా నమర్చిన ముద్దుటను చీరలను ధనంజయుఁడు మఱల సర్దెను. కాపురము చేసిన యెనిమిదేండ్లు ధరించి చిట్టచివరకుఁ దన ప్రాణనాథునికే విడిచిపోయిన నగల నతఁడు పైకిఁ దీసెను. ఆమె చక్కని నెన్నొసటిపై మున్ను వెలయుచుండిన వజ్రాల పాపటబిళ్ళయు, నామె వక్షస్థలము నలంకరించుచు వచ్చిన యాణిముత్యాలహారమును, పునస్సంధానము నాఁటి రాత్రి తాను స్వయముగా నిచ్చిన కంకణాలును, మఱికొన్ని యితరాభరణములును, నొక్కొక్కటిగాఁ, దీసి వరుసగాఁ దనయెదుటఁ బెట్టుకొనెను. అందులో నొక్కొక్కదానిని జూచినప్పుడతని కొక్కొకపూర్వ వృత్తాంతము జ్ఞప్తికివచ్చెను. ఒక్కొక్క మహానురాగసమయము తలఁపునకుం దట్టెను. ఎన్నో మాసములనుండియుఁ గొన్ని సంవత్సరములనుండియు నతనిని విడిచిపోయిన తలంపులు తండోపతండములుగా నప్పుడు వచ్చి యతని

మనను నాక్రమించెను. భార్యాభర్తగాఁ గాఁపురమునకు వచ్చినప్పుడు తన హృదయమును మధురముగాను పవిత్రముగాను జేసిన యనేకవిషయములు, పలుతావులు వాని శూన్యమనస్సున కప్పుడు జ్ఞప్తికి వచ్చెను.

తండ్రిపేరు పాడుచేసి, తల్లి మందలింపులు సరకుసేయక యతఁడు యథేచ్ఛముగా సంచరించెను. పితృపితామహార్జితమైన ధనము దుర్వ్యయముచేసెను, వీధులలోని మురికికాలువలలోనుండు బోదురుకప్పలకన్న నీచులగు స్త్రీ పురుషులతో నతఁడు సహవాసము చేసెను. స్త్రీజన సహజమైన హృదయపూర్వకానురాగముతోఁ దన చెట్టఁబట్టివచ్చిన ప్రాణమిత్రముయొక్క ప్రేమను నిష్కారణముగా చెందనాడుకొనెను. అతఁడు భార్యాభర్తల కుండవలసిన ప్రేమబంధములనెల్లఁ ద్రెంపివేసెను. మానవహృదయమునందుండు దయాధర్మములను దగ్ధముచేసెను. ఉన్నతభావములనెల్ల నీచపఱచెను. తన్ను నమ్మి, వలచి యిలుఁజొచ్చిన పరమసాధ్వియైన భార్యను బహుమాసములు, బహుదినములు బాధపెట్టి, మనోవ్యథపాలుజేసి తుదకు బలవన్మరణము చేసికొనవలసిన దుస్థితిపాలుచేసెను. తాను తెచ్చిపెట్టిన వినాశనమును దలఁచితలఁచిచూచి నా త్రాగుబోతునకు, నా ధూర్తవిటునకుఁ బశ్చాత్తాపము కలుగఁజొచ్చెను. ప్రియురాలిసంబంధమైన వస్తువులలో నప్పటికి మిగిలియున్న చీరలమీఁదను, నగలమీఁదను, శూన్యమందిరములోని గోడలమీఁదను వాని దృష్టి ప్రసరింపఁగానే పట్టలేనంత దుఃఖమతని మనంబునఁ బొడమి మనస్సు బ్రద్దలుచేసికొని పైకివచ్చి మందిరమందుఁ బ్రతిధ్వనించెను.

ప్రభాతకాల సంబంధములైన తెల్లనివెలుఁగులు గదిలోఁ బ్రవేశించి దుఃఖమలినమైన యాతని మొగముమీఁదను గుంటలుపడిన యతని కన్నులమీఁదను బడెను. ఆ వెలుగునఁ బ్రియురాలి పెట్టెపుటలలోఁ తెల్లని వస్తువొకటి యతనికంటఁబడెను. అది యొకజాబు. ధనంజయుఁడు చెదరిన తలవెంట్రుకలను వెనుకకు సర్దుకొని, వడఁకుచున్న హస్తములతోఁ బ్రియురాలు వ్రాసినయాజాబునందుకొనెను. ఆలేఖమీఁద వ్రాయునప్పుడు భార్య కంటనుండి పడిన బొట్టుబిందువుల డాగులప్పటికిని గానఁబడుచుండెను. ఆ జాబునం దిట్లుండెను.

“భర్తగారూ!—నేను మీ దృష్టికిఁ జిరకాలమునుండి భార్యను గాకపోయినను నేను వెళ్ళిపోవుచున్నదానను గావున మధురమైన యీ పేరుతో మిమ్ము కడసారి పిలుచెదను.

నేను మీయింటికివచ్చి, మీయన్నము దిని, యెనిమిది సంవత్సరములపాటు మీయిల్లాలనిపించుకొని, మీప్రేమ సంపాదించుకొని యుంటిని. పల్లెత్తి యొక్క పరుషవాక్యమైన పలుకక, కోపాలోచనము కొంచెమైన గుండెలలో నిలుపక నేనిప్పుడు మిమ్ము వదలిపెట్టి వెళ్ళఁదలచుకొన్నాను. నా ప్రాణము 'హరి' యనువఱకు నేను మునుపటి ప్రేమనే మీమీఁద నిలిపి మిమ్మే తలఁచుకొనుచుందును. మీరును మునుపు ప్రేమించిన చిన్నదానిని జ్ఞాపకముంచుకొనుటకై ప్రయత్నింపుఁడు.

క్రొత్తగా నేను కాఁపురమునకువచ్చిన దినములలోఁ నేను మీకంటికి కసహ్యముగా నుండక ప్రేమాస్పదురాలనై యుంటిని. ఆ మంచిదినములనే తలఁచుకొని నేనిప్పుడు చనిపోయెదను. నేను మీపాదముల సన్నిధిఁ గూర్చుండి కరుణారసముఁజిల్కు మీ నేత్రములవంకఁ దనివితీరక చూచుచు, వలపులు గులుకు మీ పలుకులచే నా చెవులకు విందుచేసికొనుచు నెప్పటికి నీ రాత్రియే యుండవలయును గాని తెల్లవారకూడదని కోరుకొనుచు దీర్ఘములైన యా శీతకాలపు రాత్రులనే తలఁచుకొనుచుఁ బోయెదను. పగలెల్ల పాటుపడిరో, పయనము చేసిరో శ్రమపడి మీరువచ్చి మిక్కిలి మక్కువతో నన్ను దగ్గఁ గౌఁగలించికొన్నప్పుడు మీ బాహుమధ్యముకంటె స్వర్గము విశేషసౌఖ్యప్రదముగా నుండదని నేననుకొంటిని. అట్టి నిమిషములను గొన్నింటిని నేనిప్పుడు స్మరించికొనియెద.

ఆ యానందము శాశ్వతముగా నేననుభవింతు ననుకొంటిని. కాని దైవనిర్ణయము మఱియొకలాగయ్యెను. అందుకు నేను చింతింపవలెను. నా హృదయములో పరితపించినది. నాతల దిమ్ముపట్టినది. ప్రపంచమంతయు జీకటికోణమై సంతోషశూన్యమైనందున దిక్కులేక నేను భగవంతునే శరణుజొచ్చితిని.

నేనెంతెంత మనోవ్యథ పడుచున్నను పతివ్రతాధర్మము నడుపుటకై ప్రయత్నించితిని. నేను తెలిసియో తెలియకయో యెన్నఁడైన నాధర్మము తప్పియుంటినేని ప్రాణేశ్వరా! మీరు నన్ను క్షమింప వలయును. మనసు విరిగి పోయినపుడు కోపాద్రేకముచే ననరానిమాటలాడినపక్షమునను, మనోవ్యథాభారమున నేను మీ మొగముం జూడక విసువుకొన్న పక్షమునను, ప్రాణేశ్వరా! మీరు నన్ను క్షమింపవలయును. ఈ జీవితములో నేను మిమ్ము కోరనట్టి నా కడపటికోరిక యిదియె. బాష్పపూరితములైన కన్నులతో మిమ్మీకోరిక కోరుచున్నాను. మఱియొకకోరిక కోరుటకు నేను బ్రతుకను.

నేను పోయినతరువాత మీరు సుఖింపుఁడు. మీరు గొప్ప కుటుంబములో పుట్టినవారు. మీకన్ని దేశమందంతట గౌరవము కలదు. మీశక్య మగునేని నా వెఱకటి పిచ్చి జీవనమును మఱచిపొండు. మిమ్ము నాశనముచేయుచున్న మిత్రులను విడిచిపెట్టి స్వతంత్రముగా బ్రతుకుఁడు. మీహృదయము మిక్కిలి మంచిది. అంతఃకరణశుద్ధిగా నడుచుకొనుఁడు.

ఆపద్బాంధవుఁ డైన పరమేశ్వరుని వైపునకు మీయాలోచనలను బ్రసరింపఁజేయుఁడు. వర్ధమానపట్టణమున నొక పావనస్థలము కలదు. అక్కడనూటయేఁబది దేవాలయములు కలవు. అవి యొకదానిప్రక్క నొకటిగా నున్నవి. ఒక్కొక్క దేవాలయమున నొక్కొక్క విగ్రహము కలదు. అప్పుడప్పు డాదేవాలయములకుఁ బోయి విగ్రహరూపముతో నెవ్వనిని గనఁబఱుచుటకు మనము వ్యర్థముగాఁ బ్రయత్నించుచుమో యట్టి లోకేశ్వరుని భక్తితో నారాధింపుఁడు. మంచివా రనిపించుకొనుటకు, గొప్పకార్యములు చేయుటకుఁ బ్రయత్నించుఁడు. మీకు సుఖజీవన మగు గాక! దుఃఖభాజన మైన తన జీవితముయొక్క తుదవఱకు మిమ్మే ప్రేమించిన మందభాగ్యురా లగు నీ స్త్రీని జ్ఞాపకముంచుకొనుఁడు.”

వణఁకు చున్న యాతనిచేతులనుండి యాజాబు క్రిందఁబడెను. ఆ మందభాగ్యుఁడు తలతిరుగుటచే ముందుకుతూలి హస్తములు చాచి నేలఁబడి మూర్ఛిల్లెను.

# సుధాశరచ్చంద్రము

## మూఁడవ భాగము.

### పదునాఱవ ప్రకరణము

### దేవాలయము.

స్వప్నము

అతిప్రశస్తమైన కాళి రాణీగంజిలో భద్రమైన జగత్కిశోరరాయలకు శ్రద్ధతో సంరక్షణ చేయుచుండెను. అది కలకత్తానగరమునకు రైలుమార్గమున నూటయిరువది మైళ్ళదూరమున నున్నది. అక్కడ బొగ్గుగనులుండుటచేత రమారమి యేఁబది సంవత్సరములనుండి రాణీగంజి ముఖ్యప్రదేశమైనది. ఇంగ్లీషు కంపెనీలు బొగ్గుగనులలో బనిచేయునిమిత్తము కూలివాండ్రను విశేషసంఖ్యలుగఁ బెట్టి దేశమునకుఁ గావలసిన బొగ్గంతను త్రవ్వించి సిద్ధము చేయుచున్నవి. ధనవంతులై, వ్యవహారకుతూహలులైన హిందూదేశస్థులనేకులుకూడ స్వయముగా గనులు త్రవ్వించుటకుఁ బ్రారంభించిరి. ఎన్నో చిన్నగనులలో వారి పెట్టుబడిమీఁదనే పని జరుగుచున్నది. గనులలోనుండి త్రవ్వితెచ్చినబొగ్గు హిందూదేశములో నున్న పొగబండ్లనిమిత్తము పొగయోడల నిమిత్తము నుపయోగపడుటయేకాక కలకత్తా మొదలగునగరములలో వంటకట్టియలకు మాఱుగాగృహములలో నుపయోగింపఁ బడుచున్నది.

గను లున్న యితరస్థలముల వలెనే రాణీగంజియు మురికిపట్టణము. అక్కడి గాలి బొగ్గుపొగతో నిండియుండును. అయినను నేల మిట్టపల్లములు గలిగి మొత్తముమీఁద నెత్తుగా నుండును. స్వాస్థ్యబలము కలిగించునది. గనులకు దూరముగా మంచిమంచి భవనములున్నవి. అవి శీతకాలములో మిక్కిలి సుఖప్రదముగా నుండును. కలకత్తానుండియు, వర్ధమానపట్టణమునుండియు జనులనేకులు తమదేహస్థితి

చక్కఁజేసికొనుటకై రాణిగంజికిఁబోయి యీ భవనములలో నివసించు చుందురు. జగత్కిశోరరాయలునిమిత్తము పెద్దభవనమొకటి యద్దెకుఁ బుచ్చుకొనిరి.

ఆ రోగియొక్క దురదృష్టముచేత నతనివెంట తల్లి, భార్య గాక ముగ్గురు మేనత్తలు వదినెకొందఱు దూరపుఁజుట్టములు చాలమంది పిల్లలు వచ్చిరి. వారందఱు తమ్ము రానిమ్మని బతిమాలుకొని రోగివెంట వచ్చిరి. అతని భార్యతోఁ గలిసి యతని కుపచారము చేయవలయు ననియే వారి ముఖ్యసంకల్పము. తనమీఁద వారి కంత దయ యుండినందుకు జగత్కిశోరరాయలు సంతసించెను. కాని పెద్దకుటుంబపు గొడవ మంచ మెక్కి ప్రశాంతినిఁ గోరుచున్న యా రోగికి సరిపడక రోగము తిరుగఁబెట్టెను. తిరుగఁ బెట్టినప్పుడు జీవించునా లేదా యని యెల్లవారికిని భయము కలిగెను.

ఆ స్థలమందున్న యింగ్లీషువైద్యుఁడు క్రమముగా వచ్చి రోగినిఁజూచి, శ్రద్ధతో మందిచ్చుచుండెను. కాని యింట్లోనున్న యాఁడువాండ్రు పలుమాఱు కవిరాజులను పిలిపించియు, సన్యాసులను రప్పించియు, శాస్త్రవేత్తలను పిలిపించియు, జ్యోతిశ్శాస్త్రజ్ఞులను రావించియు సలహా యడుగుచుందురు. బంగాళాదేశములో వైద్యులను కవిరాజు లందురు. ముసలమ్మలు చాలమంది కిశోరరాయని తల్లిగ్గఱకు వచ్చి, తీర్థయాత్రలు చేసినందువల్ల మహాద్భుతముగా వదలకుండు రోగములు కుదురునని చెప్పుచుందురు.

అందులో నొక్కతె యిట్లనియె.

“అమ్మా! రాణిగంజిలో నున్న యింగ్లీషుడాక్టరుకు శస్త్రవైద్యము బాగుగాఁ దెలియును. అకస్మాత్తుగా వచ్చినరోగముల కింగ్లీషువైద్యము పనికివచ్చుట గాని మన దీర్ఘవ్యాధుల సంగతి ఆ డాక్టరులకుఁ దెలియదు. తల్లీ! నా మాట నమ్ము. మన కవిరాజులు పెద్దవాండ్రు, లోకానుభవము గలవారు. రోగ లక్షణములను చక్కగా గ్రహించి నెమ్మదిగా వైద్యముచేసి, కొంచెమాలస్యమైనప్పటికి రోగములు నిశ్శేషముగా కుదిర్చివేయఁగలరు. ఎన్నో నెలలు వర్థమానపు మన్నెజ్వరము పట్టుకొని మా కుఱ్ఱవానిని పీల్చి పిప్పిచేసినది. మొదట నింగ్లీషువైద్యునివద్దకు వెళ్ళగా క్వయినా, పాషాణము మాత్రమే యిచ్చినాఁడు. ఎప్పటి కదే మందు. క్వయినా కొన్నాళ్ళవరకు జ్వరము నణఁచిపెట్టినది. కాని రోగము నిశ్శేషముగా మానలేదు. కట్టచివఱకు నేను మా పిల్లవానిని పనాతిఁబటీలో నున్న కవిరాజువద్దకుఁ బంపితిని. ఆయన మందులు మహాద్భుతములు. ఆయనపేరు దేశమంతట మ్రోఁగుచున్నది; ఆయన మా కుఱ్ఱవాని నాలుమాసము లింటఁబెట్టుకొని, పథ్యపానములు స్వయముగాఁజూచి నడిపి మంచిమందు లిచ్చినాఁడు,

మా పిల్లవాని శరీరము వజ్రశరీరమైనది. హాయిగా నింటికి వచ్చినాఁడు. అప్పు డున్నంత బలముగాను, ఆరోగ్యముగాను, మావాఁడు మారెప్పుడు లేఁడు. మన కవిరాజులలోఁ బెద్దవారి కెవరికైన వచ్చును తల్లీ! మన దీర్ఘవ్యాధులు వారెఱుఁగుదురు క్షణములో కుదిర్చివేయుదురు. పరమేశ్వరుఁడే మీ కుమారునకు దీర్ఘాయువిచ్చి, సిరి, సంతతినిచ్చి రక్షించఁగలఁ డమ్మా!"

కిశోరరాయని కెట్లున్నదో విచారించుటకు వచ్చిన మఱియొక యవ్వ యందుకొని యిట్లు చెప్పెను.

"వైద్యు లేమిచేయఁగల రమ్మా! చావు బ్రదుకులు సర్వేశ్వరుని చేతిలోనున్నవి. రోగములు తెచ్చిపెట్టఁ గలవాఁ డతఁడే. కుదర్పఁగలవాఁ డతఁడే. ఎన్ని సంవత్సరముల నేను శూలనొప్పివల్ల నానాబాధలు పడిపడి, అన్ని మందులు మ్రింగలేదమ్మా? మందుల వల్ల కుదిరినదా నాకు? చిట్టచివఱ కొక సన్యాసివచ్చి తారకేశ్వర క్షేత్రమునకు యాత్ర వెళ్ళవలసిన దని చెప్పినాఁడమ్మా. నేను కాశీవడనే ఆ క్షేత్రమునకు వెళ్ళి అక్కడ తీర్థవిధులు చేసికొని, వెంట్రుకలు తీయించుకొని వచ్చితిని. మూఁడవనాఁడు రాత్రి తారకేశ్వరుని దయవల్ల నే నొక కలగంటిని. ఆ కలలో నా కెవరో యింత ప్రసాద మిచ్చిరి. ఇచ్చిన పురుషుఁడు కనఁబడలేదుగాని చేయికనఁబడెను. అదే నా కన్నిమందుల కంటె నా కెక్కువమందైనది. తారకేశ్వరములో నే నొక వారముండి క్రొత్తదాననై వచ్చితిని. నాటికి నేటికి శూలనొప్పి రాలేదు. అనుగ్రహము వచ్చెనా భగవంతుఁడే మన రోగముల నన్నిటిని మాన్పఁగలఁడు. మీ కొడుకు కెంతో మందిని బోషించుచున్నాఁడు. ఎంతోమందికి సహాయము చేయుచున్నాఁడు. భగవంతుఁ డాయనను జబ్బుకుదిర్చి బాగు చేయకపోఁడు."

తన యిద్దఱు పిల్లలను వెంటఁబెట్టుకొని వారిం జూచిపోవుటకు వచ్చిన మూఁడవ ముసలమ్మ యీలాగనెను.

"తీసికొని పోగలవాఁడు భగవంతుఁడే. ఇవ్వఁగలవాఁడు భగవంతుఁడే. జగన్నాథ స్వామి వారి యనుగ్రహము లేకపోయిన పక్షమున నాకీ పిల్లలిద్దఱు దక్కుదురా? ఎందుకమ్మా, నేను [illegible] పెళ్ళినప్పటినుండి పుట్టిన ప్రతి పిల్ల ఏదో రోగపడి, చచ్చిపోయినది. ఇల్లు వల్లకాడై పోయినది. సంతోషము లేమిటో యీ మొగమున కన్నఁడు లేను. అలాగుండఁగా జగన్నాథమునుండి యొక పండా మాయింటికి వచ్చినాఁడు.

ఆయన నాకొడవవిని భయములే దని చెప్పి దీవించి, జగన్నాథస్వామి యొక్కఁడే రక్షింపఁగలడు గాని యితరులకు సాధ్యముకాదని చెప్పి, జగన్నాథయాత్ర చేవలసిన దన్నాఁడు. అమ్మా! జగన్నాథమంటే చాలదూరము. రైలుమీఁద కలకత్తా వెళ్ళినాము. అక్కడనుంచి పొగయోడనెక్కి సముద్రము దాటినాము. సముద్ర మంతో అల్లకల్లోలముగా నుండినది. కెరటము లెత్తుగా లేచినవి. కూర్చున్న గదులలోనికి నీరువచ్చినది. నాలుగుప్రక్కల నల్లనీళ్ళసముద్రమును చూచినప్పుడు నేను మఱల జన్మమధ్యములో కాలుచూతు ననుకో లేదు. కాని నేను జగన్నాథస్వామినే నమ్మకొని రాత్రి నాలుగు జాములు ఆయనపేరు స్మరణచేసికొనుచుంటిని. మఱునాఁడు దైవదయామున మేము క్షేమముగా రేవుజేరితిమి. తరువాత ఏడుపగళ్ళు, ఏడురాత్రులు పుణ్యసరస్సులలో నేను స్నానములుచేసి, స్వామివారి రథోత్సవమును జూచితిని. ఏడవనాఁటి రాత్రి జగన్నాథస్వామి నాకొకస్వప్నము కనిపించెను. తరువాత నేనుమాయూరికి వచ్చితిని. ఆవల ఈరెండు కాయలు కాచినవి. ఈఁగడియవఱకు ఈబిడ్డల మొగము చూచుకొని సంతోషించఁగల అదృష్టము పట్టినది. పెద్దపిల్లవానికి ఏడేండ్లు. చిన్నపిల్లవానికి అయిదేండ్లు వయస్సు. అమ్మా! నాబిడ్డలనిద్దఱిని దీవింపు నీవు పుణ్యాత్మురాలవు తల్లీ! భగవంతుఁడు నీదీవనలు విని, మావంశము నిలిపి యీ యిద్దఱు పిల్లలను రక్షించును."

చూడవచ్చినవా రాయన్నను విడిచి పోవునప్పటికి మిక్కిలి పొద్దుపోయెను. రాత్రులు సరిగా నిద్రింపక కొడుకుమంచము కనిపెట్టుకొని, యతని యవస్థ చూచుచు పగలతని పథ్యపానములు చేయించుచు నొక్కనిముస మైనవిశ్రాంతి యెఱుఁగక కష్టపడు చుండినప్పటికి కిశోరీరాయనితల్లి దేహస్థితి యించుకేనియుఁ జెడలేదు. ఈమెకే కాదు. హిందూదేశమందనేకవృద్ధవితంతువులకు రోగపీడితులైనవారి కుపచారము చేయుటయే పరమార్థము. ఆరాత్రి ప్రొద్దుపోయినప్పటికి నామె చూడవచ్చినవారితో మాటాడి సాగనంపి కుమారుఁడు పండుకొన్నగది లోనికి వెళ్ళెను. కుమారుఁడు నిద్రించుచుండెను. కోడలు మగనిపాదములవద్ద కొంగుపఱచుకొని పండుకొనెను. అనంతరమామె తనగది లోనికిఁబోయి కొంతసేపు మేలుకొని తెల్లవారుజామునఁ గన్నుమూసెను.

వేకువ నామె కొకస్వప్నము వచ్చెను. రోగపీడితుఁడైన కుమారుని విషయమై యత్యంతము తపించుచున్న యామెహృదయమున కాకల యమృత ప్రాయమయ్యెను. ఆకల యిట్టిది. భయంకరమైన చీఁకటి రాత్రివేళ నామె యొక్క యడవిలోఁ దన కుమారునివెంటఁ బయనమై వెళ్ళుచుండె నఁట. ఘాతుకమృగములు చింత నిప్పులవంటి

పెద్దకన్నులు తెఱచి, యామె వంకఁ దేఱిపాఱఁజూచు చుండెనఁట. దూరమునుండి నక్కలు కూయుచుండె నఁట. ఆమె దారితప్పి కాళ్ళు పొక్కులెక్కునట్లు మిక్కిలి శ్రమపడి నడిచి కొడుకుతోఁ బయనము చేసె నఁట. కాని మార్గము దొరకలేదఁట. ఆదుఃఖములో నామె దుఃఖించి బిగ్గఱగా జగన్నాథస్వామినిఁ బిలిచి వేడుకొనె నఁట వెంటనే తూర్పున వెలుఁగు కనబడెనట. దూరమునుండి యెవ్వరో చేయెత్తి "ఇదిదారి. ఇటు రండు, రం" డని, పిలిచి రఁట. అప్పు డామెకు ధైర్యము కలిగెనఁట. అంతట వారందఱు మహారణ్యము గడుచువఱకు, లేత సూర్యునియెండ పొలములమీఁదను గ్రామముల మీఁదను వ్యాపించువఱకు, నడిచి రఁట. తరువాత నామె కుమారుఁడు రోగముపోయి, బలముకలిగి సుఖముగా నింటికి నడిచివెళ్ళె నఁట. కాని యామె తన్నుఁ బిలిచినపురుషునిఁ బూజించె నఁట. అప్పుడీవిధమైనధ్వని యామెకువినఁబడెనఁట. "అవ్వా! సముద్రతీరమునందుఁ గాపురమున్నవాఁడను నేనే" అంతలో మెలఁకువవచ్చెను. ఆమె కన్నులు తెఱచి చూచునప్పటికి జాలకఱ్ఱలలోనుండి సూర్యునివెలుఁగుగదిలోఁ బ్రవేశించు చుండెను. మెలకువ వచ్చినప్పటికి స్వప్నములో వినఁబడిన మాటలధ్వని యామె చెవిలో ఖంగు మని కొంతసేపటివఱకు వినఁబడునట్లే యుండెను.

ఆమె తనకల గృహమం దున్నవారి కందఱకుఁ జెప్పఁగానే, యింటిలోఁ బెద్ద కళవళము పుట్టెను. అడిగినవారి కందఱకు విసుగు లేక యామె తాను కన్న కలతెఱఁగు మఱలమఱలఁ జెప్పెను. విన్నవారలమ్మ లెందఱో కన్నుల నానంద బాష్పములుగార జగత్కిశోరరాయునకు శీఘ్రకాలములోనే యారోగ్యదశ ప్రాప్తించు నని చెప్పిరి. జగన్నాథస్వామివారి యాలయమునకు జగత్కిశోరరాయలు యాత్ర చేసినపక్షమున నతఁడే రోగబాధ నివారింపఁజేయు నని, స్వప్న ఫలము చెప్పుటకై వచ్చిన పురోహితులు పండితులు కల విప్పి చెప్పిరి. కిశోరరాయునితల్లికి స్వప్నమువల్ల కలిగెను ఫలము కుమారుని యారోగ్యము బాగుపడుటయే గాక మఱియొక విశేషముగూడ సంభవించునని తోఁచెను. కాని యామె తనయభిప్రాయము నెవ్వరికినిఁ జెప్పలేదు.

[illegible] డాక్టరుసాహెబు కలకత్తానుండి రాణిగంజికి వచ్చెను. రాణిగారు తోఁబుట్టువు శరచ్చంద్రునితో స్వప్నవృత్తాంతము చెప్పెను. అది విని శరచ్చంద్రుఁడు [illegible]. "అమ్మా! జగన్నాథస్వామికి మనమీఁద ననుగ్రహము వచ్చినది. అందు [illegible] అనుమానము. [illegible] నీవు సహాయము [illegible] వేర్పవలెను."

"కాని, అక్కయ్యా ! ఇది పిచ్చిపని. శరీరములో డబ్బైత్తు బలమైనను లేనప్పుడు నీ మగనిని తీర్థయాత్రకు దీసికొనిపోవుట కేవలము పిచ్చిపని. అది దీర్ఘప్రయాణము, ప్రయాణపు బడలిక బావను జంపివేయును."

"కాదు. తమ్ముడూ ! అలాగుకాదు. జగన్నాథస్వామి అనుగ్రహించిన పత్తు మాన ప్రయాణపు బడలికయే యుండదు. ఆయన తల్లికి ఈయాత్ర యిష్టము. మేనత్తల కిష్టము. మీ బావగారు కూడ వెళ్ళ నిశ్చయించుకొన్నారు. తమ్ముడూ! నీవు సహాయము చేయవలెను. మాలో కెల్ల దృఢమైనవాడవు నీవే. నీ సహాయము లేనిదే యీ పనికాదు. ఈ తీర్థయాత్ర మాచేత నీవు చేయింపవలెను."

ఆ మాటలు విని శరచ్చంద్రు డాశ్చర్యపడెను. రోగికి దనచేతనైనంతసాయము చేయుటకు, మంచివైద్యము చేయించి బ్రతికించుటకు గంపంతయాశతో నత డక్కడకు వచ్చెను. కాని యొక ముసలమ్మకన్న పిచ్చి కలను బట్టి యామె యాజ్ఞాప్రకారము తీర్థయాత్రచేసి, రోగిప్రాణము దీయుటకై యొక పన్నుగడ బయలుదేరెను.

ఆ యాత్ర నాపివేయుటకు దనశక్యము కాదని యత డెఱుగును. అయినను తన శక్త్యైనంతవఱ కాపన్నుగడ సాగకుండ జేయుటకును, బావగారికి దీర్ఘప్రయాణము చేయుటకు శరీరదార్ఢ్యము గలుగువరకు యాత్ర నిలుపుచేయుటకును సర్వప్రయత్నములు విధిగా నతఁడు చేయదలచుకొనెను.

మధ్యాహ్న మతడు రాణిగంజిలోనున్న యింగ్లీషు డాక్టరును జూడబోయెను. రోగి విషయమై యతడు పుచ్చుకొనుచున్న జాగ్రత్తను శ్రద్ధను శరచ్చంద్రు డతని యెడ తనకుగల కృతజ్ఞతను జూపుచు బ్రశంసించెను.

"ఊ—దానికేమిలెండి. అందుకు నన్ను బ్రశంసింప నక్కఱలేదు. మా శక్త్యైన దేదో మేము విధిగా జేయుదుము. మీ బావగారికి శీఘ్రముగానే నెమ్మదిగా నుండును. పెద్దవాడు కాడు గనుక కుదురుటకు సందేహము లేదు."

"అయ్యా ! మీరు సమర్థులు. శ్రద్ధచేసి యెట్లయినను రోగము మాన్పగలరని నేను నిశ్చయముగా నెఱుగుదును. కాని—కాని—" అమీద శరచ్చంద్రుడు మాటాడ లేక పోయెను.

కాని కాని యని శరచ్చంద్రుఁ డాగుటచేత సందేహము కలిగి వైద్యుఁడు "నే నద యతని జూచి వచ్చినతరువాత రోగము తిరుగ బెట్టెనా యేమి?" యని యాత్రముతో నడిగెను.

"అయ్యా! తిరుగబెట్టుటే నయము. అంతకంటె నధమమైనపని జరుగుచున్నది. వైద్యమువల్ల రోగములు మానును. కాని బుద్ధిపూర్వకముగ జేసినతప్పులు మానవు."

"రోగి యజాగ్రతచేత దేహస్థితి పాడుచేసికొనెనా యేమి?"

"తల్లి యేదోకల గన్నదట. అందుచేత జగన్నాథయాత్ర తనజాడ్యము కుదుర్చునని రోగి తలచుచున్నాడు."

"జగన్నాథయాత్ర! జగత్కిశోరుఁడు మిక్కిలి నీరసముగా నున్నాఁడే. జగన్నాథ మెంతదూరము? ఏలాగున ప్రయాణము చేయఁదలచుకొన్నాఁడు?"

"రైలుమీఁద కాదు, స్టీమరుమీఁద కాదు. రాణిగంజినుండి పూరీజగన్నాథము వఱకు రాచబాటమీఁదనే ప్రయాణము. శరీరస్థితి సరిగా లేనివానికది బాధాకరమైన దీర్ఘప్రయాణము. అది మాబావ మరణమునకే వచ్చినది." అని శరచ్చంద్రుఁడు తలవంచి యొకటి రెండు బాష్పబిందువులు విడిచెను.

వైద్యుఁడు కూర్చున్నచోటునుంచి లేచి, యిట్టటు పచారుచేసెను. బంగాళాదేశ మతని గదిగోడమీఁద వ్రేలాడుచుండెను. ఆ పటములో రాణిగంజి జగన్నాథపు రాజబాటను సూచించునట్టి పొడవుగీతను వ్రేలితోఁ గీసినట్లు స్పృశించి పిమ్మట బల్లమీఁదనున్న కొన్ని వైద్యగ్రంథములు తెఱచి యేమో చదివి, మూసివేసి, శరచ్చంద్రునికడకువచ్చి తన స్థానమున మెల్లఁగాఁ గూర్చుండెను.

"ఈ పిచ్చిప్రయత్నము మాన్పించుటకు మీరు నాకు సహాయము చేయవలెను. డాక్టరుగారూ! శరీరస్థితి యీవిధముగా నున్నప్పు డిటువంటి ప్రయాణముచేయుట చేతులార ప్రాణము తీసికొనుటయే అని మీసహాయముతో నేనాయనకు నచ్చఁజెప్పఁగలను."

"నేనాలోచించుచున్నాను. ఈ ప్రయాణమువల్ల అతని ప్రాణరక్షణము కావచ్చునేమో అని నేనాలోచించుచున్నాను." అని వైద్యుఁడు ప్రతిమాటదగ్గఱ నిలుచుచు నాగుచు మెల్లఁగా బదులు చెప్పెను.

"విశ్వాసబలము రోగము మాన్పఁగలుగునని మీరాలోచించుచున్నారా?" అని శరచ్చంద్రుఁ డాశ్చర్యముతో నడిగెను.

"నేను దానినిగుఱించి యాలోచించుటలేదు. విశ్వాసబలము రోగనివారణ చేయవచ్చును. గాని వైద్యులము ఆమాట తలచుకొనము. నేను మీ బావకు సరిగా ఒకనెల మందిచ్చితిని. ఆయనరోగము పట్టుబడినదని నా నమ్మకము. పైగా ముసలివాఁడు కాఁడు. నలువదియేండ్లకంటె నెక్కువ లేదనితలఁచెదను. అనేక సంవత్సరములు వర్ధమానపట్టణమందలి మన్నెజ్వరము శీఘ్ర పిప్పిఁజేసి నీరసపెట్టినది. జాడ్యము కుదురుట కష్టము. కుదురునని నేను నిశ్చయముగాఁ జెప్పలేను. నీరసమే ఆయననిప్పుడు క్రమ క్రమముగాఁ జంపుచున్నది. సంవత్సరమంతటిలో మిక్కిలి మనోజ్ఞమైన యీ శీతకాలములో బంగాళాదేశమందు మిక్కిలి యారోగ్యప్రదములైన జిల్లాలలోనుండి దగ్గఱ దగ్గఱమకాములు చేసుకొనుచు నేనాఁటి కానాఁడే క్రొత్తస్థలములఁ జూచుచు దీర్ఘ ప్రయాణము చేసినపక్షమున సంపూర్ణారోగ్యముఁ జెందుటయే గాక మీ బావ క్రొత్త మనుష్యుఁడై, ముం దనేకసంవత్సరముల వఱకు జాడ్య మన్నది యేమో యెఱుఁగక యుండును."

ఆమాటలు విని శరచ్చంద్రుఁడు మహాశ్చర్యము నొంది, "ఈప్రయాణములో చలి తగులకుండ నతనినిఁ దీసికొని వెళ్ళుట సాధ్య మగు నని మీరుతలంచు చున్నారా?" యని వైద్యు నడిగెను.

"అట్టిజాగ్రత నీవే పెట్టవలెను. ఇట్టి జాగ్రత పెట్టుటకై నమ్మకము గల మనుష్యుఁడు కిశోరరాయునివెంట నే నెఱిఁగినంత మట్టుకు నీవు తప్ప మఱెవ్వరును లేరు. నీ వాయనతో వెళ్ళఁ దలఁచుకొంటే గాని, ఆయన యీప్రయాణము చేయుటకు నే నంగీకరింపను."

"అయ్యా! నా కిది యిష్టమే."

"మంచిది. జగన్నాథప్రయాణము చేయుటే నిశ్చయము. రాత్రివేళ ఆయనను వెచ్చనిగదిలో నుంచుటకుఁ బ్రయత్నము చేయుఁడు. గాలి తగుల కుండఁ జేయవలెను. పచ్చడములు ఒత్తుగాఁ గప్పవలెను. సూర్యాస్తమాన మైన తరువాత గాని రాత్రి గాని ప్రయాణము చేయవద్దు. ప్రతిదినము సూర్యోదయ మైనతరువాత నొకగంటకు బైలుదేఱ

వలెను. చిన్న చిన్న మకాములమీఁద వెళ్ళఁడు. ఆయన పల్లకిలోనే ప్రయాణము చేయును కదా?",

"డాక్టరుగారూ! ఆవిషయమంతయు నేను చూచుకొందును లెండు"

"సాధ్యమైనంతవఱకు ఆయనతో జనము తక్కువగా నుండవలెను. ఇంటిలో నిజముగా మంచితలకాయ యున్నది. ఎవరంటే ఆయనతల్లి. ఆమె చాల పెద్దది. ప్రతి విషయములో నామె యేర్పాటు లెంతో ప్రయోజనకరములు. ఆమె తప్పక వెళ్ళవలెను కదా! భార్య అంటే నీ తోబుట్టువే భార్య. పెనిమిటి కుపచారము చేయుటలో రాత్రి, పగలు విసుగులేకుండ, బద్ధకించకుండ అంతజాగ్రతగ, అంత శ్రద్ధగ, అంతభక్తిగ పనిచేయునటువంటి యిల్లాలిని ఈదేశములోనే కాదు; మా దేశములోనే కాదు; నేనెక్కడ చూచిలేను. ఆమె లేనిదే క్షణము జరుగదు. కాబట్టి తప్పక వెళ్ళవలెను. సరే, నీవు మూడవ వాడవు. కొందఱు నౌకరులు తప్పమిఁకెవ్వరిని ఆయనవెంట వెళ్ళనివ్వవద్దు."

"రోగి మేనత్తలమాట ఏమి? వారు కూడ జగన్నాథక్షేత్రము చూడవలెనని ఉబలాటపడు చున్నారు."

"పాపము! ప్రేమగల మేనత్తలు పిల్లలమందలతో వచ్చి గొడవపెట్టి, రోజూవ కంగుళిమంగళము చెప్పుచు మీబావను జంపివేయు చున్నారు. ఆకొంపలో నున్నంత మందిజనములో రోగము కుదుర్చుకొనుటకై స్థలము మార్చి ప్రయాణము చేయువాఁడు మఱియొకఁ డుండఁడు. నామాటకు మీరు కోపగించుకొనవద్దు. మీమనస్సునకు నొప్పి కలిగించవలెనని నే ననుట లేను. మీసమిష్టికుటుంబముల ఫక్కి మిక్కిలి మంచిదని నేను నొక్కిచెప్పగలను. నిరుపేద లైన యెందఱో ఆఁడవాండ్రు, ఎందఱో మగవాండ్రు దిక్కుమాలినవారై దురవస్థలపాలు గాకుండ ఈసమిష్టికుటుంబములే రక్షించుచున్నవి. ఆవిషయమై వ్యతిరేకముగా నేనేమియుఁ జెప్పఁ దలచుకొనలేను. కాని రోగి మావద్దకు వచ్చినప్పుడు వైద్యులము గనుక మేము కొన్ని సంగతులు చెప్పవలసియుండును. కాని నాయభిప్రాయ మేమనఁగా జబ్బుగానున్న సమయములో జగత్కిశోరరాయలను పెద్ద సత్రమువలె నున్న ఆకొంపలో ఆగొడవలో పెట్టి మీరు చంపివేయుచున్నారని, నేనాయనను జూడవచ్చినప్పుడు శుద్ధిమైనగాలి గదిలోకి వచ్చుటకు సాధన మేది యైన నున్నదాయని వెదకుచుందును. గాలి సాధ్యము కాదు. అపేక్ష గలచుట్టాల గొడవలోను, ఎద్దుముద్దు స్వరూపములైన నౌకరులగోలలోను, మంచివానికైన వెఱ్ఱియెత్తించునట్లు పిల్లలు చేయుగడబిడలలోను రోగి కొక్కనిమిషమైన విశ్రాంతిలేదని నేను కనిపెట్టితిని.

అయ్యా! అది యెప్పటికి సరిపడదు. నిజముగా నుపచారము చేయఁగలిగి తెలివిగల కొద్దిమంది మనుష్యులను దీసికొని నిరంతరము స్థలముమార్పులు గల దీర్ఘ ప్రయాణము చేయవలసిన దని నేను చెప్పుట కదొక ముఖ్యకారణము."

"అయ్యా! డాక్టరుగారూ! మీయభిప్రాయ మేమిటో సరిగా నాకుఁ దెలిసినది. మీసలహాప్రకారమే నడిచెదను. ప్రయాణములో రోగినిఁ గనిపెట్టి యుండుటకు కిశోరరాయనితల్లి కవిరాజు నొక్కనిని వెంటఁ దీసికొని పోవఁ దలఁచు చున్నది."

"అది మానిపించుము. మీ కవిరాజులలో గట్టివారు కొందఱున్నారు. మేమింత వఱకు వాడి యెఱుఁగని కొన్ని మూలికలు, మందులు వా రెఱుగుదురు. నేలవేము మొదలైన కొన్ని వేళ్ళు పనిచేయుటచూచి, మా మందులలోఁ చేర్చి మేము వాడు చున్నాము. కొన్ని దీర్ఘవ్యాధులలో నవి మిక్కిలి యుపయోగించుచున్నవని నే నెఱుఁగుదును. నా మిత్రుఁడొకడు పురాణగ్రహణివల్ల చిరకాలమునుండి బాధపడుచుండెడి వాఁడు. ఇన్ని మందులుపెట్టుకొని, మేమాయన రోగము కుదర్చలేక పోయినాము. అది కొంతవఱకు రోగినిబట్టికూడ నున్నదిలెండి! రోగులలో నంత పరకిమాలినవానిని నేనెక్కడఁ జూడలేను. చప్పిడిభోజనముఁ జేయుమని మేము విధించి యుండఁగాఁ భక్షింపఁగూడని వస్తువులు కచేరిపెట్టెలోదాచుకొని, యెవ్వరుచూడకుండఁ దినుచుండెడి వాఁడు. అయినప్పటికి గట్టి కవిరాజొకఁడు అతనినిఁ జేరదీసి కఠినపథ్యము చేయించి, ఆఱువారములలో జబ్బు కుదిర్చినాఁడు. కాని మీ కవిరాజులలో ననేకులు ప్రజ్ఞలేని వారు. బూటకపు వైద్యులు. మీ బావ విషయమై వేఱే కవిరాజు అక్కఱలేదు. కడచిన నెలలలో కావలసినన్ని మందులు మ్రింగినాడు. ఇఁక మందులు వేయనక్కఱలేదు. పరిశుభ్రమైన గాలి తగులనిచ్చి గొడవలు, గోలలు లేకుండఁ జేయుఁడు. మందు లక్కఱ లేకుండ ప్రకృతియే అతనిరోగము కుదుర్చును."

"డాక్టరుగారూ! మీరు మా కెంతో యుపకారము చేసినారు. మేము మీ ఋణము తీర్చికొనలేము. మీ సలహాప్రకార మేర్పాటులు చేయుదును. మేము యాత్రకు వెళ్ళునప్పుడు మా బావగారి మేనత్తలను వర్ధమాన పట్టణమునకుఁ బంపెదను."

"ముసలమ్మ లందఱిని వర్ధమానపట్టణములోనున్న కిశోరరాయల పిత్రార్జిత గృహమునకుఁ బంపివేయుము. అది వారి కుండదగిన చోటు. నామాట తప్పు పట్టుకొవద్దు. ఆ ముసలమ్మలమీఁద నాకెంతో గౌరవము గలదు. నేను రోగినిఁజూచి తిరిగి వచ్చు

నప్పుడు పాప మా ముసలమ్మలు త్రోవలో నన్నాపి, తెఱచాటునుండి కిశోరరాయునికి నెమ్మదిగా నుండునా లేదా యనియు, సరస్వతీ పూజనాఁటి కారోగ్యము కలిగి పీట మీదఁ గూర్చుండి పూజ చేయఁగలఁడా లేదా యనియు, రోగము కుదిరిన తరువాత వంశము నిలుచుటకై సంతానము కలుగునా లేదా యనియు నెన్నో ప్రశ్నలడుగుచుండెడివారు. మేము చదువుకొన్న చదువులను బట్టి, ఆ ప్రశ్నలలో నొకదాని కైనను మేము నమ్మకముగాఁ బ్రత్యుత్తరము చెప్పఁజాలము. వారు పాపము నాకు కొన్ని పుష్పములు పచ్చిబటానీలు తోటలోనుండి పంపుచుండెడివారు. నా భార్య వాటినెంతో సంతోషముగా గ్రహించుచు వచ్చినది. ఏమైన నేమి, రోగి మంచమువద్ద మాత్రము నీ రుండఁదగినవారు కారు. ఆయనతో జగన్నాథమునకు నీవు, నీతోఁబుట్టువు, రోగి తల్లిమాత్రమే వెళ్ళవలసినది. ఈ మాట మనసులో పెట్టుకో. మఱి యేచుట్టాలు వద్దు. ఏ స్నేహితులు వద్దు. ఏ కవిరాజులు వద్దు. ఏ మంత్రులువద్దు.”

వైద్యుని కంతో కృతజ్ఞుఁడై శరచ్చంద్రుఁ డా స్థలము విడువఁదలచెను. పూరీ జగన్నాథమునకు వెళ్ళుటవలన జగత్కిశోరరాయులు సంపూర్ణారోగ్యముఁ బడయవచ్చునని కోరుచు వైద్యుఁడు శరచ్చంద్రుని హస్తము స్పృశించి పంపెను.

---

## పదునేడవ ప్రకరణము.

### యాత్ర.

రాణిగంజినుండి జగన్నాథ దేవాలయము వరకు గొప్ప రాచబాటకలదు. అది మూఁడువందల మైళ్ళు నిడివిగలిగి యుత్తరదక్షిణములకు వ్యాపించియున్నది. ఇది మిక్కిలి మంచిబాట. ఈ బాటకుఁ దూర్పున నంతములేని వరిపొలములతోను, గొప్ప పట్టణములతోను, లెక్కింప నలవిగాని జనసంఖ్యలతోను నిండియున్న బంగాళాదేశపు సమభూములు కలవు. ఈ బాటకుఁ బడమటగా నేల క్రమక్రమముగ నెత్తుగనుండును. అందు గొన్ని కొండలు గలవు. ఆ కొండలమీఁద సాలవృక్షములతో నిండిన పురాతన మహారణ్యములు, మహారణ్యముల మధ్య సాగుబడికి వీలైన స్వల్పభూములు, భూములచుట్టు చిన్న కొండపల్లియలు కానఁబడుచుండును. తూర్పు దిక్కున నిరుపమానమైన నాగరకత

గలిగి యార్య మహాజనుల కళలు పారిశ్రామిక విద్యలు నేర్చిన హిందూమహమ్మదీయ జాతులు కలవు పశ్చిమ భాగమున సౌతలులవంటి యాటవిక జాతులు కలవు. వీరు మొదట ననార్యులైనను సగమువరకు హిందువులై యున్నారు. వీరి వృత్తి యిప్పటికిని వేటయే. అనార్యమైన వారి స్వంతభాషనే వారు మాటాడుచుందురు. ప్రాగ్భాగమున దేశచరిత్రలో ప్రసిద్ధికెక్కిన వర్ధమానము, నవద్వీపము, ఢక్కా, జెస్సోరు మొదలగు జిల్లాలు కలవు. ఈ జిల్లాలు కళాస్థానములు అనియు, విద్యానిలయము లనియు బహు శతాబ్దములనుండి పేరుపడి యున్నవి. పశ్చిమమున చోటానాగపూరులోఁ జేరిన మిట్ట ప్రదేశములును, నుత్కలదేశములోఁ జేరిన స్వదేశసంస్థానములును గలవు. ఈ సంస్థానములలోని జనులు యుగయుగంబులనాఁటి మోటయాచారములు, మూఢవిశ్వాసములు గలిగి సగమునాగరకతఁ గలిగియున్నారు. హిందూదేశమునందలి యితరభాగములయందు వలెనే బంగాళాదేశమందుఁ గూడ నార్యనాగరకతాతరంగము వనపర్వత ప్రాంతములు ననార్యజాతులకు వారి సంతతులకు వదలి పర్వతశూన్యములైన సమభూములమీదనే ప్రవహించెను. రాణిగంజినుండి పూరీనగరమువరకుఁబోవు బాటసారిగాని, తీర్థవాసుఁడు గాని సమభూములకు, పర్వతభూములకు నడుమను, నాగరకులైన హిందూమహమ్మదీయ జాతులకును, విద్యాగంధశూన్యులైన యాటవికజాతులకును నడుమ సరిహద్దుగానున్న యీ రాజమార్గము మీఁదనే నడువవలసి యుండును.

డిశెంబరు నెలలో నొకనాటి యుదయమున జగత్కిశోరరాయలు తన పరివారముతోఁ గలిసి యీ బాటమీఁదఁ బ్రయాణముఁజేయ నారంభించెను. దట్టమైన గవిసెనగలిగి, రోగి కవసరములైన యేర్పాటులు గలిగిన యొక పల్లకిలో కిశోరరాయలు గూర్చుండెను. మఱియొక పల్లకిలో నతని తల్లియు, భార్యయుఁ గూర్చుండెను. శరచ్చంద్రుఁడు గుఱ్ఱముమీఁద పయనముచేసెను. గుఱ్ఱ మంత మంచిస్వభావముకలది గాకపోయినను, దినమున కనాయాసముగా ముప్పదిమైళ్ళ ప్రయాణ మొక్కవరుసను జేయఁగలిగినట్టి దేశవాళీమోటకట్టు. రెండెడ్ల బండ్లు రెండుకూడఁ గలవు. అందులో వంటసామానులు వేసికొని నౌకరులు పయనము చేయుచుండిరి. ఈ బండ్లమీఁద సేవకులు రాత్రివేళ బైలుదేరి తెల్లవారునప్పటికి ముందు మజిలీకవెళ్ళి, యుదయమున బయలుదేర కిశోరరాయలు మొదలగువారు వచ్చునప్పటికి బసయేర్పాటులు మొదలైనవి చేసి, వంటచేసి సిద్ధముగ నుందురు. రైలుబండ్లు రాకమునుపు హిందూదేశములో గొప్పవారు పయనము చేయునట్టి విధానము లివి. ఇనుపదారి పడని భాగములందు నేఁటికిని గొప్పవారి పయనము లీవిధముగనే జరుగుచున్నవి. వేరైన [illegible]

కాలినడకనుబోయి మట్టమధ్యాహ్నము వేళను, రాత్రివేళను, బాటలకు సమీపముననున్న పూటకూళ్ళ యిండ్లలోగాని, యంగళ్ళలోగాని బసచేయుదురు. అక్కడ మూఁడణాల డబ్బులకు వారికి బస భోజనము కుదురును.

రాణిగంజినుండి రెండుమైళ్ళలోపుగాఁ బయనముచేసి యీ జనము దామోదర నదీతీరముఁ జేరెను. ఈనది పశ్చిమమున జనియించి కొంతవఱకుఁ దూర్పుగాఁ బ్రవహించి పిమ్మట దక్షిణముగాఁ బాఱి, బంగాళాఖాత సమీపమున హుగ్లీనదిలోఁ బడుచున్నది. వర్షకాలమున దామోదరనది పొంగి యనేక క్రోశములవఱకు దేశము నాక్రమించును. అట్టిసమయమునఁ బల్లియలు, చెట్లు జలావృతములై మెట్టసముద్రమందలి దీవులవలెఁ గాన్పించి నేత్రములకుఁ బర్వము చేయుచుండును. ఉత్తరపువైపున గొప్ప పొడికట్టబారు వర్ధమానము మొదలగు పట్టణములను వరదభయమువలన రక్షించుచున్నది. దక్షిణపువైపున నెన్ని మాఱులు గట్లు వేసినను, నది గట్లుఛేదించుకొని పొంగి పొరలుటచే నావైపున గట్ల ప్రయత్నము వదలుకొనఁబడెను. అందువల్ల వర్షకాలమున శ్రావణభాద్రపదాశ్వయుజ మాసములలో దామోదరనది దక్షిణపువైపున నిండుకొలముగా వ్యాపించి రైతులు చల్లుకొన్న విత్తనము లంటకుండఁజేసి, పొలము లన్నిటిని నీటిలో ముంచి విశేష నష్టమును గలిగించుచుండును. దీని సహజఫలము చిత్రమై పొడకట్టుచున్నది. దక్షిణపువైపునఁ గల నేలయంతయు నదీప్రవాహములో వచ్చినయొండుమట్టివలన క్రమక్రమముగా నెత్తగుచుండుటయు, నుత్తరభాగమున నున్న ప్రదేశమంతయు మన్నెపుజ్వరములకు నివాసమైన పల్లపు నేలగా నుండుటయు సంభవించుచున్నది. ఇంజనీరింగుశాఖలోని యుద్యోగస్థులను, దేశపరిపాలనాధ్యక్షులగు నధికారులను నిరంతర దీర్ఘాలోచనపాలు చేయునట్టి గొప్ప సమస్యలలో నిటువంటి చంచలనదుల విషయములు ప్రధానములైనవి. ఈనదులు వానకారులో బహుదూర వ్యాప్తములై దుర్నిరోధములై యుండి శీతకాలము నాటికే మిగుల సన్నగిలి దారములట్లు దృశ్యాదృశ్యములై యిసుకతిన్నెలసందున దాగుడుమూత లాడుచుండును.

అది డిశంబరు నెలయగుటచే జగత్కిశోరరాయలు సపరివారముగ దామోదరనది ననాయాసముగ దాటెను. ఒకతేవుపడవ పల్లకులను గుఱ్ఱములను నెక్కించికొని లోతునీరు దాటించెను. తక్కిన నదీభాగము కొన్నిచోట్ల నట్టిఇసుకతిప్ప, మఱికొన్నిచోట్ల రెండడుగులలోతుగల స్ఫటికస్వచ్ఛమైన నీరు గలిగియుండెను. నది నుత్తరించి యీబాటసారులు శీతకాలపు టెండలో మఱలఁ బ్రయాణ మారంభించిరి.

రోగముచేత మంచ మెక్కి బండెలోఁ బడియున్నట్లు రేయుంబగలు గదిలోఁబడియున్న యారోగికి నిర్మలమైన యావాయువు, వెచ్చవెచ్చని యెండ సుఖప్రదముగా నుండుటం జేసి బైలుదేఱి కొలఁదిదినములే యైనను నప్పటికే యామార్పువలన నతఁడు మునుపటికంటె శరీరదార్ఢ్యము కలిగినట్లు కనఁబడెను. అతనితల్లికిని భార్యకును గూడ నా ప్రయాణము సంతోషదాయకమై యాశాప్రేరకమై యుండెను. కంటికగపడిన ప్రతివస్తువు క్రొత్తదే. ఇసుక తిన్నెలతోడనదియు, బహుదూరవ్యాప్తములగు నరణ్యములు, పశ్చిమభాగమున నున్నతమై కనఁబడుచున్న దేశము వారికి నేత్రపర్వాయమానమై యుండెను. అన్నిఁటికంటె జగత్పావనమైన జగన్నాథస్వామి యాలయము సందర్శింపనగునన్న యాశ వారి హృదయముల నానంద భరితములు చేసి, మనస్సుల నుత్సాహ పూరితములు చేసెను.

శరచ్చంద్రుని గుఱ్ఱము బావగారి పల్లకివెనుక మెల్లమెల్లఁగా నడచిపోవు చుండుటచేత నతఁ డాప్రకృతి సౌందర్యమును గన్నులపండువుగాఁ జూచి మహానందము నొందు చుండెను. అందువలన నాప్రయాణము శరచ్చంద్రునకుఁ గలుగఁ జేసినంత యానందము తక్కినవారి కెవ్వరికిని, జగత్కిశోరీరాయలకు సైతము కలిగించి యుండదు. ఇట్టి యానందము నొందుచుండినప్పటికి శరచ్చంద్రుని మనస్సునుండి యతనికి గలిగిన యాశాభంగము నిర్మూలింప బడదయ్యెను. కాని కలకత్తాలోఁ దనజీవితమును మిక్కిలి దుఃఖభాజనమును జేసిన విషయము లిక్కడ లేవు. ఇచ్చట నేకాంతముగ నతఁడు తన పూర్వ విషాదకరచరిత్రమును గూర్చి తలపోయఁ జొచ్చెను. నిరాశను నిశ్శబ్దముగ నిబిడము చేసికొనఁ గలిగెను. తన పూర్వస్థితికిఁ బ్రస్తుతస్థితికి నడుమ మహాంతరాయములు ప్రవేశించెను. జీవించుట వ్యర్థముగాఁ దోఁచెను. గంటగంటకు నతనియెదుట నొక భువనమోహన విగ్రహము నిలిచి క్షణకాల మతని కూరటఁ గలిగించుచు వచ్చెను. కాని యావిగ్రహము స్పృశియించుటకు వీలులేని పవిత్రదేవతావిగ్రహమై, యామరణస్మరణీయమై యుండెను. అందుచేత నతఁడు దృఢశిరోత్సాహపూరితులయ్యు విఫలమనోరథులైన యనేకయువజనులవలె యావజ్జీవ మామెనే స్మరియించుకొనుచు దేశద్రిమ్మరియై యుండ నిశ్చయించుకొనెను.

రాణిగంజినుండి పదియైదు మైళ్ళదూరమున గంగాజలఘాటీ యను చిన్న గ్రామముండెను. ఆబాటసారు లాదినమున నక్కడ నిలిచిరి. శరచ్చంద్రుఁడు గుఱ్ఱము దిగి, చేయూఁత యిచ్చి కిశోరీరాయలను బల్లకిలోనుండి మెల్లఁగా దింపెను. కాళి బసలో పక్కవేసి భర్తను గనిపెట్టుకొని యుండెను.

సూర్యాస్తమయమైన కొంతసేపటి కతఁడు నిద్రించెను. అతనితల్లి వంటయింటిలో బని తెమలక యచ్చటనుండి రాకపోవుటచే రోగిదగ్గఱఁ గనిపెట్టుకొని కాశీ శరచ్చంద్రులు మాత్రమే యుండిరి.

"తమ్ముఁడా! నీవు సుధను వివాహము చేసికొనవలె నని ఆలోచించు చున్నావఁట నిజమా? పాపమది యాధీనము తప్పినపిల్లకదా? పితృతుల్యులు వివాహమాడ వచ్చునా? మనవంశమున కది కళంకము తెచ్చును సుమీ!" యని యామె పలికెను.

"అమ్మకూడ నట్లేయన్నది. అందుచేత నాసంబంధము విడఁగొట్టుకొన్నాను. చలచిత్తుఁడని, పొరపాటుచేసినాఁడని నీతమ్మునిమీఁద ప్రేమ నీవు కోసివేసి కొందువా అక్కయ్యా!" యని యాతఁడు బదులుచెప్పెను.

"తమ్ముఁడా! నీమీఁదిప్రేమ నేను కోసివేసి కొనఁగలనా? అమ్మయు నాన్నయు నన్ను గన్నట్లే నిన్నుమాత్రము గనలేదా? తమ్ముఁ డక్కకు ప్రేమాస్పదుఁడు గాక మఱి యొకలాగుండునా?"

మనోవేదన గలిగించు నావిషయమై యక్కకుఁ దమ్మునకు జరిగిన సంభాషణ మంతే. కాశీ యామాట మరల నెన్నఁడెత్తలేదు.

మొదటినాఁటి యుదయమువలెనే రెండవనాఁటి యుదయము కూడఁ బ్రభావంతమై యానందకరమయ్యెను. చెట్లమీఁదను గడ్డిమీఁదను నాణిముత్యములవలె మంచు బిందువులు వెలయుచుండెను. మంచుకురియుట మానినతోడనే వెచ్చని సూర్యరశ్మి వ్యాపించిన తోడనే బాటసారులగుంపు గంగాజలఘాటినుండి బైలుదేఱెను.

బాట క్రమోన్నతమైన దేశముగుండఁ బోవుటచేతఁ బ్రకృతి సౌందర్యము నేత్రమునకు మనోజ్ఞమై, దర్శనీయమై యుండెను. పల్లపుభూమి యంతయు జాగ్రతగా సాగుబడి చేయఁబడెను. చేలు పసుపుపచ్చ వర్ణము కలిగి పొట్టలు పోసికొని కోఁతకు సిద్ధముగా నుండెను. తక్కిన నేల బీడునేలయై యుండెను. ఆ నేలలోఁ గనుచూపుమేర నెక్కడఁ జూచిన నడవియే. ఆయడవులలో నెద్దులు దున్నపోతులు తమ కట్టుగంటలు టక్కుటక్కు మని ధ్వనిచేయ, నాకుగుబురుల నడుమఁ గానఁబడకుండఁ బచ్చికమేయు చుండును. అక్కడక్కడ సాగుబడి చేసిన పొలములు గల గ్రామములు కనఁబడును. కొన్నిచోట్ల గుడిసెలుమాత్రమే కానవచ్చును. తీర్థయాత్రాపరులకు, బాటసారులకు,

గావలసిన సరకు లమ్మెడియంగళ్ళు దూరదూరముగా బాటప్రక్కల నక్కడక్కడఁ గొన్ని కలవు. పడమటిదెసను పదియైదు మైళ్ళదూరమున నున్న సుసూనియా పర్వతము సుందరముగా వారి కగపడఁ జొచ్చెను. దాని కవ్వల నంతకంటె నెత్తయిన పాచెటు మాన్భూ కొండలు, వాని శృంగములు నభోభాగము నావరించెను.

మూఁడుగంటలు ప్రయాణము చేయునప్పటికి వారు తారకేశ్వర నదివద్దకు వచ్చిరి. ఇదియుఁ బడమటిదెస జనించి హుగ్లీనదిలోఁ గలియుటకై మొదటఁ దూర్పుగాఁ బ్రవహించి తరువాత దక్షిణముగా దిరిగిన యొక చిన్ననది. ఇది దామోదర నదికంటె సన్నముగా నుండును. ఈ నదిదాటి మన బాటసారు బంకూరాజిల్లాకు ముఖ్యప్రదేశమైన బంకూరాపట్టణమును జేరిరి. ఇటుకలతోఁ గట్టిన యిల్లొకటి సౌఖ్యప్రదమైనది జగత్కిశోరరాయని బసనిమిత్త మా గృహయజమానుఁ డిచ్చెను. ఆనాఁటికి వారక్కడ నిలిచిరి.

---

## పదునెనిమిదవ ప్రకరణము

### ఆటవికబాలిక.

వర్తమానపు జమీందారుఁ డగు జగత్కిశోరరాయుల పేరు బంకూరాపట్టణములోఁ బ్రసిద్ధము. పగటిపనులెల్ల ముగిసిన తరువాత సాయంకాలప్రదీపములు పెట్టినతోడనే గొప్పకుటుంబములలోఁ జేరిన స్త్రీలు కొందఱు కిశోరరాయునితల్లి దర్శనము చేయుటకు నొక్కరొక్కరుగా వచ్చిరి.

"తల్లీ ! నీవు మంచిపని చేసితివి. మీ కుమారుని జగన్నాథము తీసికొనిపోవుట లెస్సయైన పని. మనుష్యుల మందులు పనిచేయ లేనప్పుడు జగన్నాథదేవుఁడే జాడ్య నివారణ చేయఁగలఁడు. రోగబాధలు పడినవా రనేకు లాయనకటాక్షమువల్ల బాగు పడిరి." అని చూడవచ్చిన వారిలో నొకర్తె చెప్పెను.

"అమ్మాయీ ! ఆ జగన్నాథస్వామి యనుగ్రహించి నా కొడుకునకు రోగ నివారణ చేయవలెనని మీరందఱు దీవించి పొండి. నా కుటుంబమున కాధారము వాఁడే కదా !

వాఁ డెంతో బాధపడినాఁడు. ఈ మందా మందనక యన్నిమందులు మ్రింగినాఁడు. వ్యర్థమైనవి. నేఁటికి మహానుభావుఁడు జగన్నాథస్వామి యీ యాత్ర చేయవలసినదని యుత్తరువు చేసినాఁడు" అని కిశోరరాయనితల్లి పలికెను.

"అమ్మా! మీరు కలగన్న సంగతి మాకుఁ దెలిసినది. భగవంతుని కట్టియనుగ్రహము కలిగినది. గనుక మీ రెంతో యదృష్టవంతులు. భగవంతుని యుత్తరువు ప్రకారము మీరు నడుచుకొనఁ గలిగిరి. గనుక మీరు మిక్కిలి యదృష్టవంతులు. జగన్నాథస్వామి కోవెల చూచుభాగ్య మందఱికిఁ బట్టునా? ఆ యాత్ర మేముకూడ చేయవలెనని చిరకాలమునుంచి యుబలాట పడుచున్నాము. కాని మేము పేదవారము. కాక ప్రయాణము చాల కాలము పట్టును. ఖర్చెక్కువగును.

"అవు నది దీర్ఘప్రయాణమే. ఈ ప్రయాణ మేలాగున సాగునా అని నేను గంపెడు బెంగ పెట్టుకొన్నాను. భగవంతుని దయవల్ల మేము ప్రయాణ మెట్టట్టో యారంభించినాము. ఇప్పటికి మా అబ్బాయి మునుపటికన్న బాగున్నాఁడు. పాపము మా కోడలికి నెలదినాలనుండి రాత్రినిద్ర లేదు ఒక్కనిముషము పగలైన విశ్రాంతిలేదు. దానికి మగఁడంటే యింతింత భక్తిగాదు. నాకెంతో విధేయురాలు. నా మాట జవదాటదు. అటువంటి కోడండ్రు ఈ కాలములో సాధారణముగా నుండరు. అహోరాత్రములు నిద్రాహారములు లేక కనిపెట్టుకొని యుండబట్టేతే, అది వాలిపోయినది. శరీరములో రక్తమాంసాలు లేవు."

"నీవంటి అత్తగారికి భూదేవతవంటి అటువంటి కోడలు దొరకక మఱొకర్తె దొరకునా? ఆమె వంశవు విత్తుకట్టు నుంచిది ఈకష్టములో మిమ్ముఁ గనిపెట్టి మీవెంట వచ్చుటకు మీ కోడలితమ్ముఁడు చదువుమానుకొని వచ్చినాఁడని విన్నాను."

"అవునమ్మా! శరచ్చంద్రుఁడు మంచివాఁడు. వినయవిధేయతలు గలవాఁడు. అటువంటివానిని మనము సాధారణముగాఁ జూడజాలము. కాని పాడుకాలాలు వచ్చి కూర్చున్నవి. కాలేజీలో మనపిల్లలు రేపేమి దుర్బుద్ధులు నేర్చుకొందురో తెలియదు" అనుచుండ శరచ్చంద్రుని విషయమై యామెవిన్న లోకవాద మొకటి జ్ఞప్తికి వచ్చెను. వచ్చినతోడనే యామె మొగ మించుక మాడెను. ఆ తలఁపంతలోనే యంతరించినందున నామె మఱల నిట్లు పలికెను. "అవునమ్మా! శరచ్చంద్రుఁడు బాగుండెవాఁడు. పట్నవాసమువల్ల గలుగు పాడలవాటులు దరికి రాకుండఁ గొట్టినాఁడు. ఎల్లప్పుడు నా కొడు

కును గనిపెట్టుకొని యుండును. తమ్ముఁడు సైత మంత జాగ్రతగాఁ జేయఁడనుకో. అటువంటి కొడుకును గన్నతల్లి అదృష్టవంతురాలు. రోగబాధ పడుచున్న నా కొడుకును శరచ్చంద్రుఁడు కనిపెట్టుకొని యుండి యుపచారము చేయుట చూచినప్పుడు నాకన్నుల నుండి నీళ్ళు కారును."

"అటువంటి జాగ్రత యూరకేపోదు తల్లీ! ఆనాఁటి కానాఁడు మీ కుమారుడు బాగుపడి జగన్నాథస్వామి దయవల్ల పూరినుండి వజ్రశరీరముతో హాయిగా మఱలి వచ్చును. తరువాత మనుమలు పుట్టినదాక నీవు బ్రతికియుందువు."

"అమ్మాయీ! మమ్ము గుఱించి యిటువంటి మంచికోరికలు కోరినందుకు నీమీఁద దేవునికి దయ యుండవలెను. నేను పెద్దదానను. మా అబ్బాయికి జబ్బుకుదిరిన తరువాత మా యింటిపెత్తనము మా కోడలే చేయవలెను. నేను జగన్నాథస్వామివారి పాదముల వద్దనే యిఁకమీఁద బ్రతికియున్న నాలుగురోజులు గడిపెదను."

"అమ్మా! మీరు బంకూరాలో ఎంతకాల ముందురు? తిరిగి రేపువచ్చి మీదర్శనము చేయఁగల మమ్మా!"

"ఇక్క డెంతోకాల ముండుటకు వీలులేదమ్మా! పూరి చాలా దూరమున్నది. మా అబ్బాయి దేహస్థితినిబట్టి చిన్న చిన్న మజిలీలు చేసికొనుచు వెళ్ళవలెను. పూరి వెళ్ళుటకు పదియేను దినములు పట్టునని చెప్పుచున్నారు. అటువంటి యాత్ర వెళ్ళదలంచుకొన్నప్పుడు దారిలో ఆగుటకు వీలెట్లుండును?"

ఈ విధమున నెడతెంపులేని యీ సంభాషణము రాత్రి ప్రొద్దుపోవువఱకు జరుగుచుండఁ జూడవచ్చిన స్త్రీలొక్కొక్కరుగా జారిరి. అప్పుడు కిశోరునితల్లి వంట యింటికిఁ బోయెను. ఒకతెమాత్రము వెళ్ళక కనిపెట్టికొనియుండెను. అది పదునాలుగు, పదియైదు సంవత్సరముల వయస్సుగల బాగ్దిజాతి బాలిక. అది తక్కువజాతిది గావున లోపలికి వెళ్ళలేక గుమ్మము ముందఱనున్న వసారలోఁ గూర్చుండెను. వర్ధమానపట్టణమునుండి గొప్ప కుటుంబము యాత్ర వెళ్ళుచున్నదని విని యామెగూడ వారినిఁ జూచి దండముపెట్టి పోవుటకు వచ్చెను.

అప్పుడు జగత్కిశోరుఁడు గాఢనిద్రలో నుండెను. గుమ్మమువద్ద నెవరో బాలిక కూర్చున్నదని యెఱిఁగి పక్కవద్దనుండి కాలి గ్రహించి యామెవద్దకుఁ బోయి, కృపారసమొల్కు సౌజన్యపు భాషణములతో నామెను బలుకరించెను.

కాళి యడిగిన మాటల కామె యిట్లనియె.

“అమ్మగారూ! నేను బారిజాతి పేదదానను. మీరు వర్ధమానమునుండి వచ్చుచున్నారని జగన్నాథము యాత్ర వెళ్ళుచున్నారని విన్నాను. అమ్మా! నేను మిమ్ము చూడవలెనని యనుకొన్నాను. నా పెనిమిటి వర్ధమానములోనే పనిచేయుచున్నాడు. నేనిక్కడ పొట్ట గడుపుకొనలేక ఒంటిగా నున్నాను. పెనిమిటి దగ్గఱకు వెళ్ళవలెనని యున్నది.”

“బిడ్డా! నీకథ యేమిటో చెప్పు. సంసారములో బాధలు మనకందఱ కున్నవే. నాచేతి నైనయెడల నేను సాయము చేయుదును.”

“అమ్మగారూ! మీ రెంతో మంచివారు. లేకపోతే బారిజాతిదానితో చనువిచ్చి మాటలాడుదురా? పూర్వము మేము కొంచెము కలిగి యున్నవాండ్రమే. మా నాయన పడమట నుండినాఁడు. అమ్మా! ఈ పట్టణమునుండి సునూరియాకొండ మీరు చూడఁగలరు. అక్కడనే మేము చిన్నపల్లెలో ఉన్నాము. మా నాయన పొలము దున్నుకొని జీవించినాఁడు. నేను చిన్నపిల్లనైనప్పుడు మా యమ్మ నన్ను దీసికొనివెళ్ళి పొలములలోఁ బనిచేయుట నాకు జ్ఞాపకమున్నది.”

“పిల్లా! మీయమ్మ ఆఁడదికదా పొలములో నేలాగునఁ బనిచేయఁగలిగినది?”

“అమ్మగారూ! ఎఱుఁగరు కాఁబోలు. బారిజాతి ఆఁడవాండ్రము గనుక మే మెల్లప్పుడు పొలములలోఁ బనిచేయుచుందుము. మేము హిందువుల స్త్రీల వంటివారము కాము. పొలములలోఁ బనిచేసికొని బ్రదుకుచుందుము. మా మగవాండ్రు నేలదున్నుట మొదలైన మోటపనులు చేయుదురు. తొలకరించిన తరువాత ఊడుపురోజులు వచ్చినప్పుడు ఊడుపుపని మాకు వదలివేయుదురు. బారిజాతి ఆఁడవాండ్రవలె ఆరూఢ్యగలవారు మగవాండ్రలోఁ గూడ లేరు. మేము మోకాలులోతు నీళ్ళలో నిలువఁబడి హోరున వానగురియుచున్నను, పెళ్ళున ఎండకాయుచున్నను ప్రొద్దున సాయంకాలము వంచిన నడుము మెత్తకుండ ఊడ్చఁగలము.”

“అలాగే నేనును విన్నాను. బంకూరాలో బారిజాతివాండ్రు ఎక్కువగా నున్నారు కాఁబోలు?”

"అవును నిజమే. ఈ జిల్లా బారివాండ్రకు నివాసము. తక్కినజాతివారికంటె మా జాతివారే యిక్కడ ఎక్కువయున్నారు. మా నాయన మాజాతిలోకెల్ల మంచివాఁడు. వాఁడు మా యూరికి పెత్తనదారు. వాఁడు నేలదున్నుకొని పన్ను లిచ్చుకొనెను. అమ్మగారూ! అదెల్ల పోఁగొట్టుకొన్నాము"

"ఏలాగున పోయినది ?"

"అమ్మగారూ! ఎలాగునా? పదేండ్ల క్రిందట ఆకాశముమీఁదనుండి వాన ఒకచుక్కైన పడలేదు. అప్పుడు దేశములో గొప్పకఱవు వచ్చినది. మానాయన దుఃఖములో మునిఁగిపోయినాఁడు. వాఁడు బాధ తప్పించుకొనుటకు, పని సంపాదించుకొనుటకు గ్రామము విడిచి వెళ్ళిపోయినాఁడు. వెళ్ళినతరువాత ఒకవారము చూచినాము, ఒక నెల చూచినాము, అతనిజాడ మాకుఁ దెలియలేదు. ఇంటిదగ్గఱ మేము ఉపవాసము చేసినాము. కొన్నాళ్ళు పోయినతరువాత ముసలివాఁ డొకఁడు మానాయన చచ్చిపోయినాఁడని వార్త చెప్పినాఁడు. ఉత్తరదేశములో ఎక్కడో సర్కారువారు కఱవుగొట్టువాళ్ళకుఁ బెట్టినసత్రములో పడి చచ్చినాఁడంట."

"పాపము నీవు చిన్నప్పుడే తండ్రి లేనిపిల్లనైతివి కాఁబోలు ?"

"అవును నాకప్పుడైదేండ్లున్నవి. అప్పుడు మాయమ్మ ఇంటింటికి వెళ్ళిబిచ్చమెత్తి మమ్ము రక్షించినది. దొరకినది తిని లేనప్పుడు పస్తుపండుకొని ఎన్నో నెలలు గడపినాము. ఏదోతిని దినము గడుపుకొనవలెనని మేమెన్నోసారులు కాయలు దుంపలు తెచ్చుకొనుటకు అడవులకుఁ బోయితిమి. అలాగుండగాఁ గొన్నాళ్ళకు కఱవుకాలము వెళ్ళిపోయినది. మంచిరోజులు వచ్చినవి. భాడుదయవల్ల భూములు తెగపండినవి.

"పిల్లా! ఈభాడును మీరు పూజ చేయుదురు కాఁబోలు! అతఁడెవరు ?"

"అమ్మగారూ! మాపంటలు పండించుదేవుఁడే అతఁడమ్మా! మాకన్నము బట్టయిచ్చి తనబిడ్డలలాగున మమ్ము రక్షించువాఁ డాయనే. మాజాతి ఆఁడవాండ్రు పంటకాలములో ఆయనమీఁద రోజారోజా కావలసినన్ని కీర్తనలు పాడుదురు, ఆయనకు మేమెన్నో యుత్సవములు చేయుదుము."

"పిల్లా! ఏపేరుతో పిలచిన నేమి? మీకన్నవస్త్రము లిచ్చి పంటలిచ్చి మిమ్ము రక్షించునట్టి ఆదేవుఁడు మీమొఱ లాలకింపఁడా ?"

"వినకేమితల్లీ ! ఆయన జాలిగుండెవాఁడు. మనమే పాపాత్ములము. పాపములు చేసి మనబాధలు మనమే తెచ్చికొందుము. పంటకాలములో మా మగవాండ్రందఱు తెగ త్రాగుదురు. పండినపంటలు, తెచ్చుకొన్నడబ్బు త్రాగుడు క్రిందనే పాడు చేయుదురు. మామగవాండ్రు సారా త్రాగుట మానుకొనువఱకు మేము హిందువులవలె మంచివాండ్రము కాలేము."

"వాండ్రు త్రాగునది వంటసారాలా ?"

"అవునుతల్లీ ! అదే వాండ్రను పాడుచేసి చంపివేయునది. పూర్వకాలమున వారి వాండ్రు తమ సొంతగ్రామములో మంచి కల్లు తీసికొని త్రాగుచుండెడి వారని మానాయన చెప్పుచుండెడివాఁడు. అది యంతచెడ్డదికాదు. అది తక్కువ యెత్తించినను దానివల్ల బలముకలుగుచుండెడిది. అదొకవిధమైన యాహారమే. ఈ రోజులలో అయిదు మైళ్ళ కొకచోట, పదిమైళ్ళ కొకచోట, సారాదుకాణము. మామగవాండ్రు ఎక్కువ నిషా గల సారా త్రాగుటకే ప్రయత్నింతురు. సారాబలముచేయదు. అది యాహారము కాదు. అది విషము. అది మనుష్యులను జంపివేయును."

"పిల్లా ! నీమాట నిజము. మీవాండ్రు ఎంతశీఘ్రముగా త్రాగుడు మానివేయుదురో అంతమంచిది. హిందువులలో మహమ్మదీయులలోను పంటకాపులను, కూలివాండ్రను చూడు; వారు త్రాగరు. అందుచేత సొమ్ము పోగుచేయుదురు. మీరడవిమనుష్యులు. హిందువులు తురకలు చేసినట్లే మీరుకూడ చేయవలెను."

"మాయమ్మ బ్రతికియున్నప్పుడు ఈలాగుననే చెప్పుచు వచ్చినది. అదినాపెండ్లి చేసినదాక బ్రతికియున్నది. నాపెనిమిటి పెండ్లికాఁగానే మాయూరు విడిచి పోయినాఁడు. నాఁటికి నేఁటికి మరలఁగనఁబడ లేదు. పాపము నాతల్లికూడఁ జచ్చిపోయినది. నేనిప్పుడేకాకిని. దిక్కువరును లేరు." అని యాపేద బాలిక చీరమొగముపై వైచికొని యేడ్చెను.

"పిల్లా! ఎందుకేడ్చెదవు? నిజముగా నీపెనిమిటి బ్రతికియున్నాఁడా? నీకతఁడు కనఁబడునా?"

"అమ్మగారూ ! బ్రతికియున్నాఁడు. వర్ధమానములో నున్నాఁడు అని వర్ధమానమునుండి వచ్చినమనుష్యులు చెప్పినారు. అతఁడక్కడ కాపుర ముండఁబోలు.

అందుచేత నన్ను మఱచిపోయెదరేమో? అమ్మగారూ! మీరు తిరిగి వర్ధమానము వెళ్ళుదురు కదా? ఈపేదదాని యవస్థ కొంచెము మనస్సులో జ్ఞాపక ముంచుకొంటిరా మీవల్ల నా కెంతో సాయమగును."

"పిల్లా! నాచేత నైనపక్షమున అలాగే చేసెదను. నీపెనిమిటి నిన్ను రమ్మని కోరినపక్షమున నీవు వర్ధమానము వత్తువా?"

"అమ్మగారూ! తప్పక వచ్చెదను. ఈ యూరిలో నా మొగము చూచువారే లేరు. నేను బంకూరావటకు నడిచి వచ్చినాను. ఈపైకి వెళ్ళలేను. నాదగ్గఱ డబ్బులేదు. పైగా నా పెనిమిటి నన్ను గుర్తుపట్టునో లేదో. మీరు వర్ధమానము తిరిగి వెళ్ళినతరువాత ఈ పేదబారిదానిమాట కొంచెము జ్ఞాపక నుంచుకొంటిరా మీ కెల్లప్పుడు బాగుండవలెనని దేవునకు దండములు పెట్టుకొందును."

"ఇటువంటి మంచికోరికలు కోరినందుకు దేవుఁడు నిన్ను రక్షించును. పేదవాండ్ర మొఱలు భగవంతునకు దేవాలయములలో మంత్రములకంటె ముందుగా వినబడును. పిల్లా! ఈరూపాయి పుచ్చుకో. మేము జగన్నాధమునుండి వచ్చువరకు ఈరూపాయి ఖర్చు చేసికొని బ్రదుకు. నా పేదబాకీస్నేహితురాలిని నేనుమరచిపోనులే."

---

## పందొమ్మిదవ ప్రకరణము

### అడవికోట

మాండవనాం డాబాటసారులగుంపు రమారమి యెదుగంటలు దీర్ఘప్రయాణము చేసి విష్ణుపురము జేరెను. ఈయూరుచిరకాల మొకచిన్న రాజ్యమునకు రాజధానియై యుండెను. ఇప్పు డది యొకకుగ్రామము. అందలికోట యడవిలో మాటుపడియున్నది. చుట్టు నున్న కందకము నానావిధములైన మొక్కలతో నిండియున్నది. పురాతన దేవాలయములు, రాచనగళ్ళు నాశనములైనవి. ఉన్నతములైన బురుజు, విశాలములైన ద్వారములు నాశనములో సైతము ఒకవిధమైన గాంభీర్యమును జూపుచుండును. హిందూదేశ మిప్పటికి నిట్టిపాడుకోటలతో నిండియున్నది. ఇవియన్నియుఁ బూర్వపు

రాజుల యౌన్నత్యమును, బరస్పర యుద్ధములను జ్ఞప్తికిఁ దెచ్చుచుండును అటువంటి పాడుప్రదేశములలో విష్ణుపురములో మనస్సునకు నచ్చునదిగంభీరమైనది మఱియొకటిలేదు.

ప్రశాంతమైన యీగ్రామమునందు హిందూస్థాన్ మేజస్ట్రీటొకఁడు కచేరితీర్చి యుండెను. అతఁడు పూర్వము జగత్కిశోరరాయుల నెఱిఁగి యుండుటచేత సకుటుంబముగా నాయన 'జగన్నాథయాత్ర' వెళ్ళుచున్నవార్త విని, వారిని సగౌరవముగాఁ దన యింటికిఁ దోడ్కొనివచ్చి వారికి సకలసౌఖ్యములు కలుగునట్లేర్పాటుచేసెను. అతఁడు ప్రత్యేకముగా స్త్రీల కొకగది యిచ్చి రోగికి మరియొకగది యేర్పాటుచేసెను. మరియొకగది లేకపోవుటచేత నారాత్రి శరచ్చంద్రునిఁదనగదిలోనే పండుకొనఁబెట్టుకొనెను.

సాయంకాలము చల్లఁబడినతోడనే మేజస్ట్రీటు శరచ్చంద్రుని దోడ్కొనిపోయి పాడుకోట చూపెను. అది పూర్వము పెద్దపట్టణము. దానిచుట్టు రమారమి యేడుమైళ్ళప్రాకారముండెను. నడుమనడుమ బురుజు లనేకములు గలవు. ఈచుట్టు గోడల లోపల పట్టణముండినది. పాడుపడుచున్న యిటుక మేడలు మిద్దెలిప్పటికినిఁ గానఁబడుచున్నవి. ఈపాడుపట్టణములో సగము పాడుపడి, యడవిమొక్కలతో నిండినదేవాలయము లెన్నోగలవు. శోధించి త్రవ్వి వెదకువారికిప్పటికి గొప్పగొప్ప ధాన్యపుగాదులు కట్టినచోట్లు కనఁబడును. సమీపారణ్యములోఁ బంద్రెండడుగులన్నరపొడవు గలిగి పదియొకండంగుళముల పాతికకైవారముగలకన్నము గలిగిన ఫిరంగియొకటి యున్నది. ఈఫిరంగి సగమిసుకలోఁ గప్పఁబడియున్నది. కాని రెండువందలయేండ్లనుండి గాలితాకులు, వానదెబ్బలు తగిలినను లోహము త్రుప్పుపట్టలేదు. చేతి చెడిపోలేదు.

ఆవనప్రదేశములలోఁ దిరిగి, లోపలిపట్టణముయొక్క సింహద్వారముదాటి వెళ్ళునప్పటికి వెనుక ననేకశతాబ్దము లాపట్టణమేలిన రాజులవంశజుఁ డొకఁడు శరచ్చంద్రునకుఁ గనఁబడెను. అతఁడిప్పుడాస్థలమందే కాపుర ముండెను. కాని రాజ్యహీనుఁడై, దీనుఁడై యుండెను. పూర్వమతిప్రబలమై యుండిన రాజవంశముయొక్క మొలకయై, శిథిలమైన తమ పూర్వరాజధాని యొక్క పాడుగోడలలోనే వసించుచుండిన యాపేదపురుషునిఁ జూచి యాతని పితృపితామహుల యాత్మ లెంతశోకించుచున్నవో కదా! విష్ణుపురరాజ్యము దానికి సంబంధించిన భూములుగూడ నన్యాక్రాంతములైనవి. అందుచేత జగమెల్ల మఱచిపోయిన యారాజవంశముయొక్క సంతతివాఁడగు నీపురుషుఁడు దారిద్ర్యముతో దినములు వెళ్ళఁబుచ్చుచుండెను. బ్రిటిషు గవర్నమెంటువారతని కొక చిన్న యుద్యోగము

నిచ్చిరి. మూర్ధాభిషిక్తులవంశస్థుఁడైన యాపురుషుఁడు ప్రస్తుత ప్రభుత్వమువారనుగ్రహించి తనకుఁ జేసినమహోపకారమున కెంతయుఁ గృతజ్ఞుఁడగుచు, దినమంతయుఁ బాటుపడి తనయుద్యోగధర్మమును శ్రద్ధతో నెరవేర్చు చుండును.

ఆచిన్న యుద్యోగస్థునిఁ జూచి శరచ్చంద్రుఁ డెంతో జాలిపడెను. అతనిని మేజస్ట్రీటు రాత్రి తన యింటికి భోజనమునకు రమ్మని పిలిచెను. మూఁడు దినములు ప్రయాణము చేయునప్పటికి జగత్కిశోరుని దేహస్థితి యెంతో బాగుపడెను. మేజస్ట్రీటు పూర్వరాజవంశపు సంతతివానిని వెంటఁబెట్టుకొని సాయంకాల మింటికి వచ్చునప్పటికి కిశోరరాయలు పడకకుర్చీమీఁద గూర్చుండెను.

వారు రాఁగానే యతఁ డిట్లనియెను. "ఈపూర్వసంస్థానముల చరిత్రలు కనుగొన వలెనని నాకభిలాష మెండు. కాని యాపాఁతకోటగోడ లన్ని చూచుటకు నాకు శక్తి లేదు. ఇటువంటి యుత్కృష్టహాతిశేషములు గలరాజవంశములు బంగాళాదేశములో మిక్కిలి స్వల్పములు."

అనవుఁడు రాజవంశస్థుఁడు "మామీఁద మీ కెంతోదయ యుండుటచేనట్లను చున్నారు. మామందిరములు నేలమట్టములైనవి. మాదేవాలయములు దిబ్బలగుచున్నవి" యని పలికెను.

"ఈపాడుదిబ్బలే మీవంశముయొక్క గొప్పతనమును జ్ఞాపకము చేయుచుండును. రెండువందలయేండ్లక్రిందట వర్ధమానరాజకుటుంబము, వీరభూమి రాజకుటుంబము, విష్ణుపుర రాజకుటుంబము బంగాళానవాబుక్రింద విశేషరాజ్యములు సంపాదించి గొప్ప ప్రభుత్వ ములు చేసియుండెననియు, నందులో విష్ణుపుర మెవరికిఁ దీసిపోక విశేషప్రఖ్యాతిఁ బడసె ననియు వింటిని."

"మీరట్లనుకొనవచ్చును గాని వర్ధమానవీరభూమి సంస్థానములను మాసంస్థాన ముతోఁ బోల్చి జూచినప్పుడు నిన్న మొన్నటివి."

"మీసంస్థాన మంతపురాతన మైనదా? దానిచరిత్ర మీనోట న వినవలెనని కుతూ హలపడు చున్నాను. ఎందుచేత ననఁగా దానిపూర్వవైభవము చక్కఁగాఁ దెలిసినవారు, చెప్పగలవారు మీరే."

"అయ్యా! ఆచరిత్ర మిక్కిలిదీర్ఘమైనది. అదియుంగాక మావంశచరిత్రనే చెప్పుకొనుట భావ్యము కాదు."

"కాదు కాదు. నేను మీవలననే వినఁగోరుచున్నాను. నేను కుర్చీమీఁదఁ గూర్చుండఁగలిగి చాలకాలమైనది. పుట్టెడురోగపడి లేచినవాని కించుకవినోదముం గలిగించుటకై యీపురాతనచరిత్ర నాకెఱిఁగింపుఁడు. ఒకగంటకాలము దీనిక్రిందఁబోవును. అంతలో మీభోజనముకూడ సిద్ధమగును. నాకు నిద్రవేళకూడనగును."

రాజవంశస్థుఁడు తనవంశచరిత్రము చెప్పుటకది నూరవపర్యాయమైనను విసుగులేక చెప్పఁదొడఁగెను. జగత్కిశోరుఁడు కుర్చీమీఁదఁజేరఁబడి వినెను. ప్రాచీనవైభవసూచకము లగు జీర్ణశేషములను శరచ్చంద్రుఁ డప్పు డప్పుడే చూచి వచ్చుటచేత మిక్కిలి తమకముతోఁ జెవి యొగ్గి సావధానుఁడై గురువు చెప్పు పాఠము విను విద్యార్థి వలె శ్రద్ధతో నాలకించెను. పూర్వకాల చరిత్రలువిను కుతూహలమున జగత్కిశోరుని తల్లియు భార్యయుఁ దెరచాటునఁ గూర్చుండిరి.

అతఁడు కథ యిట్లు ప్రారంభించెను.

"మావంశ చరిత్రము పుక్కిటిపురాణములతో నిండి యున్నది. కాని మాసంస్థానపు గాథలలో నెట్లున్నదో యట్లు చెప్పెదను. అంతయు విన్నతరువాత కల్పితకథ లేవో, సత్యచరిత్ర లేవో మీరు తెలిసికొనవచ్చును.

వందలకొలఁది సంవత్సరముల క్రిందట ఉత్తరహిందూదేశమందలి మధురాపుర ప్రాంతములయం దుండెడియొకరాజు పూరీక్షేత్రమునకు యాత్రార్థమైవచ్చెను. అతఁడు తిరిగి పోవునప్పుడు దైవవశమున గర్భవతి యగు నతనిభార్య దారి తప్పిపోయి యేకాకినియై సంచరించి యొకచెట్టు క్రింద ప్రసవమై కుమారునిఁ గనియెను.

కనినతోడనే యామె చనిపోయెను. ఏవిధమునఁ జనిపోయెనో యెవరికినిఁ దెలియదు. పసిపిల్లవానిని కౌస్మితియాన్గి యనుకాఁపువాఁడు తీసికొనిపోయి సంరక్షించి తనకొడుకట్లు పెంచుకొనెను. పిల్లవాఁడు క్రమక్రమముగాఁ బెరిగి పెద్దవాఁడయ్యెను. ఈ ప్రాంతముల వసియించు బ్రాహ్మణుఁ డొకఁడు బాలకునిఁ దనసేవకునిగాఁ దీసికొని పసులకాపరిఁజేసెను.

ఆచిన్న పసులకాపరి యానాటున నున్న వాగ్దిజాతి పిల్లలతో నాడుకొనుచుండెను. ఒకనాఁడతఁడు వనములోఁ దిరుగుచు, దారితప్పి యింటి కరుగులేక యలసి సొలసి నేలఁ బండుకొని నిద్రపోయెను. చెట్లయాకులసందునుండి సూర్యరశ్మి యతని ముఖముపైఁ బడెను. స్నేహితులు వానిని వెదకికొనుచు నచ్చోటికి వచ్చిరి. వచ్చిచూచు నప్పటికి ద్రాఁచుబా మొకటి నానావర్ణములుగల తన పడగ విప్పి బాలున కెండదగుల కుండ గొడుగుగాఁ బట్టెను. ఇది మహారాజ చిహ్నమగుటచే నది చూచినవారందఱు ముందుముం దితఁడు రాజు కాఁగల డని నిశ్చయించిరి.

ఆ బాలునిపేరు రఘునాధసింగు. అంతలో నీదేశ మేలుచున్న ముసలిరాజు మృతినొందెను. అతని కుత్తరక్రియలు మిక్కిలి గొప్పగాఁ జేయఁబడెను. అవి చూచుటకు జనులు గుంపులుగుంపులుగా బోయిరి. చూడవచ్చిన జనులలో రఘునాధుఁడొకఁడు. అప్పుడు రాచయేనుఁగు జనసమూహ మధ్యమునకుఁబోయి తొండముతో నా బాలకు నెత్తి ముసలిరాజు మృతిచేత శూన్యమైన సింహాసనమునఁ గూర్చుండఁబెట్టెను. అప్పుడు జనులయుక్కజ మేమిచెప్పుదును? బ్రహ్మాండము ప్రతిధ్వనించునట్లు జనులందఱు ప్రతిధ్వనులు చేసిరి. అంతట మంత్రులు సామంతులు రఘునాధుని రాజుగా నెన్నుకొనిరి. పట్టాభిషేక సమయమున నతఁడాదిమల్లుడని బిరుదువహించెను.

కథ సాయంకాలము ప్రొద్దుపోవువఱకు జరిగెను. ఆకథకుఁడు రఘునాధుని యనంతరమున సింహాసనమునకు వచ్చిన రాజులను గుఱించి చెప్పి, వారు యుద్ధములు చేసిన తెఱంగు, నిరుగుపొరుగురాజుల గెల్చినవిధంబు, రాజ్యమును నలుదెసల వ్యాపింపఁ జేసిన భంగియు వర్ణించెను. అనేకాటవికజాతులతోడను, పురాతన మహారణ్యముల తోడను నిండియుండిన యా ప్రాంతభూముల కన్నిఁటికి విష్ణుపురరాజులే ప్రభువులై యధికారము చేసిరి.

శతాబ్దము తరువాత శతాబ్దము వచ్చెను. కాని యా వంశముయొక్క మహాధికారము రవంతయు సడలక నానాఁటికి దృఢమయ్యెను. బంగాళాదేశమును బాలించిన యాఫ్ఘను ప్రభువులు సరిహద్దులలో నున్న యీ సంస్థానముపేరే యెఱుఁగరు పటానుల విజయధ్వజమెన్నఁడు విష్ణుపురముఁ జొచ్చి యెఱుఁగదు. బహుదేశ పరివ్యాప్తమై, క్రమసన్నాహ సమేతమైన మొగలాయి చక్రవర్తుల యధికారము దాదాపుగ నుత్తరహిందూస్థానమం దంతట నాటఁబడెను. మహాపురుషుఁడైన యక్బరు చక్రవర్తి పదియాఱవ శతాబ్దమున హిందూస్థానమును బాలించినపుడు చక్రవర్తియొక్క

బంగాళాదేశ ప్రతినిధికి విష్ణుపుర సంస్థానము పేరునకు మాత్రము. కొంచెము కప్పము కట్టెను. కాని మొగలాయిరాజ్యము నానాఁటికి క్షీణింపఁగానే వారి సరిహద్దులలోనున్న విష్ణుపురరాజ్యము మఱల నొకసారి విజృంభించి సంపూర్ణస్వాతంత్ర్యము ననుభవించెను.

తరువాతి పదునెనిమిదవ శతాబ్దమున మా వంతువచ్చినది. తత్క్షణమున మహారాష్ట్రులు విజృంభించినపుడు ఫలవంతములైన బంగాళాదేశపు బయళ్ళను జయించుటకై యరణ్యమార్గద్వారమున రఘోజీభాన్స్లే యసంఖ్యాకములైన తన గుఱ్ఱపు దళములను బంపెను. మేము మడమదిరుగక నిలిచితిమి. ఎన్నిసారులో పోరాడితిమి. కొండదారులు కాచుటకై కాపరుల నియమించితిమి. వారి పేరు ఘాట్వాలాలు. ఆదినములలో మహారణ్యము లహర్నిశము యుద్ధరవములచేఁ బ్రతిధ్వను లిచ్చెననియు కూసీనదీతీరమందలి దట్టంపుటడవులయందు, మఱి యితర వనములందును బలుమాఱు సందడికయ్యములు జరిగిన వనియు పెద్దలు చెప్పుదురు.

రఘోజీభాన్స్లేయొక్క సేనాపతి యగు భాస్కరపండితుఁ డొకనాఁడబ్బాటుగ విష్ణుపురద్వారములవద్ద సైన్యసమేతుఁడై నిల్చెనఁట. అప్పుడు మేము కోటతలుపులు మూసితిమి. బురుజులమీఁద మనుష్యుల నెక్కించితిమి. ఫిరంగులుదట్టించి బారుచేసితిమి. ఆఫిరంగులలో నొకటి నేఁటికిసైతము భూమిలో సగము కప్పఁబడియున్నది. మహారాష్ట్ర సేనానాయకుఁడగు భాస్కరపండితుఁ డా ఫిరంగిదెబ్బ తగిలి రణరంగమున బడి చచ్చెనఁట. అది నిజమే.

కాని మహారాష్ట్రులు భయంకరశత్రువులు. వారితోఁ బోరాడుట కష్టము. ఏలయన మరాటి గుఱ్ఱపురౌతులు మెఱుపుతీగెలు, లేడిపిల్లలు. వారు మావలెనే కొండకనుమ లన్నియు నెఱుఁగుదురు. వారికి దెలియనిగొందులు లేవు. ఉప్పెనవలె వారు విజృంభించి వచ్చి వెంటనే మాయ మగుదురు. అయినప్పటికి మేము వెనుకంజ యిడక ఱాళ్ళవలె నిలిచితిమి. ఏలయన మా బురుజులు గట్టిగానున్నవి. ఫిరంగులు కాల్చువారు గురి తప్పని వారు. మా శత్రువులు మహారాష్ట్రులు మాత్రమే కారు. మాకు సహజశత్రువైన వర్ధమాన సంస్థానముతోఁ గూడ మేమనేక యుద్ధములు చేయవలసివచ్చెను. మహారాష్ట్రులు మాపై నెత్తివచ్చినప్పుడు వర్ధమానరాజు సమయముదేయని మానాశనము నిమిత్తము వారితోఁ గలసి కుట్రఁజేసెను. ఇట్లనేక శతాబ్దములు ప్రభుత్వముచేసి విష్ణుపురసంస్థాన మిద్దఱు విరోధుల యిరుకునఁ బడి నశించినది. విస్తీర్ణమైన మా సంస్థానము కొంతవఱకు వర్ధమాన ప్రభువుల పాలఁబడెను. తక్కినది శత్రుప్రభువులు పంచుకొనిరి. మా వంశము

యొక్క యధికార మంతరించినది. మారాజధానియొక్కయు కోటగోడలయొక్కయు శేషములు వాని పూర్వవైభవమును మాత్రము చాటుచున్నవి."

శరచ్చంద్రుఁడు చెవులు దోరఁబెట్టుకొని వినెను. కాని యారాజవంశస్థునికథ జగత్కిశోరుని నిద్రపుచ్చెను.

---

## ఇరువదవ ప్రకరణము.

### బంధుగృహము.

రెండుదినములు ప్రయాణముచేసి యాబాటసారులు మిధునపురము జేరిరి. మిధునపురము మిధునపురమండలమునకు ముఖ్యపట్టణము. చుట్టుప్రక్కల నుండు పల్లియలలోని జనంబు లదరిపడునట్లు బోయలు శ్రమనివారణార్థము విసుగు లేక చేయునోంకారధ్వనులతోఁ బల్లకులు పట్టణసమీపము చేరునప్పటికి మెరియలవంటి దృఢకాయు లాఱుగురు మనుష్యులు ప్రక్కదుకాణము మీఁదనుండి వచ్చి పల్లకుల కడ్డముగ నిల్చి యాగవలసినదని కేక వేసిరి వారి మోటువాలకములం బట్టియు, వారు చేతులం దాల్చినదుడ్డుకఱ్ఱలం బట్టియు విచారించితిమా పూర్వకాలమున వారు దారులుగొట్టు దొంగ లనుకొనుట కేవిధమైన సందియ ముండదు. కాని దినములు మారిపోయినందున వారు దొంగలు గాక, మిధునపురవాసులలో ముఖ్యపురుషుఁ డగు బిపినబిహారిదత్తుయొక్క సేవకులై యుండిరి.

వర్ధమానపురవాసి యగు జగత్కిశోరరాయలకును, మిధునపురవాసి యగు బిపినబిహారిదత్తునకును ముఖపరిచయము లేదు కాని యొకరిపేరొక రెఱుఁగుదురు. అంతియె గాక వారిద్దరు కాయస్థశాఖలోనివా రగుటచే నేదోమూల వారికి బాంధవ్యము కలిసి యుండునని వారు నమ్మియున్నారు. జగత్కిశోరరాయలు మిధునపురమునకు వచ్చునట్టి దినము శరచ్చంద్రుఁడు ముందుగా బిహారిదత్తునకుఁ దెలియజేసి తగినబసయు గావలసిన యేర్పాటులు చేయవలసిన దని వ్రాసెను. అందుచేతనే బిహారిదత్తుయొక్క సేవకులు యజమానుని యాజ్ఞప్రకారము బాటసారులను దత్తుగారి విశాలగృహమునకు దీసికొని పోవుటకై వచ్చిరి. బిహారిదత్తు కిశోరరాయల నిమిత్తమై ముందుగ మంచము పఱుపు

వేయించి వీధిగుమ్మమువద్ద నిలిచియుండి పల్లకి రాగానే కిశోరరాయులను జేయూత యిచ్చి దింపి మెల్లగాబాన్పుజేర్చి, స్త్రీలనిమిత్తమై యేర్పడినగదులలోనికి జగత్కిశోరుని యాడువాండ్రను దీసికొని పోవలసినదని తనదాసీజనము నాజ్ఞాపించెను. వారందఱు కొంచెము విశ్రమించి ఫలాహారము తిని కూర్చుండిన తరువాత దీపములు పెట్టిరి. అప్పుడు విహారిదత్తు స్వభావమధుర మైన శీలముతో గుశలప్రశ్న చేయుటకై వారికడకుబోయెను.

"అమ్మా! పూరీయాత్రకుఁ బోవుచు మీరు మాపట్టణమును మాగృహమును పావనము చేసినందుకు నాకు మిక్కిలి సంతోషముగా నున్నది. నేను మీకుమారుని గుఱించి విశేషముగా వినియుంటిని. వర్ధమానములో నింతటి గొప్పస్థితిలో మఱియొకరు లేరు. ఆయనను చూడవలెనని చిరకాలమునుండి కోరుచుంటిని. నాయదృష్టముచేతనే ఆయనయిక్కడకు విజయము జేసిరి. మీరు నాయిల్లు మీయిల్లుగా భావించి కొంతకాల మిక్కడ నుండవలెనని కోరుచున్నాను." అని యతఁడు రాయుల తల్లినుద్దేశించి పలికెను. అప్పుడు నామె మేలిముసుఁగు వైచికొని యిట్లనియెను.

"నాయనా! నీవు మిక్కిలి మంచివాఁడవు. మామీఁద నెంతో దయఁ జూపితివి. నీకిటువంటి శ్రమ కలుగఁ జేయవలెనని తలఁచుకొన లేదు. మేము మిథునపురములో నొక్కరాత్రిమాత్రమే నిలువఁ దలఁచితిమి. ఆరాత్రికి మీయింటిసమీపమున నేదో బసకుదురు ననుకొంటిమిగాని నీవిబ్బందిపడి మీయింటిలోనే బసయేర్పఱుతు వనుకొనలేదు."

"అమ్మా! ఏదో బసా? మాపట్టణముగుండ మీరు ప్రయాణము చేయుచున్నప్పుడు మీ కేదో అద్దెకొంప తగినబస యగునా? నేను కొంపకట్టుకొని గ్రామములో కాపురము చేయుచుండఁగా నాకుఁ గలిగిన కొంతగంజియన్నము పెట్టఁగలిగి యుండఁగా మీరు నాయింట బసఁజేయక వేఱొకచోట దిగినపక్షమున నాగృహమున కపమానము గాదా? నాకుటుంబమున కప్రతిష్ట కాదా? [illegible]"

"[illegible] కాని నాయనా! నీవును నాకు కుమారుఁడవే. [illegible] [illegible] [illegible] [illegible] రాయల [illegible] నాయనా!"

"అమ్మా! [illegible] నీకొడుకు మంచియారోగ్యము కలిగి [illegible] వెళ్ళును. మునుముందుకు మహోన్నత మైనదశ [illegible]. మా కుమారునితోఁ [illegible] వచ్చిన శరచ్చంద్రుఁడు గొప్పవాఁడు. [illegible] అని యతని

మొగముమీఁదనే వ్రాసియున్నది. అమ్మా! ఆశరచ్చంద్రునిఁజూచినప్పుడు మాతమ్ముఁడు భీరాముఁడు జ్ఞాపకము వచ్చెను. అచ్చముగా నితనిది వాని వయస్సే. అతనివలెనే యితను గూడ మిక్కిలి మంచివాఁడు. కలకత్తాలో వీరి కిద్దఱకు పరిచయము గల దని నానమ్మకము."

"నాయనా! వారిద్దఱు దీర్ఘాయుష్మంతులై పరిఢవిల్లవలె. నేనుచూచినంత వఱకు శరత్తు మిక్కిలి జాలిగుండెవాఁడు. ఈ ప్రయాణములో నాకతఁడు కుమారునికంటె మిక్కిలిగా సకలోపచారములు చేసినాఁడు. కాని పడుచు పిల్లవాండ్రకుఁ గలకత్తా నగరము మిక్కిలి యపాయకరమైనస్థలము. కాలేజీపిల్లలు తాము చేయుచున్నపని యేమో తెలియక నడుచు చుందురు. ఎందుకు? మీ తమ్ముఁడు నీవు వెళ్ళినాఁడు కాదా, అతఁడు వచ్చిన తరువాత కులములో చేరునా? భగవంతుఁడు పరిపాలించవలె నాయనా! నాటికి నాళ్ళు చావుకొనియున్న నావంటిముసలిది యింక నెన్నాళ్ళు బ్రతుకఁగలదు. ముందుముందెట్టి విధ్వారములు పుట్టునో చెప్పలేము."

"అమ్మా! విచారించవద్దు. ఆ విషయమై బెంగపెట్టుకొనవద్దు. కుఱ్ఱవాండ్రెప్పుడు కుఱ్ఱవాండ్రె. వాండ్రు తమకుఁ దోఁచినట్లుగాని చేయరు. వారు మంచివారై సరిగా నడుచుకొన్న పక్షమున దేవుఁడే వారికి సాయము చేయును. అమ్మా! నామాటనమ్ము. శరచ్చంద్రుఁడు దేశమున కెల్ల కారుఁడై గొప్పవాఁడై యుండఁగా నీవు చూచెదవు. అంత వఱకు నీవు బ్రతికియుందువు. మా తమ్ముఁడు దేశస్థులలో మొదటివాఁడై పేరుప్రతిష్ఠలు సంపాదించువరకు మాతండ్రికూడ జీవించి కుమారునివైభవము చూచునని నా నమ్మకము. అమ్మా! వారు వెఱ్ఱిచేష్టలు చేసినను పెద్దదానవు. వారినాశీర్వదింపుము. సజ్జనుల యాశీర్వాదములు వ్యర్థములు కావు."

"నేను వారిని మనఃపూర్తిగా దీవించెదను. భువనేశ్వరుఁడైన జగన్నాథస్వామి శరచ్చంద్రుని, మీ తమ్ముని దీర్ఘాయుష్మంతులను జేయుఁగాక! వారు వృద్ధిలోనికి వచ్చి సుఖపడుదురు గాక!"

"అమ్మా! మీరిక్కడ కొన్నిదినము లుందురు గాదా? రాణిగంజినుండి చాల దూరము వచ్చినారు. జగన్నాథము మీఁదవచ్చినంతకంటె ఎక్కువ దూరమున్నది."

"నాయనా! మే మైదుదినములనుండి ప్రయాణము చేయుచున్నాము. మేము త్వరలోనే వెళ్ళవలెను. అందువలన రేపు ఉదయమే బయలుదేరవలెనని యనుకొనుచున్నాము."

“అమ్మా! అలాగనవద్దు. ఐదుదినములు ప్రయాణము చేసినతరువాత మీకుమారుఁడు కొంచెము విశ్రమింపవలెను. మిధునపురములో నెన్నో దేవాలయములున్నవి. తీర్థవాసు లిక్కడిదేవతలను దర్శింపకుండ వెళ్ళరు. అదనుపక్షము రెండుదినములైన నిలిచి యిక్కడ దేవాలయములను క్షేత్రములను చూచి పొండు. ఈ రెండుదినములలో శరచ్చంద్రునకు మాపట్టణములోఁ జూడవలసిన చోట్లు చూపెదను. మీకుమారుఁడును రెండుదినములు విశ్రమించిన పిదప సంపూర్ణదార్ఢ్యము కలిగి ప్రయాణము సులభముగాఁ జేయఁగలఁడు,”

అతని కోరికప్రకారము వారు రెండుదినములు నిలిచిరి. మరునాఁ డుదయమున బిహారీదత్తు శరచ్చంద్రుని దన గుఱ్ఱపుబండిమీఁద నెక్కించుకొని షికారు తీసికొని పోయెను. మిధునపురములో నున్నట్లు బండిషికారున కను వైనతావులు బంగాళా దేశములో మఱియొక పట్టణములో లేవు. ఎందుచేత ననఁగా జిల్లాలో సగముకంటె నేల. కాఁబట్టి బాటలు మెత్తగ నుండును. పశ్చిమభాగమునఁ జాల దూరము పోయినతరువాత గంకరబాట నిమ్నోన్నత ప్రదేశమున వేయఁబడుటచే నొకచో నెత్తుగ నొకచోఁ బల్లముగ నుండును. చుట్టుప్రక్కల స్థలము లడవివాలకము కలిగియుండును. ప్రశాంతి లేనిపూర్వకాలమున నెవఁడో యొకానొక రాజు కొండమీఁద కట్టినయొకకోట యాపాడుచోటున కొక వింతగౌరవము గలిగించు చుండెను. ఆకొండక్రింద “కూసీ” నది శిలాసైకతమయమైన తన గర్భముమీఁద గలగల ప్రవహించు చుండెను. బిపినబిహారీదత్తు మిధునపురవాసులలో ప్రధాన పురుషుఁడు. అప్పటిగవర్నరు జనరలుగారగు రిపన్ ప్రభువుగారు విశ్వాసపాత్రము లయినజనులమీఁద పట్టణపరిపాలనాభారము కొంతనిలిపి క్రొత్తకక్షులఁ గొన్నిటి నేర్పఱిచి యుండిరి. దత్తు నిర్వహించు చుండినకార్యభారము లనేకములు గలవు. మిధునపురము మునిసిపాలిటీకి బిహారీదత్తు చేర్మన్ గా నియమింపఁబడుటచే నతనిపై మఱియొక క్రొత్తభారము పడెను. షికారువెళ్ళి తిరిగి వచ్చునప్పు డతఁడు మ్యునిసిపల్ కచ్చేరివద్ద నాగెను. ఆజిల్లాలోని యూరోపియన్ మేజస్ట్రేటు ప్రాతఃకాలమున షికారు వెళ్ళి తిరిగి వచ్చుచుండెను. అప్పుడు బిహారీదత్తు ఆయనను జూచి పలుకరించెను.

ఆజిల్లామేజస్ట్రీటునకు బిహారీదత్తుమీఁద నిష్టము, గౌరవము కలదు. అందుచేత నతఁడు గుఱ్ఱము దిగి మ్యునిసిపల్ కచ్చేరి పరీక్షించుటకును నించుక సేపు సల్లాపము సేయుటకును లోనికి వెళ్ళెను.

"దత్తూ! ఈ నడుమ హిందూదేశమునందుఁ బ్రతిభాగమున గొప్పయుత్సవములు చేయుచున్నారని పత్రికలలోఁ జదువుచున్నాము కాదా?"

"ఔనయ్యా! హిందూదేశవాసులు కృతజ్ఞులు. వారి మేలుకొఱకు పాటుపడు నట్టి యుదారశీలునియెడఁ గృతజ్ఞులయి గౌరవ మెట్లు చూపవలెనో వారెఱుఁగుదురు. రిపన్ ప్రభువువలె జనులహృదయానురాగములు వడసిన రాజప్రతినిధి యీ తరమున లేఁడు. అట్టి మహాపురుషుఁడు హిందూదేశము నుండి వెళ్ళిపోవుసమయము సమీపించుచున్నది. గావున ప్రజలు తమ విశ్వాసమును దగినవిధముగాఁ జూపఁగోరుచున్నారు"

"ఓ సరిసరి. మఱచిపోయితిని, నీవు రిపన్‌పక్షపాతివిఁ గావా?" యని నవ్వుచుఁ బలికెను.

"అయ్యా! నేను రిపన్‌గారియెడ సంపూర్ణ పక్షపాతినిగాను, సగము పక్షపాతిని. ఏలయన నీమధ్య కలకత్తాలో రిపన్‌గారివిషయమున గొప్పగొప్ప యుత్సవములు జరిగినవి. అవి చూచుటకు వెళ్ళనైతిని కాని నేను నా పిల్లల నంపితిని. కలకత్తానగరములో నిదివరకెన్నఁడు లేనివిధమున వీధు లలంకరింపఁబడెను. బాణసంచ కాల్పఁబడెను. దీపములు వెలిఁగింపఁబడెను. మాపిల్ల లుదయాస్తమయము లదేగొడవఁ జెప్పుకొందురు. వాండ్రసంభాషణ విన మనకెంతో ముచ్చటగును."

"ఈ యుత్సవములేల జరుగుచున్నవో మీపిల్లలకుఁ దెలియునా?"

"అయ్యా! ఏడేండ్లవయస్సుగల చిన్నపిల్ల నొకదానినిఁ బిలిచి ఈ యుత్సవము లెందుకని నేనడిగితిని. "ఎందుకా? రిపన్‌ప్రభువు జనులయెడ దయగలవాఁడని, న్యాయవంతుఁడని, యీయుత్సవములు చేయుచున్నారు." అని యా పిల్ల సందేహింపకుండ పెటీటున నుత్తరము చెప్పెను. ఆయుత్సవము చూచిన మగవాఁడు కాని, యాఁడుదిగాని పసిబిడ్డగాని యీ కారణమేమో యెఱుఁగకుండ నుత్సవముఁ జూచియుండలేదు. అయ్యా! పసిబిడ్డనోటనుండి వెడలిన యాతొక్కు పలుకులు శిలాక్షరములై మాదేశచరిత్రము నలంకరించును"

"రిపన్ ప్రభువు నేఁడు మహానందభరితుఁడై యుండును, [illegible]. ఈ పట్టణమునకు సమర్థుఁడైన మ్యునిసిపల్ ఛేర్‌మనునిచ్చి రిపన్‌ప్రభువు నా కుపకారము చేసినాఁడు. ఈ రిపన్‌ప్రభువువల్ల ఛేర్మనుల నెన్నుకొనుట కధికారమియ్యఁబడిన పట్టణము

ట్ని యు బికినబిహారిదత్తు ంటి సమర్థులనే యెన్నుకొన్న పక్షమున లిపర్ ప్రభువు చేసిన
వ మ్యునిసిపల్ స్వపరిపాలనా వ్యవస్థ సంపూర్ణముగాఁ బ్రయోజనకారి కావచ్చును."

"మీకు నామీఁద దయగలదు కనుక నట్లనుచున్నారు. నా శక్యమైనంతపని
శరీరము దాఁచుకొనక నేను చేయుచున్నాను. కాని, హిందూదేశజనులు పూర్వ
కాలమున బుద్ధికుశలతయం దుఁగాని సామర్థ్యమందుఁగాని కొఱవడినవారు కారు.
ఇంగ్లీషుకళాశాలలలోను, ష ాఠశాలలలోను మూఁడు తరములనుండి చదువుకొని విద్యా
వంతులైన తరువాత కేవ ు మా దేశపరిపాలనావిషయములలో జోక్యము కలుగఁజేసి
కొనుటకు సమర్థులముకాక పా యిన పక్షమున నిజముగా నధమస్థితిలోఁబడి యెందుకుఁ
బనికిరానివారమై పోయితిమని నమ్మవలసినది."

"నీమాటకొంతవఱకు ని జమే. అధికకృత్యములు మీకు మేమప్పగించినకొలఁది
మీవల్ల మేమధికమైనపని పుచ్చు కొనఁగలము. లిపర్ ప్రభువుగారి వ్యవస్థనుబట్టి యేర్పడిన
డిస్ట్రిక్టుబోర్డులకు నెన్నుకొనఁబడి వచ్చిన సభ్యులందఱు పనిచేయుటకిష్టము గలవారై
మిక్కిలి యుపయోగకారులై యు న్నారని నేను చెప్పఁగలను."

"అంతకన్న నెక్కువమాట చెప్పగలను. రాజనీతిలో నిటువంటి యుదారభావ
ప్రదర్శనము జనులమనములలోనున్న యసంతుష్టినిఁ దొలఁగించి హిందూదేశములో
బ్రిటిషుసామ్రాజ్యమును స్థిరముగా సంస్థాపించును. మానవప్రకృతి యెల్లచోటుల నొక
రీతిగానె యుండును. పరిపాలనలోఁ గొంతభాగము మా కప్పగించినయెడల మేము
రాజభక్తిఁ గలిగి రాజ్యతంత్రనిర్వాహణము చేయుదుము. అధికారము లేమియు మా
కొసఁగక మమ్ము దూరముగఁ ద్రోలినపక్షమున మేము రాజభక్తిశూన్యులమై విరుద్ధ
విమర్శకుల మగుదుము. బ్రిటిషు సామ్రాజ్య చరిత్ర మనము చదివితిమా, దేశస్థులను
వ్యవహారదూరులుగఁ జేసినప్పుడెల్ల రాజభక్తిశూన్యత, యసంతుష్టి బయలుదేఱిన వని
మనము తెలిసికొనగలము. వారిదేశవ్యవహారములో వారికిఁ గొంతభాగ మప్పగించినప్పుడు
సంతుష్టి, రాజభక్తి మొదలగునవి తప్పలములై యుండును."

"దత్తూ! నీ వింగ్లాండులో నున్నపక్షమున నీవు గొప్పవక్తవై వేదికలమీఁద
మహోపన్యాసములు చేయఁగల వని నాకుఁ దోచుచున్నది."

"నేను మహావక్తనుగాను. నేనిన్నడు డింగ్లాండు వెళ్ళియుండలేను. కాని,
నాగ్రహింతి ల యే దేశములోను దేశస్థులచేతిలోఁ గొంతవఱకైన వారి దేశపరిపాలనము

లేకపోయిన పక్షమున నది మంచి దొరతనము కాదని నాయభి[ప్ర]ాయము. దేశస్థుల దేశపరిపాలనవిషయమున నది గొంత ప్రవేశ ముంచినగాని యా దేశ[ ]వ్యవహారములు చక్కగా సమర్థింపఁబడవని నానమ్మకము."

"ఇది ప్రశస్తమైన ధర్మవాక్యము. ఉదాహరణలుర ప్రా[...]సిన రయే గ్రంథములో నుండియైనా నీ నీమాట రుజువు తెచ్చితివని నే నెఱుఁగను. వాద[...]ములు విడిచి యథార్థ విషయములు మాటాడుకొందము. మొగలాయిచక్రవర్తులు, మ[...]హారాష్ట్రులు హిందూదేశసామ్రాజ్యము నిమిత్తము పోరాడుకొన్న కాలమునను, ని[...]కరిపెత్తనము లేకుండ, నొకరిసెలవు లేకుండ నెవరికివారె యజమానులై పిండారిమూఁక[...]లు దేశమును కొల్లగొన్న కాలమునను మీదేశములో స్వపరిపాలన ముండెనా?"

"పదునెనిమిదవ శతాబ్దమున హిందూదేశములో జ[...]రిగిన కార్యములను దలఁచుకొనకుము. ఏలయనిన యూరపుఖండమునందుఁగూడ నా[కా]లమున ననేకదేశము లట్లే యుండెను. కొన్ని మాదేశముకంటె హీనస్థితిలో నుండిన[వి]. పందొమ్మిదవ శతాబ్దమున యూరపుఖండములోని దేశములస్థితిగతులు మునుపటి[కం]టె బాగుండుటకుఁ గారణమేమన, ప్రజాసంబంధములుగల ప్రభుత్వములు స్థాపింప[ఁ]బడుటయే. హిందూదేశములో మేముకూడ నటువంటి ప్రభుత్వమే కావలయునని కో[రు]చున్నాము కాని ధర్మగర్భితమైన నిరంకుశాధికార మంగీకరింపము."

"దత్తూ! నీవు తెలివిగల న్యాయవాదివి. నీవు గవర్నమెంటుప్లీడరుగా నుండి నా పనికి మిగులఁ దోడ్పడితివి. యూరపుఖండమ[ము]లోని దేశములు మిక్కిలి హీనస్థితిలో నున్నప్పుడు సైతము స్వపరిపాలన బీజములు కలిగియుండెను. అటువంటి బీజములు మీ హిందూదేశములో మొగలాయీలకాలమ[ు]నను, మహారాష్ట్రుల కాలమునను నున్నట్లు నీ ఉదాహరణములు జూపఁగలిగితివేని నీవింతకంటె నెక్కువ తెలివిగలవాఁడవని నేనొప్పుకొందును."

"మాకు పూర్వము పార్లమెంటులు లేవు. జనప్రతినిధుల సంఘములు లేవు. డిస్ట్రిక్టుబోర్డులు లేవు. కాని దేశములో నున్న సేనాధిపత్యము, పరిపాలకత్వము మొదలయిన గొప్పపదవులన్నియు హిందూసంఘనాయకులకును, మహమ్మదీయ సంఘనాయకులకును సమానముగా నియ్యఁబడుచుండెడివి. జమీఁదారులు వారిసంస్థానములను వారే సరిగాఁ బరిపాలించుకొనెడివారు. గ్రామపంచాయతీలు గ్రామవ్యవహారములను

ఆపలుకులు విని జిల్లామేజస్ట్రేటు నిమిషమాగి యాలోచనపూర్వకముగాఁ మెల్లగ నిట్లనెను. “జత్తూ! నీ మాట సరి కాదని నేను నిశ్చయముగా జెప్పజాలను. ఇంగ్లీషువారొక్కసారి మంచి పనియని దేనినైన భావించినప్పుడు వారు పట్టుదలతో దానిని తుదముట్టింతురు గాని వెనుకకు దిరుగరు. నాగలి చేతబట్టిరా చివరవఱకు వారు దున్నవలసినవారే. మీకు స్వపరిపాలన మవసరమని వారికి నచ్చవలెను. నచ్చెనా, వారిని నాపజాలరు. నచ్చువఱకు వారిని కదపజాలము. ఐనను నేనిది చెప్పగలను. హిందూదేశమునకు స్వరాజ్యము వచ్చితీరును. కాని యిది కాలక్రమమున బ్రాప్తించును. సరే! నేనింక వెళ్ళెదను, సలామ్. మీ కచ్చేరి నేను తనిఖీ చేయలేను. మాటలతో నాలస్యమైనది. నిన్ను జూచినతరువాత మాటలాడక పోజాలను. నీయొద్ద నేదో మంత్రమున్నది. నీవు నన్ను కలిసికొన్నప్పుడు నాకేపనియు దోచదు.”

---

# ఇరువదిఒకటవ ప్రకరణము

## సామంతరాజు

మిథునపురమునుండి బయలుదేఱి రెండుదినములు ప్రయాణముచేసి యాబాలసాములు సువర్ణరేఖానదీతీరమును జేరిరి. ఆనది బంగాళాదేశమునుండి [illegible] దేశమును వేఱుచేయుచున్నది. ఆనదికి నుత్తరమున నున్నవారు బంగాళీభాష మాటలాడుదురు. దక్షిణమున నున్నవారు ఓఢ్రభాష మాటలాడుదురు. ఓఢ్రమనఁగా [illegible] భాష [illegible]లలో నొకటి. పదునాఱవశతాబ్దమున నీనదికుత్తరమున నున్న దేశము పఠానులచే బరిపాలింపబడుచుండెను. కాని, దక్షిణమున నున్న దేశము [illegible] శతాబ్దము తుదవఱకు హిందూరాజులయేలుబడిలోనే యుండెను. అప్పుడు [illegible]లు ఓఢ్రదేశమును జయించిరి. కాని వారు స్వల్పకాలముమాత్రమే పాలించగలిగిరి. ఏలయన, బదునెనిమిదవశతాబ్దమున మహారాష్ట్రులాభాగమును జయించి మరల హిందూరాజ్యమును నెలకొల్పిరి. పందొమ్మిదవ శతాబ్దమున బ్రిటిషువారాదేశమును స్వాధీనము చేసికొనిరి. ఈ విధముగా గడచిన నాలుగుశతాబ్దములలో నీసరిహద్దునేల యనేక మార్పులను ప్రత్యక్షముగఁ జూచెను, హిందువులు మహమ్మదీయులకు, మహమ్మ

దీయులకు మహారాష్ట్రులకు, మహారాష్ట్రులకు బ్రిటిషువారికి జరిగిన సంగ్రామము లన్నియు నీప్రాంతముననె జరిగెను. ఈసరిహద్దులయుద్ధములు జరుపవలసిన కాలము గతించినది. సువర్ణరేఖానదీజలము తన పూర్వగౌరవమును స్మరించుకొనుచు నడచుచున్నదియుం బోలె మెల్లమెల్లఁగా సాగరమున సంగమించుచున్నది. జగత్కిశోరరాయలు సపరివారముగ దాటుచున్న సమయమున నుదయకాలప్రభాకరుని యరుణారుణకిరణములు సువర్ణరేఖాజలములపైఁబడి తళతళలాడఁ జొచ్చెను. జగన్నాథక్షేత్రము సమీపించినకొలఁది తైర్థికుల సంఖ్య క్రమక్రమముగ నధికమయ్యెను. ఉత్తరహిందూస్థానమునుండియు, బేహారుదేశమునుండియు దృఢశరీరులగు మనుష్యులును, బంగాళాదేశపు బల్లియలనుండియు బట్టణములనుండియు గుంపులుగుంపులుగ స్త్రీలును, జగన్నాథము బోవుచుండిరి. హిందూప్రపంచముయొక్క దూరప్రదేశములనుండి స్త్రీలు పురుషులనక సమస్తవిధములైన జనులు సముద్రతీరమందున్న యా క్షేత్రమునకు మందలుగఁ బోఁజొచ్చిరి. ఒకహస్తము నేకమాసముల వఱకెత్తి పట్టుకొని దానిలోని యెముక కొయ్యబారి చెయివాల్చుటకుఁ గాని కదపుటకుఁ గాని వీలులేని యవస్థలోనుండి రెండవ చేతితో సకలకార్యములు చేసికొనుచున్న యోగులు కొందఱు, జగన్నాథస్వామికి మ్రొక్కుకొని నడుపకయే నేల యుదయము మొదలు సాయంకాలము వఱకు చాగిలంబడి సాష్టాంగనమస్కారములు చేయుచునే వందలకొలఁది మైళ్ళదూరము ప్రయాణముచేయు రోగబాధితులు కొందఱు, శరీరమందంతట బూడిదఁ బూసికొని పొడుగుజడలు తలలనుండి వ్రేలాడు తాపసులు త్రిప్పుకొనుచు నెవ్వరితోఁ బలుకక కన్నులు మూసికొనుచు ధ్యానముచేయుచు నయాచితముగా జనులుపెట్టు భిక్షములవలనఁ బొట్టఁబోసికొను భిక్షులు కొందఱు.

పండ్రెండు పదమూఁడు పదునాలవశతాబ్దములలో యూరపుఖండములో వ్యాపించియుండిన సమస్తనిష్ఠలు, సమస్తనియమములు, దేహపీడనములు, తపములు మొదలగునవన్నియు నేటికాలమున హిందూదేశములోఁ గానఁబడుచున్నవి. దీర్ఘవ్యాధులవల్ల నొప్పులవల్లఁ జిరకాలమునుండి బాధపడు రోగులు, దగ్గఱిచుట్టములను ప్రియబంధువులను గోల్పోయి దుఃఖపడుచున్న జనులు, దేహయాత్రయొక్క చరమావస్థలోనున్న వృద్ధజనులు, హృదయకోశములయందు నిజవాంఛితములఁ గప్పిపుచ్చిన లేతకన్నియలు, పడుచుభార్యలు, బాధావిముక్తి నిమిత్తము, మోక్షము నిమిత్తము, మనోరథసిద్ధినిమిత్తము లండోపతండములుగ జగన్నాథక్షేత్రమును జేరుదురు. కారణమెఱుఁగని యీ మూఢవిశ్వాసమును జూచి తత్త్వశాస్త్రపారంగతులు నవ్వవచ్చును.

కాని దుఃఖకాలములందును, దుర్గతులసమయములందును బహుశతాబ్దములనుండి యైక్యముగొలిపి మహాజనులను రక్షించినది విశ్వాసమే కాని తత్త్వశాస్త్రము కాదు. పూర్వచారిత్రములలో బ్రశస్తప్రకరణములని చెప్పఁదగిన మహోత్కృష్టకార్యములను మహాజనుల నేకముఖముగాఁ ద్రిప్పివేయించినది విశ్వాసమే గాని తత్త్వశాస్త్రము కాదు. గాలి సుఖప్రదముగా నుండినందున జగత్కిశోరుఁడు సపరివారముగా నది దాటి మధ్యాహ్నము కొంచెము సేపొకచోటమాత్రము విశ్రమించి యాపద్దినము ప్రయాణము చేసెను. అరుణభానుమండల మస్తగిరిమీఁద నిలుచునప్పటికి వారు బాలనూరు పట్టణముఁ జేరిరి. ఇది యుత్కలదేశములో జగన్నాథమునకు వెళ్ళుమార్గమునందున్న పట్టణములలో మొదటి గొప్పపట్టణము. ఈ పట్టణము బంగాళాఖాతమున కంతదూరమునఁ లేదు. ఇక్కడి సముద్రపుగాలి మనోహరమై యుండునందున నిది నివాసయోగ్యమైన తావయ్యెను. అందుచేత బంగాళాదేశమందు మన్యపుజ్వరము వ్యాపించియున్న మండలములలోని ప్రజలు కొంచెము మార్పునిమిత్త మప్పుడప్పుడీ స్థలమునకు వచ్చుచుందురు.

అతిథిసత్కారతత్పరుఁడైన బాలనూరు జమీందారు పేరెన్నికఁ గన్నయాత్రికులను దనయింటికిఁ బిలుచుకొనిపోయెను. అతిథిపూజయే హిందూగృహిణికిఁ బరమకర్తవ్యమని సనాతనధర్మము విధించుటచేత నాజమీందారుని రాణివాసపు జనము కిశోరరాయలతల్లికి భార్యకు లెక్కలేనన్ని యుపచారములు చేసిరి. ఆజమీందారుని రాణివాసపుస్త్రీల మాతృభాష యోఢ్రమైనను వారు బంగాళీ భాషఁగూడ మాట్లాడనేర్చిరి. కిశోరరాయలతల్లికి భార్యకు నోఢ్రముగూడ వచ్చును. అందుచేత రాత్రి ప్రొద్దుపోవువఱకు రెండుభాషలలో యథేచ్ఛమైన సంభాషణ మంతఃపురములో జరిగెను. తరువాత నుత్కళదేశసాంప్రదాయసిద్ధమైన విందు పిండివంటలతో జరిగెను. కచేరిచావడిలో జమీందారు శరచ్చంద్రుని, జగత్కిశోరరాయలను విడియించెను. ఆసమయమునందే యుత్కలదేశ సంస్థాన ప్రభు వగు నొక సామంతరాజు జమీందారుని దర్శనము చేయుటకు వచ్చెను. ఉత్కలదేశము రెండుభాగములుగ విభజింపఁబడియున్నది. ఆ భాగములను నైసర్గిక స్వరూపములే సూచించుచున్నవి. బంగాళాఖాతతీరమున ననఁగా దూర్పుభాగమున నున్న సమభూములలో విద్యావంతు లయిన జనులు కాపురమున్నారు. వీరు ప్రత్యక్షముగా బ్రిటిషుపరిపాలనలో నున్నారు. పడమటివైపునఁ బర్వతమయ మైనయాటవిక ప్రదేశ మున్నది. అక్కడి జను లనాగరకులు. ఆదేశమును బ్రిటిషువారికి లోఁబడి హిందూసామంతరాజులు పరిపాలించుచున్నారు. ఈకొండరాజులలోనొకఁడు బాల

ళూరులో నున్న యూరోపియన్ మేజిస్ట్రేటు గారిదర్శనము చేయవచ్చి, పిమ్మట జమీందారునిఁ జూడవచ్చి, యచ్చట సాయంకాలమున జమీందారుగారితోడను, శరచ్చంద్రుని తోడను, జగత్కిశోరరాయల తోడను, సంసల్లాపము లాడఁజొచ్చెను. ఆసియా ఖండవాసులు తాల్చు పెంటలేని దుస్తు లతఁడు ధరించెను. అతని తలపాగయున్నత మై యుపరంజి నగిషీపనులతో నిండి యుండెను. శరీరచ్ఛాయ నలుపు. కాని, విగ్రహము పౌరుషసూచకమై యుండెను. వయసుముప్పదియైన నతఁడు విశేష దేహదార్ఢ్యమును గౌరవాస్పదమైన వర్చస్సును దాల్చి యుండెను. బంగారుపని జేసినదువ్వాలువలె ధరించి యతని కొడుకులిద్దఱుఁ దండ్రికిఁ జెరియొక ప్రక్కఁ గూర్చుండ గదికావల చేతులలో వెండి కఱ్ఱలు దాలిచి స్వదేశసంస్థానప్రభువు యొక్క యంగరక్షకుల మఱియొకవిధమైన గర్వము పూని కొందఱు సేవకులు నిలిచి యుండిరి. క్రిందవాకిటిలో వెండిబొందలు నెఱికుచ్చులు గలిగి మిక్కిలి డాబుగా నున్న పల్లకులు మెఱయు చుండెను. వాటి చుట్టును వాటిని మోయుబోయులు, సామంతరాజసేవకులు నిలిచియుండిరి. పూర్వపద్ధతి సిపాయిలు కత్తులు, డాలులు చేతఁ బట్టుకొనిరి రాజలాంఛన మగు వరుణఛత్రముదాల్చి కొందఱు, చామరములుదాల్చి కొందఱు ఠీవితో నిలువఁబడిరి. రాజాగారుతిరిగి ప్రయాణము చేయుటకుఁ గొందఱు చాకలివాండ్రు కాగడాలు సిద్ధముచేయుచుండిరి. కొందఱు సేవకులు చుట్టలు త్రాగుచు మాటాడు కొనఁజొచ్చిరి మఱికొందఱు కాళ్ళుఁజాపుకొని వెల్లకిలఁబండుకొనిరి. జమీందారునిఁ జూడవచ్చిన యీ గొప్పరాజును చూడఁగానే వాని వృత్తాంతము కొంత తెలిసికొనవలె నని కుతూహలము పుట్ట జగత్కిశోరుఁ డిట్లనియె.

“రాజా ! నీ ప్రజలు బ్రిటిషువారి దేశములలో నున్న ప్రజలవలె నుందురా? వారుకూడ నోఢ్రభాష మాట్లాడుదురా?” అనవుడు సామంతరా జిట్లనియె. “అవును ! నా ప్రజలలో ననేకు లోఢ్రులు. వారోఢ్రభాషే మాట్లాడుదురు. బ్రిటిషు వారి క్రింద నున్న యోఢ్రదేశములోని కాఁపులవలెనే నేల దున్నుకొని బ్రతుకుదురు. కాని, యతి దూరమున నున్న కొండలలోను నడవులలోను వెనుకటి యాటవిక జనులసంతతివా రున్నారు. వారి సొంతభాషలే వారు మాటలాడుదురు. వారి పూర్వాటవిక జీవనము నిప్పటికిని వదలిపెట్టరు. వారి గ్రామము లనఁగా నట్టడవులలోఁ గొన్నిగుడిసెల గుంపులు. వారి యాచారవ్యవహారము లన్నియు సృష్టి కాదియం దుండినవని చెప్పవచ్చును. నా సంస్థానములో విశేషభాగమున నాతండ్రి కాలమున నీయాటవికులే నివసించుచు నుండిరి ఇప్పుడు తక్కినచోట్ల యందువలెనే వారంతకంతకుఁ బలుచనగుచున్నారు.

ఏలయనఁ దమకంటె నెక్కువనాగరికులగు పాశ్చాత్యులు వచ్చి చేరియుండుటచేత నీయాటవికులు వెనుక వెనుకకు జనఁగా దట్టమగు నరణ్యములలోనికిఁబోయి నివసించుచున్నారు."

"మీసంస్థానపరిపాలనము బ్రిటిషుదేశపరిపాలనమువంటిదే కాదా?"

"మేము బ్రిటిషువారిపరిపాలనమునే యనుకరించుచున్నాము. నారాజధానిలో నొక న్యాయస్థానము, నొకకచేరి, యొకపాఠశాల, యొకధర్మవైద్యశాల కలవు. కాని, మేము సాధారణముగ జనులను వారియిచ్చవచ్చినట్లు వదలివేయుదుము. వారు నెమ్మదిగా నడుచుకొనునంతకాలము వారి గ్రామవ్యవహారములలో మేము జోక్యము కలుగఁజేసికొనము. వారివ్యవహారములలో మేము జోక్యము తక్కువ కలిగించుకొంటిమా వారి గ్రామపరిపాలన మిక్కిలి బాగుండును. మొత్తము మీఁద నెమ్మదిగలవారు. రాజునందు భక్తిగలవారు. కాని, మీసంస్థాన ప్రజలు కొన్ని సంవత్సరముల క్రిందట తిరుగుబాటు చేసిరని విన్నాము"

"ఔను! నిజమే. ఆదులో కొంతవఱకు మాయుద్యోగస్థులదే తప్పు. వారు ప్రతిగ్రామమునుండి కొంతధాన్యము, కొన్నిపశువులు, పన్నుక్రింద మాకుఁ బంపుట యాచారము. మాయుద్యోగస్థులు వారు దున్నుకొనుచున్న భూములను గొలిచిధాన్యమునకుఁ బదులుకుమారగాఁ గొంతసొమ్ము పన్నుగావిధించి పుచ్చుకొనవలయునని తలంచిరి. ఆదిమపద్ధతులయందే యభిమానము గలయజమానులకు మాక్రొత్తపద్ధతు లనుకూలమైనవి కావు. పాపము వెఱ్ఱివాండ్రు తమవిండ్లు, నమ్ములుఁ దీసికొని తిరుగఁబడిరి. కాని పితూరీ వెంటనే యడఁగి పోయెను."

"అట్లయిన నేలకొలత మీరు మానుకొన్నారా యేమి?"

"మానుకొనలేదు. నాగరికులు కాఁపురమున్నచోట్ల నేలకొలత వేయించితిమి, వెనుకఁ బడియున్న యామూర్ఖులను వారిష్టమువచ్చినట్లు బ్రతుకనిచ్చుటే మంచిదని తోఁచినది. నానాఁటికి నవనాగరికపద్ధతులు వానియంతట నవే వచ్చి దేశములలోఁ బ్రవేశించును. అతిబలవంతముగా వానిని దేశములోఁ బ్రవేశపెట్టుట లాభకరమని నేను తలంపను"

"మీరు చెప్పినది సరియైనమాట. బాలకూరు మేజస్ట్రేటుగారుకూడ మీయభిప్రాయమునే బలపఱచుచున్నారని కూడ వింటిమి. ఆయన తఱచుగా మీసంస్థానమునకు వచ్చి చూచుచుందురా?"

"ఆహా! సంవత్సరమునకొకసారియో రెండుసారులో, ఆయన మా యింటను మిక్కిలి యాక్షేమముగల పరిపాలకుడు. ఆయన మా సంస్థానమునకు వచ్చినప్పుడు మా మందిరములలోనికి ఆయనను నేను సంతోషపూర్వకముగా రానిచ్చి మా చెఱసాల, మా దర్బారు, మా యింటిలోని వాహనశాలలు చూపుచుందును. ఆయన మంచి వేటకాడు. ఆయనయు నేనును గలసి కొన్ని నాళ్ళు వేటలాడుదుము."

"మీరు సాధారణముగా తుపాకులతో వేటిని వేటాడికొట్టుదురు?"

"అడవులలో ప్రతిజాతిజంతువు కలదు. పెద్దపులులు మునుపటియంత యెక్కువగా లేవు. కాని, చిఱుతపులులు సామాన్యముగాం గనబడు చుండును. ఎలుగుగొడ్డులు కనంబడనిదినమే యుండదు. ఒకప్పుడు మేము వన్యజంతువుల వేటకై కాలినడకనే పోవుదుము. కాని సాధారణముగా మేము చెట్లలో దాగి యుందుము. అడవిమనుష్యులనేకులు గుంపుగా నిలిచియుండి గొప్పచప్పుడు చేయుదురు. అప్పుడా జంతువులు జడిసి పైకివచ్చి మా దృష్టిపథమునం బడును. నిరుడు మేజరు స్కాటు చక్కని యెలుగుగొడ్డు నొకదానిని బట్టుకొని తెచ్చినాడు. దాని కూనలిప్పటికి నాయన యింటిలోనే యున్నవి."

"మీ పెద్దపిల్లవాడుకూడ మంచిగురిగల వేటకాడని నేను విన్నాను."

"ఔను! అతడు తుపాకి కడు నేర్పుతో పట్టుకొనగలడు. కొద్దికాలములోనే యాతడు పేరుగాంచెను. అతడు కొంచె మింగ్లీషు నేర్చుకొనవలసిన దని నా కోరిక. ఈదినములలో దేశపరిపాలన కింగ్లీషు చాల తోడుపడును. మే మింగ్లీషువారి చట్టములను సూత్రములను నవలంబింపం దలచుకొన్నాము; గనుక ఇంగ్లీషుభాష వా[illegible] దీసి కొనుటలో మాకు మిక్కిలి సహకారముగును."

"స్వదేశసంస్థానప్రభువులు ఇంగ్లీషుభాష నేర్చుకొన్న పక్షమునం జెడిపోవుదురని కొందఱనుచున్నారు."

"వారిని పాడుచేయునది యింగ్లీషుభాష కాదు—కాని, యింగ్లీషుభాష ప్రజలకు రాజునకుం బరస్పరసంబంధము పోగొట్టును. ఒకరికొకరు దూరమగుదురు. యుక్తవయస్కులు కాని రాజకుమారులు కటకములో విద్యాభ్యాసము చేయుచున్నారు. అందు చేత వారనేక సంవత్సరములు సంస్థానములలో నుండపోవుట సంభవించును. అందువలన

అందువలన వారు ప్రజలనడుమనుండి వారితోఁ గలసి మెలసి యుండరు. వారు యుక్త వయస్కులై మీగల సంస్థానములకు వచ్చినప్పుడు ప్రజలకు వారు క్రొత్త; వారికి ప్రజలు క్రొత్త. ఇది మిక్కిలి శోచనీయము. మీరు కావలసినంత యింగ్లీషు వారికి నేర్పింప వచ్చును. ఎంతఎక్కువ చదువుకొంటే మన కంత మంచిది. కాని, నడుమ నడుమ సంస్థాన ప్రజలతోఁ గలసియుండు నట్లేర్పాటులు చేయవలెను. వారిమధ్యఁ గాఁపుర ముండవలెను. వారితోఁ గలసి మెలసి తిరుగవలెను. వారు తమ ప్రజలని తెలిసికొనవలెను. తెలిసికొని వారి కష్టసుఖములు తమవని భావింపవలెను. ఆపదలలో వారినొక్కొక్కరి విచారింపవలెను. అట్లు చేయుటచేత రాజు ప్రకృతిజనరంజకుఁ డగును. శ్లాఘ్యపరిపాలకుఁ డగును. దయచూపి తమా భయంకరులగు నాటవికులుకూడ లొంగిపోవుదురు."

"ఈస్వదేశరాజులలో ననేకులు తమ ప్రజలమీఁద నిజమైనదయఁ జూపుదురని మీరు తలంతురా?"

"చూపుదురనియే నేను నమ్ముదును. ఉత్కలదేశములో నిరువదిసామంత రాజ సంస్థానములు కలవు. నేను విన్నదానినిబట్టి దాదాపుగా సంస్థానాధిపతు లందఱు ప్రజారంజకులే. రాజులు మార్పుల నవలంబించుటలో సాధారణముగాఁ జాగరూకతనుఁ జూపరు. అటివిషయములలోఁ గొంత బద్ధకించి వెనుకఁబడి యుందురు. అది మంచిగుణ మని నేను వాదింపనుగాని, క్రొత్తసంబంధములు, నవీన పద్ధతులు నాగరకత లేనిమాయాదిమ ప్రజలకు భయము చిత్తక్షోభము గలిగించును. బ్రిటిషుదేశములో సంస్కరణ విషయమున మీరెంత తలబిరుసుగా వెళ్ళినను భయము లేదు. అనేకసహస్ర సంవత్సరములనుండి వచ్చిన ప్రాచీన నాగరకత కలదు. విశేషించి మీకు నేఁటి మహోన్నతమైనయైశ్వర్యము విజ్ఞానము కలవు. మాసంస్థానప్రజలు తక్కినవారికంటె నవనాగరకులు. మేము మెల్ల మెల్లఁగాఁ గదసి మార్పులు చేసికొందుము. ప్రొద్దుపోయినది. ఇఁక నాకు సెలవు దయ చేయ వలయును."

మరునాఁ డుదయమున జగత్కిశోరుఁడు సపరివారముగాఁ బ్రయాణ మారంభించెను. ఆనైరృతిమార్గమున రెండుదినములు నడచినతరువాత వారు పవిత్రమైన వైతరణీ తీరమును జేరిరి. ఈనది బ్రాహ్మణీనదితో గలసి గొప్పవర్షములు కురిసిన సంవత్సరమున నుత్కలదేశములో విశేషభాగమును వరదతో ముంచి యెత్తును. పడమటికొండలలోను మెట్టనేలలలోను బుట్టి యీ రెండునదు లక్కచెల్లెండ్రవలెఁ బయనముచేసి సమభూముల లోఁబడి దొంగవోలి యొకచోఁ గలసి లోతును వెడల్పుగల యొకనదిగా నేర్పడి

ఎండమావులిచేవు సాగరసంగమముఁ జేయును. శీతకాలములో నీరింకునదులు సన్నకాలువలై పోవును చుట్టు విశాలమైన యిసుకతిన్నె యుండును. కాని, వానాకాలములో వర్షము లారంభింపఁగానే నదులు రమారమి యిరువదినాలుగు గంటలలో సంపూర్ణముగ నిండిపోవును. వెనుకటిదినమున బచ్చనిచేలతో నిండియుండిన ప్రదేశమంతయు మఱునాఁడు సాయంకాలము జలమయమై సముద్రమట్లుండును. గొప్పవర్షములు కురిసిన సంవత్సరములందు గ్రామములు పల్లియలు వఱదలతో మునిగియుండును. మందభాగ్యులైన యా గ్రామవాసులు స్త్రీలతో బాలురతో వృద్ధులతో మట్టిదిబ్బ లెక్కి, పచ్చి బియ్యమునమిలి, నీరు తీసిపోవుదనుక, వారికుడిసెలు నివాసయోగ్యము లగునంతవరకు నానావస్థలపాలై ప్రాణసంరక్షణము చేసికొనుచుందురు. ఈ తూర్పుసముద్రతీరమందు ప్రకృతివైపరీత్యములు బలవత్తరములై బహునష్టములు కలిగించుచుండును. అనావృష్టి సంవత్సరమున దేశమందు సగముభాగమునఁ బంట లుండవు. మఱుచటిసంవత్సర మతివృష్టిచేతఁ గొంపలు మునిగి పొలములు జలమయములై మఱియొకవిధమునఁ బాటలుచెడి జనులు శ్రమపడుదురు.

జగత్కిశోరరాయులు వైతరణి బ్రాహ్మణితో సంగమించెడితావునకు మీఁదుగా నొకచోట వైతరణినాఁటి పెద్దబాటవిడిచి కొంతకాలముత్కలదేశమునకు రాజధానియైన జాజిపురమును జూడఁగోరి ప్రక్కబాటను మరలెను. వేయి సంవత్సరములనాఁటి శిల్పములు కొన్ని యా పట్టణమునఁ గలవు. అవి దాని ప్రాచీనగౌరవమును జాటుచుండును. ఏకశిలతోఁ జెక్కఁబడిన ఇంద్రాణీవిగ్రహము, కాళీవిగ్రహము, వారాహీవిగ్రహము నచ్చటఁ గలవు. జగత్కిశోరయనితల్లి భయభక్తులతో నింద్రుని రాణియైన నింద్రాణికి వరాహదేవుని భార్యయైన భూదేవికి, మహాశక్తియగు కాళికి నమస్కరించెను. ప్రస్తుతము నామావశిష్టమైన యాప్రాచీనపట్టణమందలి పెదయిండ్లమీఁద గుడిసెలమీఁద నక్షత్రములు నిశ్శబ్దముగ వెలుతురుఁ జిమ్ముచున్న యా రాత్రికాలమున సమనాగరికుఁడగు శరచ్చంద్రుఁడను సైతము గొప్పతనమెల్లఁ గోల్పోయిన విస్మృతి ప్రాచీన సామ్రాజ్యము యొక్క యాశేషభగముల నక్కజముపడిచూచుచు దీర్ఘాలోచనతత్పరుఁడై చాలసేపు వాని యెదుట నిలువఁబడియుండెను.

——

బల్లియలలోను గల యిండ్లకప్పులను బశువులను బచ్చికలను సంగ్రహించుకొని సాగరముం బ్రవేశించును. నదియెంత త్వరగాఁ బొంగినదో యంతత్వరగాఁ దీసిపోవును. గత దినసాయంకాల మెంతో యపాయకరముగా నున్నది యొకప్పుడు మరునాఁడు తెల్లవాఱునప్పటికిఁ బూర్తిగాఁ దీసిపోయి నగరవాసుల కఖండానందము గలిగించును. వర్షకాలమున నతి భయంకరమై బహుదేశపరివ్యాప్తమైన యా మహానది శీతకాలపు సాయంకాలమున సన్నగిలి ముంపుగాఁ దనయిసుకతిన్నెయ పాన్పుమీఁద నిద్రించుచున్నదో యనునట్లు పాఱుచుండెను. జగత్కిశోరుఁడు సపరివారముగా నుత్తరమువైపు నుండి నది దాఁటెను. కటకపురమందు హారివల్లభబోసు నాయకపురుషుఁడు. అతఁడు పలుకుబడి యెక్కువకలవాఁడనియు, ధనవంతుఁడనియుఁ బేరుపడయుటయే గాక యతిథి సత్కారమందు మితిలేనియభిలాష కలవాఁడని ప్రతిష్ఠ గాంచినవాఁడు. అతఁడుగూడ జగత్కిశోరరాయల కులమువాఁడే. ఊరిపురఁ జుట్టఱికముండిన నుండవచ్చును. అతఁడు వర్ధమానపు జమీందారును దనయింటఁ దప్ప మఱియొకచోట బసచేయనీయ దలఁచుకొనలేదు. అతని సేవకులుముందుగానే యుత్తరపు గట్టునకుఁబోయి పల్లకులమీఁదఁబడి మనుష్యులను దింపకయే యా పల్లకులను రేవుపడవలమీఁదఁ బెట్టించిరి. బోయలు నది దాఁటిన తరువాత మరలఁ బల్లకుల మోయంబోఁదగిరి. పురజనులను జూచినతోడనే తమయాయాస మానాటికి కడముట్టినదని సంతోషించుచు బోయలు మఱింత యుత్సాహముతో నోంకారధ్వనులు చేయుచుఁ బట్టణములోనికిఁ బోయిరి. అనుకొన్నవేళ వారు గమ్యస్థానము జేరిరి. హారివల్లభబోసు జగత్కిశోరరాయలను, శరచ్చంద్రుని స్వాగతపూర్వకముగ నాదరించి స్వగృహమును ప్రవేశింపఁజేసెను. అతని యింటి స్త్రీలుకూడ మిత్రకుటుంబము నందలి స్త్రీలువచ్చినప్పుడు నడపవలసినధర్మము మఱువక జగత్కిశోరునితల్లిని, భార్యను మిక్కిలి గౌరవముతో నెదుర్కొని లోనికిఁ దీసికొనిపోయిరి.

కిశోరరాయనితల్లి మంచి వివేకకలది. ఇంటివారిమాటలంబట్టి హారివల్లభుఁడు కొన్ని దినములవఱకుఁ దమ్మక్కడ నుండఁబోనీక నిలుపఁ దలఁచుకొన్నాఁడని గ్రహించి [illegible]పడి హారివల్లభుఁడు తన్ను జూడవచ్చినప్పుడు మఱునాఁ డుదయమున తాను పూరి జగన్నాథమునకు వెళ్ళవలె నని చెప్పెను.

ఆమెకు హారివల్లభుఁ డిట్లనియె. "అమ్మా! మేము పూర్వపద్ధతిమనుష్యులము. మాపూర్వులు కూడఁ బూర్వపద్ధతివే. మీ కుమారునివంటి, మీవంటి యతిథులు మమ్ము [illegible] మాగృహమునకు [illegible] భాగ్యము కాదు.

హిందూదేశమం దాకాలముననున్న నగరములకు శిరోమణియై యుండవచ్చును. అక్కడి దేవాలయములలో గొప్పది ఏడవశతాబ్దమునఁ గట్టఁబడెను. ఇంకను వందలకొలఁది చిన్న దేవాలయములున్నవి. ఇందులో కొన్ని పాడుపడకుండ మంచిస్థితిలో నున్నవి. ఇవియెల్ల రాజవంశస్థుల ప్రతాపమును గొప్పతనమును ఘోషించుచున్నవి. ఈనాఁటి తైర్థికులు బాటసారులు పాడుపడి యున్న నీ పట్టణమును మిక్కిలి యక్కజంపడి చూచి పారములేని పరిశ్రమతోడను, నిరుపమానమగు నేర్పుతోడను మలచఁబడి చిత్రింపఁబడిన రాతిపలకలతో నిర్మింపఁబడినట్టియు నూఱడుగులయెత్తును రెండువందల యడుగుల యెత్తును నేకశిలాఫలకములచేతనే యమర్పఁబడిన పైకప్పు కలిగినట్టియు పురాతన మహాభవనముల యెట్టయెదుట నోట మాటలేక నివ్వెఱపడి నిలిచి యుండిరి.

ఆఁడువాండ్రా మహాదేవాలయముయొక్క యంతర్భాగమును జొచ్చిరి. భువనేశ్వరుఁడైన భువనేశ్వరునకు నేటికిని యథావిధిగాఁ బూజానమస్కారములు జరుగుచున్నవి. ఆలయమందలి మహాగోపుర మొక్కటి మహోన్నతమై యున్నది దాని మీఁద విగ్రహములు విశేషముగా చెక్కఁబడి యున్నవి ఒక్కొక్క రాతిమీఁద నొక్కొక్కవిధమైన చిత్తరువు చెక్కఁబడి యున్నది శిల్పిహస్తకౌశలము, బుద్ధికుశలత దెలియఁజేయుని విగ్రహ మొకటైనను లేదనుట యతిశయోక్తి కాదు.

అప్పుడు జగత్కిశోరునితల్లి శరచ్చంద్రునితో నిట్లనియె. "ఇది దేవాలయముల పట్టణమని నాకు దోఁచుచున్నది. ఈలాగున కట్టగలవారు దేవతలుగాని మనుష్యులు కారు. ఇటువంటి రాతిగుళ్ళు మన బంగాళాదేశములో విశేషముగా లేవు."

అనవుడు శరచ్చంద్రుఁ డిట్లనియె: "ఈ పురాతనపట్టణ మిటువంటిమహోన్నత దేవాలయములతో నిండియుండుటకు మనపూర్వులయొద్ద నతిమానుషమైన యుత్సాహము నతిమానుషమైన ప్రజ్ఞ యుండి తీరవలయును. అమ్మా! పూర్వులు జన్మమున కేదో పరమార్థము పెట్టుకొని యుండెడివారు. దేవాలయము కట్టించుటో, సత్రము వేయుటో, సరోవరము త్రవ్వించుటో వారిపరమార్థము. ఈ దినములలో మనమందఱము పరమార్థ మేమియు లేక బ్రతుకుచున్నాము."

"నాయనా! నీ మాట నిజము. విశ్వాస మున్నవారు విశేషకార్యములు చేయ గలరు. ఇటువంటి యాలయములు కట్టించినరాజులకు దేవతలు తప్పక సహాయము చేసెడి

వారు. బిడ్డలారా! పడుచువాండ్రును దేహదార్ఢ్యము కలవాండ్రును జన్మములు చరితార్థములగునట్లు పరమార్థమునిమిత్తమై పాటుపడుఁడు. విశ్వాసముంచి యేదో పరమార్థము చేయవలెనని సంకల్పించుకొనుఁడు. అదే గురిగాఁ బెట్టుకొని పనిచేసిన పక్షమున మీ దేశమునకు మీరుకూడ నీదినములలో సయితమేదో కొంత యుపకారము చేయఁగలరు.”

---

## ఇరువదిమూడవ ప్రకరణము.

### ప్రతిజ్ఞ.

జగన్నాథక్షేత్రమునకుఁ గడపటి మజిలీయైన కటకపట్టణమునుండి జగత్కిశోర రాయులు సపరివారముగా బయలుదేఱునప్పటికి మేఘాచ్ఛాదనములేని శీతకాల సూర్య మండలము వ్యాపారబాహుళ్యముచేత జనసమ్మర్దమధికముగాఁ గలిగిన యా నగర వీథులలోఁ దేజంబువెదజల్లి మెఱయుచుండెను. వారుమహానదియొక్క దక్షిణప్రాయను దాటిరి. ఈ ప్రాయ కొన్ని మాసములక్రిందఁ బొంగి దేశమును ముడిచిపెట్టి ప్రస్తుతము చిన్న చిన్న కాలువలుగామాఱి రెండడుగుల లోతైనలేక యిసుకనదియని చెప్పఁదగి యుండెను. గుఱ్ఱముపల్లకులు రేవుపడవ సాయముక్కరలేకయే నదినిదాటి, జగత్ప్రసిద్ధికన్న పూరీక్షేత్రమునకును, నదీతీరమునకునుగల యేబదిమైళ్ళమార్గము పయనము చేయసాగిరి. దేశాచారమునుబట్టి యామధ్యనొకచోట మంచిబోయలను పెట్టిరి. మధ్యాహ్నము నడిదారిలో భోజనమునిమిత్తము కొంతసేపాగవలసివచ్చినను మొత్తముమీఁద సాయంకాల మగునప్పటికి బాటసారులు తమ గమ్యస్థానమును చేరఁగలమనినమ్మి యుండిరి.

హిందూదేశముయొక్క ప్రతి భాగమునుండి వచ్చునట్టి తైర్థికుల సంఖ్య క్షేత్రము సమీపించినకొలఁది యడుగడుగున కధికము కాఁజొచ్చెను. వర్షకాలములో నెనఁగా జగన్నాధస్వామివారి రథోత్సవసమయమునఁ బ్రతిదినము వేలకొలఁది మనుష్యులీదారిం బోవుచుందురు. ఆయుత్సవసమయమునఁ గాలస్థితి బాగున్న సంవత్సరములలో రెండు మూఁడులక్షలమంది జనులు చేరుదురు. తక్కిన ఋతువులలో జనసంఖ్య యంతవిశేష ముగా నుండదు. కాని పుష్యమాఘమాసములలోను ముఖ్యముగా మనోజ్ఞమైన శీతకాల

మందు తైర్థికప్రవాహ మొండిపోక యేదోవిధముగాఁ బ్రవహించు చుండును. దూరమండలములనుండి స్త్రీలు, పురుషులు, రోగులు, భోగులు, భిక్షుకులు, బైరాగులు, కుంటివాండ్రు, గ్రుడ్డివాండ్రు, పిన్నవాండ్రు, పెద్దవాండ్రు, దేహము చాలించులోపల నెన్నఁడో యొక్కసారి చూచితీరవలయునని కోరుచుండెడి జగన్నాథ క్షేత్రమునకు నెట్టెటో కాళ్ళీడ్చుకొని నానాశ్రమలు పడి పోవుదురు. విదేశప్రయాణము, నూతన స్థలదర్శనము మొదలగునవి నేటికాలమున యూరపుఖండములో మతసంబంధము విడిచి లౌక్యవ్యవహారములోఁ జేరిపోయినవి కాని హిందూదేశములో నిప్పటికిని మతముతో నవినాభావమును బొంది జనులకు విధిచోదిత ధర్మములుగా నేర్పడినవి.

మధ్యాహ్న భోజనము నిమిత్తము విశ్రాంతినిమిత్తము జగత్కిశోరయు సపరివారముగ బాటప్రక్కనున్న యొక యంగడిలో విడిసెను. పేదబాటసారు లట్టి విశ్రమస్థానముల నపేక్షింపరు. వారు చెట్టుక్రిందనే ప్రొయిఁ బెట్టికొని యొకగంటలో నిత్తడిపాత్రతో గాని కుండతోగాని కావలసినయన్నము కూరలు వండుకొని తిని తిరిగి పయనము చేయుచుందురు. వాయువ్యమూలనుండి వచ్చు దృఢకాయులగు తైర్థికులు తరుచుగా నన్నమే వండుకొనరు. గోధుమపిండి పెరుగుతోడనో, పాలతోడనో గలిపి భక్షించి సంతుష్టులగుదురు. ఒకగంటలో వంట మొదలైన యెల్లపనులు ముగియును. వంటకుండ లోపలఁ బాఱవేయుదురు. ప్రొయిలో నిప్పైనసరిగా నారిపోకమునుపే మూటలు ముల్లెలు భుజముల వేసికొని, కడపటి మజిలీ నుండి జగన్నాథక్షేత్రమునకు బోవుపట్టున మరల నెక్కడ బసదిగక యన్నపానములమాట దలపెట్టక తలవంచికొని యేకదీక్షతోఁ బయనము చేయుదురు.

అట్లు చనుచున్న తైర్థికులకు గొన్నిమైళ్ళదూరమునందే లోకానందకరమైన జగన్నాథస్వామివారి గోపురశిఖరము నేత్రపర్వమై గానఁబడెను. అప్పుడు పవిత్రులైన తైర్థికులు ముందడుగు పెట్టక నిలిచియుండెడి చిరకాలమునుండి యభిలషించిన యాదేవాలయముయొక్క ప్రథమదర్శనమైనందునఁ బరమానందభరితులై తమ సంకల్పము నెఱవేఱినందుకు జగన్నాథస్వామికి జయము, జయమని కేకలు వేయుదురు. ఆధ్వని నలుప్రక్కల నిండి మిన్నువయినట్లగుచుండును. తమ సన్నకంఠములతో స్త్రీలుకూడ సానందపారవశ్యమున నాకేకలువేసి ధ్వనిని స్థూలముచేయుదురు. జగత్కిశోరయుఁ దల్లియు భార్యయు తాము ఘోషా స్త్రీలన్నమాట మఱచి సాంప్రదాయవిరుద్ధముగాఁ బల్లకితలుపు లెంచుక తెఱచి జగన్నాథస్వామి వారి గోపుర శిఖరము [illegible] చూచి స్వామిని సన్నుతి గొ

జెప్పి వారిచుట్టములలో నెవ్వరెవ్వరు జగన్నాథయాత్ర చేసిరో వారిపేరు లుగ్గడించి తన కుటుంబమునకు వారి కుటుంబమునకుఁ గల సరియైన సంబంధము చెప్పి తన కక్కడ యధికార మున్నదని స్థిరపరిచి యా పావనక్షేత్రమున వా రున్నంత కాలము వారిం దానే కనుగొనుటకు సమ్మతించి వారిం దన యధీనము చేసికొనెను.

గవర్నమెంటువారి చట్టము ప్రకారము లైసెన్సు చేయఁబడిన గృహములలోనికి సామాన్య తైర్థికులను సామాన్యులైన పండాలు తీసికొని పోవుదురు. భాగ్యవంతుఁడైన వర్ధమానపు జమీందారుని విషయమున నట్లుగా లేదు. పురవాసియొకఁడు విశాలమైన తన భవనమును జమీందారుని యుపయోగము నిమిత్త మిచ్చివేసెను. మఱియొక పండావచ్చి తన న్యాయమైన హక్కును హరించికొని పోకుండునట్లు పండాబ్రాహ్మణుఁడు రాత్రి యంతయు నక్కడనే పండుకొని తిన్నగా నిద్రింపఁ జాలఁడయ్యెను.

జగత్కిశోరరాయుని తల్లి మాత్రము నిద్రబోలేదు. పూజ్యురాలైన యా యవ్వ కాశితోఁ గలసి దీపముదగ్గఱ గూర్చుండి శరచ్చంద్రున కిట్లనియె. "నాయనా! నా కొక్కమాట చెప్పు? నీవు వెనుకటివంగతు లెఱుఁగుదువు. ఈ గొప్పగుడి యెప్పుడు కట్టినారో చెప్పు? ఏమాసమున సముద్రతీరమున జగన్నాథస్వామి యేల వెలసినాఁడో యా కారణముకూడ చెప్పు? నేనీ రాత్రి నిద్రపోను. జాగరము చేసెదను. నీకుఁగూడ నిద్ర సరిగా రాదని నేనుఁ దలఁచెదను. ముసలమ్మకోరిక తీర్పుము. జగదీశ్వరుఁడైన జగన్నాథస్వామివారి వృత్తాంత మంతయుఁ జెప్పుము."

ఆమెకు శరచ్చంద్రుఁ డిట్లు బదులుచెప్పెను. "ఆ కథలు నాకంత బాగుగా దెలియవు. భువనేశ్వరుఁడను పేరుగల శివు నారాధించు నుత్కలదేశ ప్రభువులు సింహవంశపు రాజులు కట్టించిన భువనేశ్వర దేవాలయములు చూచితివిగదా? అవి యింతకంటెఁ బ్రాతవి. సింహవంశపురాజుల యనంతరమున గంగవంశపురాజులు సింహాసన మెక్కి యీ దేశమేలిరని చరిత్ర చెప్పుచున్నది. కాని వారు విష్ణుభక్తులు. ఆ వంశమునందలి మొదటి రాజులలో నొకఁడీ కోవెలఁ గట్టించెను."

"అదెప్పుడు నాయనా! ఈ మహాదేవాలయమును గట్టించి పుణ్యము గట్టుకొనిన యా గొప్పరాజు పేరేమి?"

"అనంగభీముఁడని యతని పేరు. ఆతఁడు రమారమి యేడువందల సంవత్సరముల క్రిందట సింహాసన మెక్కెను. జగన్నాథుఁడైన విష్ణుదేవుఁడా రాజునకు స్వప్నములోఁ

గనఁబడి యుత్కలదేశపు రాజధానీనగరములను విడిచి దక్షిణముగా సముద్రతీరమునందలి యిసుకనేలలకు బయనమై పోవలయుననియు నక్కడఁ దనపేరనొక గుడి కట్టింపవలసినదనియు నాజ్ఞాపించినట్లొక కథ గలదు. ఆనందభీముఁడు భగవంతుని యాజ్ఞ శిరసావహించి యీగుడి కట్టించెనఁట. ప్రాచీన రాజధానులు క్రమక్రమముగాఁ బాడుపడియెను. శివునిమీఁది భక్తి నానాఁటికి క్షీణించెను. క్రొత్తకోవెలయైన జగన్నాథస్వామి యాలయము, విష్ణుభక్తి, కాలక్రమమున నభివృద్ధినొందెను."

"శివుఁడు, విష్ణుమూర్తి యనునట్టివి వట్టి నామభేదములే గాని భగవంతుఁడొక్కఁడే. ఏ పేరుతో మనము బూజించినను బూజ లందుకొనును. పుణ్యక్షేత్రములలో నగ్రగణ్యమైన వారణాసిలో నేటికిని శివపూజయే జరుగుచున్నది. అక్కడ మీతల్లి చరమదినములు గడపఁదలఁచుకొన్నదికదా! అక్కడ ముఖ్యదేవాలయములన్నియు శివాలయములే. ఇక్కడ పూరిలో కోవెల విష్ణుకోవెల. దేవుఁడు విష్ణుదేవుఁడే. జగన్నాథస్వామి యను పేరుతో నున్నాఁడు. నేనేమియుఁ దెలియని యాఁడుదానను నాయనా! కాని తెలిసినవారు శివుఁడు, విష్ణుమూర్తి, యొకటేయని నాతోఁ జెప్పినారు. అతనికే యెన్నో పేరులు పెట్టి జనులు పూజింతురు."

"అమ్మా! ఆ తెలిసినవారు చెప్పినది నిజమే. ప్రపంచమందలి యెల్లజాతులు సమారాధించునట్టి భగవంతుఁడొక్కఁడేకాని యజ్ఞానముచేత మనుష్యులు నామభేదములను గ్రహింపక యొకరినొకరు జంపుకొని రక్తములు ప్రవహింపఁజేసిరి."

"నాయనా! పుణ్యాత్మురాలైన మీతల్లి హృదయము వారణాసిమీఁదనే యుంచి యా పుణ్యక్షేత్రములోనే దినములు గడప నిశ్చయించుకొన్నది. మనము చక్కగా దేహయాత్ర గడపి ప్రపంచవ్యవహారములలోనుండి, సంసారపు గొడవలలో నుండి మరల్పఁదగిన కాలము వచ్చినప్పుడు మన శాస్త్రములు విధించిన ధర్మమిదే. జగన్నాథస్వామి నాకొమరున కెప్పటియారోగ్యమియ్యవలె నాయనా! విధేయురాలైన మాకోడలిని బిడ్డలతల్లిఁ జేసి దానియిల్లది దిద్దుకొనునట్లు చేయవలె నాయనా! భూలోకములో నేను జేయవలసిన పని యయిపోయినది. ఎంతయైన జీవితశేష మీక్షేత్రమునందే గడపఁదలఁచి స్వామివారి యిష్టప్రకారము నడుచుకొన్న పక్షమున జగన్నాథదేవుఁ డామెను భక్తురాలిగా నంగీకరించునేమో!" ఈ చిట్టచివర మాటలో నున్న గభీరమైన యర్థము విచారించి కాళి వణఁకెను.

మఱునాఁడుదయమునఁ దూర్పుదిక్కున భానుమండలము ప్రభావంతమై యుదయించి వెలయఁజొచ్చెను. సూర్యోదయము కాఁగానే దేవాలయముయొక్క కవాటములు తెఱవఁబడెను. తెఱచినతోడనే తైర్థికప్రవాహములు పావనావరణములోఁ జొరఁబడెను. అది విశాలమైన చతురస్రలము. పొడవు నాలుగువందల యేఁబదియడుగులు. వెడల్పు నాలుగువందల ముప్పదియడుగులు. ఆయావరణము నిండ నెన్నో చిన్న దేవాలయములు, దేవతాపీఠములు కలవు. వాటినడుమ కైంకర్యములుజరిగెడు భోగమందిరముతోడను గానవినోదములు జరిగెడు నాట్యమందిరముతోడను, తైర్థికులు గుమిగూడునట్టి జగన్మోహన మందిరముతోడను, జగన్నాథస్వామివారి విగ్రహములుండెడి విమాన మనియెడు గర్భగుడితోడను మహాలయము భాసిల్లుచుండెను. సంవత్సరమున కొకసారి రథోత్సవ కాలమున నీవిగ్రహములు కోవెల విడిచి వసంతమైత్రావనమునకుఁ దీసికొని పోఁబడును. ఉత్కలదేశ సామంతరాజులు కలపఁ బంపుదురు. ఆ కలపతో మూఁడు గొప్పరథములు కట్టఁబడును. సంపన్నులగు భక్తులు పట్టుబట్టలు, జరీబట్టలు స్వామికిఁ బంపుదురు. విగ్రహములు మూఁడు; ఆ విగ్రహములు మూఁడు. పెద్ద జగన్నాథవిగ్రహ మొక రథముమీఁదను, బలభద్రవిగ్రహ మొక్క రథముమీఁదను, సుభద్రావిగ్రహ మింకొక రథముమీఁదను బెట్టుదురు. వేలకొలఁది తీర్థవాసులు రథము త్రాళ్ళఁబట్టుకొని లాగుదురు. ఆ సమయమున విశాలమైన వీథియు, దేవాలయశిఖరములు, గృహముల పైకప్పులు, మనుష్యుల మయములై జనసముద్ర మట్లుండును. రథములు కదల నారంభింపఁగానే చప్పట్లు లాకాశము బీటలువాఱునట్లు బయలుదేఱును. ఆ ధ్వనికి భేరీభాంకారములు తోడునూఁదును. నిరుపమాన మహోత్సవములు జరుగు ప్రాగ్దేశములలో నైనను నటువంటి యుత్సవము లుండునా యని సందియము తోఁచునట్లు రథోత్సవము నిరుపమాన వైభవముతో జరుగును.

రథములు దినదినము కొంచెము కొంచెముగా నడచును. తీర్థవాసులు మరునాఁటి యుదయమున మఱింత యుత్సాహముతో త్రాళ్ళఁబూని పవిత్రమైన పాటుపడుటకు సంతోషపూర్వకముగాఁ గుమిగూడుదురు. విగ్రహములను వసంతగృహమును జేర్చుటకు నీ యుత్సవమిట్లే రమారమి యొక వారమువఱకు జరుగుచుండును. ఒకప్పుడింతకంటె నెక్కువకాలము పట్టును. ఈ దినములలో తీర్థవాసులు పట్టణములోనున్న కోవెల లన్నిటిఁజూచి సముద్రములోనో, పుణ్యతటాకములోనో స్నానమాడి, స్వామివారికి భోగముచేసి నైవేద్యము చేసిన మహాప్రసాదమునే భక్షించుచుందురు. దినమునకు ఎప్పుడు నలుబదివేలమంది దేవతాదర్శనము చేయుటకు ముందు సముద్రములో స్నానము

చేయుదురు. రమారమి లక్షజనులు ప్రతిదినము దేవాలయమునుండి దేవతానివేదనమైన భక్ష్యభోజ్యములు దెచ్చుకొని తినుచుందురు. ఈ ప్రసాదము మిక్కిలి పవిత్రమైనది. ఇది వర్ణభేదము, జాతిభేదములేక యెల్లవారికిఁ బంచిపెట్టఁబడును. మహాప్రసాదము గ్రహించుటకు అగ్రవర్ణము వారు సైతము అంత్యవర్ణము వారి ప్రక్కను నిస్సంకోచముగా గూర్చుందురు. వర్ణభేద మవశ్యమని నమ్మువారక్కడ మాత్రము మినహాయింపు గలదని చెప్పుదురు. ఈ మినహాయింపు మఱి యేస్థలమునను మఱి యేసమయమునను జనులొప్పుకొనరు.

ఈ యుత్సవమైన తరువాతఁ దీర్థవాసులనేకులు పట్టణమువిడిచి పోవుదురు. ఎక్కువ భక్తికలవారు స్వామిరథములు మఱలవచ్చునప్పుడు వాటిని లాగి సాయము చేయుటకై మఱికొంతకాలముందురు. మొత్తముమీఁద రథములరాకపోకలకు మూఁడు నాలుగువారములు పట్టును. వర్షాకాలమందలి యీ మూఁడునాలుగు వారములు సంవత్సరమంతటిలోను జగన్నాథ క్షేత్రమున మిక్కిలి పవిత్రమైన దినములు.

తైర్థికులల్పసంఖ్యాకులుగా సంవత్సరమంతయును నీక్షేత్రమునకుఁ బోవుచుందురు. జగత్కిశోరాదులు వచ్చినప్పుడు చాలమంది తైర్థికులు చేరిరి. సూర్యోదయము కాకమునుపు మిక్కిలి పెందలకడలేచి, జగత్కిశోరునితల్లియు, భార్యయు భక్తితత్పరలై పండా చెప్పిన చొప్పున నడువసాగిరి. ఆ క్షేత్రములో మూఁడు పవిత్రసరస్సులు కలవు. ఇంద్రద్యుమ్నసరస్సు, మార్కండసరస్సు, శ్వేతగంగయని వాటిపేళ్ళు. సూర్యోదయము కాకమునుపు వారిద్దరా సరస్సులలో నొకదానిలో స్నానముచేసి యా దినమున శుచిత మగునట్లు పట్టుబట్టలు కట్టుకొని నానాదేవాలయములు చూచుచుఁ గాలినడకను పట్టణమందు దిరుగఁజొచ్చిరి. కపాలలోచను దేవాలయము, జంబుకేశ్వరునిగుడి, లోకనాథుని కోవెల దర్శించి జగన్నాథాలయమున కావలనున్న మఠముల సందర్శించిరి. ఒకవీధినుండి యొకవీధికి, నొక యాలయమునుండి మఱియొక యాలయమునకుఁ బాదచారియై పోవుచున్నను, జగత్కిశోరునితల్లి గాళ్ళునొప్పులు కాని, యాయాసము గాని యెఱుఁగ దయ్యెను. తీర్థవాసిని కుదయించునావేశము, బలము కాళ్ళయందుఁగూడ నుదయించుటం జేసి యామెయు నలగ లేదు.

ఆ స్త్రీలిద్దఱు మఠముల బసకు వచ్చునప్పటికి సూర్యబింబము నెత్తిమీఁదికి వచ్చెను. ఆలయమునుండి మహాప్రసాదము వచ్చును గనుక వారు బసలో వేఱేవంటఁజేసికొనలేదు. ఈమహాప్రసాదము చేయుటలోఁ దమచేతులు కొంతపడునేని దమకు పుణ్యమని భాగ్యవంతు లగు తైర్థికులు భావింతురు. ఒక్కదినమందే యేబదియాఱు పిండివంటలువండి రాసులు

రాసులుగాఁ బోయుదురు. ఇందునిమిత్తము ప్రతిదినము వేలకొలఁది రూపాయలు వ్యయము చేయఁబడును. ఆపిండివంటలు స్వామికి నివేదనము చేసి చుట్టుప్రక్కల పల్లియలలోని జనులకుఁ బంచిపెట్టుదురు. జగత్కిశోరుని పండాబ్రాహ్మఁ డాయనవద్దనుంచి పెద్దమొత్తమును లాగివేసెను. జగత్కిశోరుఁడు స్వామియాలయము ప్రవేశించునప్పటికిఁ బదిగంట లయ్యెను. శరచ్చంద్రుఁడు తనచేయి బట్టుకొని తీసికొనివచ్చెను. అతనితోఁదల్లియు భార్యయు గూడవచ్చిరి. ఆయంగనలిద్దఱు చిన్నచిన్న గుళ్ళవద్దఁ గొంతధనమిచ్చుచు వచ్చి, యందఱు కలసి జగన్నాథస్వామియాలయము సమీపించిరి. ముందుగా వారు భోగమందిరమును దాటి పిమ్మట గాన మందిరము నతిక్రమించి పలువురు తీర్థవాసులు పరివేష్టింప జగన్మోహన మందిరమున నిలువంబడిరి.

వారియెదుట మందిరములోనే రమారమి పదియేనుగజముల దూరమున మణిమయమైనరత్నవేదిక యుండెను. దానిమీఁదనే దేవతావిగ్రహములు మూఁడును కలవు. ఆవిగ్రహములు తీర్థవాసుల దృష్టిపథమునఁ బడఁగానే పావనమైన యానంద పారవశ్యముచేత వారినోటనుండి కేకలు బయలుదేరెను. పరమభక్తులహృదయ పుటములనుండి ప్రార్థనలు నెమ్మదిగాఁ బయలుదేరెను. ఎంతో యభిలాషయు, నెంతో యాత్రముఁ గలుపుచూపులతో నంధకారమయమైనగర్భగుడిలో నున్న యావిగ్రహములను జూచి మూర్ఛావస్థలో నున్నట్లు మైమఱచిరి. నానాశ్రమల కాకరమైన యాత్రచేయునప్పు డెన్నోమాసములు హృదయమందు వర్థిల్లుచున్న యాశలు సఫలము లైనవి. పావనహృదయముల యందు గర్భితము లైనకోరికలు నెరవేఱినవి. భక్తిచేత సాష్టాంగనమస్కారములు చేయునప్పు డానందబాష్పములు భక్తురాండ్ర కన్నులనుండి స్రవించుచుండెను. ఎట్టకేలకు నియమిత సమయము వచ్చెను. ప్రధానార్చకుఁడు సంజ్ఞచేసెను. అప్పుడందఱు స్వామి సమీపమునకుఁ బోవచ్చును. అంతట తైర్థికులు నిశ్శబ్దముగా నడుగులు ముందుకువేసి, భయభక్తులతో రత్నవేదికాసమీపమునకుఁ బోయిరి. ఆచీకటిగుడి నిశ్శబ్దమై యుండెను. భక్తులు పెదవి గదపక యూరకుండిరి వెలవెలబోవుచు దీపములు మందకాంతిఁ జిమ్ముచుండెను. కాలుచున్న సుగంధద్రవ్యములపొగ మేఘములుగాఁ బైకి లేచుచుండెను. స్వామిదర్శనము చేయఁదలఁచి వచ్చినయాడువాండ్రు పాదములు తడబడ వడఁకుచు నిలువంబడ, పండాబ్రాహ్మణులు వారినిస్వామిసన్నిధికి దీసికొని పోవుచుండిరి. ఆయంగనలు తమ్మెక్కడికిఁ దీసికొని పోవుచున్నారో యెఱుఁగక గోడలు, స్తంభములు చూడక పండాలవెంటఁ బోయిరి. పవిత్రమైన దివ్యస్థలమున నుంటి మన్నమాటమాత్రమే యెఱిఁగి

యుండిరి. నోటమాట లేక సాష్టాంగ దండప్రణామము చేయునప్పుడు దేవతావిగ్రహము లను మనసారఁ జూచుచుందురు.

నమస్కారమైన తరువాత భక్తులు తాము తెచ్చిన కానుకలు వేదిక మెట్ల మీద సమర్పణము చేయుదురు. బిహారుదేశమునుండియు, నుత్తరహిందూస్థానము నుండియు, వచ్చిన పేదకూలివాడు ధోవతికొంగున గట్టినమూట విప్పి రాగిడబ్బులు సమర్పించెను. వర్తకునిభార్య బుటేదారుచీర సమర్పించెను. చిల్లరవర్తకుని యిల్లాలు పూవులనర్పించెను. భాగ్యవంతులగు స్త్రీలు రత్నఖచితమైన కంకణములు, కంఠాభరణములు సమర్పించిరి. జమీందారులు మొహరీల నిచ్చిరి. సమస్తవిధము లైన కానుకలను సమస్తవిధములైన జనులు సమర్పించి తమతమభక్తివిశేషమును వెల్లడిచేసిరి. జగజ్జ్యోతిని తల్లి యందరి కంటె జట్టచివర గర్భగుడి వదలివెళ్ళెను. ఆమె గుడి విడుచునప్పుడు బాష్పములు కన్నుల నుండి ధారగ కుమారుని యొక్కయు, కోడలియొక్కయు శిరస్సులు స్పృశించి చిర కాలమునుండి హృదయమున వర్ధిల్ల జేయుచున్న యాప్రతిజ్ఞను బయలువుచ్చెను. ఓజగన్నాథా! ఓలోకనాయకా! నాకుమారునకు దేహారోగ్య మిచ్చి యైశ్వర్య మిచ్చి కాపాడుము. నాకోడలు కడుపెడుబిడ్డలతల్లియై గృహయజమానురాలై మనుమల మనుమ రాండ్ర నెత్తవలెను. ఈలోకములో నేను డెబ్బదిసంవత్సరములు బ్రతికినాను. నాపని యైపోయినది. నేడు మొదలుకొని నేను నీసేవజేసెదను. నాశరీరము నీకర్పించెదను. ఈపట్టణములోనే యుండెదను. ఈముసలి దానికి నీవే శరణంబవు. ఈ సముద్రతీరమున నున్నవాడవు నీవే. నాహృదయమున నున్నవాడవు నీవే.

ఈప్రతిజ్ఞ వినఁగానే యక్కడనున్న వారి కందఱకు మేను కంపించెను. తల్లి కట్టిరహస్య మనోరథ మున్నదని జగజ్జ్యోతికిఁ గాని, కాళికిగాని తెలియదు. ఆమె సంసారము నెంతో నేర్పుతో దిద్ది చక్కఁబెట్టుచునచ్చెను. ఆమె లేనిచో గృహమున సంతోషమే యుండదు. అటువంటి మాతృదేవతను బ్రతిజ్ఞావిముక్తురాలిగజేసి మరల వెంటఁబెట్టుకొనిపోవుటకు జగజ్జ్యోతింగాయాలు తనకున్న యావద్ధనమునైన నియ్య సిద్ధముగా నుండెను. ఆమె ప్రాణసుఖంబుఁ గొడుకునకుఁ గోడలికిఁ బ్రియమైన దిగుటచే నామెను దోడుకొని పోకుండ నింటికి మరలి పోవుట యనఁగానే వారిహృదయములు శూన్యములయ్యెను. కాని చేయునదిలేదు. ప్రతిజ్ఞ నోటనుండి వచ్చెను.

అప్పుడు కాళి యేడ్చుచు నత్తగారికిట్లనియె. "అమ్మా! మిమ్ముఁ దీసికొని పోకుండ మేము వర్ధమానము వెళ్ళము. గృహాయజమానురాలు లేకుండ మాకు గృహమేమిటి?"

"బిడ్డా! నీవే గృహాయజమానురాలవు కమ్ము! నీవంతు వచ్చినది. ముద్దులతల్లివి కమ్ము! జగన్నాథస్వామి నా మొఱ లాలకించినాఁడు. భూమిమీఁద నేను బ్రతికవలసిన కాలమెంతో లేదు. చరమావస్థలో మావంటి ముసలివాండ్రు దైవభక్తి గలిగి, యూర్ధ్వలోక ప్రయాణమునకుఁ బ్రయత్నము చేసికొనుచు నుండవలెనని ధర్మశాస్త్రములు వాదించుచున్నవి. ఈ ప్రపంచములో నేను వచ్చినపని యైనది. నామాట నేను చెప్పివేసినాను."

లారఁజూచి సంతోషించినది. ఇప్పుడామె భక్తిమార్గమునఁబడిపోయినది. అటువంటి యుత్తమజన్మము, ధార్మికవృత్తితోనే యంత మగుట యేమి యాశ్చర్యము! ఓ పరమేశ్వరా! నేను నీనిర్ణయ ప్రకారమే నడుచుచున్నయెడల నన్ను నీసేవకురాలనుగా నంగీకరించి, దుఃఖమగ్నుఁడైన నాకుమారుని సముద్ధరింపుము."

కుమారునిమాట జ్ఞప్తికి వచ్చినప్పుడెల్ల పాపమావృద్ధవితంతువు మొగము వెలవెలఁబాఱుచు లోనున్న బెంగఁ దెలియఁజేయుచుండును. ఆమెయాజ్ఞ శిరసావహించి శరచ్చంద్రుఁడాత్మసౌఖ్యమును గోల్పోయినాఁడని యామె యెఱుఁగును. మాతృవాక్యపరిపాలనము వలన నతనికిఁ గలిగిననష్టము గూడనామె యెఱుఁగును. శరచ్చంద్రుఁడు తల్లికి వ్రాసినజాబులు తక్కువ. వానిలో విషయముగూడ సంక్షిప్తముగా నుండును. ఎప్పుడు వ్రాసినను బావమాట, తోఁబుట్టువుమాటే గాని తనమాటేమి వ్రాయఁడు. కలకత్తాకు మరలఁబోయి విద్యాభ్యాసము చేయఁదలఁచుకొన్నట్లు జాబులవలనఁగనఁబడెను. ఒకనాఁడు సాయంకాలము శరచ్చంద్రునితల్లి దీపముదగ్గఱ నొంటిగాఁగూర్చుండి కుమారుని యొద్దనుండి వచ్చినసంక్షిప్తలేఖలను దిరుగవేయుచుండెను. అప్పుడామె హృదయము శూన్యముగ నుండెను. ఆమెమనస్సును భయమావహించెను. ఆమె మనోగతములైన యాలోచనల నెవ్వరికి విప్పి చెప్పలేదు. వానిని హృదయమునందే నిక్షిప్తము చేసి పలుమాఱు తనలో తానే వితర్కించుకొనుచువచ్చెను. గంభీరుఁడు, దయాశాలియు నగు తనకొమరుని జీవితము తనయాగ్రహమువల్లను, దన లౌక్యమువల్లను భగ్నమైనదని యాపె భయఁపడి వడఁకఁజొచ్చెను.

కూఁతురు డబ్బాటుగ నదృశ్యురాలయినదని విని యుమయొక్కతల్లి కలకత్తాకు వచ్చెను. ఆమె పలుమాఱు శరచ్చంద్రునితల్లినిఁ జూచుచుండెను. దిన దినము వారికి నేకవిషయములగూర్చి దీర్ఘసంభాషణలు జరుగుచు వచ్చెను. తన కూఁతురు తనకుఁదక్కక బెంగ పెట్టిపోయినందుకామె సహజమైన దుఃఖముతోఁ జెప్పుకొని యేడ్చెను. అప్డను దలఁచుకొనినప్పుడెల్ల మనస్సు దుఃఖపూరితమై కన్నులు బాష్పపూరితములై యుండుననియు, నామెమాట యనుక్షణము స్మరణకు రాకమానదనియుఁ జెప్పి వగచి యిట్లనియెను: "అమ్మా! దైవమును నిందింపనేల? నేను చల్లనివిత్తనములపంట కోసికొనక తప్పునా. ఈ జన్మములో నిటువంటి ఘోరదుఃఖము సంప్రాప్తించుటకు నేను పూర్వజన్మములో నెన్నిపాపములు చేసితినో. ఐశ్వర్యముఁ జూచి, కన్నులు పొరలు గ[illegible] నన్ను పదమునాకు నాబిడ్డను గట్టిపెట్టితిని. గాని,

మఱి యే పేదవాని చేతిలోఁ బెట్టినను, నాతఁడు నాయువు పెద్దతనములో నాకు సంరక్షణ సేయుటకును, నాకు మనస్సంతోషము గలుగుటకును గంజియన్నము దినుచు నైన బ్రతికి యుండును గదా ?"

ఆమెకు శరచ్చంద్రుని తల్లి యిట్లనియె. "అక్కా ! నిన్ను నీవు తిట్టుకొనవద్దు. భగవంతుఁడే మన కార్యముల నిర్ణయించును మన మాయన చేతిలోని పనిముట్లము. నిన్నుఁ దిట్టుకొనవలసిన యవసరము లేదు. ఎందుకంటే, మనయమునకు వివాహమైనప్పుడు దాని మగడు చెడిపోలేదు. తప్పుదారులుఁ ద్రొక్కలేదు. అందరివలెనే చదువుకొని బుద్ధిమంతుఁడై బాగుపడుననుకొన్నాము. అతడు మనయందరియిండ్లు కొంచెము కరఁగినంత భాగ్యవంతుఁడైనప్పటికి నడుమనడుమ తాల్పుకారు గ్రామమునకేలాగు వచ్చెడివాఁడో, వచ్చి గ్రామములో నున్న పెద్దవారి నందఱను జూచి యేలాగు నమస్కారములు చేసి పోయెడు వాఁడో మనకన్నులతో మనము చూడలేదటమ్మా ! అదినములన్నియు నాకు జ్ఞాపకమున్నవి. గ్రామమునకు వచ్చినప్పుడు ధనంజయుఁడు నన్ను జూడక వెళ్ళెడు వాఁడు కాఁడు. పాపము ! ఊమ నన్ను పిన్నీయని పిలుచు చుండుటచేత ధనంజయుఁడు నన్నత్తగారూ యనిపిలుచు చుండెడివాఁడు. నీకుల్లు ఆదినములలో నేను చూచిన పిల్లలందఱిలో బుద్ధిమంతుఁడు" ఊమతల్లి యామె కిట్లనియె : "ఆగోడలు త్రవ్వకమ్మా ! నాగుండె పగిలి పోవును అక్కా ! నిజమే నీ వన్నమాట. మాధనంజయుఁడు జాలి గుండె గలపిల్లవాఁడె. అప్పుడుగా దిప్పటికైనజాలిగుండెవాఁడె. ఏమైననేమి ? పెద్ద గోతిలో దిగి చెడిపోయినాఁడు. నాతల్లిని బలిపెట్టినాను."

"అక్కా ! విచారింపవద్దు. ఊమకష్టములు గట్టెక్కినవి. తాల్పుకారు గ్రామములో మొన్నటిదాక నాతొడమీదఁ గూర్చుండి నాప్రక్కనాడుకొని నన్ను పిన్నీ, పిన్నీ యని యెంతో ప్రేమతోఁ బిలుచుచు ముద్దుల మూటగట్టుచుండిన యాబిడ్డను దలఁచుకొన్నప్పుడు పిచ్చియెత్తిపోవు నేమో యని నాకు భయము వేయును. నాకన్నుల నుండి నీటిబొట్లు రాక నెత్తురుబొట్లే రాలును. దానికి నేఁటికి శాశ్వత విశ్రాంతి కలిగినది. బ్రతికియున్నవాళ్ళము మనమే దుఃఖములపాలై కష్టము లనుభవింపవలెను. విశ్వేశ్వరుఁడు నా కొమరున కాయురారోగ్యములిచ్చి రక్షింపవలెను. బాధలతోను దుఃఖములతోను నిండిన యీ ప్రపంచపు గొడవలలోనుండి నేను మరలిపోయి కృష్ణా రామా యనుకొనుచుఁ గూర్చుండవలె."

"అక్కా! దేవుడు నీ కుమారుని రక్షించును. ఏమంటే శరచ్చంద్రునివలె మంచితనము దయాదాక్షిణ్యములుగల పిల్లవానిని నా కన్నులతో నేఁ జూచిలేను. అతఁడు హేమునకు, బిందునకు, సోదరునికంటె ఎక్కువగా నున్నాఁడు. మీ యల్లుఁడు యాత్రకు వెళ్ళుచున్నప్పు డతని సంరక్షణకొఱకు మీవాఁడు చదువుపరీక్షను మానుకొన్నాఁడు. అక్కా! అతఁడు త్వరలోనే వచ్చి నీ ముసలితనమందు నీకుఁ జేయూతయై నీ కానందము గలిగింపఁ గలఁడు."

ఈమాట వినఁగానే శరచ్చంద్రునితల్లి నిట్టూర్పువిడిచి సన్నని యెలుఁగున నిట్లనియె. "అతని గుండెమీఁద నొప్పియున్నది. వానిబ్రతుకు సుఖములేని దైపోయినది. అదే నాకు దుఃఖము."

"ఓహో! పాపము సుధను మీవాఁడు వివాహము చేసుకోవలెనని తలపెట్టిన మాటా నీ విప్పుడనుచుంటివది? అక్కా! ఆమాటెత్తకు. ఆబాధ మనము మఱచిపోదము. హేముఁడు చిన్నవాఁడు. బిందు వానికన్న చిన్నది. తెలివితక్కువపిల్లవాని మాటలు పాటిచేసి తెలివితక్కువ యాలోచనఁ జేసినారు. ఇదివఱకే దానికై బిందు విచారించుచున్నది. ఇప్పుడు పొరఁబాటుచేతనైన నామె యాగ్రహపడ మెత్తగు. అక్కా! ఈ యపనింద నీ కొడుకునకు బాధింపదు. అతఁడు మగవాఁడు అతనికేమి? అటువంటి సంగతులు ఆఁడువాండ్రకు మనకు బాధకలిగించును. బిందు మరల నట్టిమాటే తలపెట్టదు. పాపము! సుధ యావజ్జీవనము తీరని యపనింద పాలైనది అక్కా! సుధ మునుపటిసుధ కాదు సుమా పాపము! చిక్కిశల్యమై పోయినది కన్నులు గుంటలు పడినవి. మొగము పాలిపోయినది. నెత్తురుచుక్కలేదు. అట్టె మాటాడదు. పగలెల్ల నేదో పనిపాటలతోనే కాలక్షేపము చేయును. అది యెంతో సుకుమారి. పాపమీనింద కడచి యది యెట్లు బ్రతుకునో తెలియదు."

"అయ్యో కూతురా! సుధను తలఁచుకొంటినా నాబాధలు నేను మఱచిపోదును. చిన్నతనమందే వితంతువైపోయినది కాదా. ఈ వృత్తాంతము జరిగినతరువాత వైధవ్య దుఃఖము రెట్టింపగును. కుఱ్ఱ పాడుకట్టు, దానిలోపమేమున్నది? ఎవరిలోపమని చెప్పఁ గలను? నాకొడుకు దానిని వివాహమాడవలెనని కోరినప్పుడు బిందు దురుద్దేశము లేదనియే సమ్మతించెను. ఈమధ్య కలకత్తాలో వితంతువివాహములెన్నో జరిగినవి. మన శాస్త్రము లటువంటి వివాహముల నొప్పుకొనుచున్నవని పండితులు చెప్పుచున్నారు. అందుచేత నటువంటి వివాహము తప్పుకాదని బిందు తలచియుండవచ్చును. చెల్లెలు

శరచ్చంద్రుఁడు కలసి యనుకూలదాంపత్యము కలిగియుండిన పక్షమున లోకములోని యెవరికి కావలెనని యామె తలఁచి యుండును. కౌసల్యా! బిందు మంచి యుద్యోగము లోనే చేసినది, ఆమెను నేను నిందించను. సుధను తీసికొని నాయొద్ద కొకసారి రమ్మని చెప్పు. ఒకసారి వాండ్రను జూడవలెనని యున్నది. ఎంతో శాంతము వినయము గల పిల్లలు; వాండ్ర మొగములు జూచినయెడల నాకన్నులు చల్లఁగా నుండును."

"అక్కా! వచ్చి నిన్ను జూడవలసినదని తప్పక వారితోఁ జెప్పెదను. కాని వాళ్ళకు పగలెల్ల పనితో యుందురు. నేను పెద్దదాననైనాను. నేను వాండ్రకేవిధమైన సహాయము చేయఁజాలను. నేనేదని నేయవలెనని చేయిపెట్టినను ముందుగా నా కుము మాటే జ్ఞప్తికి వచ్చును. కన్నులు నీళ్ళుగ్రమ్మి కనబడవు. కూర తరుగుకొనునప్పుడు నాకును జ్ఞప్తికి వచ్చును, ఆపనియంటే దానికెంతో యిష్టము. బియ్యము ప్రాయిమీద పడవేసితినా, యనుజ్ఞాపకము వచ్చును. వంటలో నా కడియొంగో సాయము చేయుచుండెడిది. నేనిప్పుడు పనికిరానిదాననైనాను ఇప్పుడు నాకు సుధాబిందులు తప్ప మఱి దిక్కెవ్వరున్నారు? దైవము వాండ్రకైన దీర్ఘాయుర్దాయమిచ్చి కాపాడవలెను."

"వాఁడు నాకు మా కాశీ శరచ్చంద్రునివంటివాఁడే. భూమిమీఁద నేనెన్ని దినములు బ్రదుకనని సుధాబిందులతోఁ జెప్పు. చిన్నప్పటినుండి నేను ప్రేమించినవారిని ముసలితనములో మఱచిపోనని చెప్పు."

ఆ మరునాఁడు సాయంకాలము శరచ్చంద్రునితల్లి బిందును జూడవచ్చెను. సుధా శరచ్చంద్రుల వివాహ సంకల్పము చెడిపోయినతరువాత వారికుటుంబము నామె చూచుట కదే మొదలు. హేముఁడు పూజ్యురాలయిన యాయవ్వ నసాధారణమైన గౌరవముతో ప్రీతితో సన్మానించెను. పల్లకిలోనుండి చేయూఁతయిచ్చి యామె నాదరించి జాగ్రత్తగా బిందున్న గదిలోని కామె నతఁడు తీసికొనిపోయెను. ఆమెను జూచి బిందు వినయముతో సెమరుగా వచ్చి పాదములంటి నమస్కరించి యొక పీటమీఁదఁ గూర్చుండఁబెట్టెను. ఆ యవ్వరాక సుధయుఁ జూచెను. గాని యా వృద్ధాంగనయొక్క దయానురాగములకుఁ దగనిదియుంబోలె నామె నేరముచేసిన దానివలె సిగ్గుపడి తలవంచికొని గదివిడిచి యావలకుఁ బోయెను.

"అమ్మాయీ బిందూ! యింతకాలమునుండి నన్నుఁజూచుట కొక్కసారియైన వచ్చినదానవు కావేమి? పిన్ని, పిన్నియని యెంతో ప్రేమతోఁ బిలచెడుదానవు. ఆ పలుకులన్నియు మఱచిపోయినావా యేమి?"

"లేదు పిన్నీ. నేనెప్పుడును మరచిపోను. కలకత్తాలో మాకన్నో చిక్కులు, రోగములు సంభవించినవి. మీరెఱుఁగరా? తాల్పుకారు వెళ్ళఁదలఁచుకొన్నాము. అక్కడ మావంటి పేదవాండ్రు స్వేచ్ఛగా సుఖముగా నుండవచ్చును."

"నిజము నిజము బిందూ! ఈ పెద్దపట్టణము ద్రవ్యవంతులకు నుద్యోగస్థులకుఁగాని బీదవారికిఁ గాదు. ఇక్కడ నేనుగూడ నొంటిగనున్నాను. సంతోషములేదు. వారణాసి యెప్పుడు వెళ్ళుదునా యని కోరుచున్నాము. భూలోకబంధములు ఛేదించుట మిక్కిలి కష్టము. నాపని అయిపోయినది. నావంటి పెద్దదానికి దైవభక్తి, ధర్మకార్యములు జరిగినవి."

"పిన్నీ! నీవు ధన్యురాలవు. జీవముయొక్క ధర్మములు చక్కఁగా నెఱవేర్చితివి. నీ జీవనమంతయు మొదటనుండి చివరవఱకు భక్తిమయము. వారణాసిలో నీవు జీవితశేషముఁ గడపుట నీవంటి పవిత్రచరిత్రకుఁ దగియున్నది. మేము సంసారపుగోడవల మధ్యను బడియున్నాము. నీ యుదాహరణము పాపమార్గమునఁబడి పోకుండ మావంటి వారికి మార్గదర్శకమగుఁ గాక! కాళి సుఖముగానున్నట్లు వార్త తెలిసినదా?"

"తెలిసినదమ్మా! భగవంతుని యనుగ్రహమున్నది. మా అల్లుఁడు జగత్కిశోర రాయులు జగన్నాథస్వామి యనుగ్రహముచేత రోగము కుదిరినది బాగుపడినాఁడు. వారు మరల వర్ధమానమునకు వచ్చియున్నారు. నా కొడుకుకూడ నాకు జాబులు వ్రాయుచున్నాఁడు. కాని, తఱచుగా వ్రాయఁడు. తాను తిరిగి కలకత్తాకు వెళ్ళుటను గురించి యేమియు వ్రాయఁడు."

ఆ మాటలకు బిందు ప్రత్యుత్తరమియ్యక యూరకుండెను.

"అమ్మాయీ బిందు! నా కొమరుఁడు కలకత్తా వచ్చువఱకు నేను కనిపెట్టుకొని యిక్కడ నుండఁజాలను. సర్వజ్ఞుఁడైన భగవంతుఁడే నాబిడ్డను నడిపింపఁగలఁడు. శరచ్చంద్రుఁడు పెద్దవాఁడైనాఁడు. తల్లిసాయ మపేక్ష్యము. నేనుండవలసినచోటు వారణాసిగాని యీ స్థలముకాదు. దోక్యము కలుగఁజేసికొనుటవలన వానికి నష్టము కలుగును గాని లాభము కలుగదు."

బిందు దానికి బదులు చెప్పలేదు.

"ఏది యెట్లయినను జాగుసేయక నేను వారణాసికి మరలి పోఁదలఁచినాను. బిందూ! మిమ్ము మరలఁ జూడను గనుక నిన్ను, సుధను జూచి దీవించి వెళ్ళవలెనని

వచ్చినాను. మీరు తల్లిలేని పిల్లలు. నీమీఁద మీతల్లి కెంత ప్రేమో, నాకునంతే ప్రేమ. మీరు సుఖపడునట్లు చేయుటకు నాకు భగవంతుఁడు తోడ్పడుఁగాత !"

ప్రేమరసపూరితములైన యీమాటలువిని బిందు కన్నీరు విడిచెను. కాని యప్పటికి మాటాడలేదు.

"పరమసాధువైన సుధయెక్కడ ? దాని నొక్కసారి పిలు. నేను వెళ్ళకముందు దాని నొకసారి కౌఁగలించికొని దీవించవలయునని యున్నది."

బిందు సుధను దీసికొని వచ్చెను. తాల్పుకొరుగ్రామములో శరచ్చంద్రునితల్లి చూచినప్పటికంటె సుధ పొడవెదిగి మిక్కిలి పలుచబడెను. ఆమె మెత్తని చెక్కిలు తెల్లఁబడెను. కన్నులు దీర్ఘవిచారమును సూచించెను. చేతులు సన్నగా పొడవుగా నుండెను. చిన్ననాఁటి చిఱునవ్వు లామె పెదవులను విడిచి యెందోపోయెను. అతి బాల్యమున సంప్రాప్తమైన దీర్ఘవిచారము మొగమున నెలకొనియున్నట్లు స్పష్టముగఁ గనఁబడుచుండెను. ఈ మార్పులుచూచి శరచ్చంద్రునితల్లి భయపడెను. సుధ తలక్రిందకు వంచి యా యవ్వచరణము లంటినప్పుడు విచారజనితములో, పశ్చాత్తాపజనితములో బాష్పము లామెకన్నులనుండి బాలికశిరస్సుమీఁదఁ బడెను.

"బిడ్డా ! దగ్గఱరమ్ము. నన్నుఁ గౌఁగిలించికొమ్ము ! మనఃపూర్తిగా నంతఃకరణ శుద్ధిగా దీవించనిమ్ము. ఈ యైదాఱునెలలలోనే యెంతచిక్కిపోతివే తల్లీ ! చిన్నతనమందే నీకుఁ దగనిదుఃఖము వచ్చిపడినదే యమ్మా. చిఱునవ్వువెన్నెలలు గాయు నీ మొగము దుఃఖ మొందఁదగినది కాదు. నీ సుందరనేత్రములు దుఃఖబాష్పములకుఁ దగినవి కావు."

రాత్రి బిందు చుట్టముదగ్గఱ సుధను గూర్చుండఁబెట్టి బిడ్డలను పరుండఁబెట్టుటకు వెళ్ళెను. చమురు లేక దీపము మినుకుమినుకుమని జొచ్చెను. సుధ పిల్లి కూనవలె జంకుచుఁ జిన్ననాఁడు తాల్పుకారులో నున్నప్పుడామెయొడిలోఁ గూర్చున్నట్లే యాయవ్వదగ్గఱఁజేరి కూర్చుండెను. ఆయవ్వమనస్సు పూర్వాదినములను బూర్వవృత్తాంతములను దలఁచుకొనియెను. పేవితఁతువైన సుధతల్లి సుధనుదమయింటికిఁ దీసికొనివచ్చుటయు, సుధ వచ్చియురానిమాటలతోఁ దమ్ముఁ బ్రేమించువారి కొఱకు సులభముగాఁ బోవునట్టి శిశుసామాన్య సహజలక్షణముతోఁ జేతులుచాచి దనమీఁదఁ బడుటయుఁ దా నెత్తుకొని ముద్దాడుటయు నామెకు జ్ఞప్తికివచ్చెను. తల్లిపోయినను తనవాత్స

సుధ మాతాపితృవిహీనయై తానెప్పుడైనఁ బిలిచి యాదరించి నప్పుడు తల్లి పిలుపున కానందించినట్లే యానందించినదినమునుకూడ నామెకు జ్ఞప్తికివచ్చెను. అంతేకాదు. సుధ బాలవితంతువై తన దురదృష్టమును దెలిసికొన లేక బాల్యచాపలముతోను, ప్రేమతోను దన గృహమును, దన హృదయమును వెలయింపఁ జేసిననాఁటి దినములుకూడ నామెకు జ్ఞప్తికి వచ్చెను. తాను వారణాసి వెళ్ళెడునాఁడు సుధయేడ్చుచుఁ దనపాదములువిడువక, తన మనస్సు కరగించిన కథగూడ నామెకుమనోహర మయ్యెను. తల్లిలేని యాపిల్ల యాయవ్వ ప్రేమచేతను, దయారసముచేతను వర్ధిల్లెను. ఇప్పుడు నైతము నామెయాశ లడుగంటఁజేసి యామె జీవనమును దుఃఖభాజనముచేసిన భయంకర వృత్తాంతములను మఱచిపోయి, చిన్న బిడ్డవలె నత్యంతవిశ్వాసముతో, మితిమీఱిన యనురాగముతో, నామెదగ్గఱ జేరెను. కొన్ని విషయము లాయవ్వహృదయమునకు నొప్పికలిగించెను. ఆమె హృదయమున గొప్ప బెంగ బయలుదేఱెను. ఆబిడ్డను దగ్గఱచేసి యామె కౌఁగిలించికొని మెల్లగా నేదో ప్రార్థనము చేసెను. "భగవానుఁడా! నేను పెంచినబిడ్డను నాచేతిలోఁ గొట్టకూఁడదు. అల్పజ్ఞానముచేత నే నింత దోసముచేసితిని. పరమేశ్వరా! నన్ను క్షమింపుము. నీయనుగ్రహము నాపైజాలువలెను."

---

## ఇరువదిఅయిదవ ప్రకరణము

### [illegible]టము.

కలకత్తానగరమున దక్షిణపు దిక్కునం గలపేటలలో నాఁది గంగాతీరమున జగత్ప్రసిద్ధమైన కాళీఘట్టదేవాలయము గలదు. పూర్వకాలమున గంగానది కాళీఘట్ట సమీపమునుండి సముద్రమునం బ్రవేశించు చుండిన దనియు నదిచేత భువన పావనమైన భాగీరథితీరమున శ్రీకాళికాదేవాలయము నిర్మింపబడిన దనియు లోకులు చెప్పుకొందురు. గంగానది యీవైపునుండి ప్రవహించుట మానెను. అందుచేతఁ గాలక్రమమున నాదిగంగ యని పేరుపడినయీపాయ యిప్పుడెండిపోయెను. నది పూర్వకాలము వలెనే నేఁడునైతము పుణ్యక్షేత్రముగా గణింపఁబడుచున్నది. కలకత్తాయను పేరు [illegible]ఘట్టము [illegible] శ్రీకాళికాదేవి వసించుచున్నది [illegible]

లీపురాతనదేవాలయమునకు దమభక్తిసూచకముగా నెన్నో కానుకలఁ బంపుచుందురు. ఉత్సవదినములలోఁ గలకత్తానగర స్త్రీలతో దేవాలయము చుట్టునున్న సందుగొందులు నిండియుండును. ఆలయసమీపమున నున్న పావననదీజలము పావనత్వముగోల్పోయి క్రొత్తనీరు రాక నిలువయుండుటచేత హేయమైనను జనులందులోనే మునిఁగి పవిత్రుల మైతిమని భావించి పట్టుబట్టలు తాల్చి మడికట్టుకొని యాలయమునకుఁ బోయి స్తవములు చదివి బలి సమర్పించి పూజలు చేసి వత్తురు. మతసంబంధములైన కర్మలు దీర్చిన తరువాత యాపావనక్షేత్రమునఁ జేరునట్టి కేనవేలుభిక్షుకులకు దమయొద్దనున్న సొమ్ము వెచ్చపెట్టి యన్నాతురుల కన్నము పెట్టించి పేదలకుఁ దమకుఁ దోచినంతసహాయము చేసి పుణ్యము గట్టుకొందురు.

శీతాకాలమున మనోహరమైనయొక నాఁటి యుదయకాలమున శరచ్చంద్రుని తల్లి పల్లకియెక్కి కాళీఘట్టమునకు వచ్చెను. ప్రొద్దునెత్తిమీఁదికి రాకమున్నె యాసాధ్వి స్నానముచేసి దేవతాదర్శనము చేసి యింటికి మరలఁ బోవలెనని తలచెను. తనకు మార్గప్రదర్శకుకుగా నుండుటకు నొకని వెళ్ళినయొక ముసలిపండా బ్రాహ్మణుని సహాయమున దేవాలయమును విడిచి జనసమ్మర్దము గలబజారును దాటి కొంతమారుమరిగి యొకచిన్న కుటీరము జేరెను. ఆకుటీరము చల్లని నీడలనిచ్చు చెట్లనడుమనుండెను. ఆకుటీరపుగుమ్మము ముందర నామె నిలిచి యుండెను. పండా బ్రాహ్మణుడు లోనికరిగెను. మఱియొక వృద్ధబ్రాహ్మణుడు వెలుపలికి వచ్చెను. డెబ్బది వర్షములు మున్ను దీర్ఘమైయుండిన యాతని ముడిచిన కాయమును వంచివేసి వానివిశాలఫాలభాగము ముడుతలపడజేసెను. అతనితల ముగ్గుబుట్టవలె నెరిసెను. పిలకజుట్టు వెనుక వ్రేలాడుచుండెను. దేవతా నామములు ముద్రింపబడిన యొకనామాలు పట్టుపైన వేసికొని కఱ్ఱయూఁతగొని నిలువబడెను. తాల్పుకాయు గ్రామమున నున్న ఘోషకుటుంబమున కీవృద్ధబ్రాహ్మణుడు గురువు. అతనిలోఁగూడఁ గొంత పదునమువారము వచ్చెను. ఆతఁడు నవీనవయస్సున నుండెను. అతని ముగము నాని పావనత్వమును మతిసంబంధమైనవిష్యయు సూచించుచుండెను. అతఁడు కాషాయ వస్త్రములు ధరించెను. అతని శరీరము సౌష్ఠవము విడిగి దృఢముగా నుండెను. అతని కన్నులు నిస్తేజము ... మచ్చుచుండెను. వెండ్రుకలు జడలుగా నల్లనైపోయి తెల్లగా నుండెను. అతఁడు కాశీనుండి వచ్చిన బ్రహ్మచారి, శరచ్చంద్రుని తల్లి వెనువెంట గురువుపాదములకు సాష్టాంగనమస్కారము చేసి పిమ్మట బ్రహ్మచారి కాదిగాఁ బోవుచు

చేసెను. వారామెను లేవనెత్తి యాశీర్వదించి కుటీరములోనికిఁ దీసికొని పోయిరి. "మానాయనగారు దేహారోగ్యము గలిగి సుఖముగా నున్నారా" యనియామె నడిగెను.

"అమ్మాయీ! భగవంతుని యనుగ్రహముచేత నేను సుఖముగా నున్నాను. నాబిడ్డకూడఁ సుఖముగా నున్నదా? పిల్లలు సుఖముగా నున్నారా? గృహము సుఖాస్పదముగా నున్నదా?"

"నాయనా! పరమదయాకరుఁడైన భగవంతుఁడు నాకు దీర్ఘాయుర్దాయము పోసినాఁడు. ఈలోకములో మనశ్శాంతి యెవరి కున్నది? నేను కలకత్తాలో నొంటిగా నున్నాను. కాశీపురము వెళ్ళఁగోరుచున్నాను. కాశీపట్టణమందె నాకు మనశ్శాంతి కలదు. నాయల్లుఁడు జగన్నాథయాత్ర వెళ్ళినాఁడు. నాకూఁతురు గూడను వానివెంట జనినారు."

"అమ్మాయీ! వారు మంచిపనిచేసినారు. జగన్నాథస్వామి యాయురారోగ్యములిచ్చి వారిని రక్షించుచుండు. బిడ్డా! భగవంతునే నమ్ముకో. ముసలితనమందు నీ కతఁడే మనశ్శాంతిని సుఖమును ప్రసాదింపవలెను."

"ఆయనపాదములనే నేను నమ్ముకొని యున్నాను. భగవద్విశ్వాసమే నన్ను రక్షించుచున్నది. కాని యాఁడుదానను గనుక అప్పుడప్పుడు నా హృదయము చలించుచుండును. ఆఁడుదానిబుద్ధి యపమార్గములు పట్టించును. తండ్రీ! నాకుఁ గలిగినకష్టములలో సాయము చేయవలయును. మహానుభావుఁడైన యీబ్రహ్మచారిగూడ నాకు దగిన సలహా నిచ్చి తోడుపడవలెను."

అనవుఁడు బ్రహ్మచారి యిట్లనియె. "అక్కా! నావల్లనైన సాయము నేను తప్పక చేసెదను. నీవు నన్ను జూడకపోయినను వారణాసిలో నేను నిన్ను పలుమారులు చూచి యుంటిని. తొల్పుగాయి గ్రామమునకు నేను క్రొత్తవాఁడను గాను. ఉమను బిందును వారిని వివాహములు కాకమునుపు చిన్నప్పటినుండి నే నెఱుఁగుదును."

"అందులో బిందు సుఖముగా మగనితోఁ గాపురము చేయుచున్నది. అది యిద్దఱుపిల్లలతల్లి పాపము! ఉమ పోయినది."

"ఉమ పోయినదా యేమి? గ్రామమునం దల్లారుముద్దుబిడ్డ గదా! అనాఁడు [illegible] పరమానందమును గలిగించుచుండెగదా.

తళతళలాడుచున్న దానికన్నులు ముద్దులు మూటకట్టుదాని మొగము నాకింకను బాగుగ జ్ఞాపకమున్నవి. ఆముద్దులబిడ్డ ఆచిన్నపాప యింత యల్పకాలములోఁ బోయిన దన్నమాట. నమ్మఁజాలకున్నాను. అక్కా! అది యేలాగునఁ బోయినది? ఎప్పుడు పోయినది?

"రమారమి నెలక్రిందట అది యిల్లువిడిచి పోయినది. మఱికనఁబడలేదు. వివాహ విషయమున నది మందభాగ్యురాలు. దానికదే దీర్ఘవిచారము. తన దురదృష్టమును గూర్చి యెల్లప్పుడు విచారించుచుండెడిది. తనకష్టమునంతము చేసికొనుటకది యేటిలోఁబడి చచ్చినదని చెప్పుకొనుచున్నారు."

"అక్కా! నే నామాట నమ్మను. అది నదిలో మునిఁగి చచ్చుచుండఁగా నెవ్వరు చూచినవారులేరు. ఆమెకష్టములు గట్టెక్కునట్లు బాల్యకాలమున నామె జీవితము నాచ్ఛాదించిన దుఃఖమేఘములు విడిపోవునట్లు నామె నేదేవాలయమునందో నేపుణ్యక్షేత్రమునందో జనులకన్నుల కగపడకుండ భగవంతుఁడే దాఁచియున్నాఁడని నాయభిప్రాయము."

"బ్రహ్మచారీ! నీమాటలు వేదవాక్కులవలె సత్యములు కావలె నాయనా! పాపము ఆమతల్లి నీవు దీర్ఘాయుష్మంతుఁడవు కావలెనని కోరి నీ పేరుచెప్పుకొని బ్రతుకును."

"బిందు కిడ్డలుపిల్లలా? పాపమామె సుఖముగా నుండవలె. తొల్లి కాలములోఁగల బాలికలందఱిలో మిక్కిలి సాధువై, మంచిదై యెల్లవారికిని దలలో నాలుకవలెనున్న యా బిందు మొగము నాకు బాగుగా జ్ఞాపకమే. దానికొక చెల్లెలుండవలె. నేను చూచినప్పుడది పసిపిల్ల."

"అన్నయ్యా! దాని కర్మముకూడ కాలినది. చిన్నప్పుడే అది యాక్షేమముతప్పి పోయినది."

"అక్కా! ఇది మిక్కిలి విచారకరమే. ఈ విధముగా దుఃఖసంతాపములతో నిండిన ప్రపంచములో నెవఁడు జీవింపఁగోరును? పాపము దానితల్లి యెంతో మంద భాగ్యురాలు. బిడ్డ తల్లికన్న మందభాగ్యురాలైనది. ఈడు రాకముందే వితంతువైనదా. సర్వేశ్వరుఁడు సర్వజ్ఞుఁడు. ఆట్టివారి కతఁడే తోడుపడవలె."

"అన్నయ్యా! నీ మాటలు సత్యములు కావలయు. పాపము! ఆ దిక్కుమాలిన పిల్లనుగురించియే నేను మిమ్మును మా నాయనగారిని సలహాయడుగ వచ్చితిని. నా

మనస్సు మనస్సులో లేదు. నేను కష్టములోనున్నాను. నేను మీ సహాయము నపేక్షించి మీతో నాలోచించుటకు వచ్చినాను."

ఆ మాటలు విని గురు విట్లనియె. "అమ్మాయీ! సందేహింపక చెప్పుము. నేను ప్రపంచపు గొడవలు మానుకొంటినని నీవెఱుంగుదువు. అందుచేత నాయాలోచన నీకంత ప్రయోజనకారి కాదు. ఐనను నేను నా శక్తివంచనలేక నీకు సహాయము చేసెదను. కావలసిన యాలోచనను చెప్పుటకు మన వేదశాస్త్రములలో గొప్ప పరిజ్ఞానులైన మహానుభావులు నవద్వీపములలో ననేకులున్నారు. లోకవ్యవహారములన్నిటిలో వారాలోచనచెప్పి యభిప్రాయము నిచ్చుచుందురు. నిత్యకృత్యములలో ధర్మాధర్మములను దెలిసికొనఁగోరువారు వారియొద్దకు వెళ్ళుచుందురు. నా కాలము చెల్లిపోయినది. ఈ చరమకాలములో నేను ప్రశాంతముగా దినములు గడుపవలయునని సంకల్పించుకొన్నాను."

"నాయనా! అది నిత్యకృత్యముల వ్యవహారమైన పక్షమున నేనింతదూరము శ్రమపడి వత్తునా? మీనిష్ఠకు భంగము కలిగింతునా? నేను దుఃఖములో నుంటినిగనుక ఊరటనిమిత్తము మీవద్దకు వచ్చితిని. మీరు మా కులగురువులు. నా మామగారికి మీ రాప్తులు. మావారికి మీరు పురోహితులు. నాకు మనశ్శాంతియు సాయమును గావలసివచ్చినప్పుడు మీయొద్దకురాక మఱియెవరియొద్దకుఁ బోదును?"

"అమ్మాయీ! విచారింపకు. నీకు నా చేతనైనంత సహాయము చేసెదను. కాశినుండి వచ్చిన యీ చిన్నవాఁడు నాకు స్నేహితుఁడు. వేదములు గట్టిగాఁ జదివినవాఁడు. నీ పతిని నెఱుఁగకపోయినను అతఁడు నిన్ను, నీ వృత్తాంతమును చిన్ననాఁటనుండి యెఱిగినవాఁడు. అతఁడు కూడ శక్యమైన సహాయము చేయఁగలఁడు. నీవు కదలి నాయొద్దకు వచ్చుటకు నీ మనసులో నెంతో విచారముండి తీరవలయును. నిస్సందేహముగాఁ జెప్పుము."

"నాబాధ విశేషముగానే యున్నది. అది చెప్పుటకుఁగూడ నాకు శక్యము గాకున్నది. మహాత్ముఁడైన యీ బ్రహ్మచారి బింగుచెల్లెలను గుఱించి మాటలాడినాఁడు. అది చిన్ననాఁడే వితంతువైనది. దాని కిప్పుడు యుక్తవయస్సు వచ్చినది. నా కుమారుఁడు శరచ్చంద్రుఁడు దానిని వలచియున్నాఁడు. దానినే గాని వివాహము చేసికొనవని పట్టుపట్టి కూర్చున్నాఁడు. ఈ వివాహము మీ రంగీకరించితిరా వారి జన్మము సార్థక

మగును. సుఖముగ జీవింతురు. నిషేధించితిరా వారీ భూమిమీఁదఁ జిరకాలము జీవింపరు.”

ఈ సంభాషణ చెవినిబడఁగానే మఱిజన్నిగట్టు కొయ్యబారిపోయెను. అతఁడు శరచ్చంద్రుని తల్లిని వివాహకాలమునుండి యెఱుఁగును. హిందువుల యాచారముల మీఁదను, సాంప్రదాయములమీఁదను నామె కమితగౌరవము కలదనియు నెఱుఁగును. కుమారుఁడు వితంతువివాహము చేసికొనఁ దలఁచుకొన్నాఁడని యామె చెప్పినప్పు డతఁడు మహాశ్చర్యరసమగ్నుఁ డయ్యెను.

“అమ్మాయీ! హిందువుల యాచార ప్రకారము వితంతువివాహము నిషిద్ధమని నీ వెఱుఁగవా? బ్రాహ్మణులు, మహాపండితులు చెప్పఁగా వినలేదా? వినుట యెందుకు? నీవు నెఱుఁగుదువు”

“ఈనాఁటి యాచార మెట్టిదని తెలిసికొనుటకు నే మీయొద్దకు రాలేదు. ఈ మాటనిపించుకొనుటకు నేను మీయొద్దకు రావలెనా? ఆచారమునకు, లోకాభిప్రాయమునకు విరుద్ధముగా నడుమనట్టి సమయములు ప్రతి మనుష్యుని జీవితములోను నుండును. ఇది మనయాచారములకు విరుద్ధమైనను దోషము గాకపోయిన పక్షమునఁ జేయఁదగిన దగునా కాదా? ఇది మతవిరుద్ధమా? భగవంతున కాగ్రహము కలిగించు కార్యమా? ఈ సంగతులు మీవలనఁ దెలిసికొనుటకై వచ్చితిని. తండ్రీ! ఆఁడుదాని దుఃఖకర వృత్తాంతము శ్రద్ధతో వినుము.”

అని కన్నీరు విడుచుచు నామె వెనుక జరిగిన వృత్తాంత మంతయు నతనితోఁ జెప్పెను. చెప్పుటలో నామె తన గృహవృత్తాంతము శరచ్చంద్రుని చరిత్రము దెలిపి యుమరొక్క కథను నామె తల్లియొక్క కథను నెఱిఁగించి పిమ్మట హేమునియొక్కయు, సుధాబిందులయొక్కయు వృత్తాంతములు తెలిపెను. తెలిపి వెండియు సుధాబిందులు కలకత్తానగరమునకు వచ్చినతెఱంగు శరచ్చంద్రుఁడు దినదినము వారి యింటికి వెళ్ళి సేమ మరసి వారి సౌఖ్యములకై పాటుపడుచు నాదరించిన విధంబు నటులుండ నతనిహృదయంబు సుధపై నిలిచిన ప్రకారంబు మాఱుగుపఱచ కెఱిఁగించెను. తరువాత సుధపై నపవాదములు పడుటయు నామె కవమానములు సంభవించుటయు, శరచ్చంద్రుని హృదయ మాశాభగ్నమై విషాద పూరిత మగుటయు నాయశ్రు బాష్పపూరిత నేత్రయై విన్నవించి చనినకాలములోఁ దనజీవితముచుట్టుఁ గ్రమ్ముచున్న దుస్సహ దుఃఖాంధకారమును జ్ఞాన

తేజోమూర్తులగు గురువులు కటాక్షవీక్షణ కిరణములచేత దౌర్భాగ్య బాలెంతల కుటుంబమును రక్షించి తన సంకట గరిగింపవలసిన దని వేఁడుకొనెను.

వేఁడుకొని సుధయు నిట్లనియె. "ధనము మనయల్పజ్ఞానమునుబట్టి నడచుచుండును. ప్రపంచధర్మము వేఱు. సత్యము వేఱు. ఉమయొక్క తల్లి బిడ్డను వర్ధమాన పట్టణమందు మిక్కిలి భాగ్యవంతున కిచ్చి వివాహము చేసెను. చేసినందుకు దాని గతియే మైనది? నాప్రక్కను గూర్చుండి కంటికి నేలకు నేకధారగా నహోరాత్రములు దుఃఖించుచున్నది. ఆదుఃఖ మామె హృదయమున గొప్పపిడుగువలె బడినది. నేను గూడ కొంతకాలము గర్వము గలిగి యుంటిని. అందుకు నాకుఁ దగినప్రాయశ్చిత్తమైనది. ప్రపంచము నాకంధకారమయమై సంతోషశూన్యమైయున్నది. నాయాశ లన్నియు శరచ్చంద్రుని మీఁదను నాకూఁతురు శాలిమీఁదను, సుధాంశులమీఁద నున్నవి. వారల తల్లి చచ్చిపోవునప్పుడు వారిని నాకప్పగించి పోయినది. సుధాశరచ్చంద్రులనురాగ బంధమును నేను త్రెంపివైచితిని. కాని యాచిన్న పిల్లలబ్రతుకు దిక్కుమాలినదానను నేను పాడుచేసితి నని నామనస్సు బాధపెట్టుచున్నది. తండ్రీ! మనశాస్త్రము లేమనుచున్నవో చెప్పుము. తల్లినైనందుకు నేను చేయవలసినవిధి యేమో చెప్పుము."

తల్లి కుమారునిదీన చరిత్రమును జెప్ప విని కరుణామయుఁ డగు గురువు జాలిపడి బాష్పములు విడిచెను. వైధవ్యదుఃఖభారవినమ్రమై యుడుమలు గుడుచుచున్న సుధ నెత్తిమీఁద నిందలు వడిన వని వినినప్పుడు బ్రహ్మచారి కన్నులు కోపముచే నెఱ్ఱపడెను. ఇద్దఱు క్షణమాత్ర మూరకుండిరి.

ఎట్టకేలకు గురువు తనమిత్రుఁడైన బ్రహ్మచారినిఁ జూచి యిట్లనియె. "కుమారా! చెప్పుము. కాశీదేవాలయములలో నున్న పుణ్యగ్రంథము లన్నిఁటిని నీవు శోధించితివి. సాధువుయొక్కయు బ్రహ్మచారుల యొక్కయు ముఖములనుండి యనేకధర్మములు విని యుంటివి. నీదృష్టినుండి మనవేదశాస్త్రము లొక్కమాటయైన దాచ లేవు. సరస్వతీదేవి నీకు వరప్రసాదము చేసినది. నీకు వశమైనట్లు వాగ్దేవి యీకాలమం దెవ్వరికిని వశవర్తిని కాలేదు. అతిదుఃఖపడుచున్న నీసోదరికి మనంబున నూరట గలుగునట్లు దయాగర్భితములై ప్రేమ చిలుకునట్టి పలుకులు పలుకుము. మనమనోగతములైన తలంపులను నాకంటె నీవుస్ఫుటముగాఁ జెప్పఁగలవు. అందుచేత నీవే పలుకుము."

"అక్కా! నీవు నావల్ల నేమి తెలిసికొనఁ గోరుచుంటివి? నే నీకెట్లు సాయము చేయఁగలను?"

"చిరకాలమునుండి కలియఁగోరుచున్న యీ యువదంపతుల సమాగమ మశాస్త్రీయమైన యధర్మమేమో చెప్పుఁడు. వితంతు వివాహములు జరుగఁగూడదని భగవంతుఁడు శాసించినాఁడేమో చెప్పుఁడు."

"ఈశ్వరుని శాసనములను మన మతని కార్యములవలన నూహింపఁగలము గాని యిది యాతని శాసనమని నిర్ణయింపఁగలమా? వేదములు పరమేశ్వరుని శాసనమునకుఁ బ్రతిధ్వనులు."

"అన్నయ్యా! అట్లే కానీ. వేదము లేమనుచున్నవో నాకుఁ జెప్పు."

"వివాహితలైన స్త్రీలు భర్తృమరణానంతరమున మహాపతివ్రతలై బ్రహ్మచర్యము నడుపవలసినదని వేదములు చెప్పుచున్నవి కాని, చేసికొనఁ దలఁచుకొన్న వితంతువులు పునర్వివాహము చేసికొనఁ గూడదని శాసించుటలేదు. చిన్నబిడ్డగా నున్నప్పుడు భర్తను గోల్పోయిన సుధవంటి వితంతువునకు శాస్త్రములు స్పష్టముగా వివాహము నంగీకరించుచున్నవి. ఈశ్వరకృపావిశేష మట్టి వివాహములను నిషేధింపదు. ప్రపంచమిదివరకే దుఃఖపూరితమై యున్నది. మనుష్యుల బుద్ధిహీనత దానినింకెంత దుఃఖభాజనము చేయుచున్నది."

"అన్నయ్యా! అమృతప్రాయములైన యిటువంటి మాటలు నీనోట వచ్చినందుకు నీకు వేయినమస్కారములు. కాలానుసారముగా మారము కలుగవలసి వచ్చినపక్షమున జనాభిప్రాయము పూర్వాచారము మొదలగునవి దినములలో [illegible] నాపఁగలవా?"

"అక్కయ్యా! ఔను. సత్యమూర్తియైన నా పినమామగారిని జనాభిప్రాయము, పూర్వాచారము నిలుపఁజాలదు. నీవు వినియుంటివిగదా? మహానుభావుఁడైన విద్యాసాగరుని గురించి వింటివిగదా! అతఁడు విద్వాంసులకంటె విద్వాంసుఁడు. దయాళువులకంటెఁ బరమదయాళుఁడు. పావనులకంటె పావనుఁడు. మన శాస్త్రములు వితంతువులు [illegible] వైధవ్యదుఃఖ మనుభవింపవలసినట్లు శాసించుట లేదని యతఁడు స్థాపించినాఁడు. మన ప్రభువులు విదేశీయులైనను జ్ఞానవంతులై వితంతువివాహములు శాస్త్రీయములని ప్రశస్తమైన ధర్మశాస్త్రములు నిర్ణయించినారు. [illegible] వితంతువు లెందఱో

వివాహములు చేసికొని పతివ్రతలై పరమసంతోషముతోఁ గాపురములు చేయుచున్నారని నీవు వినియుంటివి. నీ కుమారుఁడు తన యిచ్ఛవచ్చిన విధమున వివాహము చేసికో వచ్చును. దయామయుఁడైన పరమేశ్వరుఁడు దోషరహితులై చిత్తశుద్ధిగల సజ్జనుల కలయికను సౌఖ్యభాజనములు చేయును.”

అప్పుడు గురు విట్లనియె. “అమ్మా! బ్రహ్మచారి సరిగాఁ జెప్పినాఁడు. వెళ్ళి యతని యాజ్ఞాప్రకారము చేయుము. లోకులు కాకులు. ఇష్టమువచ్చిన ట్లనెదరు. నీవు నేను నటువంటి లోకులమాటలను నిరాకరింపవలసిన కాలము వచ్చినది నీవు నీ కుమారునకు సుఖముఁ జేయవలసిన ధర్మము చేయుము. పరమ దయాళుఁడైన భగవంతుఁడు భూమిమీఁదఁ బుట్టిన తనపుత్రికలు పారములేని దుఃఖ మనవసరముగ ననుభవింపవలసినదని కోరఁడు. అతఁడే వారి కూరట గల్గించు సౌఖ్యప్రదమైన మార్గములఁ జూపుచున్నాఁడు”

“తండ్రీ! చిత్తమున కూరటగలిగించు మీ పలుకులచేతను, బ్రహ్మచారియొక్క వచోవిశేషములచేతను నా మనంబు తేరినది. ప్రాణము చల్లఁగానున్నది ఇటువంటి పరమ పావనుల యుపదేశబలమునఁ దల్లి బిడ్డలయెడ నెంతపని చేయఁగలదో యంతపనియు నేను జేసెదను. నమ్ము నామాట. నేను చిరకాలము జీవింపను. సుధాశరచ్చంద్రులు వివాహమాడి యన్యోన్యానురాగము గలిగి చిరకాలము సుఖముగ జీవింపవలయునని నేను కడసారి ప్రార్థనఁ జేయుచున్నాను”

---

## ఇరువదిఆరవ ప్రకరణము.

### రాజగృహావనం.

సుందరమైన వర్ధమానపట్టణమును విచారమేఘము లావరించెను. బంగాళాదేశ మండలి గొప్పసంస్థానములలో వర్ధమానసంస్థానమొకటి. ఆసంస్థానప్రభువు రోగపీడితుఁడై మరణమునకు సిద్ధముగా నుండెను. అతనికి సంతతిలేదు. బజారునందు దర్బారునందు నంతఃపురమం దెందు బదిమంది చేరిన గోష్ఠులయందు నెల్లవారిమనస్సులను సంక్షోభపెట్టు నట్టివిషయము మొక్కటే. ఈయన మరణానంతరము రాజెవ్వరు? రాజుగారిభార్య యెవరినైన దత్తునొనునా? రాజు తల్లి యట్టిపెంపు నంగీకరించునా?

సంతతిలేక యే గొప్పరాజయిన మృతినొందునప్పుడు హిందూదేశస్థుల మనంబు లటువంటిప్రశ్నలు కలుగ బెట్టుచుండును. మృతినొందినరాజునకు బుత్రసంతానము లేక పోయినయెడల వానిభార్య మఱియొకపిల్లవానిని దెచ్చి దత్తస్వీకారము జేసికొనవచ్చునని యనేక సహస్రవర్షములనుండి వ్యవహారములను బోధించుచున్న ధర్మశాస్త్రము లధికార మిచ్చుచున్నవి. అది యాచారమైన రాజకుటుంబములలోనే గాక సామాన్యకుటుంబము లలో నైతము వర్తించుచున్నది. ఆ దత్తుడు ధర్మశాస్త్రమును బట్టియు నాచారమును బట్టియు మృతినొందినవానికి బుత్రుడై యతని సర్వస్వమునకు వారసుడై యుండును. పెంపుడుతల్లి యతనిని తన యింటికి దీసికొనివచ్చి పెంచును. కుటుంబ సాంప్రదాయము లంబట్టి యతని నడపించును. అనుకూలమైన యీ వ్యవస్థవల్ల సంతతి లేక నశించవలసిన యనేక రాజకుటుంబములు పారంపర్యముగ నిలిచి ప్రఖ్యాతములై యున్నవి. ఈ దత్తస్వీ కారములవల్ల జ్ఞాతులలో పోరాటములు నశించును. రాజ్యములకు వెళ్ళసక్కట లేదు. అన్యబాధ లనేకములు తగ్గిపోవును. సంస్థానప్రభువు పురుషసంతానశూన్యుడై చనిపోవు నప్పుడు [illegible] వంశము పారంపర్యముగ [illegible] సంస్థాన [illegible] ననియు [illegible]సంతుష్టులు కలిగి చూడవచ్చును. ప్రయోజనకరమైన యీవ్యవస్థను మతి మే యంగీకరించుచున్నది. సంతానశూన్యుడై మృతినొందిన వానియాత్మ "పుత్రస్య గతి ర్నాస్తి" యను నార్యోక్తిచొప్పున యుత్తరక్రియలు చేయువారు లేక సంతోష శూన్యమై పరలోకమున తిరుగును. దత్తపుత్రుడు కొడుకువంటివాడే. గనుక నుత్తర క్రియలలోప ముండదు. ఆ [illegible] నాత్మశాంతి కలుగును.

ఆంగ్లేయ ప్రభుత్వము కూడ హిందువులయొక్క యీ పాతధర్మము నంగీ కరించెను. హిందూదేశమును దనచిత్తమువచ్చినట్లు [illegible] దలచినయెడల గవర్న రులు స్వదేశసంస్థానప్రభువులు చనిపోవు [illegible] [illegible]నులు లేకుండబోయిన సంస్థానములు ప్రభుత్వ [illegible] కలుపుకొనవలయు నని యతడు శాసనము చేసెను. బుద్ధిహీనమైన [illegible] 1857 సంవత్సరమున జరిగిన గొప్పసిపాయి పితూరీకి ముఖ్యకారణము. [illegible] [illegible] స్వదేశ

సంస్థాన ప్రభువులు దత్త స్వీకారము చేసికొన వచ్చునని శాసించి యెల్లవారికి నమ్మిక గలిగించెను.

వర్ధమానసంస్థాన ప్రభువులు బలుమాఱు సంతానశూన్యులై దొరతనమువారిచ్చిన యీహక్కు నుపయోగించుకొనిరి. అప్పుడు వర్ధమాన మేలుచుండిన పడుచురాజు సంతతిలేక మృతినొందుటకు సిద్ధముగ నుండినను రాజెవ్వ డగు నన్న ప్రశ్న క్రొత్తగాఁ బుట్టినది గాదు. అదివఱకు సంస్థానముల నట్టి ప్రశ్న పెక్కుసారులు పుట్టి జనుల మనంబులను కలఁత పఱచినది.

ఒకనాఁడుమధ్యాహ్నము పట్టణమందు ముఖ్యులైన పురుషులు మువ్వురు రహస్యముగా నొకగదిలోఁ జేరి యాలోచనఁ జేయఁ దొడఁగిరి.

వర్ధమానపట్టణమందు బ్రిటిషు ప్రభుత్వమువా రేర్పఱచిన కమీషనరొకఁడుండును. ఇతఁడు మిక్కిలి గొప్పయుద్యోగస్థుఁడు. అతఁడు వర్ధమానసంస్థానమును రమారమి కోటి జనులు గల మఱియైదు జిల్లాలను బరిపాలించుచు నధికారము చేయుచుండును. అతఁడు వర్ధమానమునందే కాపుర ముండి తక్కినమండలములను సంవత్సరమున కొకసారి చూచి యామండలముల సరిగా నుండుటకుఁ దానుపూఁచీ పడియుండును. అతఁడు జనులందఱతో నత్యంతసంబంధము కలిగి యుండును. ఆమండలములలోని విషయము లన్నియు నతని కడకే దీర్పునిమిత్తము వచ్చును. బహువ్యవహారసంబంధము లైన కాగితములు కట్టలు కట్టలుగా వచ్చిపడి యతని కాలము విశేషముగా నాక్రమించును. కలకత్తాలో నున్న ఇండియా గవర్నమెంటుతో నతనికి నిరంతరము సంబంధముండుటచేత నతఁడు తన యధికారమునందున్న జిల్లాలకు నిండియా గవర్నమెంటువారితో నాలోచించి యుత్తరువులు పంపుచుండును. పంపినయుత్తరువులు సరిగా నమలు జరిగినవో లేదో గమనించుచుండును. పని తొందర గలయొకదినమున నెడతెంపు లేని కార్యభారముచేత విసికి మధ్యాహ్నకాలమున నతఁడు తేయాకునీళ్ళు పుచ్చుకొన్న తరువాతి వర్ధమానసంస్థానమును గూర్చిన విషయములను జర్చించుటకై తాను చేసినయేర్పాటు చొప్పున తనకచేరి గదిలోఁ జేరి యున్న పెద్ద మనుష్యులను గలసికొనుటకై యాగదిలోనికిఁ బోయెను.

అట్లు వచ్చినయుద్దఱు పెద్దమనుష్యులలో ముఖ్యుఁడు వనవిహారుఁడు రాజ్యకుటుంబమునకుఁ గలబంధువులలో నితఁ డత్యంతసమర్థుఁడు, బలాఢ్యుఁడు. వనవిహారుఁడు [illegible] చేత న[illegible]ప్రసిద్ధుఁడు. ఆజిల్లాలలో నతనికంటె గొప్పగ [illegible]వాఁడులేఁడు.

అతనికంటె గొప్పవేటకాఁడు లేఁడు. అతనికంటె నేర్పుతో నాలుగుగుఱ్ఱముల బండిని మిక్కిలి యపాయకరములైన స్థలములందును సన్నని దారుల నడుమను నడుపఁగలవాఁడింకొకఁడు లేఁడు. వేటయం దతనితమకము సహజమైనది. ఆంగ్లేయులు విందులు చేసి కొన్నప్పు డతఁడు సరిగ నాంగ్లేయుఁడువలెనే వ్యవహరింప నేర్చెను. అందుచేత నచ్చోట నున్న యూరోపియన్ స్త్రీలు సత్ప్రజ్ఞలుగల యాక్షత్రియుని సహజమైన నీతిమెచ్చి కొనియాడఁజొచ్చిరి. ఈసుగుణసంపదలకుఁ దోడు వానికడ వ్యవహారములు చక్కబెట్టుటకుఁ గూర్చుండి పనిజేయుటకు మిక్కిలి యభిరుచి యుండెను. అట్టియోపికయు నట్టితమకము నుండుటచేత జిరకాలానుభవముగల గొప్పయుద్యోగస్థులుకూడ వానియుక్తికి కచ్చెరువడి వర్ధమాన రాజకుటుంబమునం దక్కఱకు వచ్చునట్టి మనిషి యతఁడే యని నిరూపింపఁ జొచ్చిరి. అతఁడదివఱకె సంస్థానవ్యవహారములఁ జక్కబెట్టుటలోఁ గొంత ప్రధానస్థాన మాక్రమించెను. సంస్థానవిషయమైన తీర్పేదియు నవవిహారుని సమ్మతిఁ బడయకుండ జరుగుటలేదు.

అతనితో వచ్చిన రెండవపెద్ద మనుష్యుఁడు నెమ్మదిఁగలవాఁడు, మంచి యాలోచన గలవాఁడు. వార్ధక్యమునకుఁ బోనివాఁడు. దుర్బలశరీరుఁడు. చిన్నప్పుడే తల నెఱసినది. అతని పేరు సత్యచరణుఁడు. అతఁడు వర్ధమానములో గొప్పన్యాయవాది. బంగాళాదేశములో నతని సమాను లరుదుగా నుందురు. అతఁడు మితభాషి. అడిగిన ప్రశ్నములకు మాత్రము సరిగా నాలోచించి తగిన ప్రత్యుత్తరములు చెప్పును. అతఁడు పదిమందిలో దిరుగుట కిష్టముగలవాఁడు కాఁడు. విందులకు సభలకుఁ దఱచుగాఁ బోయెడివాఁడుకాఁడు. తనపని యేమో తనగొడవయేమో. ఆపనిలో నతనిని మించినవాఁడు లేనేలేఁడు. సమానులు స్వల్పసంఖ్యాకు లుండవచ్చును. ఆస్థానమందలి గొప్పగొప్ప యుద్యోగస్థులు వానిసలహా లేకుండ ధర్మశాస్త్రసంబంధములైన వ్యవహారములలో దిగెడువారు కారు. బంగాళాదేశమందలి గొప్ప ధర్మశాస్త్రవేత్తలు సత్యచరణునితో బరిచయము గలిగియుండి వానిని మిక్కిలి గౌరవింతురు.

పరిచారకుఁడు తేయాకు నీటిపాత్రలు తీసివేసినతరువాత వారికి ముఖ్యాంశ సంభాషణ మారంభమయ్యెను. కమీషనరు ముందుగా నిట్లనియెను. "మనకిప్పుడు మఱల నొక పెద్దబెడదవచ్చి పడినది. వర్ధమానరాజ్యము తిరిగి గొడవలలోఁ బడునని తోఁచుచున్నది."

పనియున్నది. కాని, చెప్పుచెప్పు. కృష్ణరాముఁడు, సుబ్బసింగు ప్రపంచమునుండి యదృశ్యులైన తరువాత వర్ధమానము రాజ్యము మా టేమైనది?"

"కృష్ణరాముని మనుమఁడైన కీర్తిచంద్రునితో నీ వంశము నిజముగా ప్రారంభ మైనది. తూర్పునను నుత్తరమునను నతఁడు చాలాభాగములను సంస్థానములలో గలుపు కొనియెను. వానికి నిజమైన పక్షమునఁ బడమటి దిక్కున నడవిలో నేదో మూలనున్న విష్ణుపుర వృద్ధరాజుకూడ వాని మూలమునఁ గొంత నష్టపడియెను. కాని కీర్తిచంద్రుఁడు తన సంస్థానమును వృద్ధిజేసికొనుటతోఁ దనివినొందక స్వదేశరక్షణార్థమై కూడ నడుము గట్టుకొని నిలిచెను. మహారాష్ట్రులు బంగాళముమీఁద దండెత్తి వచ్చినప్పుడు బంగాళము నేలుచుండిన మహమ్మదీయుని పక్షమున నిలిచి కీర్తిచంద్రుఁడు పలుమారు పోరాడెను. 1740 వ సంవత్సరమున కీర్తిచంద్రుఁడు మృతినొందినప్పుడు వర్ధమానరాజ్యము బంగాళా దేశములో నంతట ముఖ్యమైనదయ్యెను."

"తరువాత నేమి జరిగినది?"

"ఆ కథ మిక్కిలి దీర్ఘమైనది. సంగ్రహముగాఁ జెప్పెదను. ఆంగ్లేయులు బంగాళాదేశమునకు సర్వాధికారులైనప్పుడు తేజచంద్రుఁడను వాఁడు వర్ధమానపు రాజయ్యెను. అతఁడు కీర్తిచంద్రుని మూఁడవ తరమువాఁడు. పాపము! తేజచంద్రుని దృష్టి కప్పటి గవర్నరుజనరలైన వారనుహేస్టింగ్సుచే నియమింపఁబడిన కలెక్టరులు పూర్వపు మహారాష్ట్రపు కలెక్టరులకంటెను తురకకలెక్టరులకంటె నధిక తరబాధకులై యుండిరి. మీరు వారనుహేస్టింగ్సు యొక్క చరిత్రమును, రాజులు సరిగా గడువునాటికి శిస్తు చెల్లింపఁజాలనందుకు వారినతఁడు చెఱసాలలో నుంచిన కథలు మీ రెఱుఁగుదురు కదా!"

"ఎఱుఁగుదును గాని అప్పుడు వారన్‌హేస్టింగ్సు ప్రాణములమీఁదికే వచ్చినది. అందుచేత నతఁడు రాజులను బట్టి సొమ్ముకొఱకు పీడింపవలసి వచ్చెను. కాని యతని యనంతరమున గవర్నరుజనరలైన కారన్‌వాలీసు ప్రభువు వానికంటె నుపకారుఁడై పరిపాలనమునందుఁ గల లోపముల నన్ని సవరించెను."

"నిజమే! 1793 వ సంవత్సరమందు కారన్‌వాలీసుప్రభువు నేలపన్ను ప్రతి సంవత్సరము మార్పుచెందకుండ శాశ్వతముగ నొకకొంత యియ్యవలెనని యేర్పాటు చేయుటచేత బంగాళాదేశపు రాజకుటుంబములు నాశనమొందకుండ నిలిచెను. నేఁటి కాలమున నేల విశేషముగఁ బండినపక్షమున నది యంతయుఁ బ్రజలకే పోవును.

హిందూదేశమందలి పరగణాలన్నిటిలో బంగాళాదేశము మిక్కిలి భాగ్యవంతమై యైశ్వర్యమున కాస్పదమై యున్నది."

అప్పుడు నవ్వి కమీషన రిట్లనెను — "మీ జమీందారులు 1793 వ సంవత్సరమందు నేలపన్ను విషయమై జరిగిన శాశ్వతవ్యవస్థకు సంతోషింతురు. కాని మాదృష్టి కది మఱియొక లాగున నున్నది గవర్నమెంటువారికి రావలసిన శిస్తునకు హద్దు నేర్పరుచుటచేత సర్కారునకది నష్టము కాదా? రావలసినసొమ్ము రాకపోవుచుండుట లేదా? మీరు జమీందారులు కనుక మాదృష్టితో మీరు చూడలేరు. కాని సత్యచరణునివంటి లాయరు దీని విషయమై యేమి యభిప్రాయపడును?"

అంతసేపటినుండియు సత్యచరణుఁడు మాటలాడక వారిసంభాషణ వినుచుండెను. అప్పుడు కమీషనరు తన యభిప్రాయ మడిగినందున నధరస్పందము చేసి మెల్లన నిట్లనియె "అయ్యా! గవర్నమెంటు ప్రజలకొఱకు నిమిత్తమై యున్నది. ప్రజల హితమునకు విరుద్ధములైన హక్కులు గవర్నమెంటువారి కుండఁజాలవు."

"నీ వన్నది సరే! కాని కృషి వృద్ధిచెందినకొలఁది భూములమీఁద శిస్తు హెచ్చు కట్టి దొరతనమువారు సొమ్మెక్కువ తీయుట ప్రజలకుఁగూడ లాభకరము కాదా?"

"కాదయ్యా కాదు! అది హిందూదేశములోఁ బనికిరాదు. హిందూదేశములో మానేతపనులు, తక్కిన చేతిపనులు క్షీణించినవి. మావాణిజ్యమంతయు యూరోపియను వర్తకులచేతిలో నున్నది. మాదేశమందలిగను లన్నిటిలో యూరోపియను వర్తకులే పెట్టుబడిపెట్టి పనిచేయించుచున్నారు. కాఁబట్టి మాజాతికి జీవనాధారము భూమిమీఁదఁ బండినపంట యొక్కటే. మాదేశప్రజనసంఖ్యలో నైదువంతులలో నాలుగువంతులు నేలదున్నుకునే బ్రదుకుచున్నారు. ఆవిషయములో గవర్నమెంటువారు కొంతహద్దు నేర్పరచి యంతకంటె నెక్కువ పుచ్చుకోమని నియమమేర్పరుచుకొన్నపక్షమున జనులు క్రమక్రమముగ బాగుపడి భాగ్యవంతులగుదురు. అలాగున మీరు బంగాళాదేశములో నేలపన్నుకు హద్దునేర్పరచినారు. అందుకే బంగాళాదేశము బాగున్నది. చెన్నపురి రాజధానియందును, బొంబాయి రాజధానియందును, ఉత్తరహిందూస్థానమందును నీవిధముగా నేలపన్నుకు శాశ్వతవ్యవస్థ నేర్పరుప లేదు. కాఁబట్టి యాపరగణాలు నిరంతర దారిద్ర్యమునకు నెలవులై యున్నవి."

"సత్యచరణుఁడా ! అది నీవేలాగున ఋజువు చేయఁగలవు" అని కమీషన రడిగెను.

"కాటకముల చరిత్రములే నామాట ఋజువు చేయును. శాశ్వతవ్యవస్థయున్న బంగాళాదేశములో క్షామములు మిక్కిలి తక్కువ. కడచిన నూరుసంవత్సరములలో ప్రాణాపాయములు కలిగించిన కాటకములు లేనే లేవు. తక్కినపరగణాలలో క్షామములు మెండు. ప్రాణనష్ట మధికము. 1877 సంవత్సరము దనఁగా ధాతసంవత్సరపు కరువునకు చెన్నపురి రాజధానిలో నేబదిలక్షలమంది చచ్చిపోయిరి."

"కాని, బంగాళాదేశములో గవర్నమెంటువారు శిస్తునకు హద్దు నేర్పరుచుటచేత జనుల కెట్లు సహాయము కలుగునో నాకుఁ దెలియకున్నది. నామిత్రుఁడైన వనవిహారుని వంటి జమీందారుల కాపదతి యుపయోగకరముగా నున్నది. వారు విశేషధనము ప్రోగుచేసి తెలివిమాలిన పనులకుగాను వ్యయము చేయుదురు. కాని జనుల కేమి లాభమో చెప్పు ?"

"అయ్యా ! పంట విశేషముగా బండినప్పుడు బంగాళా జమీందారుల కేమియు లాభములేదు. అట్టి పంటవలన లాభము సామాన్యముగ జనులే యనుభవించి బాగుపడుదురు. బంగాళాదేశమందలి పాటకపుజనులు, సామాన్య సంసారులుకూడ దాచుకొన్న సొమ్ము భూములమీఁదఁ బెట్టుచుందురు. పంటలు బాగుగా బండినా దానివలన మఱింత బాగుపడుదురు. కారనువాలీసు ప్రభువుయొక్క ధర్మకార్యము చిరసౌఖ్యప్రదమై కొద్దిమందికి మాత్రమే గాక కోటానకోట్ల జనులకు నుపకారమై సౌఖ్యము నాపాదించుచున్నది. ఇండియాకు వచ్చిన రాజప్రతినిధులలో లారెన్సుప్రభువు, కానింగు ప్రభువు మిక్కిలి గొప్పవారు. వారిద్దరు గూడ హిందూదేశమందలి యెల్లపరగణాలలో నేలపన్ను విషయము శాశ్వతవ్యవస్థ నేర్పరుపవలయునని పాటుపడిరి. వారి ప్రయత్నములు కొనసాగియుండిన పక్షమున నేఁటికాలమున మన మిన్ని కరువులమాట వినకపోయి యుందుము."

"సత్యచరణుఁడా ! కొంతవఱకు నీమాట సరియే. నీవు దెలిపినట్లు పనులలోని యంతరువులు, విభాగములు నాకుఁ దెలియవు. కాని భూమిమీఁదఁ బంటలు విశేషముగఁ బండినప్పుడు దానిఫలము గొప్పవారు మొదలుకొని కొదివారి వఱకు నెల్లవారు సమానముగా ననుభవింపవలెనని నీవు చెప్పెడి పక్షమున మీ మాట నే నంగీకరించెదను.

కాని జనులందరు విశేషఫల మనుభవించుచున్నప్పుడు గవర్నమెంటువారుకూడ దానిలో కొంతభాగ మనుభవింపఁగూడదా ? గవర్నమెంటు జనుల మేలుకొఱకే యున్నదని మీ యంతట మీరే యన్నారుగదా ! గవర్నమెంటువారికంతు వచ్చెడు లాభమంతయు జనుల మేలు నిమిత్తమే యుపయోగపడును. ఆ ధన మేదో రూపమున మరల జనులకే వెళ్ళి పోవును. అందువలన జనుల వర్తకము చేతిపనులు వృద్ధిపొందును.”

“అయ్యా ! మా దురదృష్టవశమున హిందూదేశములో నట్టి విధముగా జరుగదు. రమారమి ముప్పదికోట్ల రూపాయలు అనఁగా మాదేశస్థులు గవర్నమెంటువారికిఁ జెల్లించెడు శిస్తులో సగము ప్రతిసంవత్సరము మీ యింగ్లాండుదేశమునకు మా దేశమునుండి పోవుచున్నది. దానికిఁ దగిన ప్రతిఫలము మీ దేశమునుండి మాకు వచ్చుటలేదు. మేము పన్నులక్రింద నిచ్చుదానిలో సగము దేశములోనుండి వెళ్ళి జనులకే రూపమునను వచ్చుటలేదు. నేటికాలమున భూమండలమున నేదేశ మీ విధమున నష్ట మనుభవించుటలేదు. ఇటువంటి నష్టము ప్రపంచములో నేదేశము సహింపలేదు. ఇట్లు నష్టపడుచున్న దేశమున దారిద్ర్యముండక, క్షామములుండక మఱేమి యుండును? ప్రాచీనకాలమందు రోమురాజ్యము గాలుదేశమును, ఈజిప్టుదేశమును, సిసిలీద్వీపమును, పాలెస్టయినుదేశమును దోచుకొని వానిని దరిద్రదేశములుచేసి తాను బాగుపడెనని మీరు నిందించుచున్నారు. అమెరికా ఖండమును, హాలండుదేశమును దోచుకొని తాను భాగ్యవంతురాలైనదని స్పెయినుదేశమును మీరధిక్షేపించుచున్నారు. ఇంగ్లండు హిందూదేశములో నట్టివంటి పద్ధతులే యవలంబించినమాట తాను తెలిసికొనలేకున్నది. హిందూదేశమును గొప్ప కరువులకునికిపట్టుగా, దారిద్ర్యమునకు జన్మభూమిగాఁ జేయుటయే గాని యీ విధమైన ధనసంపాదనమువల్ల రోమెంత బాగుపడినదో ఇంగ్లాండు నంతె బాగుపడును. స్పెయి నెంత మూలగంకు వచ్చినదో మీ దేశమంత ముందరకువచ్చును. నా యభిప్రాయము నేను దాచక చెప్పినందుకు నన్ను క్షమింపవలెను. కాని యీ విషయము మీరు మేము కూడ గట్టిగా నాలోచించవలసిన విషయమే.”

“మీరు నా యభిప్రాయములను న్యాయముగఁ జెప్పినారు. అందుకు మిమ్ము నేను మెచ్చుకొనుచున్నాను. నేను మీతో నేకీభవింపఁజాలను. కాని కొన్ని విషయములలో మీ వాదమే సరియై యుండవచ్చును. నా మట్టుకు నే నెప్పుడును మితవ్యయమే చేయవలయునని చెప్పుచుందును. ఎటులు హిందూదేశమునుండి ధన మావిధముగాఁ బోవుట నాకిష్టములేదు. [illegible] ప్రస్తుత [illegible] [illegible]. కాని నాకీసు

ప్రభువు బంగాళాదేశమునందు శాశ్వతవ్యవస్థ చేసినప్పుడు తేజచందుఁ డుండినాఁడని యతని కాలపు సంగతులు వనవిహారుఁడు చెప్పుచుండెను. అది యేమో విందము.”

“ఔనండి! కాని యింక నేను చెప్పవలసినది విస్తారము లేదు. 1832 సంవత్సరమందు తేజచందుఁడు మృతినొందెను. అప్పు డొకదొంగవాసుఁడు బయలుదేరెను. అతఁ డొక గొప్పవ్యాజ్యము తెచ్చెను. అది దేశమున గొప్ప సంక్షోభము కలిగించెను. కాని యీదొంగవాసులు చివర కోడిపోయిరి. దత్తపుత్రుఁ డైన మహాతబుచందుఁడు గెలిచెను. గొప్ప సంస్థానమునకు గొప్పప్రభువై యతఁడు వ్యవహార మెంతచక్కఁగాఁ జేసెనో, 1855 సంవత్సరమందు బయలుదేరిన సంతిలుజాతివారిపితూరీలో గవర్నమెంటువారి కతఁ డెట్టిరాజభక్తితో సాయము చేసెనో, 1857 సంవత్సరమందు జరిగిన శిపాయిపితూరీలో నతఁ డేరీతిని గవర్నమెంటువారి పక్షము నవలంబించి తోడుపడెనో, యెట్టకేలకు 1894 సంవత్సరమందు గవర్నమెంటువారు రాజప్రతినిధిగారి శాసననిర్మాణసభలో సభ్యుఁడుగా నేర్పఱచి యతని నెట్లు గౌరవించిరో మీ కందఱకు దెలిసిన విషయమే. సుప్రసిద్ధమై దీర్ఘమైన యాతనిజీవనము ముగిసిన తరువాత నిప్పటిరాజు సింహాసన మెక్కెను. అతనిసద్గుణము లేమియు నతనివద్ద లేవు కదా! ఇతఁ డేలిన దేస్వల్పకాలము. సంస్థానము పాడుచేసెను. అధికారము దుర్వినియోగము చేసెను. అప్పుడు మిక్కిలి చిన్నతనమందె తన దురాచారములకు బలియై మంచ మెక్కి మరణమునకు సిద్ధముగా నున్నాఁడు.”

“వనవిహారీ! ఇది నిజముగా విచారకరమే! నాకు మిక్కిలి దుఃఖముగా నున్నది. బంగాళాదేశపు జమీందారు లందఱు మహాతబుచందునివలె బుద్ధిమంతులై తమ తమ సంస్థానములను బాగుచేసికొని మంచివారై యుండవలయు నని బ్రిటిషు గవర్నమెంటు వారు కోరుచున్నారు. ఇప్పుడు పెంచుకొనఁబడు మన్నపిల్లవాఁడు క్రమమైన విద్యాభ్యాసము కలిగి చిన్నతనమందుఁ జెడిపోకుండ కట్టుదిట్టముగ నుండవలె నని కోరుచున్నాము. ఎవరిని పెంచుకొనఁదలఁచుకొన్నారో మీ రేమైన జాడకట్టితిరా?”

ప్రశాంతమై సుశ్రేష్ఠమైన యాకృతినుండి సుందరముఖమును బట్టి యతని యింగిత మెఱుఁగుటకు సాధ్యము కాదు. అతఁ డిట్లు బదులు చెప్పెను. “అది చిన్న రాణిగారియొక్క యిష్టమునుగూర్చి యున్నది. [illegible]

ఆమె తనయిష్టప్రకారము చేయునట్టి స్వభావము కలది. అత్తగారిమాట కోడలు మన్నించును."

"రాజుతల్లి మంచిపిల్లవాని నేరి తీసికొని వచ్చునా ?"

"అయ్యా ! తీసికొనివచ్చునని నమ్మకము కలదు. ఆమె మంచిమనస్సు కలది. చనిపోయిన మహాత్మునిచంద్రునకుఁ దగినభార్య. ఆమె నన్నుఁ జిన్ననాటనుండి యెఱుఁగును. అప్పుడీరాజకుటుంబమే నన్ను బోషించినది. ఆమె నన్నెప్పుడు మిక్కిలిదయతో నాదరించుచు వచ్చినది. కాలక్రమమున నామెకు నామీద గలగౌరవము తగ్గిపోయినను నే నామెయెడ ధర్మము తప్పినకార్యము చేసిన పాపమునఁబోను. ఆమె యెడ గౌరవవిహీనమైనమాట నానోట నెన్నఁడు వెడలదు."

"వనవిహారీ ! నీవంటివాని యొద్దనుండి తద్వ్యతిరేకమైన కార్యము వచ్చునని మేమనుకొనము. కాని ముఖ్యాంశము విచారణచేయుదము. మీపిల్లవాఁడు మిక్కిలి చక్కనివాఁడు కదా ? వర్తమానములో నతఁ డెవ్వరికంటె తెలివిగలవాఁడు చుఱుకైనవాఁడు. ఇప్పటిరాజుగారును మీరును నేకజాతివారును నేకశాఖవారును కదా ? రాణికి మీపిల్లవానిమీఁద నభిమాన మనియు, నతని నే పెంచుకొనుననియు వాడుక గలదు. అదినిజమైన పక్షమున మీరే యతనికిఁ జదువు చెప్పించి విద్యాబుద్ధులు నేర్పవచ్చును. కాలక్రమమున నతఁడు బాగుపడి మహాగొప్పవాఁడై ప్రసిద్ధిఁ గాంచును. నేనూహించిన దానిలో నసంభవ మేమైన నున్నదా ?" అని కమీషనరు దృష్టి యతనిమీఁద నిలిపెను. కాని వనవిహారుని మొగము మునుపటివలెనే దుర్భేద్యమై తలంపులను వెలిబుచ్చలేదు.

"రాజుగారితల్లి నాకుమారునిపై నభిమానము నిలుపు నని నే ననుకొనను. చిన్నరాణి నాకుమారునిఁ బెంచుకొన నిశ్చయించు నేని రాజుగారితల్లి పెంపు చెల్లగూడదని కోర్టులలో దిగి పోరాడవచ్చును."

"ధనప్రయోగమువలన మార్గము సుగమము కాదా ? రాజగృహమందలికొట్లు సొమ్ముతో నిండియున్నవని వాడుక. రాజుగారితల్లి కభిమానము గల బాలకులెవరైన నున్న పక్షమున వారికిఁ గావలసినధనమామె యిచ్చివేసి మీ కుమారుని దత్తత కంగీకరించిన బాగుండును."

"రాజుగారితల్లి యున్నతమనస్కురాలు. ఆమె ధనము పాదధూళిగాఁ జూచును. కోట్లకొలఁది [illegible] ధనమిచ్చియు [illegible] చేసినను ఆమె దానిని గడ్డిపరకగా జూచి

యొకమ్మునకో, యేబంధువునకో యిచ్చివేయును. ఆమె శూద్రి. పునర్వివాహితురాలు. ఆమెకు సొమ్మక్కఱలేదు. ధనమామెకాశను గలిగింపలేదు.''

ఆసంభాషణము మఱియొకగంటసేపు జరిగెను. కాని యిదమిత్థమని కార్యనిశ్చయము కాలేదు. చిన్నరాణి యెవరిని దెచ్చుకొనునో యని వర్ధమానపురవాసు లందఱు మిక్కిలియాత్రముతో గనిపెట్టియుండిరి దత్తతకుఁ గొనిన బాలకునియొక్క గుణాగుణములు, భాగ్యాభాగ్యములు చాటుగదులలోను, లాయముల కచ్చేరులలోను చర్చింపబడజొచ్చెను. ఇట్టి తలంపులలో బట్టణమంతయు రెండుభాగము లయ్యెను. చిన్నరాణి చేయబోవు కార్యనిశ్చయము నెల్లవారు మిక్కిలి యాత్రముతో నిరీక్షించుచుండిరి.

కవిభూషణుఁడుగూడ నామె చేయు కార్యనిశ్చయమున కెదురుచూచు చుండెను. ఆసాయంకాలము వనవిహారుఁడును, సత్యదర్శనుఁడును సెలవుతీసికొని పోవునప్పు డతఁ డిట్లనియె. "ఆమె యెవరిని దెచ్చుకొన్నను సరే. ఆ దత్తపుత్రుఁడు తన కృత్యములను జాగ్రత్తగా నెఱవేర్చుటకుఁ గావలసిన విద్యాబుద్ధులు జాగ్రత్తగాఁ జెప్పించవలెను. యుక్తవయస్కుఁ డగువఱకు నా బాలకుని సంస్థానము బ్రిటిషు గవర్నమెంటు వారు చక్కబెట్టుచుందురు. గొప్ప మహారాజులకు గావలసిన విద్య, బుద్ధి, కార్యాసక్తి మొదలగునవి యలవడుటకే ప్రయత్నములు కావలెనో యా ప్రయత్నము లన్నియు దొరతనమువారు తప్పక చేసి బాలకుని బాగుచేయుదురు."

---

# ఇరువదియేడవ ప్రకరణము

## సాయంకాలపు విందు.

కవిభూషణుఁడగ్గఱ సెలవుపుచ్చుకొని వనవిహారుఁడు జగత్కిశోరరాయుల గృహమునకు గుఱ్ఱపుబండిమీఁద వెళ్లెను. కిశోరరాయులు వనవిహారుని, మఱికొందఱు మిత్రులను సాయంకాలమునఁ జిన్న విందునకుఁ బిలిచెను. జగత్కిశోరరాయులు జగన్నాథక్షేత్రము నుండివచ్చెను. అతని దేహస్థితి చక్కఁబడుటకే యతఁడు క్షేత్రమునకు పోవలసియుండెను. మునుపటికంటె శరీరమునకు బలమువచ్చెను బలమేకాక సంతోషమును కూడ వచ్చినట్లుండెను. అతని మేనత్తలు, తమ్ములు, మఱి యితరబంధువు లనేకులు విశాలమైన వాని

పైతృకగృహమునందు నివసించుచుండిరి. కాని జగత్కిశోరరాయలు మాత్రము పట్టణమందు మిక్కిలి తెరపిగా నున్నచోట భార్యాసమేతుఁడై తోటలో నొకయింటఁ గాపురము సేయుచుండెను. రాణిగంజలో నున్న యతనివైద్యుఁ డా విధముగాఁ జేయవలసినదని యుపదేశము చేయుటచే నతఁ డా హితోపదేశము ననుసరించుట మంచిదని తలంచెను.

జగత్కిశోరుని యొక్కయు, భార్యయొక్కయు, బంధువులలో నొక గొప్ప మన్న కలిగెను. అతఁడు రోగపీడితుఁడైన దినములలో భార్య చూపినశ్రద్ధను, జాగ్రత్తను నిద్రాహారములు లేక చేసిన సేవను నతఁడు కనుమెచ్చెను. అతని మనస్సు కరఁగి పోయెను. అందుచే నతఁడు మహాపతివ్రతయై పరమభక్తురాలైన భార్యయెడ మునుపటి కంటె నధికానురాగముఁజూపి యెక్కువదయగలవాఁడై యుండెను. తాను జబ్బుపడి నప్పుడు తననిమిత్త మెప్పటికప్పుడు పాలు కాచి గిన్నెలోబోసి యిచ్చుచు, తనకు నిద్ర వచ్చువఱకు మెల్లగ నేదో చల్లనిమాటలుచెప్పి లాలించుచు, తలయువారి పాదము లొత్తుచు రాత్రి ప్రొద్దుపోవువఱకుఁ దనసంరక్షణమే యామె చేయుచుండుట యతఁడు కనిపెట్టి చూచెను. తనకు మెలఁకువవచ్చి చూచినప్పు డామె తనప్రక్కనే కూర్చుండి తనకు నిద్ర పట్టినదో లేదో యని యామె యాతురపడుచుండుట నతఁ డెన్నోసారులు చూచెను. దాదాపుగా రాత్రి యంతయు మేలుకొని నాలవజామున జీఱకొంగుఁ బఱచుకొని తన పాదములయొద్ద పండుకొనుటయు నతఁడు స్వయముగఁ జూచెను. తెల్లవారఁగానే యామె స్వసౌఖ్యము జూచుకొనక తన పథ్యపానములు చేయుచు, తన సౌఖ్యముల నిమిత్తము పాటుపడుచు నుండుటయు నతనికి స్వానుభవమైన విషయము. అవి యన్నియు జూచిన పిదప మగని కాయిల్లాలిమీఁద నతిశయప్రేమ పొడమెను. అట్టి భక్తిగల భార్య మీఁద ననురాగము గలుగుట యాశ్చర్యమా !

భార్యాభర్తలిద్దఱు ప్రత్యేకముగాఁ గాఁపురము సేయుచున్న యింటికి రమారమి యిరువది సంవత్సరములు వయస్సుగల యొక బాలిక యజమానురాలై యిల్లు దిద్దుకొనుచుండెను. అతఁ డామెను తఱచుగాఁగలిసికొని తనవ్యవహారములలో నామె యాలోచన నడుగుచు శీతకాలమునరాత్రులు ప్రొద్దుపోవుటకు మనోజ్ఞములైన యామెపలుకులువిని యానందించుచుండెను. ఒకరి సంగతి యొకరికీ దినములలో మిక్కిలి బాగుగా దెలిసెను. అందువలన వారి హృదయములు కలిసిపోయెను. వివాహమైన తరువాతఁ జిన్న పెండ్లి

కూఁతురు నవవనోత్సవము కలిగి యుక్తవయస్కురాలై సంపూర్ణయువతియై గృహాభి మానురాలైనప్పుడు హిందూదేశములో నీవిధముగా భార్యాభర్తల కన్యోన్యాను రాగము గలుగుచుండును. మొదట బాలికయై కాపురమునకు వచ్చి పతిభక్తి మొదలైన యుత్తమలక్షణములు నేర్చుకొని యువతియైన పిదప లక్షితమైన యనురాగమును జూపును. అట్లుకలయించిన యనురాగము యావజ్జీవము నిలుచును. లేతప్రాయమున నేర్చుకొన్న పతిభక్తిని భార్య జన్మమధ్యమున నెన్నఁడు మఱువదు. భర్తయు బాలికయై మొదటఁ దనవద్దకువచ్చి తన బిగియారఁ గౌఁగిళ్ళ వణఁగి పెనఁగి, తన శిక్షలో బెఱిగి విలాసవంతురాలై, యనురాగవతియై యువతీరత్నమైన యా భార్యను జన్మాంతమువరకు గాఢానురాగములోఁ జూచును.

ఆ సాయంకాలమున జగత్కిశోరరాయలు కచేరీచావడిలోఁ దానుపిలిచిన పెద్ద మనుష్యుల నెదుర్కొని సన్మానించుచుండఁగా సుఖముగా జగన్నాథయాత్ర చేసివచ్చి నందుకు ఉపహరింపవచ్చిన యువకులతో గలసి కాళీ యింటిలోపల ముచ్చటలాడు చుండెను. అధికారములోను, పలుకుబడిలోను క్రమక్రమముగా వృద్ధియగుచున్న వన విహారుని జగత్కిశోరుఁడు హృదయపూర్వకముగ సన్మానించి యాదరించెను. అతనికే కాదు తన యాహ్వానమంగీకరించి యొక్కరొక్కరుగా వచ్చిన మిత్రులందఱ యథో చితముగ సత్కరించి గౌరవించెను.

కిశోరరాయలు హృదయపూర్వకముగా సల్లాపములు చేయుచు వనవిహారునితో నొకమూలఁ గూర్చుండెను. అప్పుడు బహుదీపములతో వెలయుచున్న యా విశాల మందిరమున వీణావాదము, గాత్రగానము వ్యాపించెను. వనవిహారునకు లాలాసాహెబని రెండవపేరు కలదు. మిత్రులాపేరుతోఁ దఱచుగాఁ బిలుచుచుందురు. "లాలాసాహెబు! నిన్ను మరల జూచెడిభాగ్యము నాకుఁ గలిగినందుకు మిక్కిలి సంతోషించుచున్నాను. నేను వర్ధమానపట్టణము విడిచివెళ్ళినప్పుడు మరల బ్రతికివత్తునని తలంపలేను."

"జగత్కిశోర! నిన్నిటువంటి మంచిదశలో జూడగలిగినందులకు సంతోషము నొందితి. నీ కింకను నలువదియేండ్లయిన నిండలేదు. నీ వింక ననేక సంవత్సరములు సుఖముగా జీవింపవలెనని మేము గోరుచున్నాము. ప్రయాణము, స్థలమార్పు నీ కెంతో మేలు చేసినది. నీవు మునుపటికంటె బడుచువాడవులాగున గనబడుచున్నావు."

"ఔను ! లాలాసాహేబూ ! ఈ ప్రయాణము నాకెంతో మేలు చేసినది. ఇల్లు విడచి వెళ్ళుట కిష్టపడని జనులకు మనకు ప్రాచీనమహర్షులు తీర్థయాత్రలు విధించి నప్పుడు కేవలము మతసంబంధములైన కర్మలు చేయించుటయే వారి యుద్దేశ్యము కాదు. అంతకంటె నధికములైన యుద్దేశము లేవో యుండితీరవలయును. తీర్థయాత్ర యనగా స్థలము మార్పు, ప్రయాణము, నూతనప్రదేశ సందర్శనము. తీర్థయాత్ర మన దేహస్థితిం జక్కజేయును. జీవితకాలము వృద్ధియగును."

"ఔను ! అది నిజమే. కాని పూజ్యురాలయిన మీతల్లి పూరీక్షేత్రములోనే యుండిపోవుటకు నిశ్చయించుకొన్నదట !"

"ఔను. ఆమె లేనివెలితి ప్రతిదినము మాకుం గనబడుచున్నది. కాని యామె చరమకాలమును ప్రశాంతముగా గొడవలు లేకుండ గడుపుటయే మంచిది. ఎందుచేత ననంగా మా సంసారమువంటి గొప్పసంసారము చక్కబెట్టుటచేత నామె దేహస్థితి యిదివరకే చెడిపోయినది. ఆమె పూరీక్షేత్రములో నెక్కువకాలము బ్రతుకును. ఎక్కువ సౌఖ్యముగ నుండును. ఆమె క్షేమ మెప్పటికప్పటికి నాకుం దెలియుచున్నది."

"ఔనది యాలాగే ! మీ యాబిడకూడ నీ తీర్థయాత్రాసుఖము సంపూర్ణముగా ననుభవించిన దంటకాదా ? ఆబిడ యెవరినో యాదవివాంధ్ర కన్యను వెంటదీసికొని వచ్చినది. దాని నెక్కడనుండి పట్టితెచ్చినది ? అది బారివాంధ్ర పిల్లకాదా ? దాని మొగము చక్కగా నున్నది. గొప్పయింటి హిందువుని మొగమువలె నున్నది. మీ యాబిడయొద్ద పనికత్తెగా నుండుటకు నా జాతియే జాతిలోనుండియు నిటువంటిపిల్ల దొరకదని నేను నిశ్చయముగాం జెప్పంగలను."

"ఔను ! ఆ కుఱ్ఱది బారివాంధ్రపిల్ల. నా భార్య బందూరానుండి తీసికొని వచ్చినది. దానికొక పెద్దకథ యున్నది. దానిని మగండు విడిచిపెట్టినందున దిక్కులేక యున్నది ఆ మోట మగనిని వెదకికొనుటకది యిక్కడికి వచ్చినది."

"నిజముగానే ? ఎవండా మూర్ఖుండు ? ఇటువంటి చక్కని గొల్లచిన్నదానిని వదలిపెట్టి దేశములవెంటం దిరుగుచున్న యీ నిర్భాగ్యుం డెవండు ?"

"లాలాసాహేబూ ! అదే నీతో నేను సరిగాం జెప్పందలచుకొన్న సంగతి. మేము వానిని కనుగొన్నాము. వానిపేరు మధుబాగి. అతండొక లోటవాండు. వాండే యీ

సంపాదించుకొనలేకపోయినాఁడు. మీ రతనిని నమ్మి యుద్యోగమిచ్చి సహాయము చేసినారు. హేముఁడు మీవిశ్వాసమునకుఁ బాత్రుఁడు. అతనిని నేను చక్కగా నెఱుఁగుదును."

"జగత్కిశోర! ఇటువంటి పెద్దమనుష్యుని నాకు సిఫారసు చేసినందుకు నేనే మీయెడలఁ గృతజ్ఞుఁడనై యుండవలెను. సంస్థానములో నేను కొంతకాలమునుండి పని చేయుచున్నాను. మనుష్యుల తెలివితేటలు కనిపెట్టుటలో నాకుఁ గొంతప్రజ్ఞ కలదు. ఈ హేమచంద్రునికంటె మంచివానిని నే నిదివఱ కెన్నఁడైన దివాణములో నుద్యోగమునకుఁ దీసికొని వచ్చితినో లేదో సందేహమే. ఇంత యెందుకు? అదివఱ కాపరగణా యంతయు మిక్కిలి యల్లరిగా నుండినది. ఇతని నక్కడకుఁ బంపినతరువాత మునుపటి యల్లరి యడఁగి ప్రశాంతముగా నున్నది. దివాణపు మొహరువేసిన వ్రాత కాగితముల మీఁదకంటె హేమచంద్రుని నోటిమాటమీఁద రయితులకు విశ్వాస మెక్కువగానున్నది. సంస్థానములలో జఱిగెడు గడబిడ లన్నిఁటికి సంస్థానాధిపతులు వారిచేతఁ బంపఁబడిన యుద్యోగస్థులు ముఖ్యకారణ మని నాయభిప్రాయము. హిందూదేశపు రైతులకంటె మెత్తని కృషీవలులు, రాజభక్తిగల కృషీవలులు ప్రపంచమునం దెక్కడను లేరు. కాని వారిని మనము ధర్మము తప్పకుండ దయతోఁ జూచినంతకాలమే యట్లుందురు."

"మీ రెంతపరిశీలించినను ఈ క్రొత్తయుద్యోగస్థునికంటె జాలిగుండె గలవాఁడు, న్యాయదృష్టి గలవాఁడు, మఱియొకఁడు కనఁబడఁడు. తాల్పుకారు గ్రామములో నితని యిల్లు కోర్టువలె నుండును. రైతులలో వచ్చువివాద లన్నిఁటి నితడు పరిష్కరించును. ఆపరగణాలోనున్న 'జను లెక్కడను' కొందఱుతప్ప సాధారణముగ వ్యాజ్యములు వేసికొని కోర్టుకెక్కరు. హేముని భార్యనుగూడ నే నెఱుఁగుదును. ఆ చుట్టుప్రక్కల ఆ మాత్రపు తెలివైనది, సాధువైనది మఱియొకతె లేదు. తెలివిమాలిన రైతులు సరిహద్దును గుఱించియో, బీడునేలను గుఱించియో వివాదపడుచున్నప్పుడు హేముని భార్య రైతులభార్యలను బిలిపించి వాండ్రతో మాటలాడి తానే యావ్యవహారము కొంతవఱకుఁ జక్కఁబెట్టును. వెంటనే వివాద మడఁగిపోవును. ఆ తెలివిమాలిన మొద్దులు మగవాండ్రు తగినకారణము లేకయె పోరాడుచున్నామని తెలిసికొని యుండఁబోదురు."

"నిజముగ వారి దనుకూలదాంపత్యము. వర్ధమానసంస్థానపు టుద్యోగస్థుల విశ్వాసమునకుఁ బాత్రములై వారు చాలకాలము సుఖింపవలయును. హేముని [illegible] తలఁచి

నప్పుడు నీభావముఉంది శరచ్చంద్రునిమాట నాకు జ్ఞప్తికివచ్చును. అతఁడు హేముని మిత్రుఁడు. అతనిమాట యేమి చేసినావు ?"

"అతఁడు మాతో జగన్నాథము వచ్చినాఁడే. మమ్ము బాలసూరులో గలసి కొన్న యుత్కళదేశపు సామంతరాజు వానిమీద మిక్కిలి ప్రీతి గలిగి తన సంస్థానములో బనియిచ్చి దగ్గఱ నిలుపుకొన్నాఁడు. అతడు చాకచక్యముగల పడుచువాడు. క్రొత్తతావులు చూచుటలోను, క్రొత్తపనులు పట్టుదలతో జేయుటలోను మావాని కభిలాష మెండు. ఈస్వల్పకాలములోనే మావాఁడెన్నో దురాచారములను దొలగించి యాసంస్థాన మెంతోవృద్ధి చేసినాడని చెప్పుకొను చున్నారు. అతడు సంస్థానములో నున్న ప్రతికొండమీది కెక్కును. ప్రతిచరియలోను దిగి చూచును. అడవులలోను నిర్జనములై భయంకరములైన కొండకనుమలలోను దిరుగుటన్న నతనికెంతో సంతోషము. సంస్థానములో నున్న వేటకాఁడు కానీ, సగము మృగప్రాయుఁ డగుకొండదొర కాని యెవఁడైనను సరే అతడు తన స్నేహితుడే యని భావింపనివాఁడు, అతఁడు తన మిత్రుఁడని విశ్వసింపనివాఁడు, సత్పరిపాలకుఁ డని యతనిని గౌరవింపనివాఁడు నిశ్చయముగ లేఁడు."

"సరే! ఇది యంతయు శరచ్చంద్రుఁడు మంచివాఁడని చాటుచున్నది. జనుల జనయాత్రలో క్రొత్తపుంతలు గల్పింప సామర్థ్యము గలవారు, మంచినడత గలవారు, చాకచక్యము గలవారు మనకుఁ గావలయును. కాని జగత్కిశోర! మీవాఁడు స్వగృహము విడిచి, మిత్రులను బాసి, యత్యంతప్రేమ గల తనసోదరిని విడిచిపెట్టి పరదేశములో నుండుటకు వనభూములలోను పర్వతప్రాంతములలోను నివసించుటయు నను నభిలాషయే కారణమా? లోకములోనున్న వానికి నిజమైనపక్షమున నతని ప్రవాసము నకు వలపే మూలకారణము. వలపు సఫలము కాక భిన్నమగుటచే నతఁడు దేశములపాలై పోయినాఁడని నేనని యుంటిని."

"ఓహరో! లాలాసాహేబూ! అని నిచేతనే చదివినావా? నీ [illegible] ము లేలాగున తెలియుచున్నవో, నీ కెటుగా జ్ఞాపకముంచుకొంటివో యని నేనాశ్చర్య పడుచుంటిని."

"మిత్రుఁడా! నా యునికి ఎప్పటి కిప్పుడే యుపాయములతోఁ గూడినదని నీ వెఱుఁగుదువు. నన్ను జూచి చిన్నపిల్లలు నవ్వువారిలోను, నా మ్రుచ్చుచే కొలువు సేయు

వారిలోను నేను శ్రేయోదయమున చెడిపోయినను సంతోషించు వారనేకులు కలరు. కాబట్టి నేనెల్లప్పుడు నా కన్నులు తెఱచి చూచుచుండవలెను. నా చెవులు దోరఁబెట్టి యెల్లమాటలు వినుచుండవలెను. మీకుఁ దెలియని దారులనుండి నాకెన్నో సమాచారములు చిత్రకథలు ప్రతిదినము తెలియుచుండును."

"అలాగుండవలసినదే! మా బావమఱఁదిమాట చెప్పెద వినుము. అతఁడు కలకత్తాలో నొక చిన్నదానిని వలచినమాట నిజము. ఆ చిన్నది హేమునిమఱఁదలు. కాని యది వితంతువు. వితంతువు మరల వివాహము చేసికొనుట మనలో తప్పుగదా?"

"మనవాఁడు హిందూ వితంతువులు పునర్వివాహములు చేసికొనుట లేదా? మన వేదశాస్త్రములట్టి వివాహముల నొప్పుకొనుచున్నవని గొప్పగొప్ప పండితులు చెప్పుచున్నారు. ఆ ధర్మశాస్త్రముల యొప్పుదలనుబట్టియె బాలవితంతువుల తలిదండ్రులు కొన్ని వివాహములు చేసినారు. శరచ్చంద్రుఁడు గట్టిగా వివాహము చేసికోఁదలఁచుకొన్న పక్షమున నతనిదారి నతని నెందుకు వదలివేయఁగూడదు? మనోరథసిద్ధి భంగమైన కారణముచేత నెంతో యక్కఱకు వచ్చునట్టి కుఱ్ఱవాఁడు తన బ్రతుకంతయు పాడుచేసికొని చెడిపోవుచుండఁగాఁ జూచుట న్యాయమా? అది యెంతో విచారకరము."

"లాలాసాహేబూ! నీవు సంఘ సంస్కర్తవలె మాటాడుచున్నావే?"

"జగత్కిశోర! అట్లు కాదు. నేను లోకవ్యవహార మెఱిఁగిన మనుష్యుఁడువలె మాటాడుచున్నాను. మన వేదశాస్త్రములంటే నాకుఁగల గౌరవముకంటె మఱి యెవ్వరికి నెక్కువలేదు. ఆ శాస్త్రములు మనలను నడిపించుట కేర్పడినవి కాని మనకు సంకెళ్ళు వేయుట కేర్పడలేదు. ప్రపంచమంతయు ముందుకుఁ గదలుచున్న యీకాలమున మనముగూడ ముందంజ వేయవలదా? జగత్కిశోర! నామాట నమ్ము. మనకు వ్యతిరేకముగా నెందఱున్ని చెప్పినను జెప్పనీ. హిందువులము, కార్యవాదులము, కావలసిన కార్యము చల్లఁగాజేసికొని పోదుము. మనము సోమరులము కాము కాని మెల్లమెల్లగాను జాగ్రత్తగాను నభివృద్ధిఁ జెందుచున్నాము. రామమోహనరాయుల నాఁటనుండి కాలానుసారముగా మనవలెఁ దమ యాచారవ్యవహారములను మార్చి చక్కఁజేసికొన సాహసించిన జాతివారు ప్రపంచమున మఱియొకరుండుట యరిది. మన మభివృద్ధిచెందుచున్న పూర్వాచార పరాయణులము. ఈ రెండును పరస్పర విరుద్ధములైనమాటలని నీ వనుకొనవచ్చును. కాని యట్లు కాదు."

"లాలాసాహేబూ! నీవు చెప్పినదంతయు నిజమే, కాని యెవరియభిప్రాయములను మనము మిక్కిలి గౌరవించుచుందుమో యట్టిపెద్దలనేకు లిప్పటికిని వితంతు వివాహము పేరుచెప్పిన నెంతమాత్ర మొప్పుకొనరు."

"శరచ్చంద్రుఁ డాపిల్లను వివాహమాడుట కెవరొప్పుకొనలేదు? మీతల్లికిష్టము లేదా యేమిటి?"

"కాదు కాదు. ఆమె కీలోకవ్యవహారసంబంధమే లేదు. ఆమె మనస్సు, హృదయము జగన్నాథస్వామి పూజమీఁదను, పూరీక్షేత్రము మీఁదను నిలిచి యున్నది."

"అట్లయిన శరచ్చంద్రునితల్లికే యిష్టములేదా యేమిటి?"

"ఔను! మా యత్తగారే కాశినుండివచ్చి ఈ వివాహము చెడఁగొట్టినది. కాని తనమూలమున కుమారునకుఁ గలిగినబాధ క్రమక్రమముగా నామె తెలిసికొని తల్లిప్రాణ మగుటచేత జాలిపడి విచారించి, పుణ్యాత్ములైన పెద్దలతో నాలోచించి యావివాహము వెంటనే జరిగింపవలసిన దనియు, జరిగినతరువాత కొడుకును కోడలును దన యాశీర్వాదము బడయుటకు వారణాశికిఁ బంపవలసినదనియు, మమ్మాజ్ఞాపించినది. వర్తమాన మంపి యామె కలకత్తావిడిచి కాశికి వెళ్ళిపోయినది."

"అట్లయిన వివాహమున కాటంక మేమున్నది? తమ్ముఁడు వితంతువివాహము చేసికొనుట మీయాఁడవాండ్ర కిష్టములేదా యేమిటి? సోదరుఁడు భగ్నమనోరథుఁడై చెడిపోయి యావజ్జీవము కష్టపడునట్లు నీయాబిడ కోరినపక్షమున నామె చక్కఁగా నాలోచింపలేని దని నే ననుకొనవలసి వచ్చును."

"నాభార్యకు వేఱెయభిప్రాయము లేదు. తల్లి యభిప్రాయమే యామె యభిప్రాయము. నాయాబిడ పరమసాధువు మెత్తనిస్వభావము గలదైనను సోదరుని సుఖమునిమిత్తమై యెందకైన వోడఁగట్టఁదలఁచుకొన్నది. కాని నాకే ధైర్యము లేదు. నేను సందేహించుచున్నాను.

"ఛ! ఏమిమాటయ్యా అది. మగవాఁడవైనందుకు ధైర్యముఁ జూపుము. ఆఁడవాండ్రకే నీపిచ్చిపిచ్చి భయములు నీకుండఁదగునా? ఆభయమును బాఱద్రోలుము. నేను శరచ్చంద్రుని జూచినాను. మనుష్యులస్వభావములను జూడ గట్టుటలో నేను కొంత

వటుకు గట్టివాఁడను. అతఁడు గొప్పదేశసేవకుఁడు. మహత్కార్యములను జేయ సమర్థుఁడు. అట్టివాఁడును చిన్నతనమందు భగ్నమనోరథుఁడై కాలము పాడుచేయఁ గూడదు. జగత్కిశోర ! నీవు దీనికొడంబడి చేతిలో చేయివేయుము. ఈరాత్రి నేను బాలనూరుకు తంతివార్త పంపెదను. ఉత్కల దేశపుసామంతరాజును నే నెఱుఁగుదును. నా నిమిత్త మతఁడు డాకుఱువానిని విడిచిపెట్టును. నేను వర్తమాన మంపిన రెండుదినముల లోపుగా గాని లేక పొగయోడయో, పొగబండియో దీసికొని రాఁగలిగినంత వేగముగా గాని యతఁ డిక్కడికి వచ్చును. అట్లు రాకపోయిన నొసల పడుచువాఁడ మనోగతములు నే నెఱుఁగ నన్నమాట యుండదే.”

“లాలాసాహేబూ ! నీ ప్రజ్ఞకుఁ దగినసలహా చెప్పితివి. నీసలహా నావంటిపిరికి వారికి దౌర్బల్యము పోఁగొట్టి ప్రోత్సాహము కలిగించుచున్నది. గొప్పతనమునకుఁ దీసి కొని పోవుమార్గమున నీవు సాహసించి నడచుచున్నావు. నీకు మిక్కిలి గొప్పపదవి కనిపెట్టుకొని యున్నది. నీకుమారుఁడు వర్ధమానపురాజగు కాలము, గవర్నమెంటువారి వల్ల నీకు రాజబిరుదము వచ్చుకాలము నేను చూచెదను. నేను నీసలహా నొప్పుకొంటిని. ఇదిగో ! చేతిలో చెయి వేయుచున్నాను. నీ మేడల కే నెప్పుడును కృతజ్ఞుఁడనై యుందును.”

---

## ఇరువదియెనిమిదవ ప్రకరణము

### పశ్చాత్తాపము.

విందులకు వచ్చినమిత్రులు పోవుచుండుటచే గానధ్వని క్రమక్రమముగ సన్నగిల్లెను. పందిరియందలి దీపములు ఆర్పివేయఁబడినవి. జగత్కిశోరరాయలు లోపలి కరిగి భార్యప్రక్కను గూర్చుండి శరచ్చంద్రునకు వనవిహారుఁడు పంపఁ దలచిన తంతి వార్తను గురించి గుసగుసలాడెను. పరమసాధ్వియైన కాళి యాసంతోషవార్తను విని భర్తకు కృతజ్ఞతను తెలియజేయుటకు దగ్గఱఁ జేరెను. కేశయులపాలై పోయిన తన ప్రియ సోదరుఁడు దొంగయింటివాఁడై సదా దుఃఖమనుభవింపఁ గలఁడనియు, దిక్కుమాలి కడు దుఃఖ మనుభవించుచున్న నతని ధర్మపత్నియై గృహయజమానురాలై ప్రసాదింపఁగల

సకలానందములకు నునికిపట్టయి యుండునదియు నొకతలంపు తనమనంబునఁ బొడగానే కాళికన్నులనుండి బాష్పములు వెడలెను. అప్పుడాని కోరిక కెంతో దూరము ప్రవేశ్యు దాటును కాళియొక్క కొంటెమనస్సు తన సోదరునకుఁ బుట్టఁగలబిడ్డల ముద్దుమొగములఁ జూచినట్లు, తప్పటడుగు లిడుచు నాకడ్డముగ దిక్కుమొగ్గకువచ్చి వచ్చియురాని త్రొక్కునడలతో అత్తా అత్తా యని పిలుచుచుండినట్లు, వాండ్రుదుమ్ములో నాడుకొనివచ్చి యాదుమ్ము తనమీఁదఁ బడునట్లు మీఁదనెక్కి త్రొక్కినట్లు, తాను ముద్దులాడినట్లు భావించుకొనఁ జొచ్చెను. ఆసంకల్పాంగమున నామెకు బిందుకూడ గనఁబడెను. బిందుమాట స్మరణకు రాఁగానే చనిపోయిన యుమమాట జ్ఞప్తికివచ్చెను. దానితో విషాదచ్ఛాయ వచ్చి మేలుకొని యుండియు స్వప్నములు గనుచున్న యామె మనంబును గ్రమ్మెను. ఆనుగ్గుగుబాలికలు చిన్నవాటనుండియుఁ గలసి తిరిగిరి. హతశేషులైన యిరువురు చెలికత్తెల హృదయములయందు ప్రియమిత్రమైన యుమయవస్థ మఱపు రాక యెప్పటికప్పుడే క్రొత్తయై విషాదజనకమై యుండెను.

అటులుండ రాత్రి రెండవజాముకూడ గతించెను. దీపము మినుకుమినుకు మనఁ జొచ్చెను. భార్యాభర్తలు తమసంతోషపు తలఁపులను, విచారతలంపులను తెంపులేక చెప్పుకొని గుసగుసలాడుచుండిరి. అప్పుడు వీధితలుపు నెవరో కొట్టినట్లు చప్పుడయ్యెను. జగత్కిశోరుఁడు చెవియొగ్గి వినెను. ఆచప్పుడు మరల వినఁబడెను.

ఇంత ప్రొద్దుపోయినప్పుడు వచ్చి పిలిచెడివారెవరు? నౌకరు లందఱు పండుకొని నిదురపోయినారు. నేను వెళ్ళి తలుపుతీసెదనని జగత్కిశోరరాయలు పలికి వెలుపలికి వడిచి వెళ్ళెను. భార్య యతనివెంట నడుగులు చప్పుడు కాకుండ మనంబున నేదో యిట్టిదనరాని యాసఁ బెట్టుకొని మెల్లఁగా వెళ్ళెను.

క్రొత్త మనుష్యుఁడు లోపలికి వచ్చెను. వెలుఁగు మందముగా నుండుటచే జగత్కిశోరుఁ డతనిని గుర్తుపట్టలేదు. కాళి తటాలున వెనుకకుఁ దిరిగి ప్రక్కగదిలోనికిఁ బోయి తన ఘోషాస్థలములో నిలిచి క్రొత్తమనుష్యుని నైఖరి కనిపెట్టుచుండెను.

"అయ్యా! మీ రెవరు? ఈ యర్ధరాత్రము వేళ నేమిగావలసి వచ్చినారు?" అని జగత్కిశోరుఁ డడిగెను.

"జగత్కిశోర ! పూర్వ మొకానొకప్పుడు నేను నీ మిత్రుడను. నేనిప్పుడు నీ మిత్రుఁడ ననిపించుకొనుటకుఁ దగను. మన పూర్వస్నేహమునుబట్టి యీ రాత్రి యిక్కడ తలదాచుకొనుటకు వచ్చితిని. రేపు ఉదయమున నాదారిని నేఁబోయెదను.

ఆ కంఠధ్వని మఱచుటకు వీలులేనిది. ఐశ్వర్యాధికారము గలిగి మున్ను గొప్పవాఁడై యుండిన ధనంజయుఁ డావిధమునఁ బాటిపోవుచుండుటచూచి జగత్కిశోరుఁడు మహాశ్చర్య మొందెను. మొగము కృశించెను. కన్నులు గుంటలుపడెను. తలవెంట్రుకలు చిఱకాలమునుండి చమురెఱుఁగక మోటబారి చీకాకుబడి మొగమువీఁద బడుచుండెను. అతని వాలకము మృత్యుదేవత కాశ్రయమైనట్లు కనఁబడెను. ఆ ధనంజయుని చరిత్రమును సాధువైన యమునచరిత్రమును దలఁచుకొనఁగానే జగత్కిశోరుని మనంబున నొకవిధమైన రోషవుట్టెను. కాని సహజమైన గృహస్థధర్మ మారోషమును జయించెను. జగత్కిశోరుఁడు దయాపూర్వకముగా నతనితో మాటలాడెను. "ధనంజయా ! ఏమిది ? మనము కలిసికొని చిఱకాలమైనది నీ విటువంటి దురవస్థలోనికి వచ్చితివా ? కొన్నిమాసముల క్రిందట నీవీ దేశములో మిక్కిలి గొప్పవారిలో నొకఁడవై యుంటివి. మీయూరిలో నెంతగొప్పవాఁడైనను మీ దర్శనముచేయుట తనకెంతో గౌరవమని తలంచుచుండెడివాఁడుకదా ? అదియెల్లఁబోయి చివరకింతగతిపట్టినదా ? తలదాచుకొనుటకిల్లులేక నేఁడు దేశద్రిమ్మరివై యుంటివా ? కాని ధనపుంజములో నీకు గొప్పభూములు మేడలు మిద్దెలు యున్నవి కావా ? అవెవరు చూచుచున్నారు? నీవీలాగున నెందుకుఁ దిరుగుచున్నావు?"

"మా తండ్రియున్నప్పుడు మా వ్యవహారములు చూచునతఁడే విశ్వాసము కలిగి యిప్పుడుగూడ మాయిండ్లు భూములు చూచుచున్నాఁడు అవి మా పిల్లలకు వెళ్ళిపోవునవే కావా ? నావంటి నిర్భాగ్యునకవి యుండఁదగవు నేను ఘోర పాపము చేసినాను. దానిఫలము పూర్తిగా ననుభవించినాను. నాకు విశ్రాంతి కావలయును కాని యది ప్రపంచములో దొరుకుటలేదు. నా చిన్నతనములో నాకుఁ గొందఱు స్నేహితులుండెడివారు. వారిలో మిక్కిలి సాధువైనది భార్యయొకతె. చచ్చిపోయిన నా భార్యకు నీ భార్య తోఁబుట్టువుకంటె నెక్కువగ నుండెడిది. నేను తొల్పుకారు వెళ్ళినప్పుడు నీభార్య నెన్నిసారులో చూచి పలుకరించుచు వచ్చినది. పరమసాధువై యతి దయాశాలిని యగు నీభార్య నేనభ్యాగతుఁడనై యీ రాత్రి యిక్కడికివచ్చి యుండుటచేత నన్ను దీవించి మంచిమాటలాడి యామె నన్నాదరింప వచ్చును. నేను రేపువెళ్ళెదను. ఇఁకముందామె కెన్నఁడును కనుపడను. బాధపెట్టను."

అతి దీనములగు నతని పలుకులు విని కాళి దుఃఖము భరింపలేక యతఁడున్న చోటునకు సత్వరముబోయి మేలిముసుంగుక్రిందఁ గన్నీరు వలవల కారుచుండఁ జిన్నతన మందువలనే యాతని చేయిఁ బట్టుకొని లోపలి గదిలోనికిఁ దీసికొనిపోయి యొకచో గూరుచుండబెట్టి గద్గదకంఠయై భర్తకిట్లనియె. "భర్త మనయింటికివచ్చి గౌరవింపఁబడలేదని యుమ యాత్మవిషాదము నొందునేమోకదా. అతఁడిటువంటి బ్రతుకు బ్రతికినను మా యుమ మగఁడే కదా. మీ రాతని ప్రక్కను గూర్చుండి యోదార్పవలయు. ఇతఁ డేదేని యాహారము కావలసియున్నాడు. మిక్కిలి దుర్బలుఁడుగా నున్నాడు. నే నీ లోపున మిక్కిలి త్వరగా నేదేని యాహారము సిద్ధముచేసి పట్టుకొనివచ్చెదను."

అని చెప్పి కాళి వంటయింటిలోనికి వెళ్ళెను. కిశోరరాయ లభ్యాగతి ప్రక్కను గూర్చుండెను. ధనంజయుఁడు చనువరు లిదివఱ కెఱింగిన దీనవృత్తాంతమంతయు నతనితో జెప్పి యిట్లనియె.

"ధన నష్టమునకు నే నంతగా గుందుటలేదు. ఏమన నేను ధనము విశేషముగా గోలుపోయినను నా మాన్యములు, ముఖాసాలు నిలిచియున్నవి. మిత్రులు నన్ను వదలి వేసినారను విచారముగూడ నంతగాలేదు. పూర్వము నాకు మిక్కిలి యాప్తులుగా నుండునట్టి స్నేహితులు వ్రేలుచాపి నన్నొరులకు జూపించి నన్ను దిరస్కారభావముతో జూచి నన్నుగురించి గుసగుసలాడుచున్నారు. ఈ యేకాకిత్వములోనే నా యవమానమునుగూడ నిర్విచారముగ భరింపగలిగి యున్నాను. కాని నా జీవితమును గేవలము నరకవాసప్రాయముగ జేయుచున్న యా మహాదుఃఖ మొకటి యున్నది. మహాపతివ్రతయై నిష్కలంక చరిత్రయై నన్నే ప్రేమించి, నన్నే నమ్మియున్న పరమసాధ్విని నానా బాధలుపెట్టి క్రౌర్యము కలిపి చంపివేసితినన్న యాలోచన చావకున్నది. అదే నా హృదయమును గాల్చుచున్నది. నెత్తురుచుక్కలేక పాలిపోయిన యామె మొగము రేయుంబగళ్ళు నన్ను వేధించుచున్నది. స్వప్నములలో సైతము తెల్లని మొగముగల యొకానొక యువతి రెప్పవేయక కన్నులు నాపైనిగుడ్చి చూచుచున్నట్లు కనబడును. నేనెంతో భయపడి కేకలువేయుచు గుభాలున నిద్రలోనుండి లేచుచుందును. స్త్రీహత్యామహాపాతకము నావెంట నంటియున్నది. దానివలననే నేనున్మత్తుఁడనైతిని. ఈ మనఃక్లేశము నేనింక చిరకాల మనుభవింపఁజాలను."

"ధనంజయా! నీవు ధైర్యముఁ దెచ్చుకొనవలయును. నీవు గొప్ప పాపముచేసితి నన్నమాట నిజమే. కాని శాస్త్రము లేమిచెప్పుచున్నవో యెఱుఁగుదువా? స్త్రీలు దుఃఖ

పడిన పక్షమున భగవదనుగ్రహములేక యాకుటుంబములు నశించునని చెప్పుచున్నవి. కాని యెంత ఘోరపాపమైనను ప్రాయశ్చిత్తము లేనిపాపములేదు. నీ ప్రాయశ్చిత్తము మిక్కిలి భయంకరమై చిరకాలమునుండి నీచే ననుభవింపఁబడుచున్నది. ఈశ్వరుని నమ్ముకో! నమ్ముకొంటివా నీకు మనశ్శాంతి కలుగును.”

ఈ మాటలు ధనంజయుఁడు సరిగా వినకయే తన మిత్రులతో మాటలాడక తనలోఁ దానే యిట్లు మాటలాడుకొనఁ జొచ్చెను. “నేనొకసారి తొల్పుకారు గ్రామమున మా యత్తగారి యింటియొద్ద నుంటిని. అది వెన్నెలరాత్రి. గ్రామవాసు లందఱు గాఢముగ నిద్రించుచుండిరి. అప్పుడామెయు నేనును వెన్నెలలో షికారువెళ్ళి చెఱువుగట్టుమీఁద కూర్చుండి నీళ్ళకేసి చూచితిమి. అప్పుడామెను నేను బిగియారఁ గౌఁగిలించుకొని హృదయము హృదయముతోఁ జేర్చి మేలిముసుగుదీసి మొగము మొగముతో జేర్చిముద్దాడి యానందలహరిలో నోలలాడితిమి. అపుడు “నిన్నొక్క నిముసమైన నేనెడఁ బాయఁజాలను. మనప్రేమకు చుక్కలతో నిండిన యాకాశము సాక్షి. నా జీవితాంతము వఱకు నిన్నే ప్రేమించెద”నని యామెతో నంటిని. చంద్రప్రభాప్రసారణముచే నత్యంత శోభాయమానమైన నాఁటి యామె ముఖము తెల్లబారినను కృశించినను నాకన్నులకుఁ గట్టినట్లు కనఁబడుచున్నది. కనఁబడి మా ప్రేమకు సాక్షియైన సనక్షత్రాకాశమువంక వేలుపెట్టి చూపుచున్నది. నేను చేసినప్రమాణముఁ దప్పితిని. ఆకాశవాణి దృష్టిలో నేనసత్యవాదినైతిని.”

“ఆకథల నన్నిటిని జ్ఞాపకము చేసికొనకు. నీకుఁదప్పక పిచ్చియెత్తును.”

“నాకొకసారి జబ్బుచేసినప్పుడామె పుట్టినంటనుండి ధనపురమునకు వచ్చెను. నాకు మందిచ్చిన వైద్యుఁడు పెదవివిఱచి తెల్లబోయి దగ్గఱనున్నవారి చెవులలో గుసగుసలాడెను. మాతల్లి నా యవస్థఁజూచి వ్యాకులమునొంది నాయెదుట నేడ్చినపక్షమున నేను భయపడి జంగపెట్టుకొందునేమో యను భయమున గడపవిడిచి యావలకుఁబోయి పలుమాఱేడ్చుచు వచ్చెను. కాని యిమె యెంతచేతనో మిక్కిలి ధైర్యముగలిగి యుండెను. ఆమె హృదయము చలింపలేదు. ఆమె రాత్రియనక పగలనక నాప్రక్కనె కూర్చుండి యెన్నోసారులు నాచెవిలో భయపడవద్దు. భగవంతుఁడు మనల నిద్దఱను వేఱుచేయఁడని ధైర్యము చెప్పుచు వచ్చినది. ఆమె యనురాగాతిశయముచేత నాకెంతో ధైర్యము కలిగి జీవింతునను యాసపుట్టెను. ఆ నాఁటిస్థితి నాకన్నులయెదుట నిప్పుడు

కనఁబడుచున్నది. నిశ్శబ్దమై మూసినతలుపులు కలిగి చీకటిచీకటిగానున్న యాగదిలో మగని మంచముప్రక్కను గూర్చుండి యుపచారము చేయుచుండిన విసుగులేని యా యిల్లాలిని బరమశాంతురాలైన యా యిల్లాలిని నేనిప్పుడు సయితము చూచుచున్నాను. భార్యను జంపుటకు గాబోలు ఆ పాడుభర్త బ్రదికెను."

"ధనంజయా! నీ పుణ్యమాయెను. ఆ గొడవలో దిగకు."

"అన్నింటిలో దారుణమైనది కలకత్తాలోని యా కపటరంగమే. నా గుఱ్ఱపుబండి వెళ్ళుచున్నప్పుడు బాటమీఁద చెట్టుప్రక్కను చలిచేత వడకుచుండిన యొక దీనురాలిం జూచితిని. దీపపువెలుతు రామె మొగమున తళుక్కుమని ప్రకాశించెను. ఆమె కన్నులు నాపై నిలిచి నిశ్శబ్దమైన ప్రార్థనము చేసెను. కాని పెదవులు కదలలేదు. ఆ చీఁకటిలో నామెను విడిచి బండి సాగిపోయెను. కలకత్తా నగరమందలి యాటకత్తె యొకతె నా ప్రక్కను బండిలో నప్పుడు గూర్చుండె. అది చక్కనిదే కాని పట్టిపాడుముండ. నా చేత బరాభూతియైన నా భార్య యా చలిలో నిలిచియుండి నశించిపోయెను."

కాళి యుపాహారములు సిద్ధము చేసికొనివచ్చి ధనంజయుని యున్మత్త ప్రలాపములు వినుచు నొక్క యరగంట యావల నిలిచెను. విని విని యామె దుఃఖము తట్టలేక మేలిముసుగు దీసి యావల బారవైచి మితభాషిత్వమును వదలి చిత్తసంక్షోభముచేత గద్గదమైన కంఠముతో నిట్లనియెను.

"నీచే నట్లు పరాభవింపబడిన యా పరమసాధ్వి నీ వలన మహాప్రాయశ్చిత్తము గోరుచున్నది. ప్రాయశ్చిత్తమే మనగా పరిశుద్ధమైన బ్రదుకు బ్రదుకుట. గతించిన దోషమునకు బశ్చాత్తాపము నొందుట. ఆమెను దలచుకొని యామె పేరు నీవు గౌరవింతువేని యామె శిష్టమైన సత్ప్రవర్తనము సదాచారము గలిగి నీ వికముందు నడతువేని స్వర్గస్థురాలైన యును వెనుకటి తప్పులు క్షమించును."

హృదయభావమును సంపూర్ణముగా వెలిబుచ్చిన యామె దృఢస్వరము విని ధనంజయుఁడు త్రుళ్ళిపడి తన యున్మత్తప్రలాపములు మాని మృదుస్వరముతో నెమ్మదిగా నామె కిట్లనియె. "కాళీ! నిశ్చయముగా నీ వట్లు తలంతువా? స్వర్గములోనున్న యాయమ నా తప్పులు క్షమించునా?"

కన్నీరు పెట్టుకొని కాళి యిట్లనియె. "తప్పక క్షమించును. నీవు మంచినడత గలిగి బ్రతికితివా తప్పక క్షమించును. బ్రతికియున్నప్పుడుమ యెంతబాధ పడినదో భగవంతున కెఱుక. నేను దానిని జక్కఁగా నెఱుగుదును. అంత బాధ పడుచున్నప్పటికి దాని కన్నవిమీఁద రవంతయైన కోపములేదు. నీమీఁద మొదలే లేదు. భూదేవత సదా మాయుమ. అది నీవు చేసిన యపకారము లన్నిఁటిని మఱచిపోయి స్వర్గమునందుండి నీ కెంతో మేలుచేయును. నీవు దానినే నమ్ముకొన్నపక్షమున నిన్నుఁ గాపాడును."

ఈ పలుకులు విన ధనంజయుని సంక్షుభిత హృదయముమీఁద నమృతవర్షము కురిసినట్లయ్యెను. కొంతసే పందఱూరకుండిరి. చిన్నబిడ్డవలె నతఁడు కాళి యెక్కడికి వెళ్ళిన నక్కడికి వెంటవెళ్ళెను. ఆమె యాజ్ఞాప్రకారము కొంచె మాహారము పుచ్చుకొని, యొకచో విశ్రమించెను. మంచముమీఁదఁ బండుకొనఁగానే బాష్పప్రవాహము కన్నులనుండి స్రవించి హృదయస్థితమైన దుఃఖభారమును డిందుపఱచెను. పశ్చాత్తాపముఁ జెందిన యా పాపకర్ముఁడు నిర్విఘ్నముగా నిర్మలముగా గాఢనిద్రఁ బోయెను. ఉమ తప్పఁ బాసినది మొదలటువంటి సుఖనిద్ర యతఁ డెన్నఁడు బోయి యెఱుఁగఁడు.

---

## ఇరువదితొమ్మిదవ ప్రకరణము.

---

### అన్వేషణము.

ఉమ దబ్బాటుగ నదృశ్యురాలు కాకమునుపు వ్రాసియుంచిన జాబును మఱునాఁ డుదయమున ధనంజయుఁడు జగత్కిశోరరాయలకుఁ జూపెను. జగత్కిశోరుఁడు దానిని భార్యకుఁ జూపెను. ఆమె బాష్పాకులలోచనయై దానిం జదివెను.

అది చదువఁగానే కాళియొక్క మనస్సునఁ జిన్న యాశాంకురము మొలకెత్తెను. ఎత్తుటయు నామె యిట్లనియె. "ఉమ గంభీరమైనది. చేలది కాదు. మత విషయములు బాగుగాఁ దెలిసినది. సామాన్యపు మందభాగ్యురాలివలె మాయుమ కూడ చులకనగాఁ బ్రాణత్యాగము చేసికొనునా? కాళీఘట్టమునం దగుపడిన బ్రహ్మచారి మా యుమతో మత సంభాషణములు [illegible] పోవుటకుఁ [illegible] జేయుటకు నే ప్రయ్య

క్షేత్రమునందో మారువేషము వేసికొని యుండిన యుండవచ్చునని సందర్భవశమున బలుకలేదా? మహానుభావుఁడైన యా బ్రహ్మచారిమాటలు సత్యము కాఁగూడదా? ఆమె వ్రాసిన యీ జాబులో వర్తమానపట్టికయందలి మాటనుబట్టి దేవాలయముల మాట యామె యెత్తినది. ధనంజయుని భార్య యచ్చోట బ్రతికి యుండవచ్చునా? మహారోషభార మాతని హృదయమునుండి దింపివేయఁబడుట కాధార ముండవచ్చునా?"

ఈ యాశ పునాదిగా జేసి వారా దినమంతయు నల్లికల్లై యల్లిక యల్లి యచ్చట నుండవచ్చు, నిచ్చట నుండవచ్చునని యూహింపఁజొచ్చిరి. సాయంకాలమునఁ గిశోరరాయలును, భార్యయును నతనిని దేవాలయములకుం గొనిపోయిరి. ఆ యాలయములను మహాతబుచందురాజా కట్టించెను. ఉన్నత గోపురములతో నవి యొకదాని ప్రక్క నొకటి వరుసగా నుండెను. మహాతబుచందుఁడు పూర్వ మక్కడికివచ్చి మోకులు నొప్పినెత్తు వరకు మొగమునఁ జెమటకాల్వలు గారువఱకుఁ బ్రదక్షిణముచేసి ప్రతి దేవాలయము ముందట సాష్టాంగ నమస్కారము చేయుచుండెడివాఁడు. రాజుగారి తల్లి నేఁటికి నైతమీ దేవాలయములకుఁ బోయి దేవతాదర్శనముఁ జేయుచుండును. ఆ దేవాలయముల వ్యయమంతయు సంస్థానపు ధనము నుండియే. ఇతర స్థలములనుండి వర్తమానమునకుఁ దండోపతండములుగా వచ్చెడు తైర్థికులు పూర్వరాజుల భక్తి మూర్తీభవించినట్లున్న యా యాలయంబులకుఁ బ్రదక్షిణములు చేసి, దేవతలం గొలిచి పోవుచుందురు.

జగత్కిశోరుఁడును, భార్యయు భక్తిశ్రద్ధలతో దేవతలను దర్శించి నమస్కరించి యర్చించిరి. ధనంజయుఁడు మఱియొకసారి కన్నీరువిడిచి దుఃఖోపశమనముఁ జేసికొనెను. పాడుబ్రతుకు బ్రతికి చేసిన మహాపాతకములను భక్తి మొదలగువానిచేఁ బోఁగొట్టుకొనవచ్చునని భార్య కట్టకడపట జాబులోఁ జేసిన హితోపదేశము నతఁడు జ్ఞప్తికి దెచ్చుకొని యా యాజ్ఞ యీశ్వరాజ్ఞఁగా నెంచి దాని ననుసరించెను.

సాయంకాలము కొంత ప్రొద్దుపోయిన తరువాత గాళి పవిత్రుఁడైన దేవాలయార్చకుఁడుండు కుటీరమునకుఁ బోయెను. అతఁడు మిక్కిలి వృద్ధుఁడు. అతనిం జూచి యామె వందప్రణామములం జేసి యాశీర్వాదముల బడసి యిట్లు పలికెను. "తండ్రీ! ఈ విగ్రహముల నర్చించుచు చిరకాలమునుండి మీ రిచ్చటనే జీవించినారు. అనేక తైర్థికుల నను మీరు దీవించినారు."

"బిడ్డా! నీ వట్లనవచ్చును. ఈ దేవాలయములు నా యధీనము జేసినవాఁడు మహాబలుచంద్రుఁడు. ఆ వృద్ధరాజును నేను పలుమాఱు ఒక దేవాలయమునుండి మఱి యొక దేవాలయమునకుఁ దీసికొనివెళ్ళి విగ్రహములఁ జూపితిని. ఆయన నిజముగా మిక్కిలి గొప్పవాఁడు. మన యాంగ్లేయప్రభువులుగూడ నతని ప్రభావ మెఱుఁగుదురు. ఎఱుఁగుటచేతనే బిరుదులిచ్చి గౌరవించిరి. గొప్పతన మేమిటందువేమో? అతని మనస్సెప్పుడును మతము మీఁదనే యుండెడిది. వార్ధకదశలో నతఁడొక్కఁడైన నిక్కడకు రాకుండ దేవతాదర్శనముఁ జేయకుండ నూరకయుండలేఁడు. కాని యేమిలాభము? వెళ్ళిపోయినాఁడు అతనితోఁ బోయినదా? ఆయన యనంతరమువచ్చిన యీ చిన్న రాజుగూడ వనలను విడిచి వెళ్ళిపోవుచున్నాఁడు."

"తండ్రీ! ఇక్కడ దేవతాపూజఁ జేయువారు రాజులుమాత్రమే కారు"

"కారు బిడ్డా! కాని పూర్వాశివ్రు యాలయములు పవిత్ర హృదయములతో వచ్చునట్టి భాగవతోత్తము లందఱకు సమానముగానే ప్రవేశింపఁదగినవి."

"జీవితములో దుర్గతిమగు దుఃఖోపశమనము మతమువలనఁ గాంచవలయునని దుఃఖభారముక్రిందఁబడి నలిగిపోయిన హృదయములతో నిక్కడకు వచ్చియుండిన భక్తుల ననేకులను మీరు చూచి దీవించి యుందురు గదా?"

"అహా! అప్పుడప్పుడట్టివారి నెందఱినో నేను కనిసికొనియుంటిని. ఎందుచేతనన మందభాగ్యులకు మహాదేవుని చరణములదప్ప యన్యథా శరణమెక్కడనున్నది."

"అట్టివారిలో నొకదానికథ మీకు జ్ఞాపకమున్నదా? అది వయస్సునఁ జిన్నది. ముఖము లక్షణమైనది. అదికూడ వచ్చి తన దీనచరిత్రము మీతోఁ జెప్పికొని దుఃఖతారకమైన మీయాలోచనమడిగి యుండవచ్చును. ఎంతో కాలమైయుండదు. కొన్ని వారముల క్రిందటనే."

"అబ్బో! ఇద్దరా, ముగ్గురా? అటువంటి వాండ్రెందరో వచ్చుచుఁ బోవుచుందురు. కాని నాకటువంటి చిన్నదాని నొకదానిని జూచినట్టు జ్ఞాపకమున్నది. అది మిక్కిలి యందకత్తె. మొగముజాడఁగానే మహావిచారములో నున్నట్లగపడినది. నేనామెవంక నెన్నోసారులు చూచిచూచి దుఃఖకారణ మడిగితిని. అది బాలవితంతువు. గుండెపగిలి తెగ యేడ్చినది."

"తండ్రీ! దాని విషయమై కాదు నేనడుగుచున్నది? ఇది పెండ్లియైనదే. ఏ బాలవితంతు వెన్నఁడు ననుభవించి యెఱుఁగని ఘోరదుఃఖము ననుభవించి యిది భర్తను విడిచిపెట్టి వచ్చినది. ఆ మహాదుఃఖముచేత నదికూడ మీదర్శనము చేయుటకు వచ్చియుండునని నేననుకొంటిని."

"బిడ్డా! నీవు జ్ఞాపకము చేయుటవలన జ్ఞాపకము వచ్చినది. నేను చెప్పినది బాలవితంతువుమాట కాదు. మఱచిపోయినాను పెండ్లియైనదానిమాటే. వితంతువువలె నది యంచులేనిపంచె కట్టుకొని వచ్చినది. దండలకుఁగాని చేతులకుఁగాని మెడలోఁగాని, నగలు లేవు. కాని కాలువలుగట్టు కన్నీరు తుడుచుకొనుట కామె చేయెత్తినప్పుడు పుణ్యస్త్రీలయొద్ద గనఁబడు పసుపుబిళ్ళ నాకుఁ గనఁబడినది. అన్నినగలు తీసివేసినను పుణ్యస్త్రీ యదిమాత్రము తీసివేయదు. వితంతువు మగఁడు పోఁగానే దానిని తీసిపాఱవేయును. దానివాలకమునుబట్టి, కట్టినబట్టనుబట్టి యది వితంతువని నేను భ్రమించితిని గాని యది నిజముగా మగఁడు బ్రతికియున్న యాఁడుదై యుండవచ్చును."

"తండ్రీ! ఈమాత్రము మాటలు చెప్పి మాకు ధైర్యము కలిగించితివి. భగవంతుఁడు నిన్ననుగ్రహించుఁగాక! నీ జీవిత మెంత పవిత్రమో నీ చరమకాలముకూడ నంత సుఖాస్పదమగుఁగాక! కాని యామె మీతో తనబాధలు చెప్పికొన్నదా? చెప్పు తండ్రీ! చెప్పు. వినుటకుఁ జెవులు తొందరపడుచున్నవి. ఏదో మంచివార్త వినఁబడునను నాసచేత నా హృదయ ముబ్బిపోవుచున్నది"

"బిడ్డా! నే నెఱిఁగిన దంతయుఁ జెప్పెదను. ఆమె తన గోడేమియు నాతోఁ జెప్పలేదు"

"తాల్పుకారునుండి గాని ధనపురమునుండి గాని వచ్చినట్లయిన జెప్పలేదా."

"ఎక్కడనుండి వచ్చినదో యామాట చెప్పనే లేదు."

"కలకత్తాలోఁ దన కొక చుట్టము పక్కము లేకుండ, స్నేహితులు లేకుండ నేకాకియై యెంతో దౌర్భాగ్యస్థితి ననుభవించినట్లయిన జెప్పలేదా?"

"ఆమె స్నిగ్ధవిధముచేత దౌర్భాగ్యస్థితిలో నున్నదని నే నూహించితిని గాని నోటితో నేమియుఁ జెప్పలేదు."

"మగఁడు తన నిమిత్తము వెదకుకొనుచు వచ్చినప్పుడు తా నీ దేవాలయములలో నుందుననియైనఁ జెప్పలేదా ?"

"మగనిమాటే యెత్తలేదు. తిరిగి వచ్చుటమాట యంతకుముందే లేదు."

"ఎక్కడికి వెళ్ళఁదలఁచుకొన్నదో, ఎక్కడఁ గనఁబడునో చెప్పినదా?"

"పుణ్యనదీతీరములందున్న దేవాలయములఁ జూచుచు నెందఱో ధర్మవానులక్కడ నుండి యిక్కడకు నక్కడనుండి యక్కడకుఁ దిరుగుచుందురు. ఆమెయు వారివలెనే యొకచోట నిలువక దివ్యస్థలము లన్నిటికిఁ బోవుచుండును."

"తండ్రీ! దానిని గురించి మీకేమియుఁ దెలియ దన్నమాటే. ఏమాత్రము జ్ఞాపకమున్నను సరే, చెప్పుఁడు. ఏమి యానవాలు చెప్పినను సరే, సందర్భవశమున నాడినమాట యేదైనను సరే, ఎందుకంటే దానిభర్తయొక్క సుఖము, బ్రతుకు, సమస్తము మీమాటలనే యాధారము చేసికొని యుండును."

"బిడ్డా! ఒకమాటయైన నాడలేదు. ఒక్క యానవాలైనఁ జెప్పలేదు. అందరివలెనే వచ్చినది. దేవతాదర్శనము చేసినది. కాని యొందుచేతనో తెగయేడ్చినది. మరునాఁ డుదయమున వెళ్ళి పోయినది."

ఆయనవద్ద సెలవు పుచ్చుకొని కాళి దడదడ కొట్టుకొను గుండెలతో భర్తయొక్క సన్నిధికి వచ్చి యర్చకుఁడు చెప్పిన స్వల్పవృత్తాంత మతని కెఱిగించెను. జగత్కిశోరరాయలు మిక్కిలి యాత్రముతోఁ బ్రతిదేవాలయమునకుఁ బోయి ప్రతిపూజారిని, కంటికగపడిన ప్రతిసేవకుని నేవో కొన్ని ప్రశ్నలడుగఁ జొచ్చెను. ఒకచక్కని చిన్నది విధవవేషము వేసికొని యాదేవాలయములో నొకనాఁటిరాత్రి తల దాచుకొని మరునాఁ డుదయమున నెక్కడికో యాత్ర వెళ్ళినదని వారందఱుఁ జెప్పిరి. వారిలో నొక సేవకురాలిట్లనియె. "పాప మా యిల్లాలిమగఁడు అప్పటికి స్వల్పకాలము క్రిందటనే పోయి యుండును. ఏమంటే, మొగము మీఁద కుంకుమబొట్టు పెట్టుకొన్న యానవాలు కనఁబడుచునే యున్నది."

"కాని యామెతోఁ గలసి వెళ్ళినవారెవ రెవ్వరు? వర్ధమానమునుండి యెవరైన వెళ్ళిరా?" యని జగత్కిశోరుఁ డడిగెను. ఆసమయమునందే కాపుర మున్నవారి యొక పిల్లవాఁ డక్కడఁ జేరిన గుంపులోనుండి యిట్లనియె. "లేదు. వారందఱు క్రొత్తవారే.

గోవిందునితల్లి మాత్రము నేనెఱిఁగినది. ఆమెది గోయిపురము. ఆమెకూడఁ దీర్ఘయాత్ర వెళ్ళినది. ఆమె తిరిగి వచ్చినది."

కాళీ దేవాలయము విడిచి పల్లకియెక్కి యింటికి వెళ్ళునప్పటి కర్ధరాత్రమయ్యెను. కాని జగత్కిశోరరాయలు మాత్ర మింటికి రాలేదు. అతఁడు ధనంజయునితోఁ గలసి గోయిపుర గ్రామమునకు వెళ్ళెను. రాత్రి యంధకారమయమై యుండెను. కాలినడక కనుకూలములైన చేలగట్లు మిక్కిలి సన్నముగా నుండెను. పైగా వాటిమీఁద శీతకాలపు మంచు కురిసియుండుటచే నవి తడిసి యుండెను. మిక్కిలి యాత్రము గల యాబాటసారులమీఁద నక్షత్రములు గగనమునుండి మిణుకుమిణుకు మను కాంతులతో నల్పతేజమును బ్రసరింపఁ జేసెను.

తెల్లవారక ముందే వారా గ్రామముఁ జేరి గోవిందునితల్లిని మేలుకొలిపిరి. ఆమె విశేషమేమియుఁ జెప్పలేదు. ఆచిన్నది తన ప్రక్కను గూర్చుండి యెంతో యేడ్చిన దనియు, తన దురవస్థ యేమో యెవరికిం జెప్పలేదనియు, నామె చెప్పి కన్నుల నీరు పెట్టుకొని యెట్టకేల కిట్లనియె. "అది యెంతో మంచిది. నాయనా! చిన్నపిల్ల. కాని దైవము తిన్నఁగాఁ జూడలేదు. అందుకనివితంతువై పోయినది. కాలినడకను, రైలుమీఁద మే మెన్నోరోజులు కలసి ప్రయాణముచేసి యెన్నో క్షేత్రములు చూచితిమి. కాషాయవస్త్రములు కట్టుకొన్న యోగినులగుంపులలో నామె తరచుగాఁ గలిసి యుండెడిది. వారివలెఁ దాను గూడ కాషాయవస్త్రములు గట్టుకొని వారితో పోవలె నని కోరిక యున్నట్లు చెప్పుచు వచ్చినది. మే మందఱము బాటప్రక్కను గూర్చున్నప్పు డామె చెట్టుక్రింద వంట చేసి కొన్నది. వంటనఁగా మ రేమియులేదు. ఏదో పట్టి యున్నము గంజి. అప్పుడు నీ దురవస్థ యేమిటమ్మా యని నేనడిగితిని. అడిగినందుకేమైనఁ జెప్పినదా? ఏడ్చి యూరకుండినది. తన తల్లిదండ్రులు తొల్పుకారులో నున్నారనియు, అత్తవారి యూరు ధనపురమనియు మాత్రము చెప్పినది."

తొల్పుకారు ధనపుర గ్రామముల పేరులు వినఁగానే ప్రశ్నలు వేయువారి మనస్సులలో నాశాకిరణము మఱియొకటి బయలుదేఱెను. ఆతీర్థవాసిని నిశ్చయముగా సుమతియే యని వారు నమ్మిరి.

"ఆమెను మీరు కడసారి యెక్కడఁ జూచితిరి? ఆమెను మీరెక్కడ విడిచి వచ్చితిరి? చెప్పుమమ్మా చెప్పు. నీమాటలవల్ల నా కామెజాడ తెలిసినపక్షమున ధనపుర

మందలి కొట్లలోని ధనమంతయు మీ కాళ్ళదగ్గఱకు వచ్చియుండును. భార్యావియోగముఁ జెంది విలపించుచున్న భర్త యావజ్జీవము మీయెడలఁ గృతజ్ఞుఁడై మిమ్ము దీవించుచుండును" అని ధనంజయుఁడు పలికెను.

"అయితే నాయనా! దానికి మగఁడున్నాఁడా? ఆపిల్ల వితంతువుకదా? అయ్యో! పాప మెంతచిక్కి నూలినదై పోయినదయ్యా! దేశాలపాలై పోయినది. నేననుకొన్నాను. దానికెంతో మొగమాటము, చేటుసిగ్గు. ఒకరితో మాటలాడ నిష్టము లేనిది. ఏదోమూల నొంటిగాఁ గూర్చుండుచు వచ్చినది. కుంకుమబొట్టు పెట్టిన యానవాలు మొదటమీఁద కనఁబడు చుండినది. కాని మే మెన్నోదినములు కలసి ప్రయాణము చేసినను మగనిమాట యామె యెత్తనేలేదు."

అనవుడు ధనంజయుఁడు గుండెలు కొట్టుకొన నిట్లనియెను. "అమ్మా! అది యెటుండనిచ్చి, ఆమెను మీరెక్కడ విడిచిపెట్టితిరో, ఆమెను మీ రెక్కడ కడపటిసారి చూచితిరో ఆ స్థలము చెప్పుడు?"

"మే మిద్దరము వేఱుకాలేదు. నేనామెను విడిచిపెట్టలేను. మే మందరము కలసియే తిరిగి వర్ధమానమునకు వచ్చితిమి. ఆమె నాతో కలసి మాయూరువచ్చి మా యింటిప్రక్కనున్న కుటీరములోఁ దనవంటదానే చేసికొని కొన్ని దినము లుండినది. కాని జనులందఱు ఈమె యెవరీమె యెవరని యెన్నోప్రశ్నలడుగఁజొచ్చిరి. ఆ బాధ పడలేక రెండుదినములక్రిందటనే యీ యూరు విడిచిపెట్టి గయవెళ్ళుచున్న యాఁడువాండ్రలో గలసి వెళ్ళిపోయినది. కాషాయవస్త్రములు ధరించి యోగినులలోఁ గలసి పోదునని చెప్పినది."

అప్పుడు ధనంజయుఁ డిట్లనియె. "మిత్రుడా! నాపని యైపోయినది. ఇఁకమీఁద నేను నాభార్యాసమాచార మడుగుటతోనే కాలము పుచ్చెదను. ఈజీవితములో నాకు మఱియొకపనిలేదు. ఇల్లు వాకిలి విడిచిన దేశదిమ్మరిని నన్ను నీభార్య దయతో నాదరించినది. సజ్జనుల యాదరణమునకు, సహాయమునకు, నేను తగనివాఁడ నైనను మీరు నన్నాదరించి సహాయముచేసితిరి. నాహృదయము మీఁదనుండి గొప్పభారము దిగినది. మహాదోష కళంకము నా యాత్మమీఁదనుండి తుడిచివేయఁబడినది నాభార్య యిప్పటికి జీవించి యున్నదని నే నిప్పుడు తెలిసికొంటిని గనుక నాకిప్పుడెంతో బలము వచ్చినది. ఆమె నాకగపడువఱకు నే నీవిధముగా వెదకికొనుచు వెళ్ళెదను. లేదా, యీ యన్వేషణములో నశించి పోయెదను."

వర్ధమాన పట్టణమునుండి బంకిపురమున కొకరాత్రి ప్రయాణము. బంకిపురమునుండి ప్రత్యేకముగా నొకశాఖామార్గ మున్నది ఆమార్గముమీఁద రైలు బండియెక్కిన పక్షమున గయాక్షేత్రమునకుఁ బోవచ్చును. ఆ నగరమునిండ దేవాలయము లున్నవి. తైర్థికులైన హిందువులు గుంపులుగుంపులుగఁ బ్రతిదిన మిక్కడకువచ్చి చచ్చిపోయిన పితృపితామహాదులకు, బంధువులకు పిండములు వేయుదురు. గయలో నున్న ఫల్గునదిమీఁద స్నానఘట్టములు కట్టఁబడి యున్నవి. అక్కడ నుదయాస్తమయములు మాతాపితృభక్తులగు పుత్రులు, దుఃఖార్తులైన బంధువులు, మృతినొందినవారి యాత్మలకు శాంతి కలుగఁజేయుటకు శ్రాద్ధకర్మములు చేయుచుందురు. మృతినొందినవారి మీఁద హిందువుల కున్నంత భక్తియు, గౌరవము మఱి యే జాతివారికి లేదు. గయాక్షేత్రమునఁజేయు శ్రాద్ధకర్మములకంటె పితృదేవతాకములైన పుణ్యకార్యములు వేఱులేవు.

ఆపట్టణమునకుఁ దైర్థికులు ప్రతిదినము తండోపతండములుగావచ్చి యొకనాఁడో, యొకపూటయో యచ్చట విడిసి, తాము వచ్చి పోయినట్లు రవంతైన గుఱుతు నిలుపక వెడలిపోవుచుందురు. అట్టినగరములో దనపేరెవ్వరికి జెప్పక ప్రచ్ఛన్నముగా వచ్చి ప్రచ్ఛన్నముగా వెళ్ళిపోయిన యొకానొక యాతురాని సమాచారము తెలిసికొనుట యసాధ్యము కదా! ఐనను ధనంజయుఁడు ధైర్యము విడువలేదు. భార్యాన్వేషణమే యతని జీవితముయొక్క పరమార్థము. అపరాధమునకు దగిన ప్రాయశ్చిత్తము చేసికొనుటయే యతని సంకల్పము.

ఎండలో మిక్కిలి యలసిపోయియున్న మధ్యాహ్నకాలమున ధనంజయుఁడు గయలో మనుష్యులేఁగుచున్న వీధులవెంబడి దిరుగఁ జొచ్చెను. అతఁడు ప్రతిదుకాణము దగ్గఱ భోగట్ట జేసెను. రాతి చిప్పలకు రాతిపళ్ళెములకు గయ ప్రసిద్ధి. తన భార్యను గుఱించి యతఁ డా వర్తకుల నెన్నో ప్రశ్నలు వేసెను. దేవాలయముల ప్రక్కనుండు గొందులలో నిత్తడివిగ్రహముల నమ్మెడు స్త్రీలను పురుషులను విసువులేక సమాచార మడిగెను. వీధిమూలలయం దతఁడు కొంచెముసేపు నిలువఁబడి దేవాలయములలోనుంచి వచ్చెడి మనుష్యులగుంపులను పరిశీలించి చూచెను. పూజారులను, బాటసారులను, ప్రశ్నలు వేయుచు నేటిగట్టుమీఁద నెన్నోసారులు తిరిగెను.

సాయంకాలము గడచి రాత్రి ప్రారంభ మయ్యెను. కాని యన్వేషణము ముగియలేదు. బాటప్రక్కన నొకయంగడిలో నతఁ డటుకులు కొని తిని ఫల్గునది జలము

కొంచెము త్రోవి శ్రమ దీర్చికొనుటకు మెట్లమీద గొంతసేపు కూర్చుండెను. దేవాలయ ఘంటానాదము సాయంకాల సేవాసమయమైన దని ఘోషించెను. సాయంసమయ మందమారుతములు నదిమీదనుండి వచ్చి చల్లగా వీచెను. ధనంజయుడు తిరిగి తిరిగి యున్నందున కాళ్ళు నొప్పులుపట్టి యలసిసొలసి దుఃఖభారమున గుండి రాతిస్తంభము నకు జేరబడి నిద్రపోయెను.

అది చీకటిరాత్రి; అర్ధరాత్రి పప్పటికి నిర్మానుష్య మయ్యెను. క్రమక్రమముగా దేవాలయమునందును బజారునందును ధ్వని మందగించెను. చల్లగాలి యంతకంతకు జలి గాలిగా మారెను. అట్టిసమయమున నెవరో వచ్చి కనుదస్సిన యాబాటసారిని జేతితో మెల్లగ స్పృశించిరి. అస్పర్శ యతనిని మేలుకొలిపెను. అతడు కన్నులు దెఱచి తన యెదుట మెట్లమీద నిలిచి యున్నయొక ముసలి బ్రాహ్మణుని జూచెను. ఆబ్రాహ్మణుడ తని కిట్లనియె.

“నాయనా! నీవెవ్వరు? తైర్థికు లందఱు బసలకు వెళ్ళి పండుకొనిరి. ఈయర్ధ రాత్రమువేళ నీ విక్కడ నొంటిగా నెందు కున్నావు?”

“తండ్రీ! నేను వర్ధమానమునుండి వచ్చుచున్నాను. రెండుదినముల క్రిందట నిక్కడి కొకబాటసారులగుంపు వచ్చినది. ఆగుంపును వెదకికొనుచు వచ్చినాను. ఆగుంపుతో నొకచిన్నది వచ్చినది. ఆమెను దీసికొని పోవలెనని భర్త కోరుచున్నాడు”

“ఆగుంపులో నున్న మనుష్యుల పేళ్ళెఱుగుదువా?”

‘ఆహా! తెలుసును.’

“ఐతే నీవు కష్టపడి వెదకికొన నక్కఱలేదు. నాతో రా.”

ఆబ్రాహ్మణుడ తనిని దేవాలయమునకు దీసికొనిపోయెను. వందలకొలది పండాలు దేవాలయావరణములో గాపుర ముండిరి. ఆయన్వేషణము గురించియు, వెదకితెచ్చినవారికి వచ్చుగొప్పబహుమానముల గురించియు విని వారందఱుగుంపుగూడిరి. ఆ పేర్లు కనుగొనుటకై పండా లందఱు తమతమపుస్తకముల కట్టలు తిరుగవేసిరి. గయలో వడుగుపెట్టిన తైర్థికు లందఱి పేళ్ళు చిత్రగుప్తుని లెక్కవంటి యాపండా బ్రాహ్మణుల పుస్తకములలో నెక్కియుండును.

"కనఁబడినది. కనఁబడినది అదియైదుగురు మనుష్యుల తండా; తల్లి, తండ్రి, పెండ్లియైన కుమార్తెలిద్దరు, వారితో నొకవితంతుపుత్రికయు వచ్చిరి." అని యొకపండా చెప్పెను.

"ఆవితంతువు పేరేమి?" యని ధనంజయుఁ డాత్రముతో నడిగెను.

"అది నా పుస్తకములో లేదు. ఆబిడపేరు లేమియుం జెప్పలేదు. తాల్పు కాకలో జన్మించిన దఁట. ధనపుర మత్తవా రఁట."

'ధనపురమా యేమిటి మీయభిప్రాయము?'

"ఐయుండ వచ్చును. వ్రాతసరిగా లేదు, అలుకుకొని పోయినది."

"ఆతండా యిప్పుడెక్కడున్నది?"

'ఇప్పటివఱకు గయలోనే యున్నా రని నే దలంచెదను. నేను వారిని వెంటఁ బెట్టుకొని దేవాలయము లన్నియుఁ జూపితిని. సాయంకాలమునందు వారు చేయవలసిన దానములు జేసి, తాము బసదిగినయంగడిలో నిద్రింపఁబోయిరి.'

'ఆయంగడి యెక్కడ?'

"అది మిఠాయి గోపాలునియంగడి."

"అయ్యా! త్వరపడు. త్వరపడు. ఆతండా యిప్పటికి నచ్చట యుండెనా నీకు మంచిబహుమానము దొరకును."

అర్ధరాత్రము మిఠాయి గోపాలుఁడు గాఢనిద్రనుండి మేలుకొల్పఁబడి కన్నులు నలుపుకొనుచు, "ఇదేమిటయ్యా! అపరాత్రమువేళ, నిద్రపోవుచున్న మర్యాదస్థులైన పేదసంసారులను లేవఁగొట్టి తీసికొనివచ్చుచున్నా రేమి? మీరు పోలీసువారా యేమిటి? ఖూనీ యేదైన జరిగినదా యేమిటి పట్టణములో?' నని సణుగుకొనుచు వచ్చెను.

తళతళ లాడుచున్న తెల్లని రూపాయయొకటి క్షణము వానిచేతిలోఁ బడెను. అది సణుగులను గొణుగులను నిమిషములో నంత మొందించెను.

"ఈ రాత్రి నీయంగడిలో నిద్రపోవుచున్న తండా మనుష్యులతో నేను కొంచెము మాటలాడవలెనని యున్నది. నిన్నింకొంతసేపు మేలుకోఁబెట్టను." అని ధనంజయుఁ డతనితోఁ బలికెను.

"అది యేతండా?"

"ఎఱుఁగవా! ఒక మగవాఁడు, కలుగు రాఁడుఁవాండ్రు గలసివచ్చినతండా. వారు వర్ధమానమునుండి వచ్చిరి. వారిక్కడ రెండు దినములనుండి యున్నారు."

"అయ్యో! వారు సాయంకాలము భోజనము కాఁగానే వెళ్ళిపోయిరి. ఒక జామైనది బయలుదేఱి."

"అయితే వారెక్కడికి వెళ్ళినారయ్యా?"

"అది నే జెప్పలేనండి! నే నేమి పోలీసువాఁడనా పెద్దమనుష్యులు బోవుచున్నప్పుడు మీ రెక్కడికి వెళ్ళుచున్నారని యడుగుటకు?" అని వారందఱక్కడనుండఁగానే గోపాలుడు తడికలు గింపి యంగడి మూసివేసి లోపలికిఁ బోయెను."

"ఒక్కనిముస మాగినోయి. నీ యంగడి విడిచి వారేలాగున బోయిరి?" యని ధనంజయుఁ డడిగెను.

"వారణాసిని యెద్దుబండి యద్దెకుఁ గుదుర్చుకొని పోయిరి ఆఁడువాండ్రు నలుగురు బండెక్కిరి. మగవాఁడు వెనుక నడచుచు పోయెను" అని యతఁడు లోపలనుండి చెప్పి పండుకొనెను. చూఁకనగా చేతిలో బిళ్ళకుడుము వలె రూపాయి పడినంగున సంతోషముగా నిద్రపట్టెను.

"అయ్యా! మేము చేయవలసిన దింకెన్న నేమున్నది? ఈపాటికి వ్యర్థమైన ప్రయత్నములు మాని యింటికి వెళ్ళండి. తప్పుదారి ద్రొక్కిన యా యిల్లాలు తిరిగి తిరిగి విసికి వేసారి బుద్ధితెచ్చుకొని మరల మగనికడకుఁ దానే పోవును. దేశ దిమ్మరియైన యాడుదానిని, గాలిని, పట్టుకొని యెవఁడు బంధింపఁ గలడు!" యని యాపండాపలికెను.

"అయ్యా! నీవనవసర మైనమాట లాడకు. మనపని యింకను ముగియ లేదు. ఆ బండివానియిల్లు కనుగొందము" అని ధనంజయుఁడు కొంచెము విసిగికొని పలికెను.

తిరిగి తిరిగి వారు బండివాని యిల్లు దెలిసికొనిరి. చప్పట్లు గట్టిగా కొట్టగా కొట్టగా, తలుపులు తట్టగా తట్టగా, పాపము! బండివానిభార్య మేల్కొనెను. మేలుకొని తన మగఁడు పన్నులియ్యవందున వానిని బట్టుకొని తీసికొని పోవుటకై వచ్చిన సర్కారు బంట్రోతులు వచ్చియుండి రనుకొని భయముతో గడగడవడఁకుచు నామె తలుపులు తెఱచెను. తెఱచి యేడ్చుచు "బాబయ్యా! ఆయన యింట్లో లేడండి" యని బొంకులు చెప్పెను.

"నీమగఁడు మనుష్యుల నెక్కించుకొని యేదో యూరికి రాత్రి బండి తోలుకొని పోయినవాఁడు కాదూ?" యని ధనంజయుఁ డడిగెను.

"వెళ్ళినాఁడు బాబూ! కాని, సరకారువారిపన్ను లెగవేయఁడండి. పెద్దమనిషి బాబయ్యా!" యని వడఁకుచున్న యా పడఁతి ప్రత్యుత్తర మిచ్చెను.

"అమ్మా! సర్కారు పన్నులకోసము రాలేదు మేము. ఒక యాఁడది తప్పి పోయినది. ఆమెను వెదకికొనుచు వచ్చినాను."

"అయ్యో దేవుఁడా! నా పెనిమిటి పని యేమవుతుందో కదా; బాబూ యెవరి భార్యను? యెవరి కూఁతురిని? మా మగమనిషి యెఱిఁగిఉండి దాచఁడండి బాబయ్యా. నేరక చేసినాఁడండి బాబయ్యా! అలాటి ఆఁడమనిషిని నా కొంపలోనికి జేరనియ్యనండి బాబయ్యా. మేము పేదవాళ్ళమే కాని బాబయ్యా, పరువు గలవాళ్ళము. సీమరాణిగారి అనుగ్రహామువల్ల బ్రదుకుచున్నాము బాబయ్యా!"

"అది మే మెఱుఁగుదుమమ్మా నీ పెనిమిటిమీఁద మేము నేర మేదియు మోప లేదు. ఆ తప్పిపోయిన యాఁడదాని పెనిమిటి ఆబిడ యేలాగున వెళ్ళినదో తెలిసికొని రమ్మని మనుష్యులను బంపినాఁడు. అందుకోసము వచ్చినాము నీబండి యే వైపువెళ్ళినదో, యేయూరు వెళ్ళినదో యని తెలిసికొన వచ్చినాము" అని ధనంజయుఁడు పలికి యామె చేతిలో నొకరూపాయి పెట్టెను.

ఆమె ధైర్యము తెచ్చుకొని యిట్లనియె. 'అది నేఁ జెప్పలేను బాబయ్యా! మా మగమనిషి తీసికొనిపోయిన మనుష్యుల నైనా నేను చూడలేను. ఈ రాత్రి యెనిమిది గంటలకు బండి గోపాలుని దుకాణము దగ్గఱకు తీసికొని వెళ్ళినాఁడు బాటసారు లక్కడనే బండెక్కినారు.'

"అతఁడు తిరిగి యెప్పుడు వచ్చును? ఎంతదూరము వెళ్ళుచున్నాఁడో ఎప్పుడు తిరిగివచ్చునో నీతో జెప్పకపోవునా?" యని పండా బ్రాహ్మణుఁ డడిగెను.

'రేపు పొద్దు నెత్తిమీఁదికి వచ్చేటప్పటికి కూఁడు తయారుగా నుంచమన్నాడండి బాబయ్యా. మద్దినాలకు బుద్ధగయనుండి రాఁగల నని చెప్పినాఁడు."

అనవుడు ధనంజయుఁడు మహోత్సాహముతో దాపున నున్న పండాబ్రాహ్మణునిజేయిబట్టి బుద్ధగయకు వెళ్ళుబాటవైపునకు లాగి యిట్లనియె. 'చాలు; బుద్ధగయ

యిక్కడికి కొంతదూరము లేదు. బండి జాముక్రిందటనే బయలుదేరినది. పండాజీ! ధైర్యము తెచ్చుకో! మనము తెల్లవారకముందే బుద్ధగయఁ జేరఁగలము. త్వరగా నడిచి తిమాత్రోవలోనే బండిని కలసికొనఁగలము."

అని పలుక నాపండా బ్రాహ్మణుఁడు తనపడిన శ్రమకు గొప్పబహుమానము లాగివేయ వచ్చునని దృఢముగా నమ్మి 'అలాగే చేయవచ్చును లెండి' యని బదులు చెప్పి తనలో 'భర్తను విడిచిపెట్టి మఱికొందరుభార్యలీ లాగున లేచివచ్చి మాపాలఁ బడినపక్షమున మాపొట్ట నేతిలోఁ బడును గదా' యనుకొనెను.

గయాబ్రాహ్మణు లందఱివలెనే యీపండాకూడ దృఢదీర్ఘకాయుఁడు. ధనంజయుఁడు దేహబల మంతగా లేకపోయినను నీవిషయమున గట్టిమనోనిశ్చయము కలిగి యున్నవాఁడు. ఆచీఁకటిరాత్రి మైలు తరువాతమైలు వారు విసవిసనడిచిరి. అప్పుడప్పుడు నేల నిమ్నోన్నతముగా నున్నచోట్ల నడుగుజారి పడుచుండిరి. ఒకరితోనొకరు తరచుగా మాటాడుటలేదు. ఒకటిరెండెద్దుబండ్లు తమ కెదురుగా వచ్చినప్పుడు వారొక నామునిబండినిగూర్చి వాఁడడిగిరి. కాని, వారిప్రశ్నలకుఁ దగినయుత్తరములు రాలేదు. దారిని బోవు ప్రతిమగవానిని, ప్రతియాఁడుదానిని వారు ప్రశ్నలు వేయఁజొచ్చిరి. కాని యేవర్తమానమునుఁ దెండా సంగతి తెలియలేదు.

అలసిసొలసి బాటసారులు బుద్ధగయఁ జేరునప్పటికి నుదయకాల సంధ్యారాగము గ్నిజ్వాలవలెఁ బ్రదీప్తమై పొడుపుకొండ నలంకరించెను. తైర్థికులబండ్లు నిలిచెడు చోటు, బండియెద్దులకు మేతవెట్టుచోటు కనుగొనుటకు వారంతగా శ్రమపడలేదు. కొంత భోగట్టా చేసినతరువాత బండిమనుష్యుఁడైన హరనాముని వారుకనుగొనిరి. అతఁడు రాత్రి యంతయుఁ బయనము చేసి చల్లగాలిలో నుండుటచే నప్పుడు చుట్టగాల్చుచు హాయిగాఁ జలిమంట కాగు చుండెను.

అతని జూచి పండా యిట్లనె 'ఓయీహరినామ్! గయనుండి బుద్ధగయకు రాత్రి యొకాయకీని బండి గట్టుకొని వచ్చినందుకు మంచికిరాయి దొరికినది కాఁబోలు.'

"పండాజీ! లేదు. లేదు. తీర్థవాసులు పూర్వమిచ్చి నట్లిప్పుడు డబ్బిచ్చుటలేదు. అదిగాక మునుపటియంతమందికూడ వచ్చుట లేదు. ఇంతకు మాబండివాండ్ర గ్రహచారమది. మాతండ్రి తాతలు బండితోలి బ్రతికినారు గదా యని మేమును విడువలేక తోలుచున్నాము. లాభములు లేవు. నే నేమాత్రమో మీకు బాకీయున్నాను. జ్ఞాపకమున్నది.

వడ్డితోగూడ సంవత్సరము లోపుగా మీ కిచ్చివేయక మానను. కాని యీరోజున నాసలపాదన కొంచెమే. ఇది మీకిచ్చిన పత్రమున నా పెండ్లము బిడ్డలు వస్తు పడ వలసినదే.”

“నీ పెండ్లము మంచిది. వస్తుండ లేదు. ఈమధ్యాహ్నము నీవు వెళ్ళునప్పటికి మంచికూర వండి నీకన్నము సిద్ధముగా నుంచును. నా కియ్యవలసిన బాకీ వసూలుచేసి కొనుటకు నేనిక్కడకు రాలేదు. ఈతీర్థవాసుడు మిక్కిలి దయగలవాడు. ఈయన నీకేదోబహుమాన మియ్యదలచుకొన్నాడు. అది నీకెప్పించుటకు వచ్చితిని. ఈడూపాయి పెట్టి నీభార్యకు మంచికోక కొని తీసికొనిపో. నీవు రాత్రి తీసికొనివచ్చిన మనుష్యు లెక్కడ నున్నారో చెప్పు” బండివాడు కన్నులు మిక్కిలి యాశ్చర్యముతోను సంతోషముతోను మెఱయనిట్లనియె. “పండాజీ! భగవంతుడు మీకు మేలుచేయువలె. నా పెండ్లము బిడ్డలు మీపాదములకు మ్రొక్కుచుందురు. నాయనా! ఇప్పుడే కాదు, మీరుమాకెన్నో సారులు దయగలిగి యుపకారము చేసితిరి. కాని నేను తీసికొనివచ్చిన మనుష్యు లెవరో నేను బాగుగా నెఱుగను. బండిలో నలుగురాడవాండ్రు కూర్చుండిరి. ఒకమగవాడు వెనుక నడచివచ్చెను.

“సరే! ఆవియంతయు మే మెఱుగుదుము. వీరందరు యేస్థలమునుండి వచ్చినదో చెప్పు? ఆయాడవాండ్రేలాగున నున్నారో చెప్పు.”

“బంగాళాదేశములో గొప్పయింటి యాడవాండ్రవలెనే వారు దుస్తులు ధరించినారు. అందులో నొకావిడ పెద్దది. ఆమె కిద్దరుకూతురు లున్నారు. వారు పెండ్లిలేనివారే. వారుకట్టిన బట్టలనుబట్టి నేను పెండ్లయిన దనుకొన్నాను. నాలుగవయావిడ కొంచెము దూరముగా గూర్చున్నది. ఆమెచేతులకు కాళ్ళకు నగలులేవు. పండాజీ! ఈతీర్థముల కెంతమందో చిన్న వితంతువులు వచ్చుచుందురు.”

“వారిక్కడికి వచ్చి యెంతసేపైనది? ఎక్కడికి వెళ్ళియుందురు? నీబండిలో వారుతిరిగి గయకు వెళ్ళుదురా?”

“లేదు పండాజీ. నా కిరాయి యిచ్చి నన్ను పంపివేసినారు. అయితే వారిక్కడ ఒకరోజో రెండురోజులో ఆగుదురని నే ననుకొనుచున్నాను. మేమువచ్చి యొక గంటయైనది. బుద్ధగయ పెద్దగ్రామము కాదు. వెతికితిరా మీకు వారు తప్పక కనబడుదురు. దాటిపోవుటకు వీలులేదు.”

అప్పుడు ధనంజయుం డిట్లనియెను. "పండాజీ! నీవు చేయవలసినపని సమాప్తమైనది. రాత్రి మీరుచేసిన సహాయమున కివిగో యీ రూపాయలు తీసుకొనుడు! తక్కినపనినాకు వదలివేయండి! ఇంతవఱకు సాయము చేసిన భగవంతుఁడు ముందుగూడ నాకుసాయము చేయక పోఁడు!"

పండాబ్రాహ్మణుఁడు హాఁనామని బండియెక్కి గయకుఁబోయెను. ధనంజయుఁడు తన యన్వేషణము సాగించెను. తూర్పున రేఖలు తోఁచినది మొదలు సూర్యోదయము వఱకు తైర్థికులు మాగునట్టి ప్రతి యంగడియందుఁ ప్రతి స్థలమునందు నతఁడు భోగట్ట చేసెను. అట్లు చేసిచేసి యెట్టకేల కతఁడు వర్ధమానపు తండాను గనుగొనెను. అతఁడామెను జూచినగానే యతని హృదయ మాశాబద్ధమై దడదడ కొట్టుకొనెను. ఆ తండాలో మగవానిం జూచి యతడిట్లు పలుకరించెను.

"అయ్యా! మీరు వర్ధమానపు పురవాసులఁట! మీకు నమస్కారము. నేనుగూడ వర్ధమానపు వాఁడనే. మీరీయాడవాండ్ర నీపుణ్య క్షేత్రమునకు యాత్ర నిమిత్తము తీసికొని వచ్చితిరి గాఁబోలు. పరమేశ్వరుఁడు వారి హృదయములకు మిక్కిలి ప్రియములైన కోరికలను బ్రసాదించుఁ గాత! కాని మీపండా మీతో మఱియొకచిన్నది వచ్చినదని చెప్పినాఁడు. ఆమె నాకిక్కడ కనఁబడ దేమి? ఆమెయెక్కడికి వెళ్ళియుండును.?"

ఆ మాటలు విని యతఁడిట్లనియె—"మహాప్రభూ! నమస్కారము. నాచత్వారపు కన్నులతో నేను సరిగాఁ జూచుచున్నానో లేదో కాని, మీరు మా ధనపూరు జమీందారుగా రని తోఁచుచున్నది. మీ గ్రామములలోనే మా కాపురము. నా పూర్వపుణ్యమువల్ల నేను మిమ్మీరోజునఁ గలిసికోఁగలిగితిని. ధనపురము జమీందారుగారికి వంగి నమస్కారము చెయ్యండే!" అని భార్యలోను బిడ్డలతోను చెప్పెను.

ఆ స్త్రీలట్లు వంగి నమస్కరించిరి. భార్య భర్తతో నేమో గుసగుసలాడెను. అనంతర మతఁడు గట్టిగా నిట్లు పలికెను. "ఏలినవారిభార్య కలకత్తాలో మృతి నొందినట్లు మాయావిడ చాల విచారించు చున్నానని మనవిచేయు చున్నది. ఏలినవారు తిరిగి సుఖముగా వివాహము చేసికొని కొడుకులను గని మనుమలనెత్తి చిరకాలము జీవింపవలెనని భగవంతుని వేఁడుచున్నది. మీ కొడుకులు, మనుమలు మీ వంటిమంచివారై సంస్థానము నిలుపవలె ననిగూడ కోరుచున్నది." నప్పుడు ధనంజయుఁడు "దిక్కుమాలిన కోరికలు. నీ కోరికలు తగలబెట్ట" యని తనలో ననుకొని పైకి మృదువుగా నిట్లనియె

గ్లాచెంబుతో మీరు త్రాగవచ్చును." అని యతని ప్రక్కనుగూర్చుండి పాలచెంబు డస్సిన మార్గస్థుని నోటికడబెట్టెను. అతఁడా పాలు త్రాగి మెట్లమీఁదనే నిద్రపోయెను.

---

## ముప్పదవ ప్రకరణము.

### తపస్విని.

హిందూదేశమునందలి నానా పుణ్యక్షేత్రములలో బుద్ధగయవంటి పరమపావన స్మారక చిహ్నములు కలది మఱియొకటిలేదు. క్రీస్తుశకమునకు రమారమి యైదువందల సంవత్సరములక్రిందట భూమిమీఁదఁ జిరకాలము తిరిగితిరిగి వేసారిన యొక బాటసారి యిప్పుడు ధనంజయుఁడు విపన్నుఁడై పండుకొనినచోటనే కూర్చుండి పాపకర్మనిరతులై సద్గతిభ్రష్టులగుచున్న మనుష్యుల దుర్గతినిఁగూర్చి విచారించి వారికి మోక్షప్రాప్తిగల్గు నుపాయ మెద్దియని వితర్కించుచు మనోవేదన నొందుచుండెను. ఆ బాటసారి గౌతమ బుద్ధుఁడు. అతఁడు బోధించినమతము బౌద్ధమతము. ఆ మతమీకాలమునఁ బ్రపంచములోఁ గల మానవజాతిలో నాల్గవవంతు జనులచేత ననుసరింపఁబడుచున్నది. పాపరహితమైన పరిశుద్ధజీవనము, సర్వభూతదయ, మనఁబోటి బాధించువారియెడ క్షమ, మనలను ద్వేషించువారియెడ గాఢప్రేమ మొదలగు సత్కృష్టధర్మముల నా మహాత్ముఁడు హిందువులకు, హిందువులకే గాదు తోడిమానవులకు బోధించెను. ఆధర్మములను హిందూదేశమందలి పేదలు సాదలు విని యవలంబించిరి. అవి చీనా దేశమునను, జపాను దేశమునను, బర్మా దేశమునను, సింహళద్వీపమందును గలజనులచేత నంగీకరింపఁబడినవి. భారతఖండమున కనతిదూరమున నున్న తార్తారుదేశము, సైబీరియా దేశము మున్నగుచోట్లను వ్యాపించెను.

హిందూదేశ చక్రవర్తులలో నగ్రగణ్యుఁడని చెప్పఁదగిన యశోకుఁడు క్రీస్తుశకమునకు ముందు మూఁడువందల సంవత్సరముల క్రిందట బౌద్ధమత మవలంబించి యామత ధర్మములను బోధించుటకు [illegible] బోధకులను [illegible] పంపిన [illegible] చాలా యొక్క కోట్లకొలఁకులకు బంపెను. ఈ బౌద్ధమత బోధకులు [illegible] ప్రోత్సాహమున దక్షిణదేశము నాక్రమించిరి ఈజిప్టు, సిరియా, మాసిడోనియా, గ్రీసు, ఎపిరసు ఏషియామైనరు పశ్చిమరాజ్యములలో బౌద్ధమత బోధనము విపులముగాఁజేసిరి. ఏసుక్రీస్తు

పుట్టినప్పు డతనిజన్మస్థానమగు పాలస్టయిన్ దేశములో భూతదయ నను గొప్పలను త్తమధర్మములను జనులకు బోధించుచు బౌద్ధసంఘములు నివసించుచుండెను.

మహాత్ముఁడైన యశోక చక్రవర్తి గతించినతరువాత ననేక సంవత్సర శతములు చెల్లిన పిదప దేశాభిమానపూరితుఁడైన మహాత్ముఁడు హిందువుఁ డెవఁడో మున్ను మహానుభావుఁ డగుగౌతమబుద్ధుఁడు సర్వభూతదయాత్మకమైన మతము మనంబునందొలుతొల్త భావించినస్థాన మాచంద్రతారార్కసంస్థాయిగా నుండునట్లు జగత్ప్రసిద్ధమైన యీదేవాలయమును గట్టించెను. ఆగొప్పదేవాలయము పూజానమస్కారములు లేక కాలవశమున శైథిల్యము పాలయ్యెను. ఈకథాకాలమునకుఁ గొంచెముపూర్వము బ్రిటిషుగవర్నమెంటువారు దయారసప్రేరితులై భరతఖండముయొక్క ప్రాచీనౌన్నత్యమునందుఁగల గౌరవముచేత గుడిమరమ్మతు చేయించి మంచిస్థితియందుంచిరి. ఆదేవాలయపుమెట్లమీఁదనే పాపము! ధనంజయుఁడు నిద్రించి హృదయవేదన మఱచెను.

ఉదయకాల ప్రభాకరుఁడు దేవాలయముయొక్క యున్నతశిఖరమును దన యరుణతేజముచే మెఱయఁజేసి నలుదెసలఁ గాంతులు వెదజల్లెను. బౌద్ధమతసంబంధము లగు విగ్రహములు బొమ్మలు నానాఁట దొరకినప్పుడెల్ల దెచ్చి దేవాలయ సమీపమున నొకచోటజాగ్రత్త పెట్టిరి. సింహళద్వీపమునుండియు బర్మాదేశమునుండియు బుద్ధగయాక్షేత్రమును సందర్శింప వచ్చిన బౌద్ధతైర్థికులను గాషాయవస్త్రములను దాల్చిన శ్రమణుఁ డొకడు దివ్యస్థలములకుఁ దీసికొనిపోయి దర్శనీయములను చూపుచుండెను. హిందూమతస్థు లగుతీర్థవాసులు గూడ నిందందుఁ దిఱిగి చెట్లక్రిందపడుకొనుటకై నిప్పులు రాజవేసిరి. కొందఱు వర్తకులు తినుకొట్లు తెఱచి సరకులు వెలుపలికిఁ దీసిరి. తీర్థవాసులకు మిక్కిలి ప్రియములగు బొమ్మలు మొదలగు చిత్రవస్తువులను గొందఱు విక్రయింపఁ దొడఁగిరి. దట్టము లగుచెట్లతో, గడ్డియిండ్లతో, ధనవంతులతో నిండిన చిన్నగ్రామము బుద్ధగయ, దేవాలయమును జుట్టియుండెను.

గుడిమెట్లమీఁద నిద్రించుచున్న ధనంజయునిప్రక్క నొకయంగన కూర్చుండెను. కాషాయవస్త్రములు ధరించినను నా యువతి బౌద్ధశ్రమణి కాదు. ఆమె హిందూమతస్థురాలు. సన్న్యాసినియై యుండవలె లేక తపస్వినియై యుండవలె. ఆమె తలవెండ్రుకల నెఱ్ఱరుమాలులోఁ గట్టుకొనియెను. ఆ రుమాలులో గొంతభాగము మొగము భుజముల మీఁదను వ్రేలాడుచు నామెకు మేలిముసుగయ్యెను. ఆమెశరీరము నిండ నట్టాపె

"ఊరడు. ఊరకు! ఉమా! నన్ను నీపాదములు స్పృశింపనిమ్ము: క్షమింపుమని నిన్నుఁ వేడుకొందును. ఎరుఁగుదువా? చిన్నప్రాయమున నీకు నేను గలుగఁజేసిన కష్టము లిన్నియన్ని కావు. నా హృదయమునుండి నిన్ను వెలిచేసితిని. హృదయము నుండియే కాదు. నా యింటనుండికూడఁ వెడలఁజేసితిని. నా యంతకాంతనైన నిన్ను ద్రిమ్మరిఁ జేసితిని."

అని యతఁడా యుంగన రెండుపాదములు ఒట్టుకొని గడగడవడఁకుచు గన్నీటితో నామె పాదములను దడుపుచుండెను. వడఁకుచున్న యా పురుషుని పట్టుదప్పించుకొని తన పాదముల నావలికి దీసికొనుటకామె గిజగిజ తన్నుకొని యెట్టో యావలఁబడెను. పడి యీసారి యతని దగ్గఱనుండక కొంచెము దూరమున నిలిచి సన్నని యెలుగుతో నిట్లనియె. "స్వామీ! ధనపుత్రప్రభూ! పూర్వాశ్రమవృత్తాంతము స్మరణకుఁ దేవలదు. గతం నాస్తి. అది మనయిరువురి కదును భూస్థాపితము కావలసినదే ఎవ్వఁడు మన పాప కర్మంబులనెల్ల గడిగివేయ సమర్థుఁడో యాతని క్షమార్పణము వేడుఁడు."

"ఆహా! ఆతఁడే నా పాపములను క్షమించుగాక! ఆతని కరుణారసమే నా కిప్పుడు విశేషముగఁ గావలసియున్నది. నేనెంత చిత్తక్షోభము నొందితినో నీవు తెలిసి కొన్నపక్షమున నీవుగూడ నన్నుఁ దప్పక క్షమింతువు. గతవృత్తాంతము మిగుల భయంకరమై ఘోరమై పవలును రాత్రియు నన్ను వేధించినది. నా కంతట తల యేఱుపట్టినది. దృష్టి మందగించినది. నే నధఃస్థితిలోఁ బడితిని. అందుచేత నాకూపిరి సలుపలేదు. నాయెడల దయచూపువారు లేరైరి. ఘోరమరణము నావల్లగలిగెనని, స్త్రీ హత్యచేసిన మహాపాతకుండనని, దివారాత్రములు కుందితిని. నామనసు మండిపోయెను నా నెత్తురు పేరుకొనిపోయెను. నాగుండె కొట్టుకొనుట మానెను."

"కటకటా! మీరు మహాదుఃఖ మనుభవించినారు. దుఃఖార్తులకు దయామయుఁడగు పరమేశ్వరుఁడే శరణము."

"అర్ధరాత్రమున హత్యలు నాయెదుట జరిగినట్లు నేను స్వప్నములు గాంచితిని. ఆ ఘోరస్వప్నములోనుండి నేను మేల్కొని భయకంపితుఁడనై కేకలువేయుచు గుభాలున లేచితిని. అనంతరము నవవధూహృదయము నాశనము చేసితి ననియు మధుర జీవనము మంటిపాలు చేసితి ననియు నేను గ్రహింపఁగలిగితిని. గ్రహించి బిగ్గరగా నేడ్చితిని. నాయేడ్పు వినువారెవ్వరు? నాపై జాలిపడువారెవ్వరు?"

"ఓధనపురప్రభూ ! అలాగనవద్దు. తాను పరిత్యజించిన జీవితముయొక్క పూర్వ వృత్తాంతమును గాని, తత్సంబంధములైన సుఖములుగాని దుఃఖములుగాని తపస్విని చెవులఁ బడరాదు."

"ఓహో ! భక్తిమార్గమునఁ బడినయెడల మనస్సున కూరట గలుగునని నీవుసంసార సంబాధములైన సుఖములు దుఃఖములు వదలుకొంటివి కాఁబోలు. ఇఁక నాయవస్థ యెట్లుండెనో చూడు ! నీవు విడిచిపెట్టివచ్చిన ప్రతివస్తువు, పూర్వ పరిచితమైన ప్రతి పదార్థము సూదులవలె నాకన్నులలో గ్రుచ్చికొని నాకు బాధ గలిగించెను. ఆబాధ పడలేక యెట్టకేలకు మిక్కిలి యసహ్యమైన యాకలకత్తా గృహము విడిచి తలదాఁచు కొనుటకేదైన ప్రశాంతమయిన యిల్లు దొరుకునా యని వాడవాడలం బడి తిరిగితిని. నేనొక సారి మనబిందుగారి యింటికి వెళ్ళితిని. ప్రపంచములో నెక్కడనైన శాంతి యుండినపక్షమున నది యామెగృహమందే యున్నది. ఆమె హృదయమునందే యున్నది. చిన్నతనములో నీవంటే ఆమె కెంతో ప్రేమ. అలాటిప్రేమ మఱియెవ్వరికి నుండదు. నీ పేరామె కిప్పటికి జ్ఞాపకమే. ప్రాత స్నేహితులమాట అంతచక్కగా జ్ఞాపకముంచుకొనువారు మఱిలేరు. ఆమె యనుగ్రహమును నేను వేడుకొంటినా, ఆమె నన్ను క్షమియించి మనస్సున కూరట గలిగించునని నే ననుకొంటిని."

ఉష కన్నులు తడి యయ్యెను. మరలఁగలసికొను నాశలేక తాను విడిచివచ్చిన బాల్యస్నేహితురాలియొక్క మాట వినఁబడఁగానే కాషాయవస్త్రముల యడుగున మాటువడియు హృదయము శోకావిష్టమయ్యెను.

"నేను బిందుగృహమునకు వెళ్ళియుంటిని ! కాని యామె కలకత్తావిడిచి తాల్పూరునకు వెళ్ళినది. అక్కడకు వెళ్ళుటకు నాకు మొగము చెల్లినది కాదు. అప్పుడు కాళి మాట జ్ఞాపకము వచ్చినది. ధనపురమున బయలుదేఱి వర్ధమానమువఱకు రాత్రింబగలు నడచితిని. రాత్రులు పల్లెలలో గుడిసెలలోఁ దలఁదాచుకొనుచు గడ్డిపాన్పులమీఁదఁ బండుకొనుచుఁ బయనము చేసితిని. ఒకనాటి రాత్రి మిక్కిలి ప్రొద్దుపోయిన తరువాత వర్ధమానముచేరి వడకుచున్న చేతితో జగత్కిశోరుని తలుపు తట్టితిని. వారు జగన్నాథ యాత్రచేసి క్రొత్తగావచ్చి యిల్లుచేరిరి. వారు నన్నెంతో దయతో నాదరించిరి. కాళి నాదుఃఖములు శ్రద్ధతో వినెను. సహజముగా మిక్కిలి మృదువైన యామెహృదయము జాలిచే కరగిపోయెను. ఆమె చిన్నప్పుడు పట్టుకొన్నట్లే నాచేయి బట్టుకొని గదిలోనికి దీసికొనిపోయి నీపేరు గౌరవించి నీయిష్టప్రకారము నేను నడచినపక్షమున నీవు నన్ను

దప్పక క్షమింతువని నాతో నొక్కి చెప్పినది ఆమాటలు బహుసంతాపమునమఱుగుచున్న నాహృదయముమీఁద నమృతవర్ష బిందువులవలెఁ బడెను. నీవు వెళ్ళిపోయిన తరువాత నేను హాయిగా నిద్రించినరాత్రి యారాత్రియే. ఆమె చూపినదయకుఁ బ్రేమకు భగవంతుఁ డామెను రక్షించుఁ గాక !"

అట్లు చెప్పి ధనంజయుఁడొక్క నిముసమాగెను. రెండు కన్నీటిచుక్కలు చెలియొక్క కంటినుండి దిగి చెక్కులమీఁదఁ బడి జారెను. పిమ్మట నతఁడు మునుపటికంటె నెమ్మదిగాఁ దనకథ వినిపించెను.

"ఉమా ! నీప్రణయమునకు గడపటిగుర్తుగా నీవు విడిచిపోయినజాబు నిరంతరము నాహృదయమునం దున్నది. ఆజాబునుబట్టి నేను నూటతొమ్మిది దేవాలయములకు బోయితిని. కాళియు నామెమగఁడు వచ్చోటికి నావెంట వచ్చిరి. నిన్ను గుఱించి వారేమియు నెఱుఁగరు. వారునన్ను గోయిపురమునకుఁ బంపిరి. నీవు గయకు వెళ్ళితివని నాకక్కడ దెలిసినది. నేను నిన్ను గయకువచ్చితిని. నీకొఱకు గుడిలోను బజారులోను వెదకితిని. నదిప్రక్కను నీమీఁద నొకకల గంటిని. ఇంకనధికముగాఁ జెప్పవలెనా ? భగవంతుఁడు నాయుమను నాకిచ్చినాఁడు నాప్రాణము నాకిచ్చినాఁడు. నాయాత్మ నాకిచ్చినాఁడు."

తపస్విని వేషముక్రిందనున్న యా స్త్రీహృదయము మఱియొకసారి శోకపూరిత మయ్యెను. ఆ స్త్రీనేత్రములు మఱియొకసారి బాష్పపూరితము లయ్యెను. గద్గదస్వరముతో నాతపస్విని యిట్లనియె. "ఓధనపుప్రభూ ! మనుష్యమాత్రులకు క్షమించుటకు శక్తిలేదు. భక్తవత్సలుఁడగు పరమేశ్వరుఁడే మనజీవితములు పరిశుద్ధములుగఁ జేయఁగలఁడు. కాని పనికిమాలిన యాడుదాని ప్రార్థనలు ప్రయోజనకరము లగునని మీనిమిత్తమా ప్రార్థనలు రేవుమాపు కరుణాసముద్రుఁడు, పతితపావనుఁడు నగు పరమేశ్వరుని సన్నిధిఁ జేయుచుండుదును. మీరు దారుణదుఃఖ మనుభవించినారు. అది దీర్ఘకాలముగా ననుభవించినారు. పూర్వకృత దోషము మీరు భయంకర ప్రాయశ్చిత్తములఁ జేసికొన్నారు. ఈనా హృదయము మీయెడల రవంతయైన క్రోధము గలిగియుండదు. నేను జీవించి యుండినంతకాల మిట్లే. ఇందుకు భగవంతుఁడే సాక్షి."

"ఉమా ! దయారసపూరితములైన యీ పలుకులకు నన్ను భగవంతుఁడాశీర్వదించుఁ గాక ! నేను నీయెడల దోషములు చేసితిననియు, నీవు యోగ్యురాలవై నన్ను క్షమించితి వనియు నేను జీవితాంతమువఱకు జ్ఞాపక ముంచుకొందును. దోషములు చేసి మానవస్వాం

తుండనై నేను నిన్ను మఱలం జేరితిని. నాదోషాపహరణార్థము నీవు భగవంతుని ప్రార్థించితివి. ఇక్కడికి నాకథ ముగిసినది. నీ దుఃఖవృత్తాంతము చెప్పు! నీ వేకాకివై యిట్లు సంచరింపనేల? చెప్పు!

"ధనపురప్రభూ! కాదు. నా వృత్తాంతము దుఃఖకరమైనది కాదు. తన్ను శరణు జొచ్చువారికి పరమేశ్వరుండు దుఃఖములుబాపి యూరట గలిగించునుగదా? తపస్వినీ శీలము గ్రహించి తీర్థయాత్రలు చేయుచు ధర్మకార్యముల నెఱపుచు భక్తిపరులై జీవయాత్ర గడపునట్టి యంగనలీ దేశమున నెంతోమంది కలరు. అట్టివారి నెందఱనో గలసికొంటిని. వారు దేశమంతటం దిరిగి మానవనేత్రములు సాధారణముగాం జూడజాలని యనేక పుణ్యక్షేత్రములను సేవించినారు. గంగామాతకు జన్మభూములైన గోముఖ మందలి మంచుదిబ్బలు కన్నులారం జూచినారు. కాశ్మీరమందలి మంచుకొండలలో దాగియున్న దివ్యస్థలములు మెట్టినారు దక్షిణాపథంబున సీతారాముల నివాసముచేతం బావనమైన గోదావరీసరంబుల కఱిగనారు. కృష్ణాకావేరీతీరములం దున్న ప్రాచీన దేవాలయముల సందర్శించినారు. సర్వవ్యాపకుండైన దేవదేవుం, డతనిచేతం గట్టంబడిన దివ్యస్థలములందు దర్శించుటయు, దుఃఖాతురులై, రోగపీడితులై వేదనపడుచున్న యాదేవదేవుని భక్తుల నాదరించి యథాశక్తి సహాయము చేయుటయు వారి పవిత్ర సంకల్పము. వారి జీవనము యోగినీజీవనము. అనదయైన యీపేదరాలినింగూడ వారు దీవించి తగు సహాయముచేయుట కొడంబడిరి. వారిసాంగత్యముచేత సంసారసంబంధములైన దుఃఖములను మనోవేదనలను నేను మఱచి పోయితిని. వారితపస్వినీవేషము నేను ధరించితిని. వారివలె మిక్కిలిపవిత్రజీవనమును గడుపుటకై ప్రయత్నించెదను. అట్టి పవిత్ర జీవితము నందే నిజమైన యానందము కలదు."

"ఆహా! నీసంకల్పము మిక్కిలి గొప్పది. అది నీపూర్వాశ్రమ చరిత్ర కనురూపమై యున్నది. కాని భగవంతుండు తన దివ్యస్థలములను దర్శించి సేవించువారి పూజా నమస్కారములను మాత్రమే పరిగ్రహించునని నమ్ముచున్నావా? సంసారముం జేయుచు, దుర్బలులగు స్త్రీపురుషులకుం జేయూత నొసంగువారిని, దిక్కులేనివారిని, వ్యాధిగ్రస్తులను రక్షించువారిని, సంతతశ్రద్ధాళువులయి [illegible] పరిశుద్ధ [illegible] నడుపువారిని, భగవంతుండు చూడండని నీ వుపేక్షింతువా?"

"కాదు! సంసారముం జేయుచు ధర్మమార్గ మవలంబించువారును దేవాలయముల లోని కైంకర్యములకంటె నెక్కువ కైంకర్యమున, యథాశక్తి కలమీఁద నిమ్ము బరికించు

చెడి దుఃఖసముద్రనిమగ్నయైన సుధ నూరార్పగూడదా? ఇంటియొద్దకతిగి చేయవలసిన యీ ధర్మములకంటె సన్యాసిని ధర్మములు మిక్కిలి యుత్కృష్టములని నీవనుకొను చున్నావా?

బంధుమిత్రజనముల తలంపులు మనస్సున బాదరకాగానే వెక్కివెక్కి యేడ్చుచు ఉమ 'నాకిల్లులేదు వాకిలిలేదు' అనెను.

అనవుడు ధనంజయుఁడిట్లనియె "ప్రియురాలా! నీకిల్లులేకేమి? పశ్చాత్తప్తుఁడైన నీ మగని హృదయమే నీకు దివ్యభవనమైన యిల్లు. క్రొత్తగా నీవు కాపురమునకు వచ్చిన నాఁటి కాలముఁదలచుకో! నా కన్నులకు నీవెంతప్రేమమై యుంటివి. కర్మవశమున నేను తిప్పదారుల పట్టితిని. నేను భ్రష్టుఁడనైతిని. ఘోరపాపము చేసితిని. కాని ఉమా! నమ్ము నామాట. నీ యనురాగము నేనెన్నఁడు మఱువలేను. క్రొత్త పెండ్లికూఁతురవై యెక్కుడు మనోహరమైన దానవై, యెక్కుడు మధురమైనదానవై కనఁబడుచున్నావు. నవోఢవై మా యింటికివచ్చి నా శిక్షలోనే పెరిఁగి నిండు జవ్వనముదాల్చిన నాటికంటె వేదనాదోదూయమానమైన నాహృదయమున కిప్పుడెక్కువ ప్రియమును గూర్చుచున్నావు. ఇఁకముందు ధర్మార్థకామములయందు నిన్నతిచరింపను. ఈ ధర్మపరిపాలనము నాచేతఁ జేయింపుము! నాయందు దోషారోపణము లేకుండ నన్నుఁగాపాడిన పరమేశ్వరునియెడల నేను కృతజ్ఞుఁడనై యుండెను."

ఉమ మేను కంపించెను. కన్నీటిచేఁ గంఠము పూడిపోయెను. మానవ హృదయములోఁ బ్రభవించు ప్రతిరసమును లోఁబఱచుకొని యడచివేయవచ్చును. జ్ఞాపకమున్న ప్రతి విషయమును జెరిపివేయవచ్చును. కాని పతివ్రతయైన కాంత తాను మున్ను మనసార వలచి ప్రేమించిన యా మనోనాథుని యనురాగము మాత్రము మఱపజాలదు. మృదువైన స్త్రీ హృదయమునుండి బయలుదేఱుచున్న ప్రేమరసచిహ్నముల నడఁచి కప్పిపుచ్చుటకై యా తపస్విని యెంతో ప్రయత్నము చేసెను. ఎట్టకేలకామె మాటలాడినప్పుడు మనోదౌర్బల్య మెంతదాచినను దాగక స్పష్టమయ్యెను. "ఓ ధనపురప్రభూ! దుర్బలురాలైన యాఁడుదానిని వదలివేయుము. మనము కలసికొన్నాము. విడిపోయినాము. ఎవరు త్రొక్కినపుంతలో వారు నడుచుట మంచిది. పరమేశ్వర కైంకర్యమునందు నా కభిలాష యున్నది. దానిచే నాకు దుఃఖోపశమన మగును. సంసారములో నాకట్టి యభిలాష కలుగలేదు. ధనపురస్వామీ! మీ[illegible] గొప్ప కార్యాంతరములు గలవు. మీ పేదరైతులకు సాయము చేయవచ్చును. మీ శక్తికిఁ దగినట్లు మీదేశమునకు, జాతికి సేవచేయవచ్చును. ఉత్కృష్టధర్మములు మీచేతఁ జేయించుటకు మిమ్ము గాపాడిన పరమే

శ్వరుని గొలువవచ్చును. స్త్రీలోలతకంటె నివి మహోత్కృష్టములైన ధర్మములు కావా? స్వామీ! ఈ ధర్మముల నెఱవేర్చి దీనురాలైన యీ యాఁడుదానిని దాని యిచ్చవచ్చిన తెఱంగున బోవుటకు వదలివేయరాదా? ఇట్లు చేయుట బాగుండును. తరువాత నాతల వరసినప్పుడు మనము గలిసికొంటిమేని మనము మొదట దేనిలోఁ బ్రవేశించి కృతకృత్యు ముగా లేకపోతిమో యా సంసారసంబంధమైన సమాగమమును మరల నపేక్షింపక కేవల మిత్రములవలె నుండవచ్చును."

"ప్రియురాలా! ఉమా! నేను కృతకృత్యుఁడను కానిమాట నిజము. నీవు నాప్రక్క మఱియొకసారి నిలుతువేని దైవసహాయమున నేనీసారి కృతకృత్యుఁడను గాఁగలను. నేను నీకపకారముఁ జేసితిని. అపమార్గములు పట్టితిని. తిరిగి గృహస్థుఁడ నగుటకు నాకుఁ దోడ్పడుము. దేవునియెదుట చాగిలంబడి మ్రొక్కుట మఱచిన నేను నీయెదుటఁ జాగిలపడి మ్రొక్కెదను. ఓ నాదేవతా! నాకు సహాయము చేయుము. నీకుఁ దగినవాడను నేననిపించుకొనుటకుఁ దోడ్పడుము."

"ప్రాణేశ్వరా! వలదు వలదు. నేనెల్లకాలము నీభార్యనే యనిపించుకొందును. నామాట నమ్ము! నేను జీవించినంతకాలము, నేను నీభూమిమీఁద దిరిగినంతకాలము, నా హృదయమున మీపైఁ బ్రేమ నిలిచియుండును. ప్రాణేశ్వరా! ఇందు మోసమేమియు లేదు. నా జీవితము పరమేశ్వరుని కర్పణము చేయుచున్నాను గనుక నన్నాఁడుదానిగఁ జేసిన యా పరమేశ్వరుఁడు అతఁడు తన హృదయములో భక్తివిషయమునఁ బెంపవలసిన ప్రేమరసమును బెంచుగాక! నా మనసులోనున్నది నిష్కల్మషముగా నొప్పుకొంటిని గావున నేనేర్పరుచుకొన్న పద్ధతిప్రకారము నడుచుకొనవలెను. నా హృదయమున మీ విగ్రహమే యుండునని మీరెఱుఁగుదురు. మఱుగులేక మన తలంపుల నెఱుఁగజాలిన పరమేశ్వరునకు నేనుజేయు ప్రార్థనలో మీపేరుగూడ గలిపి చేసెదను. కాషాయవస్త్ర ధారణము చేసినపిదప మరల సంసారమునం దెట్లు ప్రవేశింపఁగలను?" అని యుమ యేడ్చుచుఁ బలికెను.

"కాదు. ఓ ప్రియురాలా! ఓ స్త్రీశిరోమణీ! నీ హృదయము నాకీధర్మాచర ణమునందు నిశ్చితమైయున్నదేని యీ కాషాయవస్త్రధారణము నిన్ను వారింపదు. వివాహమునాఁటి రాత్రి నీవు భుజముపైఁ గట్టుకొన్న యాయినుపబిళ్ళ నీవు తీసి పారవేయలేదు. అశుభచిహ్న మింకను ధరించుటవలన నీవు తపస్వినీశీలము సంపూర్ణముగా గ్రహింపలేదనియు, నిప్పుడిప్పుడే దానినిఁ జవిచూచు చుంటివనియు నేనెఱుఁగుదును.

రేమైనదో చూడు! నాతియ్యాని పెరుగంటే యెంతో యిష్టముకదా! నవ్వులేకుండా ఆయమ్మకు పూసే రాదుగదా. చిన్నప్పుడే పెనిమిటి పోయిన ఆపిల్ల తిరిగి పెండ్లాడునని యెవరను కొన్నారు. ఏమమ్మా అక్కా! నేనప్పుడు నీతో చెప్పలేదూ. కాలేజీలలో చదువుకొను పిల్లలు నెంతకైన సాహసులే, బ్రతికి యున్నవారిని గొంతుకలుకోసి చంపివేయ గలరు. వాళ్ళు." నవ్వుచు నామెకు ఓం దిట్లనియె. "శరచ్చంద్రుఁడు మాచెల్లెలి గొంతుకకోయలేదు. ఆతడు దానిని వివాహము చేసికొని యావజ్జీవము సుఖపెట్టఁ దలఁచుకొన్నాఁడు."

"అది గొంతుకోయుటకన్న నన్యాయముకాదా? అక్కా! ఊరిలో నలుగురు ఏమి చెప్పకొనుచున్నారో విన్నావా?" యని యామె పరిహాసముగాఁ బలికెను.

'అక్కా! ఊరిలోనివాండ్రు నోరునొప్పి పెట్టినదాక యిష్టమువచ్చినట్లనుకొననీ! మన మది లెక్కసేయఁ గూడదు. శరచ్చంద్రునికంటె మంచివాఁడు మన గ్రామములో లేఁడు. మా సుధకంటె మంచియిల్లాలును లేదు. సజ్జనరక్షకుఁడైన భగవంతుఁడు వారిని వర్ధిల్లఁజేయవలెను."

"అక్కా! ఔనౌను. పాపము సుధమంచిదే. నేను కాదనఁగలనా? నాతియ్యాని పెరుగంటే ఆబిడ కిప్పుడుకూడ ఇష్టమే. నన్నిప్పటికి అక్కయ్యా అని పిలుచుచునే యుండును. ఆచిన్నదానిని నారాయణమూర్తి కాపాడవలెనమ్మా!" అని కన్నీటిముక్క విడిచి యామె యవతలికిఁ బోయెను.

తక్కిన యిరుగుపొరుగువారుకూడ నట్లే చేసిరి. కాలము చెడిపోయిన దనియు యువయువతీ జనంబులు చెప్పినట్లు వినక విధేయతలేక పాడగుచున్నారనియు, వారు చెప్పుకొని విచారించిరి. విచారించినను శరచ్చంద్రుని యొక్కయు సుధయొక్కయు మంచితనముమాత్రము వారు మరువఁజాలరయిరి. మంగలిది కోపముచేత కొన్నాళ్ళు సుధను చూచుటకు రాకపోయినను నొకనాఁడు చీకటి పడిన తరువాత వచ్చి చూచి యామె కాళ్ళమీఁదపడి యేడ్చెను. చాకలిది మొదట నిష్టము లేకపోయినను దరువాత వారిబట్టలుదుక నారంభించెను. పరువుగల యింటఁ బుట్టిన స్త్రీలు వారియింటఁ జరుగు పండుగులకుఁ బబ్బములకు సుధను బిలువ సాహసింపకైరి. కాని యెవరిమీఁదను లేశమైనను క్రోధము నిలుపక యెల్లవారిని సమానప్రేమతోఁ జూచునట్టి యాపరమ సాధుశీలను జూచుట కెల్లవారు నామెయింటికే వచ్చుచుండిరి. హిందూదేశములో వెలి

యొక్క తీవ్రత మిక్కిలి తగ్గినది. పూర్వాచారములయం దభిమానము గలిగియుండినను జనులు కార్యవాదులు.

తారుణీమల్లికు డొకనాడు వర్ధమానమునుండి స్వగ్రామమునకు వచ్చి శరచ్చంద్రునిం జూచి యిట్లనియె. 'కాలప్రవాహమున కెదురీత లాడినఁ బ్రయోజనము లేదు. శరచ్చంద్రుఁడా! నీవు గట్టిమనోనిశ్చయము కలవాఁడవు. అనుకొన్న దేదో చేసితీరుదువు. దీని సంగతి సంగ్రహముగా మూఁడుముక్కలలోఁ జెప్పెద వినుము. బ్రాహ్మణులకు మంచి సంతర్పణము కావలెను. కాఁబట్టి గొప్పసంతర్పణ మొకటి చేయుదము.' అలాగునే తారుణీమల్లికునియింట నొక బ్రాహ్మణసంతర్పణము జరిగెను. తొల్లి కారు గ్రామములో నటువంటి దెన్నఁడు జరుగలేదు. దానితో శరచ్చంద్రునిపై గలవిరుద్ధభావము కొంత మందగించెను.

ఉదయం నొకసారి తండ్రియింటికి వచ్చి చాలదినము లుండెను. ఆమె కాషాయ వస్త్రములు విడిచి ముత్యాలతోను రత్నాలతోను మెఱసెను. ఆమె తల్లికి మఱియొకసారి నమస్కరించి బిందును గౌఁగిలించుకొని హృదయములు సంతోషముతో నుబ్బజేసెను. ఆమె శరచ్చంద్రుని గృహమునకు బోయి కంఠములో బంగారపు గొలుసు, చేతులకు మురుగులు పెట్టుకొని తన్ను జూడవచ్చిన వారిం జూచి సిగ్గున దలవంచుకొని మాటలాడక యున్న సుధను గనుగొని యానందపారవశ్యమున బాష్పములు విడిచెను. విడిచి యును సుధను గౌగిలించుకొని 'చెల్లెలా! భగవంతుడు రక్షింపవలె నమ్మా నిన్ను" అని యైదు పేటలు గల ముత్యాలహారమును దన మెడలోనుండి తీసి సుధ వక్షస్థలమున వేసి "ఇది నీవు వేసుకో సుధా! నేను చిన్నప్పటినుండి నిన్ను నాచెల్లెలు లాగున చూచుకొన్నాను. చిన్నతనమందే నీవు వితంతువై హాయిగా నున్నందుకు మిక్కిలి సంతోషించుచున్నాను. ఈముత్యాలహారము నీబావగారు ప్రథమప్రణయములో నాకిచ్చినది. భగవంతుడు పరమ దయాళువై నాకాయనను మరల దయచేసినాఁడు' అని పలికి యుదు యంతకంటె నెక్కువ మాటలాడలేక పోయెను. సుధహృదయము తన హృదయముతోఁ జేర్చి కౌగిలించి యాసమయమున నామె విడిచినబాష్ప బిందువులు, నిజముగా మితిలేని దుఃఖ మనుభవించిన స్త్రీ తనవలె మిక్కిలి దుఃఖ మనుభవించిన మఱియొక సోదరిమొదలఁ జూడవలసిన ప్రేమానుబంధమును వెల్లడి చేయుచు హృదయమును భేదించుకొని వచ్చిన వని చెప్పవచ్చును.

"అలాగే చేయవచ్చును. ఎంత త్వరగా వెళ్ళిన నంత మంచిది. మన వివాహమైనది మొదలుకొని మీ యమ్మగారిని జూడవలెనని నా మనస్సులో నభిలాషయున్నది. మా యమ్మయైనను నామీద నింత ప్రేమ గలిగియుండలేదు. ఇప్పుడు పూర్వకాలపు సంగతులు నామనంబునకు జ్ఞప్తికి వచ్చుచున్నవి. అవి యొకప్పుడు సంతోషముగా వచ్చును. వసంతకాలపు సాయంకాలమున నేనిక్కడ నిలువబడియుండగా నా కొక్క సంగతి జ్ఞాపకము వచ్చుచున్నది. నేను చిన్నదాననైయున్నప్పుడు పండ్రెండు సంవత్సరముల క్రిందట మాయమ్మతో గలిసి నే నీచోటునకు వచ్చుచుండెడి దానను. నేను పిల్లనైయున్నప్పుడే మా యమ్మ చనిపోయినది. భగవంతుడు నాయం దనుగ్రహము కలిగి అంతమంచిదానిని, అంత దయ గలదానిని, అంత ప్రేమ గలదానిని నాకు దయచేసినాడు. నన్ను వారిదానిఁ జేసికొని పోయిన నాబాష్పజలములతో మీయమ్మగారి కాళ్ళు కడిగి యామె దీవన పొందెదను. అటువంటివారి దీవెనలు మన కీజీవితమున నెంతో సహాయము జేయును."

"సుధా! ఔనౌను. నీవు నిజము చెప్పితివి. మహాఋషివంటి పెద్దల దీవెనలు మన జీవితమున కెంతో సహాయము చేయును. నీవు నాకెల్లప్పుడు తోడునీడవై యుందువు. నా జీవితకాలముమీద నుదయించిన ప్రేమజ్యోతివి. నీవు నాయానందము. నీవు నా కామధేనువు. నీవు నాకు సుఖోపభోగమున కారణివి. నీవు నాదానవు"

అని చంద్రుండు పలికి వికసించుచున్న మల్లెపువ్వువలె మనోహరముగా నున్న యా బాలిక మెడకు తన బాహువులు పెనవేసి ప్రేమయుక్తముగా నా యంగనముఖ మెంతోసేపు ముద్దాడెను. ఆ పట్టు విడిపించుకొనుట కామె యెంతో ప్రయత్నముచేసి యెట్టకే యాతని బాహువులనుండి తప్పించుకొని కంపించు మేనితో సిగ్గుదేలుపు నెమ్మొగముతో దడదడకొట్టుకొను గుండెతో చెట్లచాటునకు దాగొనిపోయెను.

రాత్రి నిశ్శబ్దముగ నుండెను. స్వచ్ఛందమగు తెల్లని కాంతి పొలములమీద

— ♦ సమాప్తము —

